f. Rewrite the following sentences changing the subject and predicate noun phrases into plural as shown in the model.

Model : అది కుర్చీ.
అవి కుర్చీలు.

1. ఆయన డాక్టరు.
2. నేను విద్యార్థిని.
3. ఇది పుస్తకం.
4. అది పిల్లి.
5. ఆమె విద్యార్థిని.
6. ఇది అతని ఇల్లు.
7. అది మా స్కూలు.
8. ఆమె నీ స్నేహితురాలా?
9. ఇతను శర్మ స్నేహితుడు.
10. ఈ అమ్మాయి మా చెల్లెలు.

g. Produce atleast 8 sentences from the following table modifying the words in the second column as shown in the model:

| | | |
|---|---|---|
| వాళ్లు | ఇద్దరు<br>ఏడుగురు<br>ముగ్గురు<br>నలుగురు | నా స్నేహితులు<br>తెలుగు విద్యార్థులు<br>సరళ స్నేహితురాళ్లు |

Model : వాళ్లిద్దరూ నా స్నేహితులు.

# UNIT 5

## Lesson 18

| | |
|---|---|
| గిరిజ : విమలా ! అవిగో నా పుట్టిన రోజు బట్టలు. ఆరో తారీకు నా పుట్టిన రోజు. | Vimala ! Those are my birth day clothes. My birth day is on the sixth. |
| విమల : ఆ రోజు ఏం వారం ? | Which day is that ? |
| గిరిజ : ఆదివారం. | Sunday. |
| విమల : ఇవ్వాళ శుక్రవారం. రేపు శనివారం. ఎల్లుండి ఆదివారం. నీ పుట్టిన రోజు ఎల్లుండా ? | Today is Friday. Tomorrow is Saturday. Day after tomorrow is Sunday. Then, is your birthday on the day after tomorrow ? |
| గిరిజ : అవును. అవతలెల్లుండి మా సరళ పుట్టిన రోజు. | Yes. The two days after tomorrow is our Sarala's birth day. |
| విమల : నీ పుట్టిన రోజు మర్నాడు సరళ పుట్టిన రోజా ? | Is Sarala's birth day on the day next to yours ? |
| గిరిజ : అవును. | Yes. |

విమల : ఆ రోజు సోమవారమా ?
Is it Monday ?

గిరిజ : అవును. ఏడో తారీకు. మరి నీ పుట్టిన రోజు ఎప్పుడు ?
Yes. Seventh of this month. When is your birth day ?

విమల : నా పుట్టిన రోజు జూలై నాలుగు.
My birth day is on the fourth of July.

గిరిజ : ఇదే జూలై నెల. ఇవ్వాళే నాలుగో తారీకు.
This is July. Today is fourth.

విమల : అవును.
Yes.

గిరిజ : మరి ఇవ్వాళే నీ పుట్టిన రోజు. స్వీట్లు ఏవి ?
Then, today is your birthday. Where are the sweets ?

విమల : ఇవిగో !
Here, they are !

గిరిజ : మా అన్నయ్య పుట్టిన రోజు అటుమొన్న.
My elder brother's birth day was two days before yesterday.

విమల : అటుమొన్నా ? ఏం వారం ?
Was it two days before yesterday ? What day was it ?

గిరిజ : ఇవ్వాళ శుక్రవారం. నిన్న గురువారం. మొన్న బుధవారం. అటుమొన్న మంగళ వారం.
Today is Friday. Yesterday was Thursday. Day before yesterday was Wed nesday And two days before yesterday was Tuesday.

విమల : ఎన్నో తారీకు ?
What was the date ?

గిరిజ : ఒకటో తారీకు ?
First of the month.

విమల : సరే ! ఇదుగో స్వీటు.
Allright. Here is the sweet.

## DRILLS

a. Repetition drill.

1. ఇవ్వాళ ఏం వారం ?
   ఇవ్వాళ ఆదివారం.
   నిన్న శనివారం.
   మొన్న శుక్రవారం.
   అటుమొన్న గురువారం.
   రేపు సోమవారం.
   ఎల్లుండి మంగళవారం.
   అవతెల్లుండి బుధవారం.

2. ఇవ్వాళ రెండో తారీకు.
రేపు మూడో తారీకు.
ఎల్లుండి నాలుగో తారీకు.
అవతెల్లుండి ఐదో తారీకు.
నిన్న ఒకటో తారీకు.
మొన్న ఎన్నో తారీకు ?

**b. Build-up drill.**

పుట్టిన రోజు.
లత పుట్టిన రోజు.
మా లత పుట్టిన రోజు.
మర్నాడు మా లత పుట్టిన రోజు.
నా పుట్టిన రోజు మర్నాడు మా లత పుట్టిన రోజు.

ఆరు.
జూలై ఆరు.
పుట్టిన రోజు జూలై ఆరు.
అన్నయ్య పుట్టిన రోజు జూలై ఆరు.
మా అన్నయ్య పుట్టిన రోజు జూలై ఆరు.

**c. Substitution drill.**

Model (i) : ఇవ్వాళ ఏడో తారీకు.
రేపు
రేపు ఏడో తారీకు.

నిన్న
మొన్న
ఎల్లుండి

Model (ii) : ఇవ్వాళ ఒకటో తారీకు.
మూడు
ఇవ్వాళ మూడో తారీకు.

ఆరు
పదకొండు
ఎనిమిది

**d. Expansion drill.**

Model : అది పుస్తకం (రెండు)
అది రెండో పుస్తకం.

1. ఇది ఇల్లు. (పది)
2. ఆయన విద్యార్థి. (నాలుగు)
3. ఇది కాయితం. (ఎన్ని)

**e. Response drill.**

Model (i) : నీ కలాలు ఏవి ?
ఇవిగో, నా కలాలు.

1. సరళ కలాలు ఏవి ?
2. మూర్తి గడియారాలు ఏవి ?
3. మా బల్లలు ఏవి ?

Model (ii) : సరళ కలాలు ఏవి ?
అవిగో, సరళ కలాలు.

1. సుశీల కుర్చీలు ఏవి ?
2. మీ గడియారాలు ఏవి ?
3. అతని పుస్తకాలు ఏవి ?

## EXERCISES

a. Answer the following questions.

1. ఇవ్వాళ ఎన్నో తారీకు ?
2. మొన్న ఎన్నో తారీకు ?
3. నా పుట్టిన రోజు బుధవారం. నా పుట్టిన రోజు మర్నాడు ఏం వారం ?
4. రేపు ఏం వారం ?
5. నిన్న ఏం వారం ?
6. మీ పుట్టిన రోజు ఎన్నో తారీకు ?

b. Fill up the blanks using the correct forms of the words given in the parentheses.

1. మొన్న..................(ఒకటి) తారీకు.
2. నిన్న..................(ఎన్ని) తారీకు ?
3. రేపు..................(పది) తారీకు.
4. ఇవ్వాళ..................(పదకొండు) తారీకు.

c. Change the following as shown in the model :

Model : ఇవిగో మీ బట్టలు.
మా బట్టలు ఏవి ?

1. ఇవిగో కిటికీలు.
2. అవిగో పుస్తకాలు.
3. ఇదిగో కలం.
4. ఇవిగో ఇళ్లు.

d. Change the following into question forms using ఎన్నో or ఏం whichever is suitable.

1. ఇవ్వాళ ఆదివారం.
2. రేపు పదకొండో తారీకు.
3. అది పన్నెండో గది.
4. ఆయన రెండో డాక్టరు.

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| అవిగో | there, they are !(neut., rem.) | శనివారం | Saturday |
| పుట్టిన రోజు | birth day | ఎల్లుండి | dayafter tomorrow |
| బట్టలు | clothes | ఆవలెల్లుండి | two days after tomorrow |
| తారీకు | date | మర్నాడు | next day |
| రోజు | day | సోమవారం | Monday |
| వారం | week | మరి | then ; if so (sentence initiator) |
| ఆదివారం | Sunday | | |
| ఇవ్వాళ | today | ఎప్పుడు | when |
| శుక్రవారం | Friday | జూలై | July |
| రేపు | tomorrow | నెల | month |

| | |
|---|---|
| స్వీటు | sweet |
| ఏవి | which (pl.) |
| ఇవిగో | here, they are! (neut., prox.) |
| అన్నయ్య | elder brother |
| అటుమొన్న | two days before yesterday |
| నిన్న | yesterday |
| గురువారం | Thursday |
| మొన్న | day before yesterday |
| బుధవారం | Wednesday |
| మంగళవారం | Tuesdey |

## GRAMMAR NOTES

18.1 The neuter plural indicators (for neuter singular indicators అదుగో and ఇదుగో c.f. 14.5) అవిగో (remote) and ఇవిగో (proximate) are introduced in this lesson.

18.2. Ordinal numerals are also introduced in this Lesson. ఓ is added to the numerals to change them into ordinals.

ఒకటి + ఓ — ఒకటో 'first'
*okati* + *oo* — *okatoo*
(one + ordinal suffix)

18.2.1. The above ordinal marker ఓ is also added to the interrogative count pronoun ఎన్ని 'howmany' when the expected answer is 'ordinal + noun'.

అది ఎన్నో పుస్తకం ? అది మూడో పుస్తకం.

18.2.I. When ఓ is added to a short vowel, the short vowel is dropped.

ఎన్ని + ఓ — ఎన్నో మూడు + ఓ — మూడో
*enni* + *oo* — *ennoo* *muudu* + *oo* — *mudoo*

*This rule is optional when ఓ is an initial vowel of a word.

అతని పేరు ఓబయ్య
*atani peeru oobbyya*
అతని పేరోబయ్య 'His name is Obayya.'
*atani peeroobayya*

18.3. మరి is used for continuing speech. This can be taken as equivalent English 'then and Hindi फिरतो.

* Vowel Sandi is always applicable in word and suffix/particle combination. Between to words, Vowel Sandhi in Telugu is purely at the speaker's option.

# UNIT 5

## Lesson 19

| | |
|---|---|
| రవి : ఇది ఎవరి పుస్తకం ? | Whose book is this ? |
| శర్మ : నాది. | Mine |
| రవి : దీని ఖరీదు ఎంత ? | What is its cost ? |
| శర్మ : ఒక రూపాయి. | One rupee. |
| రవి : ఇది ఎవరి సంచీ ? | Whose bag is this ? |
| శర్మ : ఏ సంచి ? | Which bag ? |
| రవి : ఈ కొత్త సంచీ. | This new bag. |
| శర్మ: ఇది రామ్మూర్తి సంచి. | This is Rammurthy's bag. |
| గిరి : కాదు. ఇది నా సంచీ. | No. This is my bag. |
| శర్మ : ఈ సంచి మీదా ? | Is this your bag ? |

| | |
|---|---|
| గిరి : అవును నాది. | Yes. This is mine. |
| శర్మ : దీని ఖరీదు ఎంత ? | What is its cost ? |
| గిరి : పదహారు రూపాయలు. | Sixteen rupees. |
| శర్మ : మరి, రామ్మూర్తి సంచి ఏది ? | So, which is Rammurthy's bag ? |
| గిరి : ఆ పాత సంచీ రామ్మూర్తిది. దాని ఖరీదు పదిహేను రూపాయలు. | That old bag is Rammurth's. Its cost is fifteen rupees. |
| శర్మ : అవును. ఈ సంచి మీది. ఆ సంచి రామ్మూర్తిది. | Yes. This bag is yours. That is Rammurthy's. |

## DRILLS

a. Repetition drill.

ఈ ఇల్లు మీది.
ఆ ఇల్లు రామ్మూర్తిది.
ఈ పుస్తకం నాది.
మీ సంచీ ఏది ?
ఈ సంచీ మీది.
ఆ సంచీ నాది.

b. Build-up drill.

నాది
సంచీ నాది.
పాత సంచీ నాది.
ఆ పాత సంచీ నాది.
అవును, ఆ పాత సంచీ నాది.

రూపాయి.
ఖరీదు రూపాయి.
కలం ఖరీదు రూపాయి.
కొత్త కలం ఖరీదు రూపాయి.
ఈ కొత్త కలం ఖరీదు రూపాయి.

c. Substitution drill.

Model (i) : ఇది నీ పుస్తకం.
నా
ఇది నా పుస్తకం.

కొత్త
పాత
ఎవరి
మన

Model (ii) : ఈ సంచీ రామ్మూర్తిది.
లీలావతి.
ఈ సంచీ లీలావతిది.

1. ఈ ఇల్లు రామ్మూర్తిది. (మీరు)
2. ఆ పుస్తకం గిరిజది. (నేను)
3. ఆ కలం కమలది. (శ్యామల)
4. ఆ కుర్చీ కృష్ణుడిది. (ప్రిన్సిపాల్)

d. Transformation drill.

Model (i) : ఇది రామ్మూర్తి సంచీ.
ఈ సంచీ రామ్మూర్తిది.

1. ఇది నా సంచీ.
2. అది మీ పుస్తకం.
3. ఇది మాష్టరు కుర్చీ.

Model (ii) : ఈ సంచీ నాది.
ఏ సంచీ నీది ?

1. ఆ ఇల్లు రవిది.
2. ఈ గడియారం నాది.
3. ఆ గది ప్రిన్సిపాల్ది.

## EXERCISES

a. Fill up the blanks with the correct forms of the words given in the parentheses.

1. ఈ పుస్తకం................ (మీరు)
2. ఆ గడియారం... ............ (రవి)
3. ఈ కలం................ (బాలకృష్ణ)
4. ఆ కుర్చీ............... (నేను)

b. Answer the following questions.

1. ఇది ఎవరి గడియారం ?
2. మీ కలం ఖరీదు ఎంత ?
3. ఈ సంచీ మీదా ?
4. ఆ కుర్చీ శర్మదా ?

c. Produce as many sentences as possible from the following table.

| | |
|---|---|
| కుర్చీ | నాది |
| కలం | మీది |
| గడియారం | రవిది |

## VOCABULARY

| | |
|---|---|
| ఖరీదు | price |
| ఎంత | howmuch |
| రూపాయి | Rupee |
| సంచీ/సంచి | bag |
| కొత్త | new |
| పదహారు | sixteen |
| పాత | old |
| పదిహేను | fifteen |

**GRAMMAR NOTES :**

**19.1.** In this lesson the simple adjectives కొత్త 'new' and పాత 'old' are introduced.

**19.2.** _ది is added to the nominal/pronominal adjectives to form nominal/pronominal predicates.

| | |
|---|---|
| నా_ది | 'Mine' |
| శర్మ_ది | 'Sharma's' |
| ఎవరి_ది | 'Whose' |

**19.3.** The mass (non-count) interrogative neuter pronoun ఎంత 'howmuch' is also introduced. This is used when the interrogated noun cannot be counted.

| | |
|---|---|
| ఖరీదు ఎంత ? | What is the price ? |

**19.4.** రూపాయి 'rupee' is singular and రూపాయలు 'rupees' is plural. But in pronunciation the vowel on యి is not heard.

**19.5.** సంచి 'bag' can also be సంచీ.

# UNIT 5

## Lesson 20

| | |
|---|---|
| రాజు : గీతా ! ఈ పెట్టె ఎవరిది ? | Geetha ! Whose box is this ? |
| గీత : మా నాయనమ్మగారిది. | My grandmother's. |
| రాజు : మీ నాయనమ్మగారు ఏరి ? | Where is your grandmother ? |
| గీత : ఇరుగో ! | Here she is ! |
| రాజు : ఈ చొక్కా ఎవరిది ? | Whose shirt is this ? |
| గీత : మా బావగారిది. | My brother-in-law's. |
| రాజు : మీ బావగారు ఏరి ? | Where is your brother-in-law ? |
| గీత : అరుగో ! | There he is ! |
| రాజు : ఈ పుస్తకాలు ఎవరివి ? | Whose books are these ? |
| గీత : మా అన్నయ్యవి. | My elder brother's. |

| | |
|---|---|
| రాజు : అన్నీ మీ అన్నయ్యవేనా ? | Are all these books your elder brother's ? |
| గీత : ఆ ! ఆ పుస్తకాలన్నీ మా అన్నయ్యవే ! | Yes. All those books are my elder brother's. |
| రాజు : మీ అన్నయ్య ఏడీ ? | Where is your elder brother ? |
| గీత : ఇడుగో ! | Here he is ! |
| రాజు : ఈ చీర ఎవరిది ? | Whose sari is this ? |
| గీత : మా అక్కయ్యది. | My elder sister's. |
| రాజు : మీ అక్కయ్య ఏది ? | Where is your elder sister ? |
| గీత : అదుగో. | There she is ! |
| రాజు : ఈ పూలు ఎవరివి ? | Whose flowers are these ? |
| గీత : నావి. | Mine. |
| రాజు : నీవా ? నీవి కాదు. నావి. | Yours ? No, not yours ! Mine. |
| గీత : మనవి. ఒక పువ్వు నీది, ఒక పువ్వు నాది. | Ours. One flower is yours and the other is mine. |
| రాజు : రాము బొమ్మలు ఏవి ? గౌరి బొమ్మలు ఏవి ? | Where are Ramu's dolls ? Where are Gowri's dolls ? |
| గీత : అవిగో ! ఆ పులి బొమ్మలు రామువి. ఈ ఏనుగు బొమ్మలు గౌరివి. | There ! Those tigers are Ramu's and these elephants are Gowri's. |
| రాజు : రాము ఏడీ ? గౌరి ఏదీ ? | Where is Ramu and where is Gowri ? |
| గీత : అడుగో రాము. ఇదుగో గౌరి. | There Ramu is and here Gowri is ! |
| రాజు : మీ స్నేహితులు ఏరి ? | Where are your friends ? |
| గీత : అరుగో ! | There they are ! |
| రవి : మీ చెల్లెళ్లు ఏరి ? | Where are your sisters ? |
| గీత : ఇరుగో ! | Here they are ! |

## DRILLS

**a. Build-up drill.**

ఏడీ ?
రవి ఏడీ ?
మీ రవి ఏడీ ?

తమ్ముడిది
మా తమ్ముడిది.
పుస్తకం మా తమ్ముడిది.
ఆ పుస్తకం మా తమ్ముడిది.

ఎవరిది ?
పుస్తకం ఎవరిది ?
ఈ పుస్తకం ఎవరిది .

రామువి
బొమ్మలు రామువి.
ఏనుగు బొమ్మలు రామువి.
ఈ ఏనుగు బొమ్మలు రామువి.

**b. Response drill.**

Model (i) : మీ నాన్నగారు ఏరి ?
అదుగో ! మా నాన్నగారు.

1. రామ్మూర్తిగారు ఏరి ?
2. మీ మాష్టరుగారు ఏరి ?
3. మీ అన్నగారు ఏరి ?
4. రవీ రాజీ ఏరి ?

Model (ii) : మీ తమ్ముడు ఏడీ ?
అడుగో ! మా తమ్ముడు.

1. రవి ఏడీ ?
2. మీ స్నేహితుడు ఏడీ ?
3. రవి తమ్ముడు ఏడీ ?
4. మీ అన్నయ్య ఏడీ ?

Model (iii) : మీ అక్కయ్య ఏది ?
అదిగో, మా అక్కయ్య.

1. మీ చెల్లెలు ఏది ?
2. సరళ ఏది ?
3. సుగుణ చెల్లెలు ఏది ?

**c. Substitution drill.**

Model (i) : ఈ పుస్తకాలు ఏవివి.
నేను
ఈ పుస్తకాలు నావి.
నువ్వు
మీరు
మేం
మనం

Model (ii) : మా నాన్నగారు అదుగో.
తమ్ముడు
మా తమ్ముడు అడుగో.
చెల్లెలు
అమ్మగారు
విద్యార్థులు
మాష్టరుగారు

**d. Transformation drill.**

Model (i) : ఆయనే రామ్మూర్తిగారు.
రామ్మూర్తిగారు ఏరి ?

1. ఆయనే మాష్టరుగారు.
2. అతనే గోపాలరావు.
3. ఆమే సులోచనగారు.
4. అదే మా చెల్లెలు.
5. వాళ్లే మా స్నేహితులు.

Model (ii) : ఈ పుస్తకం రవిది.
ఈ పుస్తకాలు రవివి.

1. ఈ కలం నాది.
2. ఆ ఇల్లు మాది
3. ఈ కుర్చీ మనది.
4. ఆ గది నీది.
5. ఈ గడియారం మీది.

## EXERCISES

**a. Fill up the blanks with ఏరి/ఏడీ/ఏది whichever is appropriate.**

1. మీ తమ్ముడు................ ?
2. రవి స్నేహితుడు................ ?
3. మీ అమ్మగారు................ ?
4. కొత్త విద్యార్థిని................ ?
5. శర్మగారు................ ?
6. విద్యార్థినులు................ ?

**b. Rewrite the following sentences as shown in the model.**

Model : అదుగో రవిగారు.
రవిగారు ఏరి ?

1. అదుగో గుమాస్తా.
2. ఇదుగో ప్రిన్సిపాల్.
3. అదుగో లలిత.
4. ఇదుగో మా అన్నయ్య.
5. ఇదుగో మా చెల్లెలు.
6. అవిగో మా పుస్తకాలు.
7. అదుగో మా స్నేహితులు.

**c. Change the following sentences as shown in the model.**

Model : ఈ కలం శర్మది.
ఈ కలాలు శర్మవి.

1. ఆ ఇల్లు నాది.
2. ఈ గడియారం అతనిది.
3. ఆ కుర్చీ మా తమ్ముడిది.
4. ఈ గది మాది.
5. ఏ స్కూలు మీది ?
6. ఆ పుస్తకం ఎవరిది ?

**d. Match the following.**

| అ | ఆ |
|---|---|
| 1. అరుగో | ఉమ ( ) |
| 2. అడుగో | గోపి ( ) |
| 3. అదుగో | డాక్టరుగారు ( ) |

## VOCABULARY

| | |
|---|---|
| పెట్టె | box |
| నాయనమ్మ | father's mother |
| ఏరి | where she/he/they is/are (hon. sg & pl.) |
| ఇరుగో | here she/he/they is/are (hon. sg. & pl.) |
| చొక్కా | shirt |
| బావ | brother-in-law |
| అరుగో | there she/he/they is/are (hon. sg. & pl.) |
| అన్నీ | all (neuter) |
| ఏడీ | where he is (inferior) |
| ఇడుగో | here he is (inferior) |
| చీర | sari |
| అక్కయ్య | elder sister |
| ఏదీ | where she is (non-hon.) |
| అదుగో | there she is (non-hon.) |
| పువ్వు | flower |
| అడుగో | there he is (inferior) |

## GRAMMAR NOTES

20.1. In this lesson the human indicators and the corresponding interrogative words are introduced :

| Description | Interrogative words | Indicators | |
|---|---|---|---|
| | | Proximate | remote |
| Epicene hon-sg./pl. | ఏరి ? | ఇరుగో ! | అరుగో ! |
| Masc. non-hon. sg. | ఏడీ ? | ఇడుగో ! | అడుగో ! |
| Fem. non-hon. sg. | ఏదీ ? | ఇదుగో ! | అదుగో ! |
| Neuter sg. | ఏది ? | ఇదుగో ! | అదుగో ! |
| Neuter pl. | ఏవి ? | ఇవిగో ! | అవిగో ! |

**20.2.** _వి is added to the pronominal/nominal adjectives to form pronominal/nominal predicates, with reference to plural nouns. (ది is added for singular ones. 19.2).

| | |
|---|---|
| ఈ పుస్తకాలు నా_వి. | 'These books are mine.' |
| ఈ పుస్తకం శర్మ_ది. | 'This book is sarma's.' |
| ఆ కలాలు ఎవరి_వి? | 'Whose pens are those?' |

**20.3.** అన్నీ 'all' is used with neuter count nouns.

| | |
|---|---|
| ఆ పుస్తకాలు అన్నీ నావి | 'all of these books are mine' |

**20.4.** పూలు is the plural form of పువ్వు 'flower'.

| | |
|---|---|
| పువ్వు + లు → పూలు | 'flowers' |

# UNIT 6

## Lesson 21

| | |
|---|---|
| సుగుణ : అమ్మా ! దసరా పండగ ఎప్పుడు ? | Mummy ! When is the Dasara festival ? |
| పార్వతి : ఇప్పుడు దసరా పండగే. దసరా పది రోజుల పండగ. చివరి మూడు రోజులు ముఖ్యమైన పండగలు. | This is the Dasara festival period. Dasara is a ten-day festival. The important celebrations fall on the last three days. |
| సుగుణ : ఆ పండగల పేర్లేమిటి ? | What are the names of those days ? |
| పార్వతి : మొదటిరోజు దుర్గాష్టమి. రెండోరోజు మహార్నవమి. చివరిరోజు విజయదశమి. | The First day is Durgashtami. The last day is Vijayadasami. |
| సుగుణ : విజయదశమి ఎన్నో తారీకు ? | What is the date of Vijayadasami ? |
| పార్వతి : ఇరవయ్యో తారీకు. | 20th of this month. |
| సుగుణ : ఇవ్వాళ ఎన్నో తారీకు ? | What date is today ? |

పార్వతి : పదిహేడో తారీఖు.

Seventeenth.

సుగుణ : ఇవ్వాళ పదిహేడు, రేపు పద్దెనిమిది, ఎల్లుండి పంధొమ్మిది, ఆవలెల్లుండి ఇరవై. అయితే విజయదశమి ఆవలెల్లుండి అన్నమాట !

Today is seventeenth. Tomorrow is 18th. The day after is 19th. Two days after tomorrow is 20th. Then Vijayadasami falls on the third day from today.

## DRILLS

a. Repetition drill.

1. 'నీ పుస్తకాల ఖరీదెంత ?'
'నాలుగు పుస్తకాలు ఎనిమిది రూపాయలు.'
'అయితే ఒక్కొక్క పుస్తకం రెండు రూపాయలన్నమాట !'

2. 'పండగ ఎప్పుడు ?'
'సోమవారం'
'ఇవ్వాళ ఏం వారం ?'
'ఆదివారం'
'అయితే పండగ రేపన్నమాట !'

b. Substitution drill.

Model (i) : పుస్తకాల ఖరీదు ఇరవై రూపాయలు.
కాయితం
కాయితం ఖరీదు ఇరవై రూపాయలు.

1. కలం
2. బల్లలు
3. కుర్చీలు
4. పెట్టెలు

Model (ii) : ఇది మూడో పుస్తకం.
రెండో
ఇది రెండో పుస్తకం.

1. మొదటి
2. చివరి
3. ముఖ్యమైన
4. కొత్త

c. Expansion drill.

Model : విజయదశమి రేపు.
విజయదశమి రేపన్నమాట !

1. ఇది మొదటి నెల.
2. ఎల్లుండి ఆదివారం.
3. ఈ అబ్బాయి మీ తమ్ముడు.
4. అతను మా తెలుగు విద్యార్థి.

**d. Transformation drill :**

**Model (i) :** ఇవ్వాళ ఆదివారం.
ఆదివారం ఎప్పుడు ?

1. రేపు పండగ.
2. ఎల్లుండి పన్నెండో తారీకు.
3. ఆవతెల్లుండి విజయదశమి.

**Model (ii) :**

ఈ పుస్తకం ఖరీదు రెండు రూపాయలు.
ఈ పుస్తకాల ఖరీదు రెండు రూపాయలు.

1. ఈ కాయితం ఖరీదు పది రూపాయలు.
2. ఈ కలం ఖరీదు రెండు రూపాయలు.
3. ఈ ఇంటి ఖరీదు ఎంత ?

## EXERCISES

a. Combine the following sentences as shown in the model.

Model :

ఈ కలం ఖరీదు పది రూపాయలు.
ఆ కలం ఖరీదు ఐదు రూపాయలు.
ఈ కలాల ఖరీదు పదిహేను రూపాయలు.

1. ఈ పుస్తకం ఖరీదు ఎంత ?
   ఆ పుస్తకం ఖరీదు ఎంత ?
2. ఈ కుర్చీ ఖరీదు పది రూపాయలు.
   ఆ కుర్చీ ఖరీదు పది రూపాయలు.
3. ఈ గడియారం ఖరీదు ఎంత ?
   ఆ గడియారం ఖరీదు ఎంత ?

b. Write the following in Telugu words.

| | |
|---|---|
| 19 | 14 |
| 20 | 18 |
| 17 | 11 |

c. Answer the following questions.

1. ఇవ్వాళ మొదటి రోజు.
   రేపు ఎన్నో రోజు ?
2. రేపు పంధొమ్మిదో తారీకు.
   ఇవ్వాళ ఎన్నో తారీకు ?
3. అవతెల్లుండి పదిహేడో తారీకు.
   నిన్న ఎన్నో తారీకు ?
4. నిన్న ఎనిమిదో తారీకు.
   ఎల్లుండి ఎన్నో తారీకు ?

## VOCABULARY

| | |
|---|---|
| దసరా | Dasara festival |
| పండగ | festival |
| ఇప్పుడు | now |
| చివరి | last, final |
| ముఖ్యమైన | important/prominent |
| మొదటి | first |
| దుర్గాష్టమి | Durgashtami festival |
| మహార్నవమి | Maharnavami festival |
| విజయదశమి | Vijayadasami festival |
| ఇరవై | twenty |
| పదిహేడు | seventeen |
| పద్దెనిమిది | eighteen |
| పంథొమ్మిది | nineteen |
| అయితే | if so |
| అన్నమాట | 'an expression of confirmation and inference.' |

## GRAMMAR NOTES :

21.1. In this lesson the oblique base of plural nouns is introduced. అ is added to the nouns ending in plural suffix -లు to form corresponding obliqe bases :

పండగలు - అ → పండగల     పండగల పేర్లు     'the names of the festivals'

*paṇḍagalu - a → paṇḍagala     paṇḍagala peerlu*

21.2. అన్నమాట is an idiom used when the speaker expresses his opinion in confirmation with the listener's or his own statement. The sentence with అన్నమాట always refers to and infers something from the previously conveyed information.

| | |
|---|---|
| 'ఇవ్వాళ ఆదివారం' | 'Today is Sunday' |
| 'అయితే మీకు ఇవ్వాళ సెలవు అన్నమాట!' | 'So, (I can take it that) today is a holiday for you' |

# UNIT 6

## Lesson 22

| | |
|---|---|
| సరళ : రవీ ! ఇప్పుడు టైం ఎంత ? | Ravi ! What is the time now ? |
| రవి : ఇదుగో గడియారం. | Here is the watch. |
| సరళ : ఇవి ఎవరి గడియారాలు ? | Whose watches are these ? |
| రవి : ఒకటి నాది ఒకటి సుబ్బారావుది. | One is mine. The other is Subbarao's. |
| సరళ : ఇదేమిటి ? ఒక గడియారంలో తొమ్మిదీ ఇరవై నాలుగు, ఇంకొక గడియారంలో తొమ్మిదీ ముప్పయ్యొకటి. | What is this ? It is 9.24 in one watch and 9.31 in the other. |
| రవి : కరెక్టు టైం తొమ్మిదీ ముప్పై. గోపి గడియారం ఆరు నిమిషాలు స్లో. నాది ఒక నిమిషం ఫాస్టు. | The correct time is 9.30. Gopi's watch is running six minutes slow. Mine is running one minute fast. |
| సరళ : అయితే ఏదీ కరెక్టు కాదన్నమాట. | Then, none is correct. |

రవి : అవును. — Yes.

సరళ : ఇదెవరి గడియారం ? ఇది గంట ఫాస్టు. — Whose watch is this? This is running one hour fast.

రవి : అవును. అది మంచి గడియారం కాదు. — Yes. That is not a good watch.

## DRILLS

**a. Build-up drill.**

రెండు.
ముప్పైరెండు.
తొమ్మిదీ ముప్పైరెండు.
గడియారంలో తొమ్మిదీ ముప్పైరెండు.
ఇంకొక గడియారంలో తొమ్మిదీ ముప్పైరెండు.

అన్నమాట.
కాదన్నమాట.
కరెక్టు కాదన్నమాట.
ఏదీ కరెక్టు కాదన్నమాట.
అయితే ఏదీ కరెక్టు కాదన్నమాట.

**b. Substitution drill.**

**Model :**

ఇప్పుడు టైం తొమ్మిదీ ఇరవయ్యారు. (ఆరు)
ఇప్పుడు టైం ఆరూ ఇరవయ్యారు.

1. ఈ గడియారంలో నాలుగూ ముప్పైరెండు. (ఎనిమిది)
2. కరెక్టు టైం తొమ్మిదీ పద్నాలుగు. (ఏడు)
3. మీ గడియారంలో ఇప్పుడు టైం పదీపదిహేను (పదకొండు)

**c. Response drill.**

**Model (i) :** నీ గడియారం ఎన్ని నిమిషాలు ఫాస్టు ? (ఆరు)
నా గడియారం ఆరు నిమిషాలు ఫాస్టు.

1. రవి గడియారం ఎన్ని నిమిషాలు ఫాస్టు ? (పన్నెండు)
2. వాడి గడియారం ఎన్ని నిమిషాలు స్లో ? (ఒకటి)
3. మీ గడియారం ఎన్ని నిమిషాలు స్లో ? (ఇరవై)

**Model (ii) :** ఏ పుస్తకం నీది.
ఏదీ నాది కాదు.

1. ఏది కొత్త పుస్తకం ?
2. ఏది శర్మ గడియారం ?
3. ఏది తెలుగు పుస్తకం ?
4. ఏది మీ స్నేహితుడి కలం ?
5. ఏది మంచి గది ?

## EXERCISES

a. Answer the following questions.

మీ ఇల్లు ఎక్కడ ? (సరస్వతీపురం)
మా ఇల్లు సరస్వతీపురంలో.

1. మీ ఆఫీసు ఎక్కడ ? (మానసగంగోత్రి)
2. మీ స్నేహితుడి ఇల్లు ఎక్కడ ? (జయలక్ష్మీపురం)
3. మీ స్కూలు ఎక్కడ ? (జయనగర్)
4. మీ నాన్నగారు ఏ కాలేజీలో లెక్చరరు ? (మహారాజా కాలేజీ)

b. Write the following in Telugu script.

| | *Hrs-Minutes* | | *Hrs-Minutes* |
|---|---|---|---|
| 1. | 9_20 | 3. | 10_25 |
| 2. | 8_36 | 4. | 12_39 |

c. Write numerals from 20 to 39 in Telugu words.

## VOCABULARY

| | |
|---|---|
| టైం | time |
| ముప్పై | thirty |
| కరెక్టు | correct |
| నిమిషం | minute |
| స్లో | slow |
| ఫాస్టు | fast |
| గంట | hour |

## GRAMMAR NOTES

22.1. In this lesson the locative case suffix _లో is introduced. This is added to the oblique base. (4.2)

గది_లో 'in the room'

పుస్తకాల_లో 'in the books'

22.2. The time expression is also introduced in this lesson. Notice that in time expression, the final vowel of the numeral representing hours is lengthened.

తొమ్మిది + ముప్పై → తొమ్మిదీముప్పై '9 hours 30 mnts.'

*tommidi + mupphai → tommidii muphai*

22.3. In this lesson the numeral formatiou after twenty is shown. Numerals 'one' to 'nine' are added to 'twenty', 'thirty' etc. to form numerals like 'twentyone', 'twentytwo', 'thirtyfour' etc.

| | | | | |
|---|---|---|---|---|
| ఇరవయ్యొకటి | 21 | ఇరవైతొమ్మిది | 29 | |
| ఇరవై రెండు | 22 | ముప్పై | 30 | |
| ఇరవై మూడు | 23 | ముప్పయ్యొకటి | 31 | |
| ఇరవై నాలుగు | 24 | ముప్పైరెండు | 32 | |
| ఇరవయ్యయిదు | 25 | ముప్పైమూడు | 33 | |
| ఇరవయ్యారు | 26 | ముప్పైనాలుగు | 34 | |
| ఇరవయ్యేడు | 27 | ముప్పయ్యయిదు | 35 | |
| ఇరవయ్యెనిమిది | 28 | ముప్పయ్యారు | 36 | etc. |

22.4. Notice the sandhi in the case of the following numerals :

ఇరవై + ఒకటి → ఇరవయ్యొకటి 'twentyone'

*iravai + okati → iravay-y-okati*

ముప్పై + ఆరు → ముప్పయ్యారు 'thirtysix'

*mupphai + aaru → mupphay-y-aaru*

ఐ + vowel becomes అయ్_య్ + vowel.

# UNIT 6

## Lesson 23

| | |
|---|---|
| గురునాథం : ఏమండీ ఇది గుంటూరు బస్సేనా ? | Sir, is this Guntur (bound) bus ? |
| రామయ్య : కాదు. | No. |
| గురు : ఇది పదింబావు బస్సు కాదా ? | Is this bus not scheduled for 10.15 ? |
| రాము : కాదు. | No. |
| గురు : ఇప్పుడు టైం ఎంత ? | What's the time now ? |
| రాము : పదిన్నర. | 10.30. |
| గురు : నా టైం తొమ్మిదిమ్ముప్పావు. | It is 9.45 in my watch. |
| రాము : మీ టైం తప్పు. ముప్పావుగంట స్లో. | Then your watch is incorrect. It is running 45 minutes slow. |
| గురు : మళ్లీ గుంటూరు బస్సు ఎప్పుడు ? | When is the next bus to Guntur ? |
| రాము : పావుగంట తర్వాత పాసింజరు బస్సు. అరగంట తర్వాత ఎక్స్‌ప్రెస్ బస్సు. | There is a passenger bus 15 minutes later and an express bus after half an hour. |

## DRILLS

**a. Repetition drill.**

ఇప్పుడు టైం తొమ్మిదింబావు.
ఇప్పుడు టైం ఎనిమిదిన్నర.
ఇప్పుడు టైం పదకొండుమ్ముప్పావు.
ఇప్పుడు టైం పన్నెండుంబావు.
ఇప్పుడు టైం పది గంటలు.

**b. Build-up drill.**

కాదా
బస్సు కాదా ?
తొమ్మిదిన్నర బస్సు కాదా ?
అది తొమ్మిదిన్నర బస్సు కాదా ?

ఎప్పుడు
బస్సు ఎప్పుడు ?
బెంగుళూరు బస్సు ఎప్పుడు ?
మళ్లీ బెంగుళూరు బస్సు ఎప్పుడు ?

ముప్పావు
తొమ్మిదిమ్ముప్పావు.
టైం తొమ్మిదిమ్ముప్పావు.
నా టైం తొమ్మిదిమ్ముప్పావు.
ఇప్పుడు నా టైం తొమ్మిదిమ్ముప్పావు.

బస్సు
పాసింజరు బస్సు.
తర్వాత పాసింజరు బస్సు.
గంట తర్వాత పాసింజరు బస్సు.
పావుగంట తర్వాత పాసింజరు బస్సు.

**c. Response drill.**

Model (i) : ఇప్పుడు టైం ఎంత ?
మూడుంబావు.
ఇప్పుడు టైం మూడుంబావు.

1. నాలుగున్నర
2. ఐదుంబావు.
3. ఒకటిమ్ముప్పావు.

Model (ii) : ఆరో తారీకు ఎప్పుడు ?
ఐదో తారీకు తర్వాత.

1. ఆదివారం ఎప్పుడు ?
2. శుక్రవారం ఎప్పుడు ?
3. ఇరవైఎనిమిదో తారీకు ఎప్పుడు ?

**d. Interlocked substitution drill.**

Model :

ఇప్పుడు టైం రెండుమ్ముప్పావు.
................మూడు................
ఇప్పుడు టైం మూడుమ్ముప్పావు.
........................అర.
ఇప్పుడు టైం మూడున్నర.

1. ఇప్పుడు టైం నాలుగున్నర.
................ అరు............
.....................ముప్పావు.
................ తొమ్మిది........
........................అర
................ పది............
........................పావు

## EXERCISES

a. Combine the following.

1. పది + అర
2. తొమ్మిది + పావు
3. ఎనిమిది + ముప్పావు
4. ఆరు + అర
5. ఏడు + పావు
6. మూడు + ముప్పావు

b. Change the following as shown in the model :

Model : తొమ్మిదీ పదిహేను.
తొమ్మిదింబావు.

1. పదీ ముప్పై.
2. ఆరూ పదిహేను.
3. ఒకటీ పదిహేను.
4. రెండూ ముప్పై.

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| గుంటూరు | Guntur | తప్పు | wrong, error, mistake |
| బస్సు | bus | మళ్లీ | again |
| పావు | ¼ | తర్వాత | afterwards |
| అర | ½ | పాసింజరు | passenger |
| ముప్పావు | ¾ | ఎక్స్‌ప్రెస్ | express |

**GRAMMAR NOTES :**

**23.1. In this lesson the fractions are introduced. These constructions are used in measurment of time and the like.**

పావు 'quarter'
అర 'half'
ముప్పావు '¾'

23.1.1. పావు becomes ంబావు when added to a number.

రెండు + పావు → రెండుంబావు '2¼'
*rendu + paavu → rendumbaavu*

23.1.2. అర becomes న్నర when added to a number.

మూడు + అర → మూడున్నర '3½'
*mudu + ara → mudunnara*

23.1.3. ముప్పావు becomes మ్ముప్పావు when added to a number.

నాలుగు + ముప్పావు → నాలుగుమ్ముప్పావు '4¾'
*naalugu + muppaavu → naalugummuppaavu*

23.2. Notice that when fraction and a unit are conjoined, a nasal sound is inserted in between the two.

నాలుగు + పావు → నాలుగు–ం–బావు 'four and a quarter'
*naalugu-m-baavu*

నాలుగు + అర → నాలుగు–న్న–అర 'four and a half'
*naalugu-nn-ara*

నాలుగు + ముప్పావు → నాలుగు–మ్–ముప్పావు '4¾'
*naalugu-m-muppaavu*

23.3. The lenthening of the short vowels in time expression (22.2) does not occur in number-fraction constructions.

ఇప్పుడు టైం పన్నెండున్నర 'now the time is 12.30.'

but ఇప్పుడు టైం పన్నెండూ ముప్పై (22.2).

# UNIT 6

## Lesson 24

గీత : సరళా ! ఈ పెట్టెలో చీరెలు ఎవరివి ?

Sarala ! Whose saris are these in this box ?

సరళ : కొన్ని నావి.

Some are mine.

గీత : అలాగా ! ఏవి నీవి ?

I see ! Which are yours ?

సరళ : ఇవిగో, ఈ ఆకుపచ్చ చీరే ఈ గులాబి రంగు చీరే నావి.

This green sari and that rose sari are mine.

గీత : మిగిలిన చీరెలు ఎవరివి ?

Whose are the rest ?

సరళ : ఎర్రచీరే తెల్లచీరే మా అమ్మవి. పసుపు పచ్చ చీరె మా అక్కయ్యది. మిగిలినవి మా వదినవి. ఇదుగో, ఈ ఫోటోలో ఆవిడ మా వదిన.

The red sari and white sari are my mother's. The yellow sari is my elder sister's. The rest are my sister-in-law's. See, the lady in this photograph is my sister-in-law.

గీత : ఈవిడేనా మీ వదినె ? ఈవిడె మహారాణీ కాలేజీలో లెక్చరర్ కదూ ?

Is she your sister-in-law ? She is a lecturer in Maharani's College. Isn't she ?

సరళ : అవును.

Yes.

గీత : ఆవిడె పేరు సరోజ కదూ ?

Her name is Saroja. Isn't it ?

సరళ : అవును.

Yes.

## DRILLS

**a. Build-up drill.**

ఎవరివి ?
పుస్తకాలు ఎవరివి ?
గదిలో పుస్తకాలు ఎవరివి ?
ఈ గదిలో పుస్తకాలు ఎవరివి ?
రవీ, ఈ గదిలో పుస్తకాలు ఎవరివి ?

కదూ !
గుమాస్తా కదూ !
కాలేజీలో గుమాస్తా కదూ !
మహారాణీ కాలేజీలో గుమాస్తా కదూ !
రవీ ! ఇతను మహారాణీ కాలేజీలో గుమాస్తా కదూ !

వదిన.
ఆవిడ మా వదిన.
ఫోటోలో ఆవిడ మా వదిన.
ఆ ఫోటోలో ఆవిడ మా వదిన.
సరళా ! ఆ ఫోటోలో ఆవిడ మా వదిన.

కదూ !
రామారావు కదూ !
పేరు రామారావు కదూ !
స్నేహితుకి పేరు రామారావు కదూ !
మా స్నేహితుడి పేరు రామారావు కదూ !

**b. Interlocked substitution drill.**

ఆ పెట్టెలో చీరెలు మా వదినవి.
....సంచీ........................
ఆ సంచీలో చీరెలు మా వదినవి.
............పుస్తకం.................
ఆ సంచీలో పుస్తకాలు మా వదినవి.
........................అన్నయ్య....

ఆ సంచీలో పుస్తకాలు మా అన్నయ్యవి.
....ఫోటో..................................
.........గడియారం....................
...................................నేను
...................................మేం
....పెట్టె..................................
............కలం.........................

**c. Combination drill.**

**Model :**

రాముడు విద్యార్థి. కృష్ణుడు విద్యార్థి.
రాముడూ కృష్ణుడూ విద్యార్థులు.

1. వాడు నీ స్నేహితుడు. వీడు నీ స్నేహితుడు.
2. ఆమె డాక్టరు. ఈమె డాక్టరు.
3. ఆ గది నాది. ఈ గది నాది.
4. మా వదిన డాక్టరు. మా అన్నయ్య డాక్టరు.

**d. Conversation drill.**

**Model :**

A ఇవి పది పుస్తకాలు. నాలుగు నావి.
B మిగిలిన పుస్తకాలు ఎన్ని ?
A మిగిలిన పుస్తకాలు ఆరు.

1. A ఇవి ఇరవై చీరెలు. తొమ్మిది ఆవిడవి.
2. A అవి ముప్పైనాలుగు కలాలు. ఇరవై శర్మవి.
3. A వాళ్లు ఏడుగురు విద్యార్థులు. ముగ్గురు తెలుగు విద్యార్థులు.

**e. Expansion drill.**

**Model :** ఇది మా ఇల్లు.
ఇది మా ఇల్లు కదా !

1. రేపు దసరా పండగ.
2. ఎల్లుండి నాలుగో తారీకు.
3. ఇది బెంగుళూరు బస్సు.

**f. Respanse drill.**

**Model :**

ఈ పుస్తకాలు ఎవరివి ? (అతను, ఇతను)
కొన్ని అతనివి. కొన్ని ఇతనివి.

1. ఆ కాయితాలు ఎవరివి ? (మీరు, మేం)
2. ఈ గడియారాలు ఎవరివి ? (రాముడు, కృష్ణుడు)
3. ఆ ఇళ్లు ఎవరివి ? (వాళ్లు, మనం)

**EXERCISES**

a. Combine the following sentences as shown in the model.

**Model :** రవి నా స్నేహితుడు.
గోపి నా స్నేహితుడు.
రవీ గోపీ నా స్నేహితులు.

1. ఈ ఇల్లు మనది. ఆ ఇల్లు మనది.
2. ఆ గది రవిది. ఈ గది రవిది.
3. ఆ కుక్క సరళది. ఈ పిల్లి సరళది.

**b. Change the following as shown in the model :**

Model : ఈ కలం నాది.
ఇవిగో, ఈ కలాలు నావి కదూ !

1. ఈ పిలి ఆమెది.
2. ఈ గడియారం మనది.
3. ఈ ఇల్లు మా బావది.

c. Answer the following questions as shown in the model.

Model : ఈ కుర్చీలు ఎవరివి ? (వాడు, వీడు)
కొన్ని వాడివి. కొన్ని వీడివి.

1. ఆ కలాలు ఎవరివి ? (మీరు, మేం)
2. ఈ గడియారాలు ఎవరివి ? (మా అన్నయ్య, అతను)
3. ఆ పుస్తకాలు ఎవరివి ? (ఆవిడ, ఈవిడ)

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| కొన్ని | some (count) | ఎర్ర | red |
| అలాగా | I see ! | తెల్ల | white |
| ఆకుపచ్చ | green | పసుపుపచ్చ | yellow |
| గులాబి | rose | ఆవిడ/ఆవిద | she/that lady |
| రంగు | colour | ఈవిడ/ఈవిద | she/this lady |
| మిగిలిన | remaining | కదూ | isn't it ? |

## GRAMMAR NOTES

24.1. కొన్ని 'some', a neuter indefinite count pronoun (9.3.) is also introduced in this lesson.

కొన్ని పుస్తకాలు 'some books'
కొన్ని చీరెలు 'some saris'

24.2. Co-ordinative constructions like రవీ రామూ 'Ravi and Ramu' are also introduced in this lesson. Short vowel ending nouns, participating in co-ordinative constructions, lenghthen the final vowel. In other words, the length of the final vowel functions as a conjunction in co-ordinative constructions.

రవీ రామూ స్నేహితులు 'Ravi and Ramu are friends'

24.3. Notice the use of కదా । 'is it not' in tag questions. కదా is added to assertive sentences to form tag question.

| | |
|---|---|
| నేను మేష్టర్ని కదా । | 'I am a teacher. Amn't I? |
| వాడు నీ స్నేహితుడు కదా । | 'He is your friend. Isn't he? |
| నువ్వు సరళవి కదా । | 'You are Sarala. Aren't you?' |

24.4. ఆవిడ and ఈవిడ which are equivalent to ఆమె and ఈమె respectively are also used in this lesson.

| | |
|---|---|
| ఆవిడ సీత = ఆమె సీత | 'she is Sita' |
| ఆవిడ జానకి = ఆమె జానకి | 'she is Janaki' |

24.5. Notice the expression

| | |
|---|---|
| ఫోటోలో ఆవిడ | 'The lady (who is) in this photograph' |

The verb of existence in such constructions is implied.

| | |
|---|---|
| ఈ గదిలో అతను నా స్నేహితుడు | 'The one (who is) in this room is my friend' |

24.6 ఆహా । 'I see !', 'oh !' is an interjection. (c.f. 6.8.)

# REVIEW 3

## Lesson 25

| | |
|---|---|
| కమల : లీలా ! ఆ పుస్తకం ఎవరిది ? | Leela ! Whose book is that ? |
| లీల : ఏది ? | Which one ? |
| కమల : ఆ తెల్ల పుస్తకం. | That white book. |
| లీల : అది మా బాబు పుస్తకం. ఎర్ర పుస్తకం నాది. | That is our Babu's book. The red book is mine. |
| సుశీల : మీ బాబు ఎన్నో తరగతి ? | Which class is your Babu in ? |
| లీల : ఆరో తరగతి. | 6th class. |
| కమల : నాది ఆకుపచ్చ రంగు పుస్తకం. మా తమ్ముడిది నల్ల పుస్తకం. | Mine is a green book. My younger brother's is a black one. |
| లీల : ఎరుపు మంచి రంగు. ఆకుపచ్చా నలుపూ మంచి రంగులు కాదు. | The red is a nice colour. The green and the black colours are not nice. |

| | |
|---|---|
| కమల : ఆకుపచ్చ మంచి రంగు కాదా ! ఆకులు ఆకుపచ్చ. | Is not the green a nice colour? The leaves are green. |
| లీల : పూలు ఎరుపు. | Flowers are red. |
| కమల : ఆకులు అన్నీ ఆకుపచ్చ రంగే ! పూలు అన్నీ ఎరుపు కాదు. కొన్ని తెలుపు. కొన్ని పసుపుపచ్చ కొన్ని గులాబి రంగు. | All the leaves are green. But all the flowers are not red. Some are white some are yellow and some are rose in colour. |
| లీల : అదుగో మా నాన్నగారు. నాన్నగారూ ! ఆకు పచ్చ మంచిరంగా ? ఎరుపు మం: | There my father is. Daddy! Is green a nice colour ? or red ? |
| రామా : అన్నీ మంచి రంగులే ! | All are nice colours. |

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| తరగతి | class | నలుపు | black (N) |
| నల్ల | black (adj.) | ఆకు | leaf |
| ఎరుపు | red (N) | తెలుపు | white (N) |

## EXERCISES

a. Answer the following questions.

ఇవ్వాళ శనివారం.

1. రేపు ఏం వారం ?
2. ఎల్లుండి ఏం వారం ?
3. మొన్న ఏం వారం ?
4. ఆవలెల్లుండి ఏం వారం ?
5. నిన్న ఏం వారం ?
6. అటుమొన్న ఏం వారం ?

b. Answer the following question using the cue words.

Q. మీ తమ్ముడు ఎన్నో తరగతి ? (ఆరు)
మా తమ్ముడు ఆరో తరగతి.

ఎనిమిది
ఒకటి
మూడు

c. Change the following as shown in the model :

Model : ఇది శర్మ పుస్తకం.
ఈ పుస్తకం శర్మది.

1. అది రావు గడియారం.
2. ఇవి రామ్మూర్తి చొక్కాలు.
3. అవి నా పూలు.
4. ఇది మన గది.
5. అవి మీ పెట్టెలు.
6. ఏవి వాళ్ల పుస్తకాలు? ఏవి వీళ్ల పుస్తకాలు?
7. ఏవి విజయలక్ష్మిగారి చీరెలు? ఏవి సరోజినిగారి చీరెలు?

d. Complete the following dialogues as shown in the model.

Model : A అది నా పుస్తకం.
B ఏది?
A అదిగో, అదే!

1. A అతను డాక్టరు.
2. A ఇది మా అమ్మాయి.
3. A ఆయన మాష్టరుగారు.
4. A ఇవి నా పాత చొక్కాలు.
5. A వీళ్లు మా చెల్లెళ్లు.

e. Combine the following pairs of sentences as shown in the model.

Model :

ఈ గది నాది. ఆ గది నాది.
ఈ గదీ ఆ గదీ నావి.

1. ఆ తెల్ల చీరె సరళది. ఈ నల్ల చీరె సరళది.
2. అతను నా స్నేహితుడు. ఇతను నా స్నేహితుడు.
3. ఇది సుబ్బారావు ఇల్లు. అది సుబ్బారావు ఇల్లు.
4. ఈమె నా స్నేహితురాలు. ఆమె నా స్నేహితురాలు.

f. Answer the following questions.

1. ఆకులు ఏ రంగు?
2. ఏనుగులు ఏ రంగు?

g. Put the following words into various semantic groups.

Example : కాయితం, పుస్తకం and కలం.

కూతురు
తెలుపు
ఇల్లు
తొమ్మిది
వదిన
ఇవ్వాళ
గది
ముప్ఫైరెండు
పసుపుపచ్చ
జావ
మర్నాడు
నిన్న
నలుపు
అర

h **Answer the following questions looking at the picture.**




1. ఇప్పుడు టైం ఎంత ?
2. పావుగంట తర్వాత టైం ఎంత ?
3. పదిహేను నిమిషాల తర్వాత టైం ఎంత ?

# UNIT 7

## Lesson 26

| | |
|---|---|
| గోపి : రవీ ! నీకు తెలుగులో ఎన్ని మార్కులు ? | Ravi ! How many marks did you score in Telugu ? |
| రవి : నాకు నలభైనాలుగు. | I scored fortyfour. |
| గోపి : శర్మకు ఎన్ని ? | How many did Sarma get ? |
| రవి : యాభైతొమ్మిది. | Fiftynine. |
| గోపి : సుశీలకెన్ని ? విమలకెన్ని ? | How many did Suseela get and how many did Vimala ? |
| రవి : సుశీలకు అరవైనాలుగు విమలకు డెబ్బైఒకటి. | Suseela secured 64 and Vimala 71. |
| గోపి : ఏమండీ శర్మగారూ ! మీకు ఇంగ్లీషులో ఎన్ని మార్కులు ? | Hello ! Mr. Sarma ! How many marks did you score in English ? |
| శర్మ : నాకు నలభైఎనిమిది. | I scored 48. |

## DRILLS

### a. Substitution drill.

**Model (i) :**

గోపాల్‌కు ఇరవై మూడు మార్కులు.
..........ముప్పై..................
గోపాల్‌కు ముప్పైమూడు మార్కులు.

1. ..........నలభై..................
2. ..........యాభై..................
3. ..........అరవై..................
4. ..........డెబ్బై..................

**Model (ii) :**

సరళకు నలభైఆరు మార్కులు.
విమల
విమలకు నలభైఆరు మార్కులు.

1. నువ్వు
2. నేను
3. మీరు
4. మేం
5. మనం

### b. Interlocked substitution drill.

Model :

నీకు తెలుగులో ఎన్ని మార్కులు ?
నేను..............................
నాకు తెలుగులో ఎన్ని మార్కులు ?
హిందీ......................
నాకు హిందీలో ఎన్ని మార్కులు ?
.............. ఎనిమిది..............
నాకు హిందీలో ఎనిమిది మార్కులు.

రాజా...........
.......కన్నడం.
మీరు...........
...............అరవై
శర్మ.
.......ఇంగ్లీషు......................
నువ్వు..............................

### c. Response drill.

Model :

సుగుణా ! నీకు తెలుగులో ఎన్ని మార్కులు? (26)
నాకు తెలుగులో ఇరవై ఆరు మార్కులు.

1. శ్యామలా ! నాకు తమిళంలో ఎన్ని మార్కులు ? (43)
2. అరుణా ! కమలకు కన్నడంలో ఎన్ని మార్కులు ?(73)
3. ఏమండీ ! మీకు ఇంగ్లీషులో ఎన్ని మార్కులు ? (67)

## EXERCISES

a. Answer the following questions using the cue words.

1. సుశీలకు ఎన్ని మార్కులు? (64)
2. సరళకు ఎన్ని మార్కులు? (79)
3. నాకు ఎన్ని మార్కులు? (57)
4. నీకు ఎన్ని మార్కులు? (40)

b. Fill up the blanks using the correct forms of the words given in the parentheses.

................(నేను) ఇంగ్లీషులో అరవై మార్కులు.

................(నువ్వు) హిందీలో నలభై మార్కులు.

మా................(అన్నయ్య) తెలుగులో యాభై మార్కులు.

మీ................(అక్కయ్య) ఎన్ని మార్కులు?

................(మేం) హిందీలో అరవై నాలుగు మార్కులు.

................(మీరు) కన్నడంలో డెబ్బై తొమ్మిది మార్కులు.

c. Write numerals from 40 to 79 in Telugu words.

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| మార్కు | mark | అరవై | sixty |
| నలభై | forty | డెబ్బై | seventy |
| యాభై | fifty | ఇంగ్లీషు | English |

## GRAMMAR NOTES

26.1. The dative case suffix – కు is introduced in this lesson. When somebody gets some thing the noun denoting the recceiver takes dative suffix. This suffix expresses 'benefactive relationship' between the noun and the verb.

'Sarma got 50 marks.'

This is expressed in Telugu as :

శర్మకు 50 మార్కులు.

(Sarma-dative 50 marks)

**26.2.** All the case suffixes are added to the oblique bases : (4.2)

| | | |
|---|---|---|
| నేను : | నా-కు | 'to me' |
| నువ్వు : | నీ-కు | 'to you' |

The oblique base and the nominative base of some of the nouns and pronouns may be identical.

| | | | |
|---|---|---|---|
| ఆమె | 'she' | ఆమె-కు | 'to her' |
| శర్మ | 'Sarma' | శర్మ-కు | 'to Sarma' |

**26.3.** The numerals నలభై 'forty', యాభై 'fifty' అరవై 'sixty' and డెబ్భై 'seventy' are introduced. By adding ఒకటి 'one' to తొమ్మిది 'nine' the numerals like నలభైఒకటి 'forty-one', యాభైరెండు 'fiftytwo', అరవైమూడు 'sixtythree', డెబ్భైనాలుగు 'seventyfour' etc. can be derived.

# UNIT 7

## Lesson 27

మాష్టరు : ఏమండీ ! మీలో ఎంతమంది హర్యానా వాళ్ళు ? ఎంతమంది కేరళవాళ్ళు ? ఎంతమంది ఒరిస్సావాళ్ళు ?

Hello ! How many of you are from Haryana ? how many from Kerala ? and how many from Orissa ?

మృత్యుంజయ్ : మాలో నేను ఒకణ్ణే ఒరిస్సా వాణ్ణి. ఆయన కేరళవాడు. తక్కిన వాళ్ళు హర్యానావాళ్ళు.

Amongest us I am the one from Orissa. He is from Kerala. The others are from Haryana.

మాష్టరు : అయితే తక్కిన పదిమంది హర్యానా వాళ్ళన్నమాట.

Therefore, the remaining ten are from Haryana.

శర్మ : కాదండీ. అతను మధ్యప్రదేశ్ వాడు, ఇతను మరాఠీవాడు. ఎనిమిదిమందిమే హర్యానావాళ్ళం.

No, Sir ! He is from Madhya Pradesh. He is a Marathi ; and the remaining eight of us are from Haryana.

## DRILLS

a. Repetition drill.

మీరు హిందీవాళ్లు.
మేం తెలుగువాళ్లం.
వాళ్లు అమెరికావాళ్లు.
వీళ్లు రష్యావాళ్లు.

ఆయన ఒరిస్సావాడు.
ఇతను అస్సాంవాడు.
తక్కిన వాళ్లు మరాఠీవాళ్లు.

b. Build-up drill.

మరాఠీవాళ్లు.
వాళ్లు మరాఠీవాళ్లు.
తక్కినవాళ్లు మరాఠీవాళ్లు.

హర్యానావాళ్లు.
ఎంతమంది హర్యానావాళ్లు ?
వాళ్లలో ఎంతమంది హర్యానావాళ్లు ?
తక్కిన వాళ్లలో ఎంతమంది హర్యానావాళ్లు ?

c. Response drill.

Model (i) :

వాళ్లలో ఎంతమంది హర్యానావాళ్లు ? (ఎనిమిది)
వాళ్లలో ఎనిమిదిమంది హర్యానావాళ్లు.

1. వాళ్లలో ఎంతమంది తెలుగువాళ్లు ? (తొమ్మిది)
2. వీళ్లలో ఎంతమంది ఒరిస్సావాళ్లు ? (పది)
3. ఈ విద్యార్థులలో ఎంతమంది కన్నడంవాళ్లు ? (పదకొండు)

Model (ii) :

మీలో ఎంతమంది విద్యార్థులు ? (ఇద్దరు)
మాలో ఇద్దరం విద్యార్థులం.

1. మీలో ఎంతమంది ఒరిస్సావాళ్లు ? (ఆరుగురు)
2. మీలో ఎంతమంది ఇంగ్లీషువాళ్లు ? (ఏడుగురు)
3. మీలో ఎంతమంది హిందీవాళ్లు ? (ముప్పై)

d. Substitution drill.

Model :

మాలో పదిమందిమి తెలుగువాళ్లం.
వాళ్లు
వాళ్లలో పదిమంది తెలుగువాళ్లు.

1. మీరు
2. వీళ్లు
3. మేం
4. ఆ విద్యార్థులు

**e. Transformation drill.**

Model :

వాళ్ళు హర్యానావాళ్ళు.
వాళ్ళలో ఎంతమంది హర్యానావాళ్ళు?

1. మేం హర్యానావాళ్ళం.
2. మీరు తెలుగువాళ్ళు.
3. వీళ్ళు హిందీవాళ్ళు.
4. ఆ అమ్మాయిలు తెలుగువాళ్ళు.

## EXERCISES

**a.** Fill up the blanks using the correct forms of the cue words given in the parentheses.

1. ................(మేం) లో పదిమందిమి విద్యార్థులం.
2. ................(మీరు) లో తక్కినవాళ్ళు విద్యార్థినులు.
3. ................(వాళ్ళు)లో ఆరుగురు కన్నడం వాళ్ళు.
4. ఈ................(పుస్తకాలు) లో ఎన్ని తెలుగు పుస్తకాలు?

**b.** Fill up the blanks with కు or లో.

1. ఈ కాయితాల............ఒకటి నాది.
2. వాళ్ళ............ఎన్ని మార్కులు?
3. ఈ విద్యార్థుల........ఎంతమంది తెలుగువాళ్ళు?
4. మీ............ఎంతమంది తెలుగు విద్యార్థులు?
5. మీ... ........ఎన్ని మార్కులు?

**c.** Answer the following questions using the correct forms of the cue words.

1. వాళ్ళు ఎంతమంది విద్యార్థులు? (ఆరు)
2. మీరు ఎంతమంది తెలుగువాళ్ళు? (ఎనిమిది)
3. మేం ఎంతమంది విద్యార్థులం? (ఏడు)
4. వీళ్ళు ఎంతమంది గుమాస్తాలు? (పది)
5. వాళ్ళు ఎంతమంది డాక్టర్లు? (తొమ్మిది)

## VOCABULARY

| | |
|---|---|
| హర్యానా | Haryana |
| కేరళ | Kerala |
| ఒరిస్సా | Orissa |
| తక్కిన | remaining |
| మధ్యప్రదేశ్ | Madhya Pradesh |
| మరాఠీ | Marathi |

## GRAMMAR NOTES

27.1. In this lesson a different use of locative case suffix -లో is shown.

మీలో ఎంతమంది తెలుగు విద్యార్థులు ? 'How many are Telugu students among you ?'
(How many of you are Telugu students?)

27.2. వాడు in singular number and -వాళ్ళు in plural number are added to the adjectives to change them into appropriate nouns :

| | |
|---|---|
| అతను మంచివాడు | 'He is a good man' |
| వాళ్ళు మంచివాళ్ళు | 'They are good people' |

వాడు is used for masculine singular nouns and వాళ్ళు is for epicene plural. These derived nouns can also be used in I and II person with suitable concord (c.f. 3.3. ; 7.4. ; 11.3. 12.4.1 and 12.5.)

| | |
|---|---|
| నేను మంచివాణ్ణి | 'I am a good man' |
| నువ్వు మంచివాడివి | 'You are a good man' |
| మేం మంచివాళ్ళం. | 'We (excl.) are good people' |
| మనం మంచివాళ్ళం. | 'We (incl.) are good people' |

Here, వాడు does not denote 'inferiority' as the pronoun వాడు does. (14.2.1.)

27.3. మంది is added to numerals from ఎనిమిది 'eight' to form numeral pronouns referring to human nouns. Remember that గురు (12.1) is added from మూడు 'three' to ఏడు 'seven'.

| | | |
|---|---|---|
| ఒకరు/ఒకడు | ఎనిమిదిమంది | |
| ఇద్దరు | తొమ్మిదిమంది | |
| ముగ్గురు | పదిమంది | |
| నలుగురు | పదకొండుమంది | |
| ఐదుగురు | పన్నెండుమంది | etc. |
| ఆరుగురు | | |
| ఏడుగురు | | |

**27.4.** Notice the concord in the sentence

ఎనిమిది మందిమే హర్యానా వాళ్ళం

'(We) eight only are Haryana people.'

In this sentence, the subject NP is మేం/మనం 'we' which is implied. This could be understood from the use of the concord for మేం/మనం.

ఎనిమిది మంది_మి_ఏ హర్యానావాళ్ళ_అం

(We eight people-concord-emphatic marker Haryana people-concord)

మేం ఎనిమిదిమందిమే హర్యానావాళ్ళం.

'We eight only are Haryana people'

**27.5.** Consider the following sentence.

నేను ఒకణ్ణే హర్యానా వాణ్ణి.

'I, alone, is a Haryana person'

In this sentence ఒకణ్ణే is an attribute to నేను, the subject NP. And it appears in this sentence that the attribute also maintains concord with subject NP. However, note that the predicate NP only maintains concord with subject NP according to para 3.3. Therefore, the above sentence may be considered as a combination of two sentences, viz.

| | |
|---|---|
| నేను ఒకణ్ణి. | 'I am one'. (subordinate or embedded sentence) |
| నేను హర్యానా వాణ్ణి. | 'I am a Haryana person'. (Main sentence or matrix sentence) |

When the embedded sentence, నేను ఒకణ్ణి, is merged with the matrix sentence the subject NP of the embedded sentence is dropped as it is identical with the subject of the matrix sentence. But the predicate of the embedded sentence ఒకణ్ణి with its concord is incorporated in the matrix sentence. Thus we get the sentene.

నేను ఒకణ్ణి హర్యానావాణ్ణి.

# UNIT 7

## Lesson 28

| | |
|---|---|
| మూర్తి : చలపతీ ! వెంకటేశ్వర్లు నీస్నేహితుడా ? | Chalapathi! Is Venkateswarlu your friend ? |
| చలపతి : అవును. | Yes. |
| మూర్తి : వాళ్ళది ఏ ఊరు ? | Which place does he hail from ? |
| చలపతి : ఏలూరు. | From Eluru. |
| మూర్తి : అతనికి పిల్లలు ఎంతమంది ? | How many children does he have ? |
| చలపతి : నలుగురు. | Four. |
| మూర్తి : పెద్ద పిల్లలా ? చిన్న పిల్లలా ? | Are they grown up or young ? |
| చలపతి : అందరూ పెద్ద పిల్లలే. | All of them are grown up. |
| మూర్తి : ఆడపిల్లలెంతమంది ? మగపిల్లలెంత మంది ? | How many of them are girls ? and how many of them boys ? |

| | |
|---|---|
| దళపతి : ఇద్దరమ్మాయిలూ ఇద్దరబ్బాయిలూ. | Two girls and two boys. |
| మూర్తి : వాళ్లకు ఎన్నేళ్లు ? | How old are they ? |
| దళపతి : పెద్ద అమ్మాయికి ముప్పైఒకటో సంవత్సరం. ఆమెకు ఒక ఆడపిల్లా ఒక మగపిల్లవాడు. చిన్నమ్మాయికి యిరవైఐదో ఏడు. పెద్దపిల్లవాడికి ఇరవై ఏళ్లు. చిన్నపిల్లవాడికి పదహారేళ్లు. | The eldest daughter is 31. She has a daughter and a son. The younger daughter is 25 years old. The elder son is 20 years old and the younger one is 16 years old. |
| మూర్తి : పెద్ద అమ్మాయి రచయిత్రి కదూ ? | The eldest daughter is a writer. Isn't she? |
| దళపతి : అవును. తెలుగులో పెద్ద రచయిత్రులలో ఆమె ఒకతె. | Yes, she is. She is one of the famous writers in Telugu. |

## DRILLS

**a. Repetition drill.**

రవికి ఆరో ఏడు.
రాజుకు ఆరేళ్లు.
శర్మకు పదహారో సంవత్సరం.
శాస్త్రికి పదహారు సంవత్సరాలు.

అతని పనులలో ఇది ఒకటి.
తెలుగు రచయితలలో ఇతను ఒకడు.
తెలుగు రచయిత్రులలో ఆమె ఒకతె.

**b. Build-up drill.**

ఏడు.
ఆరో ఏడు.
ఇరవై ఆరో ఏడు.
అమ్మాయికి ఇరవై ఆరో ఏడు.
వాళ్ల పెద్ద అమ్మాయికి ఇరవైఆరో ఏడు.

సంవత్సరాలు.
ఇరవై సంవత్సరాలు.
అమ్మాయికి ఇరవై సంవత్సరాలు.
చిన్నమ్మాయికి ఇరవై సంవత్సరాలు.
మా చిన్నమ్మాయికి ఇరవై సంవత్సరాలు.

**c. Response drill.**

**Model (i) :**

మీదే ఊరు ? (ఏలూరు)
మాది ఏలూరు.

1. మీదే ఊరు ? (మైలారు)
2. వాళ్ళదే ఊరు ? (గుంటూరు)
3. సుబ్బారావుగారిదే ఊరు ? (విజయవాడ)
4. మోహన్‌దే ఊరు ? (విశాఖపట్నం)

**Model (ii) :**

రవి : శర్మగారికి పిల్లలెంతమంది ?
2 ఆడ. 2 మగ.

ఇద్దరు ఆడపిల్లలూ ఇద్దరు మగపిల్లలూ.

1. నీకు పిల్లలెంతమంది ? (1 ఆడ, 1 మగ)
2. గౌరికి పిల్లలెంతమంది ? (2 ఆడ, 1 మగ)
3. సావిత్రికి ఎంతమంది పిల్లలు ? (1 మగ)

**Model (iii) :**

శర్మ : రవికి పిల్లలెంతమంది ?
2 ఆడ. 2 మగ.

ఇద్దరు అమ్మాయిలూ ఇద్దరు అబ్బాయిలూ.

1. నీకు పిల్లలెంతమంది ? (1 ఆడ, 1 మగ)
2. గౌరికి పిల్లలెంతమంది ? (2 ఆడ, 1 మగ)
3. సావిత్రికి ఎంతమంది పిల్లలు ? (1 మగ)

**Model (iv) :**

ఏమండీ : మీకు ఎన్నేళ్ళు ? (64)
నాకు అరవై నాలుగు ఏళ్ళు.

1. ఆమెకు ఎన్నేళ్ళు ? (34)
2. మీ నాన్నగారికి ఎన్నేళ్ళు ? (56)
3. మీ అమ్మాయికి ఎన్నేళ్ళు ? (28)

**d. Transformation drill.**

**Model (i) :**

రవికి ఇద్దరు ఆడపిల్లలు.
రవికి ఎంతమంది ఆడపిల్లలు ?

1. ఆయనకు ముగ్గురు మగపిల్లలు.
2. సరళకు ఒక ఆడపిల్ల. ఒక మగపిల్లవాడు.
3. విమలకు ఇద్దరమ్మాయిలూ ఇద్దరబ్బాయిలూ.

**Model (ii) :**

నాకు ముప్పైఒకటో సంవత్సరం.
నీకు ఎన్నేళ్ళు ?

1. రవికి ఇరవై ఒకటో సంవత్సరం.
2. మూర్తికి ముప్పైనాలుగో ఏడు.
3. మా తమ్ముడికి ఐదో సంవత్సరం.

## EXERCISES

a. Fill up the blanks with కు/కి.

1. రవి...........ఇద్దరు ఆడపిల్లలు.
2. సుబ్బారావు...........నలభై సంవత్సరాలు.
3. గోపి...........మూడేళ్ళు.
4. ఆమె...........పదమూడు సంవత్సరాలు.
5. మా అబ్బాయి...........తెలుగులో డెబ్భై ఆరు మార్కులు.
6. మా అమ్మాయి...........ఐదేళ్ళు.
7. ఆయన...........నలుగురు పిల్లలు.
8. అతని...........ఎన్నేళ్ళు ?

b. Fill up the blanks with ఒకడు/ఒకతె/ఒకటి.

1. శర్మగారి అమ్మాయిలలో గిరిజ...........
" విమల కొడుకులలో మోహన్...........
3. నాపుస్తకాలలో ఇది...........
4. మా విద్యార్థులలో అతను...........
5. మా గుమాస్తాలలో ఆమె...........
6. మన పండగలలో దసరా...........

c. Answer the following questions using the cue words.

1. గోపీ, మీ తాతగారికెన్నేళ్ళు ? (78)
2. ఈమెకు ఎన్నేళ్ళు ? (32)
3. సరళా, మీ అక్కయ్యకు ఎంతమంది పిల్లలు ? (2 ఆడ, 1 మగ)

d. Give the plural forms of the following :

1. అబ్బాయి
2. ఆడపిల్ల
3. అమ్మాయి
4. ఏడు
5. మగపిల్లవాడు
6. సంవత్సరం

## VOCABULARY

| | |
|---|---|
| ఊరు | village |
| ఏలూరు | Eluru (a town) |
| పిల్లలు | children |
| పెద్ద | elder/big |
| చిన్న | younger/small |
| ఆడపిల్ల | girl |
| మగపిల్లవాడు | boy |
| ఏడు | year |
| సంవత్సరం | year |
| రచయిత్రి | writer (fem.) |
| ఒకతె | one woman/one girl |

## GRAMMAR NOTES

28.1. In this lesson the variation in the dative case suffix కు/కి is introduced. -కి occurs after the oblique bases ending in ఇ or ఈ. (The ఈ ending oblique bases of I and II person pronouns నీ and మీ are exceptions).

| | | | |
|---|---|---|---|
| అతని-కి<br>*atani-ki* | 'to him' | వాడి-కి<br>*vaaḍi-ki* | 'to him' |
| రవి-కి<br>*ravi-ki* | 'to Ravi' | కుర్చీ-కి<br>*kurcii-ki* | 'to the chair' |

and -కు occurs elsewhere.

| | | | |
|---|---|---|---|
| ఆయన-కు<br>*aayana-ku* | 'to him' | ఆమె-కు<br>*aame-ku* | 'to her' |
| సుబ్బారావు-కు<br>*subbaaraavu-ku* | 'to Subbarao' | మోహన్-కు<br>*moohan-ku* | 'to Mohan' |
| నీ-కు<br>*nii-ku* | 'to you' | మీ-కు<br>*mii-ku* | 'to you' |

28.2. Notice the use of the dative case suffix to express possession.

అతని-కి ఇద్దరు పిల్లలు. 'He has two children.'
(he-dative two children)

28.3. Another function of the dative case is in the expression of age.

నా-కు ఇరవై ఏళ్ళు. 'I am twenty years old.'
(I-dative twenty years)

28.4. పిల్లలు 'children' is epicene plural.

28.5. The plural form of ఆడపిల్ల 'girl' is ఆడపిల్లలు 'girls' and the plural form of మగపిల్లవాడు 'boy' is మగపిల్లలు 'boys'.

28.6. Notice the free variation between అమ్మాయి and ఆడపిల్ల ; and అబ్బాయి and మగపిల్లవాడు or పిల్లవాడు.

28.7. ఒకతె is the feminine numeral pronoun corresponding to the masculine numeral pronoun ఒకడు (12.2.). ఒకరు (12.2.) is also the honorific from of ఒకతె. (ఒకరు is epicene honorific.) The numeral pronouns for human nouns except 'one' are epicene (12.2.) and 'one' shows a contrast of masculine and feminine in the non-honorific forms.

ఆమె ఒకతె 'She is one' అతను ఒకడు 'He is one'

But, ఆమె ఒకరు 'She is one' and ఆయన ఒకరు 'He is one' are honorific forms.

28.8. When the plural suffix -లు is added to the డు ending nouns the డు and లు merge together as ళ్లు.

ఏడు + లు → ఏళ్లు 'years'

*eeḍu + lu → eeḷḷu*

But, remember that the Sanskrit nouns drop the final డు. (11.4.3)

స్నేహితుడు + లు → స్నేహితులు 'friends'

# UNIT 8

## Lesson 29

| | |
|---|---|
| వైద్యు : నింగయ్యగారూ ! ఈ పెట్టెలో ఏం ఉన్నది ? | Mr. Ningaiah ! What is there in this box ? |
| నింగయ్య : సీసా ఉన్నదండీ. | There is a bottle in that box. |
| వైద్యు : సీసాలో ఏం ఉన్నది ? | What is there in the bottle ? |
| నింగయ్య : మందు. | *Mandu.* |
| వైద్యు : మందు అంటే ఏమిటి ? | What do you mean by ***Mandu*** ? |
| నింగయ్య : మందు అంటే ఇంగ్లీషులో మెడిసిన్. | *Mandu* means medicine in English. |
| వైద్యు : అలాగా ! మందు ఎవరికి ? | I see ! For whom ? |
| నింగయ్య : నాకే. | For me. |
| వైద్యు : ఎందుకు ? జ్వరమా ? | Why ? (Do you have) Feaver ? |
| నింగయ్య : జ్వరం కాదు. కడుపులో నొప్పి. | Not fever, stomachache. |




## DRILLS

**a. Build-up drill.**

ఉన్నది

ఏం ఉన్నది ?

సంచీలో ఏం ఉన్నది ?

ఈ సంచీలో ఏం ఉన్నది ?

ఏమిటి ?

అంటే ఏమిటి ?

పుస్తకం అంటే ఏమిటి ?

**b. Substitution drill.**

**Model (i) :**

**student** అంటే విద్యార్థి.

**girl**

**girl** అంటే అమ్మాయి.

**cat**

**elephant**

**tiger**

**Model (ii) :**

పెట్టెలో కలం ఉన్నది.

సంచీ

సంచీలో కలం ఉన్నది.

గది

సీసా

పుస్తకం

**c. Response drill.**

**Model (i) :**

ఈ పెట్టెలో ఏం ఉన్నది ? (సీసా)
ఈ పెట్టెలో సీసా ఉన్నది.

1. సీసాలో ఏం ఉన్నది ? (మందు)
2. మీ కొత్త సంచీలో ఏం ఉన్నది ? (రవి కలం)
3. మీ పాత సంచీలో ఏం ఉన్నది ? (మా అబ్బాయి చొక్కా)

**Model (ii) :**

ఈ మందు ఎవరికి ? (కమల)
ఈ మందు కమలకు.

1. ఈ చొక్కా ఎవరికి ? (మా అబ్బాయి)
2. ఆ మందు ఎవరికి ? (నేను)
3. ఈ కుర్చీ ఎవరికి ? (మాస్టరుగారు)
4. ఈ కొత్త పుస్తకం ఎవరికి ? (ఎం. ఏ. విద్యార్థులు)

## EXERCISES

a. Fill up the blanks with లో or కు/కి.

1. మీ పెట్టె...........పుస్తకం ఉన్నది.
2. ఈ పుస్తకం రవి........., ఆ పుస్తకం కమల......
3. మా స్నేహితుడి......కడుపు......నెప్పి.
4. మీ గది.........ఏం ఉన్నది ?
5. కాయితం అంటే హిందీ.........ఏమిటి ?

b. Answer the following questions using the cue words.

1. మీ ఇంటికి ఎన్ని కిటికీలు ? (ఆరు)
2. మీ కొత్త సంచీలో ఏం ఉన్నది ? (గడియారం)
3. ఈ పుస్తకం ఎవరికి ? (సుశీల)
4. ఎవరికి కడుపులో నెప్పి ? (రామారావుగారు)
5. ఈ పెట్టెలు ఎవరికి ? (మా అమ్మాయి)
6. మన కాలేజీ ఎక్కడున్నది ? (మైసూరు)

c. Match the following.

| A | B | |
|---|---|---|
| 1. రామ్మూర్తిగారికి | రెండో గదిలో. | (        ) |
| 2. మీ ఇల్లు | ఏం ఉన్నది ? | (        ) |
| 2. మన క్లాసు | ఎంత మంది పిల్లలు ? | (        ) |
| 4. ఈ కాయితంలో | సరస్వతీపురంలోనా ? | (        ) |
| 5. కడుపులో నెప్పి | అంటే ఏమిటి ? | (        ) |

**d.** Answer the following questions based upon the text of the lesson.

1. మందు ఎక్కడ ఉన్నది ?
2. పెట్టెలో ఏం ఉన్నది ?
3. మందు ఎవరికి ?
4. సింగయ్యకు జ్వరమా ? కడుపులో నెప్పా ?

## VOCABULARY

| | |
|---|---|
| ఉన్నది | it is/was |
| సీసా | bottle |
| మందు | medicine |
| అంటే | means |
| ఎందుకు | why |
| జ్వరం | fever |
| కడుపు | stomach |
| నెప్పి | pain |
| అందం | beauty |
| డిగ్రీ | degree |
| ఉద్యోగం | employment |

## GRAMMAR NOTES

29.1. In this lesson the neuter singular form of the existential verb, ఉన్నది 'it exists, it is avilable, it is possessed', is introduced. This verb expresses existence, availability and possession.

అది ఎక్కడ ఉన్నది ? 'Where is it?'

The tense expressed by this verb is non-future.

29.2. అంటే 'means' is used to elicit or to give the meaning of a word or anything.

పుస్తకం అంటే ఏమిటి ? 'What do you mean by *pustakam* ?'

'medicine' అంటే తెలుగులో మందు. '*Medicine* means *Mandu* in Telugu'

29.3. ఎందుకు 'why' is an interrogative word (7.1.) which questions the reason and cause.

29.4. Notice the use of dative case suffix కి/కు in sentences like :

ఈ మందు ఎవరికి ? 'Whom is this medicine for ?'

ఈ మందు నాకు. 'This medicine is for me'.

This is a benefactive relationship. (26.1.)

# UNIT 8

## Lesson 30

| | |
|---|---|
| రతిరామ్ : ఏమండీ ! మీది ఏ ఊరు ? | Hello ! Which place do you hail from ? |
| రామనరసింహం : మాది అమరావతి. | I am from Amaravathi. |
| రతిరామ్ : అది ఏ రాష్ట్రంలో ఉన్నది ? | In which state is it ? |
| రామనరసింహం : ఆంధ్ర ప్రదేశ్‌లో గుంటూరు జిల్లాలో ఉన్నది. | It is in Guntur district in Andhra Pradesh. |
| రతిరామ్ : మీ ఊళ్లో ఏం ఉన్నాయి ? | What are the attractions in your town ? |
| రామనరసింహం: శివాలయం బౌద్ధస్తూపం ఉన్నాయి. | Siva Temple and Bouddha Sthupa. |
| రతిరామ్ : ఇంకా ఏమేం ఉన్నాయి ? | What else are there ? |
| రామనరసింహం : కృష్ణానది ఉన్నది. మ్యూజియం కూడా ఉన్నది. | The river Krishna. There is also a museum. |

రహీమ్ : మీ ఊరికి రైలున్నదా ?

Is your town connected by the rail ?

రామనరసింహం : లేదు. బస్సు మాత్రమే ఉన్నది.

No. There is only bus connection.

## DRILLS

a. Repetition drill.

1. మీది ఏ ఊరు ?
మీ స్నేహితుడిది ఏ ఊరు ?
మీ ఊరికి రైలున్నదా ?
మీ ఊళ్లో ఏమేం ఉన్నాయి ?

మీ సంచీలో ఏమేం ఉన్నాయి ?
పుస్తకం, కలం ఉన్నాయి.
కాయితం, గడియారం ఉన్నాయి.
పెంసిలు కూడా ఉన్నాయి.

b. Substitution drill.

ఈ పెట్టెలో సీసా, సంచీ ఉన్నాయి.
కలం, కాయితం ఉన్నాయి.

1. ఈ గదిలో కుర్చీ, బల్ల ఉన్నాయి.
(పాత పెట్టె, కొత్త పెట్టె)

2. మా ఊళ్లో కృష్ణానదీ శివాలయం ఉన్నాయి.
బౌద్ధ స్తూపం, మ్యూజియం)

3. ఈ కొత్త సంచిలో గడియారం, పెంసు సీసా ఉన్నాయి. (తెలుగు పుస్తకాలు, హిందీ పుస్తకం)

c. Interlocked substitution drill.

మాది అమరావతి

మీరు

మీది అమరావతి.

గుంటూరు

మీది గుంటూరు.

అతను.

........మైసూరు

మా వదినె............

............బెంగుళూరు

మా స్నేహితుడు...........

................విజయవాడ

నా భార్య..................

**d. Expansion drill :**

Model :

నా దగ్గర పుస్తకం ఉన్నది.

నా దగ్గర పుస్తకం గూడా ఉన్నది.

1. మా ఊళ్లో హైస్కూలు ఉన్నది.
2. ఆ సంచీలో గడియారం ఉన్నది.
3. ఈ గదిలో బల్లలున్నాయి.
4. ఆ పెట్టెలో చీరెలు ఉన్నాయి.

**e. Response drill.**

Model (i) :

మీదేఊరు ? (గుంటూరు)

మాది గుంటూరు.

1. మీ ప్రిన్సిపాల్‌గారిదే ఊరు? (నరసాపురం)
2. కోటేశ్వరరావుదేఊరు ? (తిరుపతి)
3. మీ స్నేహితుడిదేఊరు ? (హైదరాబాదు)

Model (ii) :

మీ ఊళ్లో ఏం ఉన్నాయి ? (కృష్ణానది, శివాలయం)

మా ఊళ్లో కృష్ణానదీ శివాలయం ఉన్నాయి.

1. ఈ సంచీలో ఏం ఉన్నాయి ? (పుస్తకం, కాయితాలు)
2. మీ ఊళ్లో ఏం ఉన్నాయి ? (మ్యూజియం, కాలేజీ)
3. ఆ పెట్టెలో ఏం ఉన్నాయి ? (శర్మ పుస్తకం, నా గడియారం)

Model (iii) :

మీ ఊరికి రైలున్నదా ? (బస్సు)

లేదు. బస్సు మాత్రమే ఉన్నది.

1. మీ దగ్గర కలం ఉన్నదా ? (పుస్తకం)
2. మీ ఊళ్లో కాలేజీ ఉన్నదా ? (స్కూలు)
3. ఈ సంచీలో కాయితం ఉన్నదా ? (కలం)

**f. Transformation drill.**

Model :

నా దగ్గర పుస్తకం ఉన్నది.

నా దగ్గర పుస్తకం లేదు.

1. మా ఊరికి బస్సు ఉన్నది.
2. మా ఊళ్లో కాలేజీ ఉన్నది.
3. మా ఊరికి రైలు ఉన్నది.

## EXERCISES

a. Answer the following questions.

1. మీదేఊరు ?
2. మీ ఊరు ఏ రాష్ట్రంలో, ఏ జిల్లాలో ఉన్నది ?
3. మీ ఊరికి రైలు ఉన్నదా ?
4. మీ ఊళ్ళో కాలేజీ ఉన్నదా ?
5. మీ ఊళ్ళో మ్యూజియం ఉన్నదా ?

b. Rewrite the following sentences as shown in the model.

Model (i) :

ఈ పెట్టెలో ఇరవై రూపాయలున్నాయి.
ఈ పెట్టెలో ఇరవై రూపాయలు మాత్రమే ఉన్నాయి.

1. నా దగ్గర తెలుగు పుస్తకం ఉన్నది.
2. మా ఊళ్ళో ఒక స్కూలున్నది.
3. ఈ పెట్టెలో ఆరు పొట్లాలున్నాయి.

Model (ii) :

మీ ఊళ్ళో ఏం ఉన్నాయి ?
మీ ఊళ్ళో ఇంకా ఏమేం ఉన్నాయి ?

1. ఆ పెట్టెలో ఏం ఉన్నాయి ?
2. ఈ సంచీలో ఏం ఉన్నది ?
3. మీ గదిలో ఏం ఉన్నాయి ?

Model (iii) :

మా ఊళ్ళో శివాలయం, మ్యూజియం ఉన్నాయి.
మా ఊళ్ళో శివాలయం ఉన్నది ; మ్యూజియం కూడా ఉన్నది.

1. ఈ సంచీలో నా పొట్లాం, మా చెల్లెలు చీరే ఉన్నాయి.
2. ఆ గదిలో మా కుక్కా, పిల్లీ ఉన్నాయి.
3. ఈ పెట్టెలో నా గడియారం, రవి గడియారం ఉన్నాయి.

c. Fill up the blanks with the correct forms of the words given in the parentheses.

1. మా సొంత ఇల్లు మా........(ఊరు) ఉన్నది.
2. మీ........(ఊరు) బస్సు ఉన్నది కదా ?
3. ఏమండీ, ........(మీరు) ఏ ఊరు ?
4. మీ........(ఊరు) ఎన్ని కాలేజీలున్నాయి ?

d. Fill up the blanks with ఉన్నది/ఉన్నాయి.

1. అక్కడ ఏమేం............ ?
2. మా ఊళ్ళో శివాలయం............
3. ఈ సంచీలో పుస్తకాలు............
4. ఆ పెట్టెలో గడియారం, కలం............

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| అమరావతి | Amaravati (a village) | ఇంకా | still |
| రాష్ట్రం | State | ఏమేం | what (pl.) |
| ఆంధ్రప్రదేశ్ | Andra Pradesh | కృష్ణానది | the river Krishna |
| జిల్లా | district | మ్యూజియం | museum |
| ఉన్నాయి | they are/were (neuter) | రైలు | train |
| శివాలయం | Siva temple | మాత్రమే | only |
| బౌద్ధస్తూపం | Bouddha Sthupa | | |

## GRAMMAR NOTES

30.1 In this lesson neuter plural form of the existential verb ఉన్నాయి (plural form of ఉన్నది 29.1.) is introduced.

నీ పుస్తకాలు ఎక్కడ ఉన్నాయి ? 'Where are your books?'

30.2. లేదు, the negative form of ఉన్నది (29.1.), is also introduced in this lesson. లేదు stands to negate the existence of a neuter singular noun. The tense expressed by this verb also is non-future.

కుర్చీలో సంచి లేదు. 'There is no bag in the chair.'

30.3. When the nouns, not ending in a vowel, are participating in a co-ordinative construction (24.2.) there will be no marker which functions as a conjunction. As they do not end in a vowel, there doesn't arise a question of lengthening the final vowel as in the case of short vowel ending nouns (24.2.).

మా ఊళ్లో శివాలయం బౌద్ధస్తూపం ఉన్నాయి. 'There are Siva temple *and* Bouddha Sthupa in my village.'

30.4. ఇంకా 'more, still, yet' is an adverb. Remember the word ఇంకొక (ఇంకా + ఒక) 'one more' introduced in lesson 10.

30.5. The oblique base of ఊరు 'village' is ఊరి_.

30.6. Notice the Sandhi :

ఊరు + లో → ఊళ్లో 'in the village'

*uuru + loo → uulloo*

30.7. Notice the use of dative case suffix in sentences like

| | |
|---|---|
| మీ ఊరికి రైలు ఉన్నదా ? | 'Is there rail connection to your village ?' |
| మా ఊరికి రైలు లేదు. | 'There is no rail connection to my village.' |

Here, the dative case suffix is used to denote a type of location/destination.

30.8. The existential verb and its negative forms take always a noun of location (or a noun with dative case suffix.

| | |
|---|---|
| With a noun of location : | ఈ పుస్తకం ఎక్కడ ఉన్నది.<br>'Where is this book ?' |
| With a noun + locative case suffix : | ఆ పుస్తకం గదిలో ఉన్నది.<br>'That book is in the room. |
| With a noun + dative case suffix : | మా ఊరికి రైలు ఉన్నది.<br>'There is a rail connection to my village. |

30.9. ఏమేం (ఏం + ఏం) (6.7.)

Reduplication of such interrogative words (7.1.) anticipates more than one object or a plural noun in the answer.

| | |
|---|---|
| ఏమేం ఉన్నాయి ? | కలం, కాగితం ఉన్నాయి. |
| What are there ? | Pen and paper are there. |
| మీ స్నేహితులు ఎవరెవరు ? | రవి, శర్మ నా స్నేహితులు. |
| Who are your friends ? | Ravi and Sarma are my friends. |
| మీ కలాలు ఎక్కడెక్కడ ఉన్నాయి ? | నా కలాలు ఈ గదిలో, ఆ గదిలో ఉన్నాయి. |
| Where are your pens ? | My pens are (some) in this room and (some) in that room. |

30.10. కూడా 'also' and మాత్రమే 'only' are adverbs which are used in complementation, ie., both cannot be used in one sentence.

| | |
|---|---|
| మా ఊరికి రైలుకూడా ఉన్నది. | 'There is rail connection also to my village.' |
| మా ఊరికి రైలు మాత్రమే ఉన్నది. | 'There is only rail connection to my village.' |

# UNIT 8

## Lesson 31

| | |
|---|---|
| కమల : సరళా ! అవి ఏం పూలు ? | Sarala ! What are those flowers ? |
| సరళ : ఏవి ? తెల్లపూలా ? ఎర్రపూలా ? | Which ones ? The white flowers or the red ones ? |
| కమల : ఆ ఎర్ర పూలు. | Those red flowers. |
| సరళ : ఎర్రవి గులాబీ పూలు. | The red ones are roses. |
| కమల : తెల్లది మల్లెపువ్వు కదూ ? | Is not the white one a jasmine ? |
| సరళ : అవును. మీ ఇంట్లో మల్లె చెట్టు ఉన్నదా ? | Yes, it is. Do you have a jasmine plant in your house ? |
| కమల : ఆ ! ఒకటి కాదు. రెండు చెట్లు ఉన్నాయి. | Yes. Not one, there are two. |
| సరళ : గులాబీ చెట్లు లేవా ? | Don't you have rose plants ? |

కమల : లేవు. — No.

సరళ : మా ఇంట్లో ఒక మల్లె చెట్టూ ఒక గులాబీ చెట్టూ ఉన్నాయి. — We have one jasmine plant, and one rose plant in our house.

కమల : పెద్ద చెట్లా ? చిన్న చెట్లా ? — Are they big ones or small ones ?

సరళ : మల్లె చెట్టు చిన్నది. గులాబీ చెట్టు పెద్దది. — The jasmine plant is small and the rose plant is big.

## DRILLS

a. Repetition drill.

తెల్లని మల్లె పువ్వు.
ఎర్రని గులాబీ పూలు.
చిన్నది గులాబీ చెట్టు.

పెద్దవి మల్లె చెట్లు.
ఇక్కడ ఎర్ర పూలు లేవు.
అక్కడ తెల్ల పువ్వు లేదు.

b. Build-up drill.

ఉన్నాయి.
చెట్లు ఉన్నాయి.
మల్లె చెట్లు ఉన్నాయి.
రెండు మల్లె చెట్లు ఉన్నాయి.
ఇంట్లో రెండు మల్లె చెట్లు ఉన్నాయి.
మా ఇంట్లో రెండు మల్లె చెట్లు ఉన్నాయి.

కదా !
పువ్వు కదా !
గులాబీ పువ్వు కదా !
ఎర్రని గులాబీ పువ్వు కదా !

c. Substitution drill.

**Model (i):**

ఇది ఒక కలం. (రెండు)
ఇవి రెండు కలాలు.

1. అది ఒక పువ్వు. (నాలుగు)
2. అక్కడ నా సంచీ లేదు. (సంచీలు)
3. ఇది ఒక మల్లె చెట్టు. (మూడు)

**Model (ii):**

మీ ఇంట్లో మల్లె చెట్లు లేవా ?
పాత సంచీలు.
మీ ఇంట్లో పాత సంచీలు లేవా ?

1. గులాబీ చెట్లు
2. పెద్ద చెట్లు
3. తెల్ల పూలు.

**d. Interlocked substitution drill.**

**Model :**

ఈ సంచీ పెద్దది.

చిన్న

ఈ సంచీ చిన్నది.

సంచీలు

ఈ సంచీలు చిన్నవి.

ఆ

ఆ సంచీలు చిన్నవి.

ఈ పువ్వు తెల్లది.

ఎర్ర

....పూలు............

ఆ...................

....ఇల్లు............

...............పాత

....ఇళ్లు............

...............కొత్త

....ఊరు...............

ఏ.......................

**e. Response drill.**

**Model (i) :**

మీ ఇంట్లో గులాబీ చెట్లు లేవా ?

మా ఇంట్లో గులాబీ చెట్లు లేవు.

1. మీ ఇంట్లో పెద్ద బల్లలు లేవా ?
2. మీ ఊళ్లో కొత్త బస్సులు లేవా ?
3. మీ దగ్గర గులాబీ పూలు లేవా ?

**Model (ii) :**

మీ ఇంట్లో కుర్చీ ఉన్నదా ?

ఆ ! మా ఇంట్లో కుర్చీ ఉన్నది.

1. మీ ఊళ్లో మల్లె చెట్లున్నాయా ?
2. ఆ గదిలో మీ కుర్చీల్లి ఉన్నాయా ?
3. మీ ఇంట్లో మా బొమ్మ ఉన్నదా ?

**Model (iii) :**

ఇవి కొత్త పుస్తకాలా పాత పుస్తకాలా ?

ఈ పుస్తకం కొత్తది; ఆ పుస్తకం పాతది.

1. ఇవి ఎర్రపూలా తెల్ల పూలా ?
2. అవి పాత ఇళ్లా కొత్త ఇళ్లా ?
3. అవి పెద్ద చెట్లా చిన్న చెట్లా ?

**f. Transformation drill.**

**Model (i) :**

ఆ తెల్లపూలు మల్లె పూలు.

ఆ తెల్లవి మల్లె పూలు.

1. ఈ పెద్ద సంచీలు మా సంచీలు.
2. ఆ కొత్త కుర్చీలు విద్యార్థులవి.
3. ఆ ఎర్ర పూలు గులాబీ పూలు.

**Model (ii) :**

ఈ కుర్చీ కొత్తది.

ఈ కుర్చీలు కొత్తది.

1. ఆ పువ్వు ఎర్రది.
2. ఈ ఇల్లు పెద్దది.
3. మా గులాబీ చెట్టు చిన్నది.

**EXERCISES**

a. Answer the following questions as shown in the model.

మీ ఇంట్లో హిందీ పుస్తకాలున్నాయా ?
మా ఇంట్లో హిందీ పుస్తకాలు లేవండీ ?

1. మీ ఇంట్లో గులాబీ చెట్లున్నాయా ?
2. మీ ఊళ్లో మల్లె చెట్లున్నాయా ?
3. మీ సంచీలో నా పుస్తకాలున్నాయా ?

b. Fill up the blanks with లేదు or లేవు.

1. మా ఇంట్లో గులాబీ చెట్టు............
2. రవి కొత్త పుస్తకాలు నీ పాత సంచీలో........
3. ఈ ఊళ్లో మల్లె చెట్లు........
4. ఈ గదిలో మీ కుక్క..............

c. Fill up the blanks using the correct forms of the cue words given in the parentheses.

1. మా ఊరు............(పెద్ద)
2. ఈ పెట్టెలో పుస్తకాలు............(కొత్త)
3. ఈ ఎర్రని గులాబీ........... (పువ్వు)
4. మా ఇంట్లో రెండు గులాబీ........(చెట్టు) ఉన్నాయి.

d. Give your responses to the following as shown in the model :

Model (i) :

మీ ఇంట్లో కొత్త కుర్చీ ఉన్నదా ?
ఆ ! ఒకటి కాదు, రెండు కొత్త కుర్చీలున్నాయి.

1. మీ ఇంట్లో గులాబీ చెట్టు ఉన్నదా ?
2. నీ దగ్గర మల్లె పువ్వు ఉన్నదా ?
3. మీకు ఇల్లు ఉన్నదా ?

Model (ii) .

ఇది కొత్త పుస్తకం.
ఈ పుస్తకం కొత్తది.

1. ఇది పాత ఇల్లు.
2. ఇవి తెల్ల పూలు.
3. అవి పెద్ద కాయితాలు.
4. అది చిన్న కుర్చీ.

**VOCABULARY**

| | |
|---|---|
| మల్లె | jasmine |
| చెట్టు | plant, tree |
| లేవు | not available, not existing (neuter pl.) |

## GRAMMAR NOTES

31.1. In this lesson the adjectival predicates (c.f. pronominal/nominal predicates 19.2) are introduced. _ది and _వి for singular and plural respectively are added to adjectives to form adjectival predicates.

| | | | |
|---|---|---|---|
| మంచి_ది | 'good one' | పెద్ద_ది | 'big one' |
| మంచి_వి | 'good ones' | పెద్ద_వి | 'big ones' |

31.2. Notice the derivation of the adjectival predicates in thefollowing expressions.

ఎర్రపూలు → ఎర్రవి
'red flowers' 'red ones'

పెద్ద చెట్టు → పెద్దది
'large tree' 'large one'

అవి పెద్ద పుస్తకాలు → ఆ పుస్తకాలు పెద్దవి
'Those are big books.' 'Those books are big ones.'

ఇది తెల్ల సంచి → ఈ సంచి తెల్లది.
'This is a white bag.' 'This bag is white one.'

But,

అది మల్లె చెట్టు → ఆ చెట్టు మల్లెది
'That is a jasmine plant.'

ఇవి తెలుగు పుస్తకాలు → ఈ పుస్తకాలు తెలుగువి
'These are Telugu books.'

are not possible.

The condition seems to be that the adjective—either pronominal adjective or a pure adjective—should be

(i) in possessive relationship with the noun,

ఇది రవి పుస్తకం → ఈ పుస్తకం రవిది
'This is Ravi's book.' 'This book is Ravi's.'

(ii) a qualitative adjective,

ఇది మంచి పుస్తకం → ఈ పుస్తకం మంచిది.
'This is a good book.' 'This book is good.'

(iii) a quantitative adjective (but not a numeral adjective),

ఇది పెద్ద చెట్టు → ఈ చెట్టు పెద్దది.
'This is a big tree.' 'This tree is big.'

or (iv) to mean 'belong to' or 'made in',

ఇది అమెరికా గడియారం → ఈ గడియారం అమెరికాది.

'This is an American clock.' 'This clock is an American one.'

but not

(i) if the adjective identifies the noun with its name.

ఇది గులాబీ చెట్టు → *ఈ చెట్టు గులాబీది.

'This is a rose plant.'

ఇవి తెలుగు పుస్తకాలు → *ఈ పుస్తకాలు తెలుగువి.

'These are Telugu books.'

In the above sentences marked * the adjective identifies the noun with its name or language and therefore they are ungrammatical.

The numeral adjectives (ordinal) tolerate this transformation and not the numeral adjectives (cardinal).

అది రెండో పుస్తకం → ఆ పుస్తకం రెండోది.

'That is the second book.' 'That book is the second one.'

and not

అవి రెండు పుస్తకాలు → *ఆ పుస్తకాలు రెండువి.

'Those are two books.'

31.3. లేవు (the plural form of లేదు and the negative form of ఉన్నాయి) is also introduced in this lesson. This is used in neuter plural.

ఈ పెట్టెలో పుస్తకాలు లేవు. 'There are no books in this box.'

31.4. ఇ and ఉ are dropped between ట and ల and ట్ + ల cluster will be simplified to ట + ల.

ఇల్లు + లో → ఇంటి_లో → ఇంట్లో 'in the house' (16.3.)

*illu + loo → inṭi-loo → inṭ-loo*

చెట్టు + లు → చెట్లు 'trees'

*cettu + lu → çeṭ-lu*

Sentences marked * are ungrammatical.

# UNIT 8

## Lesson 32

| | |
|---|---|
| సరళ : అన్నయ్యా ! నీ అలమరలో నా పుస్తకం ఉన్నదా ? | Brother ! Do you have my book in your cupboard ? |
| రవి : లేదు. | No. |
| సరళ : మరి ఎక్కడున్నది ? | Where is it then ? |
| రవి : ఏమో, ఎక్కడున్నదో ? | I don't know where it is. |
| సరళ : అదుగో, అక్కడ ఏమిటి ? | There, what is it ? |
| రవి : ఎక్కడ ? | Where ? |
| సరళ : నీ పుస్తకం పక్కన. | By the side of your book. |
| రవి : ఇది నీది కాదు. ఇక్కడ నీ పుస్తకం లేదు. | This is not yours. Your book is not here. |

## DRILLS

**a. Repetition drill.**

అది నా గడియారమా ?
అది నా గడియారం కాదు.

నా గడియారం అక్కడ ఉన్నదా ?
నీ గడియారం అక్కడ లేదు.

**b. Build-up drill.**

1. ఉన్నదా ?
పుస్తకం ఉన్నదా ?
నా పుస్తకం ఉన్నదా ?
అలమరలో నా పుస్తకం ఉన్నదా ?
నీ అలమరలో నా పుస్తకం ఉన్నదా ?

2. పుస్తకం ఎవరిది ?
పెట్టెలో పుస్తకం ఎవరిది ?
కొత్త పెట్టెలో పుస్తకం ఎవరిది ?
ఈ కొత్త పెట్టెలో పుస్తకం ఎవరిది ?

**c. Response drill.**

**Model (i):**

ఈ పుస్తకం ఎక్కడున్నది ?
ఏమో ! ఎక్కడున్నదో !

1. ఆ పుస్తకం ఎవరిది ?
2. రవి ఇల్లు ఎక్కడ ?
3. ఇవి ఎవరి పుస్తకాలు ?
4. మల్లె చెట్టు ఎక్కడున్నది ?

**Model (ii):**

ఇది నీ పుస్తకమా ?
కాదు.

1. ఇది మీ ఇల్లా ?
2. అది గడియారమా ?
3. మీ ఇల్లు మా ఇంటి దగ్గరా ?

**Model (iii):**

మీ పుస్తకం నా సంచీలో ఉన్నదా ?
లేదు.

1. అక్కడ కుక్క ఉన్నదా ?
2. మీ ఇల్లు మైసూరులో ఉన్నదా ?
3. మీ ఇంట్లో గులాబీ చెట్టున్నదా ?

**Model (iv):**

రవి పుస్తకం ఎక్కడున్నది ?
(సరళ పుస్తకం)
రవి పుస్తకం సరళ పుస్తకం పక్కన ఉన్నది.

1. మీ ఇల్లు ఎక్కడున్నది ? (కాలేజి)
2. మాష్టరుగారి కుర్చీ ఎక్కడున్నది ? (నా కుర్చీ)
3. మీ కాలేజీ ఎక్కడున్నది ? (మా ఇల్లు)

## EXERCISES

a. Answer the following questions as shown in the model.

Model :

నీ పుస్తకం ఎక్కడున్నది ?
ఏమో ! ఎక్కడున్నదో !

1. మీ నాన్నగారి ఆఫీసు ఎక్కడ ?
2. గోపాలరావుగారి ఇల్లు ఎక్కడున్నది ?
3. నా పుస్తకాలు ఎక్కడున్నాయి ?
4. ఇది ఎవరి ఇల్లు ?

b. Answer the following questions with లేదు or కాదు.

1. ఇది మొక్కేనా ?



2. ఇవ్వాళ ఆదివారమేనా ?
3. ఇక్కడ మా కుక్క ఉన్నదా ?
4. మీ ఇంటి పక్కన గులాబీ చెట్టున్నదా ?
5. మీ అన్నయ్య మా కాలేజీలో లెక్చరరా ?

## VOCABULARY

| | |
|---|---|
| అలమార | cupboard |
| ఏమో | it is not known |
| అక్కడ | there |
| పక్క | side |
| ఇక్కడ | here |

## GRAMMAR NOTES

32.1. In this lesson the place adverbs అక్కడ 'there' and ఇక్కడ 'here' are introduced. The corresponding interrogative word is ఎక్కడ 'where' (16.5.).

32.2. ఓ is dubitative marker. When added to an interrogative sentence or to an interrogative word, it expresses unknownness and doubt.

| | |
|---|---|
| అది ఎక్కడున్నది ? | 'Where is it ?' |
| ఏమో ! ఎక్కడున్నదో ! (ఏం + ఓ ఎక్కడ ఉన్నది_ఓ) | 'It is not known where it is.' (6.7 ; 14.1.4) |
| అతను ఎవరు ? | 'Who is he ?' |
| ఏమో ! ఎవరో ! | 'It . not known who he is.' |

**32.3.** A contrast between కాదు and లేదు is shown in this lesson.

**32.3.1.** కాదు is used to negate a verbless sentence and as a negative answer to a verbless interrogative sentence.

| | |
|---|---|
| ఇది పుస్తకం. | ఇది పుస్తకం కాదు. |
| 'This is a book.' | 'This is not abook.' |
| ఇది కలమా ? | ఇది కలం కాదు. |
| 'Is this a pen ?' | 'This is not a pen.' |

కాదు can also be used as an answer to a sentence with verb to negate a word or a phrase and not the verb.

| | |
|---|---|
| నీ పుస్తకం ఇక్కడ ఉన్నది. | ఇక్కడ కాదు, అక్కడ ఉన్నది. |
| 'Your book is here.' | 'Not here, it is there.' |

Here ఉన్నది, the verb, is not negated but ఇక్కడ is negated.

**32.3.2.** లేదు is used to negate an existential verb and as a negative answer to a sentence having a verb particularly while negating the verb.

| | |
|---|---|
| పుస్తకం ఇక్కడ ఉన్నది. | పుస్తకం ఇక్కడ లేదు. |
| 'The book is here.' | 'The book is not here.' |
| పుస్తకం అక్కడ ఉన్నదా ? | పుస్తకం అక్కడ లేదు. |
| 'Is the book there ?' | 'The book is not there.' |

**32.4.** -న is a locative case marker, used with some nouns denoting 'location'.

| | | | |
|---|---|---|---|
| పక్క | 'side' | పక్కన | 'on the side' |

## REVIEW 4

## Lesson 33

# నేనెవరిని ?

| | |
|---|---|
| బాబూ బాబూ నేనెవరిని ? | Babu ! Babu ! Who am I ? |
| పాపా పాపా నేనెవరిని ? | Papa ! Papa ! Who am I ? |
| కదలిక ఉన్నది | There is no leg |
| కాలు లేదు | But movement. |
| కొలత ఉన్నది | There is no shape |
| రూపం లేదు | But measurement. |
| బాబూ బాబూ నేనెవరిని ? | Babu ! Babu ! Who am I ? |
| పాపా పాపా నేనెవరిని ? | Papa ! Papa ! Who am I ? |
| ఎండ ! | Sun ! |
| నా పేరు ఎండ కాదు — దాని | My name is not sun |
| వేడి నాకు లేదు. | I don't have its heat ; |
| నా పేరు ఎండ కాదు — దాని | My name is not sun |
| వేడి నాకు లేదు | I don't have its heat. |

| | |
|---|---|
| ఓ బాబూ బాబూ నేనెవరిని ? | Oh ! Babu ! Babu ! Who am I ? |
| పాపా పాపా నేనెవరిని ? | Papa ! Papa ! Who am I ? |
| గాలి ! | Wind ! |
| నా పేరు గాలి కాదు — దాని | My name is not wind |
| శక్తి నాకు లేదు. | I don't have its power; |
| నా పేరు గాలి కాదు — దాని | My name is not wind |
| శక్తి నాకు లేదు. | I don't have its power. |
| ఓ బాబూ బాబూ నేనెవరిని ? | Oh ! Babu ! Babu ! Who am I ? |
| పాపా పాపా నేనెవరిని ? | Papa ! Papa ! Who am I ? |
| కాలం ! | Time ! |
| అవును ! అవును ! | Yes ! Yes ! |
| ఎండ కాదు నా పేరు | Sun is not my name, |
| గాలి కాదు నా పేరు | Wind is not my name, |
| కాలం బాబూ నా పేరు | Babu ! My name is time, |
| కాలం పాపా నా పేరు | Papa ! My name is time. |
| కదలిక ఉన్నది | There is no leg |
| కాలు లేదు | But movement. |
| కొలత ఉన్నది | There is no shape |
| రూపం లేదు | But measurement. |
| బాబూ బాబూ నేనెవరిని ? | Babu ! Babu ! Who am I ? |
| పాపా పాపా నేనెవరిని ? | Papa ! Papa ! Who am I ? |

## EXERCISES

a. Answer the following questions.

A. 1. రవికి హిందీలో ఎన్ని మార్కులు ? (78)
2. నీకు తెలుగులో ఎన్ని మార్కులు ? (49)
3. ఆమెకు ఇంగ్లీషులో ఎన్ని మార్కులు ? (63)
4. సరళకు కన్నడంలో ఎన్ని మార్కులు ? (58)

B. 1. వాళ్లు ఎంతమంది హర్యానావాళ్లు ? (5)
2. మీరు ఎంతమంది హిందీవాళ్లు ? (8)
3. మేం ఎంతమందిమి తెలుగువాళ్లం ? (9)
4. మనం ఎంతమందిమి ? (2)

b. **Fill up the blanks with కాదు or లేదు.**

1. నా దగ్గర కలం…… ....
2. ఈ కలం శర్మది. …… .
3. మా ఇంట్లో గులాబీ చెట్టు…… ....
4. ఈ పెట్టెలో సీసా…………
5. ఇది గులాబీ పువ్వు…………
6. అది నీ పుస్తకం…………

c. Change the following sentences as shown in the model.

Model (i) :

అతనిది ఒరిస్సా.
అతను ఒరిస్సావాడు.

1. వాళ్లది కేరళ.
2. వాళ్లది హర్యానా.
3. నాది మధ్యప్రదేశ్.

Model (ii) :

అక్కడ ఏమున్నది ?
ఏమో ! ఏమున్నదో !

1. ఆయన ఎవరు ?
2. నీ పుస్తకం ఎక్కడున్నది ?
3. మా ఊరు ఏ రాష్ట్రంలో ఉన్నది ?

d. Cahnge the verbs of the following sentences into negatives.

1. ఇక్కడ పుస్తకం ఉన్నది.
2. అక్కడ పూలు ఉన్నాయి.
3. శర్మకు జ్వరం ఉన్నది.
4. ఈ గదిలో మీ కుర్చీలున్నాయా ?

e. Give the plural forms of

ఏను
రైలు
ఉన్నది
తెలుగువాడు
రచయిత్రి
మల్లెచెట్టు
లేము
గులాబీపువ్వు

f. Answer the following questions.

1. మీకు ఎన్నేళ్లు ?
2. మీకు ఎంతమంది పిల్లలు ?
3. మీ భార్యకు/భర్తకు ఎన్నో సంవత్సరం ?
4. మీ ఊరు ఏ రాష్ట్రంలో ఏ జిల్లాలో ఉన్నది ?
5. మీ ఊరికి రైలున్నదా ? బస్సున్నదా ?
6. మీ ఊళ్లో స్కూళ్లు ఎన్ని ఉన్నాయి ?
కాలేజీలు ఎన్ని ఉన్నాయి ?

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| కదలిక | movement | వేడి | heat |
| కాలు | leg | గాలి | wind |
| కొలత | measurement | శక్తి | energy |
| రూపం | shape | కాలం | time |
| ఎండ | sun | | |

# UNIT 9

## Lesson 34

| | |
|---|---|
| మోహన్ : రవీ ! అన్నయ్య ఇంట్లో ఉన్నాడా ? | Ravi ! Is your brother at home ? |
| రవి : లేడు. గుంటూరులో ఉన్నాడు. ఎందుకు ? | No. He is in Guntur. Why ? |
| మోహన్ : అతని దగ్గర నా పుస్తకం ఒకటి ఉన్నది. | He has one of my books. |
| రవి : వాడి పుస్తకాలన్నీ మా నాన్నగారి పెట్టెలో ఉన్నాయి. తాళంచెయ్యి మా అమ్మ దగ్గర ఉన్నది. | All his books are in my father's box. The key is with my mother. |
| మోహన్ : అలాగా ! మీ నాన్నగారెక్కడున్నారు ? | Oh ! Where is your father ? |
| రవి : ప్రస్తుతం ఇక్కడ లేరు. | He is not here at present. |
| మోహన్ : మీ అమ్మగారున్నారా ? | Is your mother available ? |
| రవి : ఆమె కూడా లేరు. | No, she too is not here. |

## DRILLS

a. Repetition drill.

1. మీ నాన్నగారు ఇంట్లో ఉన్నారా?
   నారాయణరావు ఎక్కడున్నాడు?
   కమలారాణిగారు మీ ఇంటి దగ్గర ఉన్నారు.

2. ఇక్కడ మీ నాన్నగారు లేరు.
   మా ఇంట్లో మీ అమ్మగారు లేరు.
   రవి మా స్నేహితుడి ఇంట్లో లేడు.

b. Response drill.

Model (i):

మీ నాన్నగారు ఇంట్లో ఉన్నారా?
మా నాన్నగారు ఇంట్లో లేరు.

1. గోపాలరావుగారు కాలేజీలో ఉన్నారా?
2. మాష్టరుగారు క్లాసులో ఉన్నారా?
3. మీ వదినెగారు ఈ ఊళ్లో ఉన్నారా?

Model (ii):

మీ అన్నయ్య ఇంట్లో ఉన్నాడా?
మా అన్నయ్య ఇంట్లో లేడు.

1. మీ తమ్ముడు ఊళ్లో ఉన్నాడా?
2. మీ స్నేహితుడు చెట్టు దగ్గర ఉన్నాడా?
3. రవి తమ్ముడు క్లాసులో ఉన్నాడా?

c. Substitution drill.

Model (i):

రవి ఇంట్లో ఉన్నాడు.
ఆయన
ఆయన ఇంట్లో ఉన్నారు.

1. సీతగారు.
2. సుబ్బారావు.
3. మీ నాన్నగారు.

Model (ii):

వాడి పుస్తకాలన్నీ నా దగ్గరున్నాయి.
కలాలు
వాడి కలాలన్నీ నా దగ్గరున్నాయి.

1. కాయితాలు.
2. సంచులు.
3. సీసాలు.

## EXERCISES

a. Answer the following questions using లేడు/లేరు/లేదు.

1. ఇక్కడ మీ అన్నయ్య ఉన్నాడా?
2. మీ ఇంట్లో మీ పాప ఉన్నాదా?
3. నా కలం అక్కడున్నదా?
4. అక్కడ డాక్టరుగారు ఉన్నారా?
5. జయలక్ష్మిగారు ఈ ఊళ్లో ఉన్నారా?
6. మీ ఇంటి తాళంచెయ్యి నీ దగ్గరున్నదా?

b. Fill up the blanks with ఉన్నది/ఉన్నారు/ఉన్నాడు

1. పార్థసారథి మా ఆఫీసులో . .
2. మీ అమ్మగారు ఇంట్లో ....
3. డాక్టరుగారు బస్సులో. ...
4. మా పక్క ఇంట్లో........

c. Change the following sentences as shown in the model.

Model :

నా పుస్తకాలు ఇంట్లో ఉన్నాయి.
నా పుస్తకాలన్నీ ఇంట్లో ఉన్నాయి.

1. గులాబీపూలు సంచిలో ఉన్నాయి.
2. మీ తెల్లకాయితాలు నా దగ్గరున్నాయి.
3. మా బట్టలు గదిలో ఉన్నాయి.

d. Produce atleast 12 correct sentences from the following table taking one cue from each column at a time.

| | | |
|---|---|---|
| | | ఉన్నారు |
| రావుగారు | | ఉన్నాడు |
| | కాలేజీలో | లేడు |
| | ఇంట్లో | లేరు |
| | | ఉన్నది |

## VOCABULARY

| | |
|---|---|
| ఉన్నాడు | he is/was (non-hon. sg.) |
| లేడు | he is/was not available (non-hon. sg.) |
| తాళంచెవి | key |
| ఉన్నారు | he/she/they are/were (hon. sg. & pl., epicene) |
| ప్రస్తుతం | at present |
| లేరు | he/she/they are/were not available (hon. sg. & pl., epicene). |

## GRAMMAR NOTES

34.1. In this lesson the following forms of the existential verb are introduced.

| | | |
|---|---|---|
| | ఉన్నాడు | 'he is' (3rd person masculine singular) |
| | ఉన్నారు | 'he/she is' (3rd person epicene honorific singular) |
| | లేడు | (the negative of ఉన్నాడు) |
| and | లేరు | (the negative of ఉన్నారు) |

34.2. ఉన్నది (29.1.) and its negative లేదు (30.2), and ఉన్నాయి (30.1.) and its negative లేవు (31.3.) are used in neuter gender. ఉన్నాడు and its negative లేడు, and ఉన్నారు and its negative లేరు are used in human gender, in 3rd person.

34.3. దగ్గర 'near' (16.6.) also expresses possession when the subject is in human gender.

అతని దగ్గర నా కలం ఉన్నది.
'My pen is with him.' (in his possession).
(He has my pen.)

# UNIT 9

## Lesson 35

| | |
|---|---|
| సుబ్బయ్య : ఏమండీ ! మీరు ఎంతమంది అన్నదమ్ములు ? | Sir, how many brothers are you ? |
| రామారావు : ముగ్గురం. అన్నలు లేరు. నేనే పెద్దవాణ్ణి. నాకు ఇద్దరు తమ్ముళ్ళు. | We are three. I don't have elder brothers. I am the eldest. I have two younger brothers. |
| సుబ్బ : అక్కచెల్లెళ్ళు ఉన్నారా ? | Do you have sisters ? |
| రామా : అక్కలు లేరండీ. ఇద్దరు చెల్లెళ్ళు. | I don't have elder sisters. I have two younger sisters. |
| సుబ్బ : మీ చెల్లెళ్ళు ఇక్కడే ఉన్నారా ? | Are your sisters here ? |
| రామా : ఒక చెల్లెలు ఇక్కడ లేదు. విజయవాడలో మా మామయ్యగారింట్లో ఉన్నది. | One is not here. She is at my uncle's house in Vijayawada. |
| సుబ్బ : మీ మామయ్యగారికి పిల్లలు లేరా ? | Doesn't your uncle have children ? |

రామా : మగ పిల్లలున్నారండీ , ఆడ పిల్లలు లేరు. — He has sons, but no daughters.

సుబ్బ : బాబాయిగారంటే ఎవరు ? మీ నాన్నగారి తమ్ముడా ? — Which uncle is this? Is he your father's younger brother?

రామా : కాదండీ. మా పిన్నిగారి భర్త. — No, sir. He is the husband of my mother's younger sister.

**DRILLS**

a. Build-up drill.

అక్కచెల్లెళ్లు
ఎంతమంది అక్కచెల్లెళ్లు ?
మీరు ఎంతమంది అక్కచెల్లెళ్లు ?
ఏమండీ ! మీరు ఎంతమంది అక్కచెల్లెళ్లు ?

లేరు
పిల్లలు లేరు.
ఆడపిల్లలు లేరు.
బాబాయిగారికి ఆడపిల్లలు లేరు.
మా బాబాయిగారికి ఆడపిల్లలు లేరు.

ఉన్నది.
ఇంట్లో ఉన్నది.
పెదనాన్నగారింట్లో ఉన్నది.

మా పెదనాన్నగారింట్లో ఉన్నది.
గుంటూరులో మా పెదనాన్నగారింట్లో ఉన్నది.
ఆమె గుంటూరులో మా పెదనాన్నగారింట్లో ఉన్నది.

b. Substitution drill.

Model (i) :

మా చెల్లెలు ఇంట్లో ఉన్నది.
మీ చెల్లెలు.
మీ చెల్లెలు ఇంట్లో ఉన్నది.

1. సరళ
2. సుమ
3. లక్ష్మి

Model (ii) :

మా చెల్లెళ్లు మా బాబాయిగారింట్లో ఉన్నారు.
రమ, సుమ
రమా సుమా మా బాబాయిగారింట్లో ఉన్నారు.

1. మీ వదిన, మా అక్కయ్య.
2. మా అన్నయ్య, మా తమ్ముడు.
3. మా తమ్ముడు, మా చెల్లెలు.

c. **Response drill.**

Model (i) :

సీత కాలేజీలో ఉన్నదా ?
కాలేజీలో లేదు.

1. గీత యింట్లో ఉన్నదా ?
2. మీ అక్కయ్య ఆ గదిలో ఉన్నదా ?
3. మీ చెల్లెలు మైసూరులో ఉన్నదా ?

Model (ii) :

మీ చెల్లెళ్లు ఈ ఊళ్లో ఉన్నారా ?
మా చెల్లెళ్లు ఈ ఊళ్లో లేరు.

1. రమా సుమా కాలేజీలో ఉన్నారా ?
2. మీ చెల్లెళ్లు అక్కయ్యలు ఇక్కడున్నారా ?
3. మీ పిల్లలు ఇంట్లో ఉన్నారా ?

Model (iii) :

మీ విద్యార్థులు క్లాసులో ఉన్నారా ?
మా విద్యార్థులు క్లాసులో లేరు.

1. రవీ రఘూ మైసూరులో ఉన్నారా ?
2. మీ నాన్నగారూ అమ్మగారూ యింట్లో ఉన్నారా ?
3. మీ అన్నయ్యలు కాలేజీలో ఉన్నారా ?

Model (iv) :

రవి ఇంట్లో ఉన్నాడా ? (కాలేజీ)
రవి ఇంట్లో లేడు కాలేజీలో ఉన్నాడు.

1. గోపి ఇంట్లో ఉన్నాడా ? (క్లాసు)
2. శర్మగారు ఇంట్లో ఉన్నారా ? (కాలేజీ)
3. మీ అమ్మగారు ఇంట్లో ఉన్నారా ? (గుంటూరు)
4. మీ చెల్లెలు మైసూరులో ఉన్నారా. (బెంగుళూరు)
5. మీ తమ్ముళ్లు ఆ గదిలో ఉన్నారా? (ఈ గది)
6. ఆ పుస్తకాలు పెట్టెలో ఉన్నాయా? (సంచిలో)

d. Transformation drill.

Model (i) :

ఇక్కడ అమ్మాయిలు ఉన్నారు.
ఇక్కడ అమ్మాయిలు లేరు.

1. మీ ఇంట్లో మా తమ్ముడున్నాడు.
2. ఇక్కడ లక్ష్మి ఉన్నది.
3. సరళ చెల్లెళ్లు మా క్లాసులో ఉన్నారు.
4. నా పుస్తకాలు ఈ గదిలో ఉన్నాయి.

Model (ii) :

మా అక్కయ్య యింట్లో ఉన్నది.
మా అక్కయ్యలు యింట్లో ఉన్నారు.

1. మా అమ్మాయి కాలేజీలో ఉన్నది.
2. రవి చెల్లెలు మైసూరులో ఉన్నది.
3. మా తమ్ముడు మద్రాసులో ఉన్నాడు.
4. మా స్నేహితుడు కాలేజీలో [illegible].

Model (iii) :

గోపీ ఇంట్లో ఉన్నాడు.
సరళ ఇంట్లో ఉన్నది.
గోపీ సరళా ఇంట్లో ఉన్నారు.

1. మా అమ్మ గుంటూరులో ఉన్నది.
మా నాన్నగారు గుంటూరులో ఉన్నారు.

2. మా తమ్ముడు కాలేజీలో ఉన్నాడు.
మా చెల్లెలు కాలేజీలో ఉన్నది.

3. సరళ క్లాసులో ఉన్నది.
రవి క్లాసులో ఉన్నాడు.

## EXERCISES

a. Answer the following questions as shown in the model.

Model :

రవి ఇక్కడ ఉన్నాడా ?
రవి ఇక్కడ లేడు.

1. మీ అన్నయ్య మా బాబాయిగారింట్లో ఉన్నారా ?
2. సరళ మీ పిన్నిగారింట్లో ఉన్నదా ?
3. గౌరీ కుమారిగారు ఆఫీసులో ఉన్నారా ?
4. మీ తమ్ముడూ చెల్లెలూ ఏలూరులో ఉన్నారా ?
5. రవీ రామారావూ మీ క్లాసులో ఉన్నారా ?
6. కమలా విమలా మీ స్నేహితుడిఇంట్లో ఉన్నారా?

b. Fill up the blanks with ఉన్నది/ఉన్నాడు/ఉన్నారు/ఉన్నాయి

1. గోపాలరావు చెల్లెలు మా ఆఫీసులో ........
2. సరళ తమ్ముడు బెంగుళూరులో ........
3. కమలా విమలా వాళ్ల పిన్నిగారింట్లో ........
4. మా మాష్టరుగారు ఎక్కడ........ ?
5. నా పుస్తకం ఆ అలమరలో ........
6. మీ కలాలు ఎక్కడ........ ?

c. Fill up the blanks with లేదు/లేడు/లేరు/లేవు.

1. మాయింట్లో తెల్ల కాయితాలు........
2. నా దగ్గర మీ పుస్తకం........
3. గోపి మా బాబాయిగారింట్లో........
4. మీ బాబాయిగారు కాలేజీలో........
5. కమలా గిరిజా గదిలో........
6. సుశీల గిరిజ గదిలో........
7. రామారావూ సుబ్బారావూ ఈ ఊళ్లో........
8. రవి మోహన్ గదిలో........

d. Match the following.

| | A | B | |
|---|---|---|---|
| 1. | రవి | ఇక్కడ లేదు | ( ) |
| 2. | మాష్టరుగారు | అక్కడ లేవు | ( ) |
| 3. | సీత | ఇంట్లో లేరు | ( ) |
| 4. | కలాలు | కాలేజీలో లేడు | ( ) |

e. Produce atleast 10 correct sentences from the following table taking one cue from each column at a time.

| | | |
|---|---|---|
| రమ గడియారం<br>సుబ్బారావు తమ్ముడు<br>రామారావు చెల్లెలు<br>గోపాలరావు నాన్నగారు<br>మీ అమ్మగారు<br>మన పుస్తకాలు | నా గదిలో | ఉన్నది<br>లేదు<br>ఉన్నాడు<br>లేడు<br>ఉన్నాయి<br>లేవు<br>ఉన్నారు<br>లేరు |

**VOCABULARY**

| | |
|---|---|
| అన్నదమ్ములు | brothers |
| అన్న | elder brother |
| అక్కచెల్లెళ్లు | sisters |
| అక్క | elder sister |
| బాబాయి | paternal uncle |
| పిన్ని | maternal aunt |

## GRAMMAR NOTES

35.1. In this lesson the use of ఉన్నది (29.1.) and లేదు (30.2.) in inferior and equal feminine singular (in addition to neuter singular) is introduced.

| | |
|---|---|
| సీత ఇంట్లో ఉన్నది | 'Sita is at home.' |
| ఆమె ఇంట్లో ఉన్నది | 'She is at home.' |
| అది గదిలో ఉన్నది | 'She (inf.) is in the room.' |
| ఆమె ఇంట్లో లేదు | 'She is not at home.' |
| అది గదిలో లేదు | 'She (inf.) is not in that room.' |

35.2. ఉన్నారు and లేరు which were shown as honorific singular in 34.1. are also used as 3rd person epicene plural.

| | |
|---|---|
| వాళ్లు గదిలో ఉన్నారు | 'They are in the room.' |
| అమ్మాయిలు అక్కడ ఉన్నారు | 'The girls are there.' |
| అబ్బాయిలు ఇక్కడ ఉన్నారు | 'The boys are here.' |
| అమ్మాయిలు, అబ్బాయిలు ఇక్కడ ఉన్నారు | 'The boys and girls are here.' |
| అమ్మాయిలు ఇక్కడ లేరు | 'The girls are not there.' |
| అబ్బాయిలు ఇక్కడ లేరు | 'The boys are not here.' |
| అమ్మాయిలు, అబ్బాయిలు ఇక్కడ లేరు | 'The boys and girls are not here.' |

35.3. The function of the dative case suffix in the sentence

మీ బాబాయిగారికి పిల్లలు లేరా ?

'Doesn't your uncle have children ?'

is equivalent to the function of the dative case suffix in the sentence

అతనికి ఇద్దరు పిల్లలు.

'He has two children.'

as appeared in para 28.2.

# UNIT 9

## Lesson 36

| | |
|---|---|
| వాట్సన్ : మీరు అందరూ నిన్న సాయంత్రం ఆరు గంటలకి హాస్టలులో ఉన్నారా ? | Were you all there in the hostel yesterday evening at 6 O' clock ? |
| సంపత్‌కుమార్ : లేదు. బస్టాండు దగ్గర ఒక గుడి ఉంది. ఆ గుళ్లో నిన్న నాటకం. మేం అందరం అక్కడ ఉన్నాం. | No. There is a temple near the bus stand. There was a play in the temple yesterday. We were all there. |
| వా : బస్టాండు దగ్గర రెండు గుళ్లు ఉన్నాయి. ఏగుళ్లో నాటకం ? | There are two temples near the bus stand. Where was the play ? |
| సంప : రెండో గుడి ఎక్కడున్నదండీ ? అక్కడ ఒకటే ఉన్నది. | Where is the other temple sir ? There is only one temple. |
| వా : నాటకం ఎన్ని గంటలకు ? | When was the play ? |
| ఇబ్రహీమ్ : ఆరు గంటల ముప్పై నిమిషాలకు. | At 6.30. |

వా : శర్మా ! నువ్వూ అక్కడే ఉన్నావుకదూ ?

Sarma ! You were also there. Weren't you ?

శర్మ : లేను. నేను నా గదిలోనే ఉన్నాను. రతిరామ్ గూడా నా గదిలోనే ఉన్నాడు.

No. I was in my room only. Ratiram was also in my room.

రతిరామ్ : అబద్ధం శర్మా ! మనం నిన్న సాయంత్రం నీగదిలో లేము.

It's a lie, Sarma ! We were not there in your room yesterday evening.

శర్మ : మరి ఎక్కడున్నాం ?

Where were we, then ?

రతిరామ్ : మనం ఇద్దరం నా గదిలోనే ఉన్నాం.

We both were in my room.

శర్మ : నేను నా గదిలోనే ఉన్నాను.

I was in my room only.

రతిరామ్ : నువ్వు నీ గదిలో లేవు, నా గదిలో ఉన్నావు.

You were not there in your room but you were in my room.

వా : అయితే మీరిద్దరూ నిన్న సాయంత్రం కాలేజీలో లేరన్నమాట.

So both of you were not there in the college yesterday evening.

రతిరామ్ : అవును.

Yes.

వా : అయితే జనతాసింగ్ ఎక్కడున్నాడు ?

Where was Janatha Singh ?

బాలకృష్ణ : ఏమో ఎక్కడున్నాడో ! సినిమా హాలులో ఉన్నాడేమో !

We don't know where he was ! He might be in a cinema theatre.

## DRILLS

**a. Expansion drill.**

**Model (i) :**

మీరు విద్యార్థులు

మీరు అందరూ విద్యార్థులు.

1. మీరు డాక్టర్లు
2. వాళ్లు నా స్నేహితురాళ్లు.
3. వీళ్లు మన పిల్లలు.

**Model (ii) :**

మనం విద్యార్థులం

మనం అందరం విద్యార్థులం.

1. మనం భారతీయులం
2. మనం స్నేహితులం.
3. మనం విద్యార్థినులం.

Model (iii) :

మేం పిల్లలం

మేం అందరం పిల్లలం.

1. మేం మీ స్నేహితులం.
2. మేం ఆంధ్రులం.
3. మేం హర్యానా వాళ్ళం.
4. మేం ఒరిస్సా వాళ్ళం.

Model (iv) :

అక్కడ శర్మ ఉన్నాడు.

అక్కడ శర్మ ఉన్నాడేమో !

1. శర్మ ఇంట్లో ఉన్నాడు.
2. మాష్టరుగారు క్లాసులో ఉన్నారు.
3. సరళ బస్సులో ఉన్నది.

b. Substitution drill.

Model :

మీరు మొన్న సాయంత్రం ఇక్కడున్నారు.

మనం

మనం మొన్న సాయంత్రం ఇక్కడున్నాం.

మేం

మేం మొన్న సాయంత్రం ఇక్కడున్నాం.

నేను

నేను మొన్న సాయంత్రం ఇక్కడున్నాను.

నువ్వు

నువ్వు మొన్న సాయంత్రం ఇక్కడున్నావు.

1. రవీ ! మనం ఇప్పుడు ఎక్కడున్నాం ?

నేను

మేం

నువ్వు

మీరు

2. రాధా ! నువ్వు నిన్న ఇంట్లో ఉన్నావా ?

మీరు

మేం

మనం

రవి

వాళ్ళు

c. Interlocked substitution drill.

Model :

నేను మొన్న ఇంట్లో ఉన్నాను.

నువ్వు

నువ్వు మొన్న ఇంట్లో ఉన్నావు.

నిన్న

నువ్వు నిన్న ఇంట్లో ఉన్నావు.

కాలేజీ

నువ్వు నిన్న కాలేజీలో ఉన్నావు.

1. నువ్వు ఇవ్వాళ స్కూలులోనే ఉన్నావు.
   రవి..............................
   ...నిన్న............................
   ..........................ఇల్లు...............
   మీరు.............................
   నేను..................................
   ........మొన్న..............................
   మేం......................................
   ..........................గుడి.............
   వాళ్లు...............................
   వాడు...............................

2. అతను మొన్న ఇంట్లో లేడు.
   నువ్వు....................
   సరళ.............
   మీరు..............
   .......పదో తారీకు.
   ....................హాస్టలు......
   ....................మీ ఇల్లు....
   గోపీ, గిరిజా...................
   మా నాన్నగారు.................
   ....................గుడి.....
   నేను.

d. Response drill.

Model (i) :

నువ్వు మొన్న సాయంత్రం ఇంట్లో ఉన్నావా ? (కాలేజీ)
నేను మొన్న సాయంత్రం ఇంట్లో లేను. కాలేజీలో ఉన్నాను.

Model (ii) :

గోపీ : నేను పదో తారీకు మీ ఇంట్లో ఉన్నానా ? (మీ ఇంట్లోనే)
నువ్వు పదో తారీకు మా ఇంట్లో లేవు. మీ ఇంట్లోనే ఉన్నావు.

1. నువ్వు నిన్న గుంటూరులో ఉన్నావా ? (విజయవాడ)
2. నువ్వు మార్చి పన్నెండో తారీకు మైసూరులో ఉన్నావా ? (బెంగుళూరు)
3. కమలా : నువ్వు నిన్న బెంగుళూరులో ఉన్నావా ? (ఈ ఊరు)

1. సరళా : నేను జనవరి ఇరవయ్యో తారీకు మైసూరులో ఉన్నానా ? (మద్రాసు)
2. రఘూ : నేను అటుమొన్న సాయంత్రం బస్సులో ఉన్నానా ? (హాస్టలు)
3. శర్మా : నిన్న సాయంత్రం నీ గదిలో ఉన్నానా ? (నీ గది)

**Model (iii) :**

ఏమండీ ! మీరు నిన్న సాయంత్రం ఇంట్లో ఉన్నారా ? (కాలేజీ)

మేం నిన్న సాయంత్రం ఇంట్లో లేమండీ ! కాలేజీలో ఉన్నాం.

1. మీరు మొన్న సాయంత్రం హాస్టల్లో ఉన్నారా ? (కాలేజీ)
2. మీరు పదహారో తారీకు ఆఫీసులో ఉన్నారా ? (ఇల్లు)
3. మీరు నిన్న బెంగుళూరులో ఉన్నారా ? (మైసూరు)

**Model (iv) :**

రామారావు ! మనం నిన్న సాయంత్రం ఇంట్లో ఉన్నామా ? (గదిలో)

మనం నిన్న సాయంత్రం ఇంట్లో లేం. గదిలో ఉన్నాం.

1. మనం మొన్న కాలేజీలో ఉన్నామా ? (హాస్టలు)
2. మనం పదమూడో తారీకు మద్రాసులో ఉన్నామా ? (మైసూరు)
3. మనం ఆదివారం సాయంత్రం ఇంట్లో ఉన్నామా ? (కాలేజీ)

**Model (v) :**

మేం మొన్న బెంగుళూరులో లేం. (మైసూరు)

అవును మీరు మొన్న బెంగుళూరులో లేరు. మైసూరులో ఉన్నారు.

1. మేం నిన్న హాస్టలులో లేం. (కాలేజీ)
2. మేం ఆరో తారీకు మైసూరులో లేం. (మద్రాసు)
3. మేం అటుమొన్న ఇంట్లో లేం. (కాలేజీ)

e. Transformation drill.

**Model :**

ఇప్పుడు టైం ఆరూ ముప్పై.

ఇప్పుడు టైం ఆరు గంటల ముప్పై నిమిషాలు.

1. నిన్న నేను ఆరూ నలభైకి ఇంట్లోనే ఉన్నాను.
2. రవి సాయంత్రం ఐదూ నలభై అయిదుకు కాలేజీలో ఉన్నాడు.
3. నేనూ, మీరూ నిన్న సాయంత్రం నాలుగూ ఇరవైకి నా గదిలో ఉన్నాం.
4. మీరూ రవీ నిన్న పదీ పదిహేనుకు ఇంట్లో ఉన్నారా ?

**EXERCISES**

a. Fill up the blanks with ఉన్నాను/ఉన్నాం/ఉన్నావు/ఉన్నారు

1. నేను మైసూరులో.........
2. నేనూ, శ్యామలా ఇంట్లో.........
3. మనం కాలేజీలో.........
4. నువ్వు నిన్న ఇంట్లోనే.........
5. మీరూ, నేనూ నిన్న ఈ ఊళ్లోనే.........
6. మేం మొన్న హాస్టల్లో.........
7. మీరు అటుమొన్న మద్రాసులో.....
8. సరళా, నువ్వూ ఇంట్లో.........
9. నువ్వూ, నేనూ నిన్న కాలేజీలో....
10. మీరూ, మేమూ మొన్న మైసూరులో.

b. Fill up the blanks with లేను/లేం/లేవు/లేరు.

1. రవీ నేనూ నిన్న నా గదిలో.........
2. నువ్వూ నేనూ మొన్న మైసూరులో.........
3. నేను నిన్న నా గదిలో.........
4. నువ్వు నిన్న హాస్టల్లో.........
5. మనం పదో తారీఖు మైసూరులో.........
6. మీరు నిన్న సాయంత్రం.........
7. మీరూ రవీ నిన్న ఇంట్లో.........
8. మీరూ మేమూ నిన్న బెంగుళూరులో
9. మేం నిన్న ఇంట్లో.........
10. మీరూ నేనూ మొన్న కాలేజీలో.....

c. Answer the following questions in negation.

1. నువ్వు నిన్న ఇంట్లోనే ఉన్నావా ?
2. మనం మొన్న బెంగుళూరులో ఉన్నామా ?
3. రవీ నువ్వూ నిన్న హాస్టల్లో ఉన్నారా ?
4. మేం నిన్న మైసూరులో ఉన్నామా ?

d. Change the following as shown in the model :

Model :

ఆరూ ఇరవై.
ఆరు గంటల ఇరవై నిమిషాలు.

1. ఇప్పుడు టైం మూడూ నలభై.
2. నిన్న సాయంత్రం నాలుగూ ఇరవై అయిదుకు నేను ఇంట్లో లేను.
3. మా ఆఫీసు పదీ ముప్పైకి.

e. Answer the following questions as shown in the model.

Model :

శర్మ ఎక్కడున్నారు ? (ఇంట్లో)
ఇంట్లో ఉన్నారేమో !

1. రవి నాన్నగారు ఎక్కడున్నారు ? (కాలేజీ)
2. సుబ్బారావు భార్య ఎక్కడున్నది ? (ఇంట్లో)
3. సుగుణా సరళా ఎక్కడున్నారు ? (క్లాసులో)
4. మీ నాన్నగారు ఇప్పుడు ఎక్కడున్నారు ? (ఆఫీసు)
5. మోహన్ ఎక్కడున్నారు ? (బెంగుళూరులో)

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| అందరూ | all people | ఉన్నావు | you are/were |
| సాయంత్రం | evening | లేను | I am/was not (present) |
| హాస్టలు | hostel | ఉన్నాను | I am/was |
| లేం | we are/were not (present) | అబద్ధం | false statement |
| బస్టాండు | bus-stand | లేవు | you (sg.) are/were not (present) |
| గుడి | temple | సినిమాహాలు | cinema theatre |
| నాటకం | drama | | |
| ఉన్నాం | we are/were | | |

## GRAMMAR NOTES

36.1. In this lesson the verb of existence (29.1.) in I and II persons is introduced. The use of the verb of existence in III person is already introduced in the earlier lessons. Now the paradigm is complete and it is as follows.

The underlined are the concord suffixes and they are in agreement with the person-gender-number of the subject.

| | | |
|---|---|---|
| I per. sg. | నేను ఇక్కడ ఉన్నాను | 'I am/was here.' |
| I per. pl. (excl.) | మేం ఇక్కడ ఉన్నాం | 'We are/were here.' |
| I per. pl. (incl.) | మనం ఇక్కడ ఉన్నాం | 'We are/were here.' |
| II per. inf. sg. | నువ్వు ఇక్కడ ఉన్నావు | 'You are/were here.' |
| II per. pl. & hon. sg. | మీరు ఇక్కడ ఉన్నారు | 'You are/were here.' |
| III per. inf. masc. sg. | వాడు ఇక్కడ ఉన్నాడు | 'He is/was here.' |
| III per. equal masc. sg. | అతను ఇక్కడ ఉన్నాడు | 'He is/was here.' |
| III per. inf. fem. sg. | అది ఇక్కడ ఉన్నది | 'She is here.' |
| III per. non-inf. fem. sg. | ఆమె ఇక్కడ ఉన్నది | 'She is/was here.' |
| III per. hon. epicene sg. | {ఆయన / ఆమె} ఇక్కడ ఉన్నారు | 'He/She is/was here.' |
| III per. formal epicene sg. | వారు ఇక్కడ ఉన్నారు | 'He/She is/was here.' |
| III per. epicene pl. | వాళ్లు ఇక్కడ ఉన్నారు | 'They are/were here.' |
| III per. neuter sg. | అది ఇక్కడ ఉన్నది | 'It is/was here.' |
| III per. neuter pl. | అవి ఇక్కడ ఉన్నాయి | 'They are/were here.' |

Note from the above paradigm that ఉన్నారు is common for second and third person human plural/honorific sg. and that ఉన్నది is common for third person inferior and non-inferior feminine singular, and neuter singular.

36.2. The negative forms of the above verb are formed by adding concord suffixes to the negative verb లే– 'not to be.'

The paradigm of the negative verb is given hereunder. The underlined are the concord suffixes and they are in agreement with the person-gender-number of the subject as in the case of the affirmative verb.

| Affirmative forms of the existential verb | Negative forms of the existential verb. | | Description of the person-gender-number. |
|---|---|---|---|
| ఉన్నాను | నేను ఇక్కడ లేను | 'I am/was not here.' | I per. sg. |
| ఉన్నాం | మేం ఇక్కడ లేం | 'We are/were not here.' | I per. pl. (excl.) |
| ఉన్నాం | మనం ఇక్కడ లేం | 'We are/were not here.' | I per. pl. (incl.) |
| ఉన్నావు | నువ్వు ఇక్కడ లేవు | 'You are/were not here.' | II per. sg. |
| ఉన్నారు | మీరు ఇక్కడ లేరు | 'You are/were not here.' | II per. pl. & hon. sg. |
| ఉన్నాడు | వాడు ఇక్కడ లేడు | 'He is/was not here.' | III per. inf. masc. sg. |
| ఉన్నాడు | అతను ఇక్కడ లేడు | 'He is/was not here.' | III per.equal masc. sg. |
| ఉన్నది | అది ఇక్కడ లేదు | 'She is/was not here.' | III per. inf. fem. sg. |
| ఉన్నది | ఆమె ఇక్కడ లేదు | 'She is/was not here.' | III per. non-inf. fem. sg. |
| ఉన్నారు | {ఆయన / ఆమె} ఇక్కడ లేరు | 'He/She is/was not here.' | III per. hon. epicene sg. |
| ఉన్నారు | వారు ఇక్కడ లేరు | 'He/She is/was not here.' | III per. formal epicene sg. |
| ఉన్నారు | వాళ్లు ఇక్కడ లేరు | 'They are/were not here.' | III per. epicene pl. |
| ఉన్నది | అది ఇక్కడ లేదు | 'It is/was not here.' | III per. neuter sg. |
| ఉన్నాయి | అవి ఇక్కడ లేవు | 'They are/were here.' | III per, neuter pl. |

Note from the above paradigm that లేవు is common for II person inferior singular and neuter plural, లేదు is common for III person inferior feminine singular, III person non-inferior feminine singular and III per. neuter singular, and లేరు is common for II person pl./honorific sg. and III person hon./formal epicene sg. & pl.

36.3. The verb in Telugu shows a concord which will be in agreement with the person-gender-number of the subject. The concord suffixes of the verb (which can also be called personal suffixes) are listed hereunder.

| | | | | |
|---|---|---|---|---|
| నేను | : | ను | ఉన్నా_ను | లే_ను |
| మేం/మనం | : | ం | ఉన్నా_ం | లే_ం |
| నువ్వు | : | వు | ఉన్నా_వు | లే_వు |
| మీరు<br>ఆయన, ఆమె<br>వారు, వాళ్లు | : | రు | ఉన్నా_రు | లే_రు |
| వాడు | : | డు | ఉన్నా_డు | లే_డు |
| అది/ఆమె | : | ది/డు | *ఉన్న_ది | లే_దు |
| అవి | : | యి/వు | ఉన్నా_యి | లే_వు |

36.4. Notice that in 29.1. it was reported that the existential verb ఉన్నది and its forms are in non-future tense. Until last lesson, this verb was used in present tense. In this lesson the use of this verb in past tense is introduced.

ఇప్పుడు మీరు ఎక్కడున్నారు ? — 'Where are you now ?'

నిన్న మీరు ఎక్కడున్నారు ? — 'Where were you yesterday ?'

36.5. Remember the use of the dubitative marker ఓ along with an interrogative sentence. (32.2.)

అది ఎక్కడున్నదో । — 'It is not known where it is.'

ఓ, along with ఏం (14.1.4), is used with an assertive sentence to denote uncertainty.

ఈ పుస్తకం ఎవరిది ? — 'Whose book is this ?'

ఇది రవి పుస్తకమేమో । — 'May be, this is Ravi's book.'

అతనెక్కడున్నాడు ? — 'Where is he ?'

సినిమాహాల్లో ఉన్నాడేమో । — 'May be, he is in a cinema theatre.'

37.6 Remember the sandhi rule డు + లు = ళ్లు. (28.8.) డి + లు will also become ళ్లు in the following process. డి + లు become డు + లు according to 11.4.1. and డు + లు become ళ్లు according to 28.8.

గుడి + లు = గుడు + లు = గుళ్లు — 'temples'

The base ఉన్న_ ends in a short అ before ది and in a long ఆ before other suffixes.

36.7. టి + లో → ట్లో
గుడి + లో → గుడ్లో 'in the temple'

36.8. Notice the use of the dative case suffix in sentences like

నాటకం ఎన్ని గంటలకు ? 'At what time is the drama ?'
నేను ఆరు గంటలకు ఇంట్లో ఉన్నాను. 'I was at home at 6 O'clock'
ఈ రైలు ఆరూపదికి. 'This train is at 6.10.'

This is a type of location (of time) in function. Recall the use of the dative case suffix in 30.7. where the function of the dative case suffix is also location (of place).

మీ ఊరికి రైలున్నదా ? (location of place)
'Is there rail connection to your village ?'
నాటకం ఎన్ని గంటలకు ? (location of time)
'At what time is the drama ?'

36.9. The words beginning in ఉ or ఊ are always pronounced with వు or వూ. They can also be written with initial వు or వూ when the words occur in the middle of a sentence.

నువ్వు నా గదిలో ఉన్నావు/వున్నావు 'You are in my room'

Similarly words beginning in ఇ or ఈ are pronounced with initial యి or యీ. They can also be written with initial యి or యీ when the words occur in the middle of a sentence.

ఈ యిల్లు నాది
ఈ ఇల్లు నాది 'This house is mine'

# UNIT 10

## Lesson 37

| | |
|---|---|
| సర్వర్ : ఏమండీ, మీకు టిఫిన్ ఏం కావాలి ? | Sir, what tiffin do you want ? |
| శర్మ : ముందు మంచినీళ్లు కావాలి. తర్వాత టిఫిన్. | First I need water. Then only tiffin. |
| సర్వర్ : ఇవిగో మంచినీళ్లు. ఇక్కడే ఉన్నాయి. | Water is here. |
| శర్మ : ఈ నీళ్లు చల్లగా లేవు. | This water is not cold. |
| రతిరామ్ : టిఫిన్ ఏమున్నది ? | What tiffin is available ? |
| సర్వర్ : ఇడ్లీ పూరీ మినపట్టూ పెసరట్టూ ఉప్మా ఉన్నాయి. | There are *idli*, *puri*, *minapattu*, *pesarattu* and *upma*. |
| జనతాసింగ్ : ఇడ్లీ వేడిగాఉన్నదా ? | Is *idli* hot ? |
| సర్వర్ : లేదండీ ! పూరీ వేడిగా ఉన్నది. మినపట్టూ పెసరట్టూ గూడా వేడిగా ఉన్నాయి. | No, sir ! *Puri* is hot. *Minapattu* is also hot. |

| | |
|---|---|
| రతి : ఏం జనతాసింగ్! నీకు మినపట్టు కావాలా? పెసరట్టు కావాలా? | Janatha Singh! Do you want *minapattu* or *pesarattu*? |
| జనతాసింగ్ : నాకు రెండు వేడి పెసరట్లు కావాలి. మినపట్టు ఒద్దు. నీకేం కావాలి మృత్యుంజయ్? | I want two hot *pesarattus* but no minapattu. What do you want, Mruthyunjay? |
| మృత్యుంజయ్ : నాకు ఇడ్లీ కావాలి. | I want *idli*. |
| సర్వర్ : ఇడ్లీ చల్లగా ఉన్నదండీ! | *Idli* is cold, sir! |
| మృత్యుంజయ్ : అయితే ఉప్మా కావాలి. | Then I want *upma*. |
| సర్వర్ : మీకేం కావాలండీ! | What do you want, sir? |
| రతి : నాకు పాలు కావాలి. | I want milk. |
| సర్వర్ : పాలు లేవండీ! కాఫీ ఉన్నది. టీ వున్నది. బోర్నవిటా గూడా ఉన్నది. మీకేం కావాలి? | Milk is not available sir. Coffee and tea are available. Fournvita is also available. What do you want among these? |
| రతి : నాకు ఏమీ ఒద్దు. పాలే కావాలి. | I don't want any of these. I want milk only. |
| సర్వర్ : పాలు లేవండీ! | Milk is not available, sir. |
| రతి : అయితే చల్లని మంచినీళ్లు కావాలి. | Then I need only cold water. |
| శర్మ : ఈ హోటల్లో మంచినీళ్లు చల్లగా లేవు. | The drinking water available in this hotel is not cold. |
| మృత్యుంజయ్ : నింగయ్య గూడా యిక్కడే ఉన్నాడు. మరి క్లాసులో ఎవరున్నారు? | Ningaiah is also here. Then who is there in the class? |
| రతిరామ్ : ఎవరూ లేరు. | Nobody is there. |

## DRILLS

### a. Repetition drill.

నాకు పాలు కావాలి కాఫీ ఒద్దు.

మృత్యుంజయ్‌కు మినపట్లు కావాలి. పెసరట్లు ఒద్దు.

మంచినీళ్లు ఉన్నాయా ? లేవు.

మీ ఇంట్లో పాలు ఉన్నాయా ?

మా ఇంట్లో పాలు లేవండీ !

ఇది వేడి కాఫీ.

ఈ కాఫీ వేడిగా వున్నది.

అది తెల్ల పువ్వు.

ఆ పువ్వు తెల్లగా వున్నది.

ఇది చల్లని కాఫీ.

ఈ కాఫీ చల్లగా వున్నది.




### b. Build-up drill.

కావాలి.

ఏం కావాలి ?

మీకు ఏం కావాలి ?

ఏమండీ మీకు ఏం కావాలి ?

ఒద్దు.

మినపట్లు ఒద్దు.

వేడి మినపట్లు ఒద్దు.

నాకు వేడి మినపట్లు ఒద్దు.

ఉన్నాయా ?

తెల్లగా వున్నాయా ?

కాయితాలు తెల్లగా వున్నాయా ?

ఆ కాయితాలు తెల్లగా వున్నాయా ?

**c. Substitution drill.**

Model (i) :

నాకు ఇడ్లీ కావాలి.
పాలు
నాకు పాలు కావాలి.
పెసరట్టు
ఉప్మా
కాఫీ

Model (ii) :

నాకు మల్లెపూలు ఒద్దు.
గులాబీపూలు
నాకు గులాబీపూలు ఒద్దు.
వేడిపాలు
తెలుగుపుస్తకం
పూరీ

**d. Response drill.**

Model (i) :

మీకేం కావాలి ? (కాఫీ)
నాకు కాఫీ కావాలి.

1. రవికేం కావాలి ? (పుస్తకం)
2. నాకేం కావాలి ? (గడియారం)
3. మనకేం కావాలి ? (పెసరట్లు)

Model (ii) :

ఇడ్లీ వేడిగా ఉన్నది. పూరీ చల్లగా ఉన్నది.
అయితే నాకు ఇడ్లీ కావాలి.

1. మినపట్టు చల్లగావున్నది. పెసరట్టు వేడిగా ఉన్నది.
2. కాఫీ చల్లగావున్నది. టీ వేడిగా ఉన్నది.
3. ఉప్మా వేడిగా వున్నది. ఇడ్లీ చల్లగా వున్నది.

Model (iii) :

నీకు మినపట్టు కావాలా ? పెసరట్టు కావాలా ?
నాకు మినపట్టు కావాలి. పెసరట్టు ఒద్దు.

1. నీకు కాఫీ కావాలా ? టీ కావాలా ?
2. రవికి కలం కావాలా ? కాయితం కావాలా ?
3. మీకు పాలు కావాలా ? కాఫీ కావాలా ?

Model (iv) :

మీకు ఏం కావాలి ? మినపట్లా ? పెసరట్లా ?
నాకు ఏమీ ఒద్దు.

1. మీకు ఏది కావాలి ?
కలమా ? కాయితమా ?
2. మీకు ఎవరు కావాలి ?
రామారావా ? సుబ్బారావా ?
3. మీకు ఏం కావాలి ?
మల్లె పూలా ? గులాబీ పూలా ?

Model (v) :

ఇవి నా కాయితాలు.
వీటిలో ఒక కాయితం నాకు కావాలి.

1. ఇవి మా పుస్తకాలు.
2. ఇవి గులాబీ పూలు.
3. అవి రవి గడియారాలు.
4. అవి కొత్త కుర్చీలు.

**e. Transformation drill.**

**Model (i) :**

ఇక్కడ పుస్తకం లేదు.
ఇక్కడ పుస్తకాలు లేవు.

1. ఇక్కడ మినపట్టు లేదు.
2. అక్కడ మల్లెచెట్టు లేదు.
3. మాయింట్లో పెసరట్టు లేదు.

**Model (ii) :**

నాకు కాఫీ కావాలి.
నాకు కాఫీ ఒద్దు.

1. నాకు రవి కావాలి.
2. రవికి పెసరట్టు కావాలి.
3. మా మాష్టరుగారికి టీ కావాలి.

**Model (iii) :**

ఇవి వేడి పెసరట్లు.
ఈ పెసరట్లు వేడిగా ఉన్నాయి.

1. ఇవి తెల కాయితాలు.
2. అవి ఆకుపచ్చ పుస్తకాలు.
3. ఇవి చల్లని పాలు.

## EXERCISES

a. Answer the following questions using the cue words given in the parentheses.

1. రవికి ఏం కావాలి ? (కొత్త కలం)
2. సరళకు ఏం కావాలి ? (గులాబీపూలు)
3. మీకు ఏం కావాలి ? (పెసరట్టు)
4. పాపకు ఏం కావాలి ? (పాలు)

b. Answer the following questions as shown in the model.

Model (i) :

మీకు గులాబీపూలు కావాలా ? (మల్లెపూలు)
నాకు గులాబీపూలు ఒద్దు. మల్లెపూలు ఒద్దు.

1. మీకు ఇడ్లీ కావాలా ? (పెసరట్టు)
2. రవికి కాఫీ కావాలా ? (పాలు)
3. నీకు హిందీ పుస్తకాలు కావాలా ? (తెలుగు పుస్తకాలు)
4. గోపాలరావుకు పాత కలం కావాలా ? (కొత్త కలం)

c. **Fill up the blanks with** లేదు/లేవు.

1. మా ఇంట్లో కాఫీ ................
   మీ ఇంట్లో మంచినీళ్లు ................
   మీ ఇంట్లో పాలు ...........
4. వాళ్ల ఇంట్లో టీ
5. శర్మగారింట్లో మల్లెచెట్లు

d. Change the following sentences using the adverbs of the corresponding adjectives.

1. ఇవి చల్లని పాలు.
2. అవి తెల్ల పూలు.
3. అది వేడి కాఫీ.
4. అది ఎర్ర చొక్కా.

e. Produce atleast 10 correct sentences from the following table taking one item from each column at a time.

| | | | | |
|---|---|---|---|---|
| రవి | | | | |
| రామారావు | | ఎర్ర | పూలు | |
| మా అమ్మాయి | కు | చల్లని | పాలు | కావాలి |
| నా | కి | వేడి | మంచినీళ్లు | వద్దు |
| నీ | | | ఇడ్లీ | |

## VOCABULARY

| | |
|---|---|
| టిఫిన్ | tiffin |
| కావాలి | is required |
| ముందు | firstly |
| మంచినీళ్లు | drinking water |
| నీళ్లు | water |
| చల్లగా | cold (adv.) |
| ఇడ్లీ | *idli* |
| పూరీ | *puri* |
| మినపట్టు | *minapattu* (an edible ) |
| పెసరట్టు | *pesarattu* (an edible) |
| ఉప్మా | *upma* (an edible) |
| వద్దు | not required |
| పాలు | milk |
| కాఫీ | coffee |
| టీ | tea |
| బోర్నవిటా | Bournvita |
| చల్లని | cold (adj.) |
| స్విమ్మింగ్‌పూల్ | swimming pool |
| సార్ | sir |

## GRAMMAR NOTES

37.1. In this lesson the defective verb కావాలి 'want' is introduced. The tense expressed by this verb is non-past. The defective verbs do not show any concord with the subject. The subject of the defective verb will always be in dative case.

| | |
|---|---|
| నాకు కలం కావాలి. | 'I want a pen.' |
| (I -dative pen want) | |
| శర్మకు కలాలు కావాలి. | 'Sarma wants pens.' |
| నీకు పుస్తకం కావాలి. | 'You want a book.' |

37.2. ఒద్దు 'not needed' is the negative from of కావాలి. All the conditions given in 37.1. are also applicable to ఒద్దు.

| | |
|---|---|
| నాకు కలం ఒద్దు | 'I don't want a pen.' |
| శర్మకు కలం ఒద్దు | 'Sarma does not want a pen.' |
| నీకు పుస్తకాలు ఒద్దు. | 'You do not need books.' |

37.3. కావాలి and ఒద్దు function like verbs but they do not exhibit all the properties of the verbs. For example, they are not conjugated for all the tenses. They do not exhibit the concord for person-gender-number of the subject, unlike the verbs ఉన్నది, లేదు, etc. Hence these verbs are called defective verbs.

37.4. Notice the length of the final vowel (inclusive marker, 15.2.) in sentences like:

| | |
|---|---|
| నాకు ఏమీ ఒద్దు. | 'I do not want any thing' or 'I want nothing.' |
| క్లాసులో ఎవరూ లేరు. | 'There is nobody in the class.' |

The length of the final vowel of an interrogative word and the use of a negative verb along with it, denote something which we can equate with the English expressions like 'nothing, nobody, nowhere, etc.'

| | |
|---|---|
| అక్కడ ఏమీ లేదు. | 'Nothing is there.' |
| ఏమీ ఒద్దు. | 'Nothing is required'. |
| ఎవరూ లేరు. | 'Nobody is there'. |
| ఎక్కడా లేదు. | 'Nowhere it is'. |

etc.

37.5. ఏమీ is the combination of the inclusive marker (15.2.) and the interrogative word ఏం.

ఏమిటి does not take the inclusive marker. In the context where ఏమిటి has to be used with the inclusive marker, ఏం is only used with the inclusive marker.

| | |
|---|---|
| అది ఏమిటి? | 'What is that?' |
| ఏమీ లేదు. | 'Nothing' |
| (ఏం + inclusive marker) | |

37.6. -గా is the adverbial marker. It is added to the adjectives and to some abstract nouns to form adverbs.

| | | | |
|---|---|---|---|
| వేడి | 'heat' (N. & adj.) | వేడిగా | 'hot' (adv.) |
| తెల్ల | 'white' (adv.) | తెల్లగా | 'white' (adv.) |

37.7. చల్లగా is formed by adding గా to the adjective చల్ల. But the use of చల్ల as an adjective is very much restricted and చల్లని 'cold' is used in its place.

| | |
|---|---|
| చల్లని కాఫీ | 'cold coffee' |
| ఈ కాఫీ చల్లగా ఉన్నది. | 'This coffee is cold.' |

37.8. మంచినీళ్ళు 'drinking water', నీళ్ళు 'water' and పాలు 'milk' behave like plural nouns.

| | |
|---|---|
| అక్కడ మంచినీళ్ళు ఉన్నాయి. | 'There is drinking water.' |
| అక్కడ నీళ్ళున్నాయి. | 'There is water.' |
| అక్కడ పాలు ఉన్నాయి. | 'There is milk.' |

# UNIT 10

## Lesson 38

| | |
|---|---|
| సర్వర్ : ఏం కావాలండీ ? | What do you want, Sir ? |
| మహాపాత్ర : నాకు మూడు మినపట్లు కావాలి. | I want three *minapattus*. |
| రతిరామ్ : మూడు మినపట్లా ? | Three *minapattus* ? |
| మహా : అవును. ఈ హోటల్లో మినపట్టు చాలా చిన్నది. నాకు ఒకటీ రెండూ చాలవు. | Yes. The *minapattu* is very small in size in this hotel. One or two are not sufficient for me. |
| నంజయ్య : సరే ! ఆయనకు మూడు మినపట్లు, మాకు కాఫీ, పాపకు పాలు. | Alright. Three *minapattus* for him, coffee for us and milk for the child. |
| రతి : ఈ పాప మీ అమ్మాయా ? | Is this child your daughter ? |
| నంజ : అవును. | Yes. |
| రతి : పాపా ! నీ పేరేమిటమ్మా ? | What is your name, dear ! |
| పాప : జ్యోతి. | Jyothi. |
| రతి : మంచి పేరు. | A nice name. |

b. Build-up drill.

ఉన్నది
ఎలా వున్నది ?
కాఫీ ఎలా వున్నది ?
ఈ కాఫీ ఎలా వున్నది ?

చాలు
కాఫీ చాలు
ఈ కాఫీ చాలు.
నాకు ఈ కాఫీ చాలు.

c. Expansion drill.

Model (i) :

ఈ కాఫీ వేడిగా ఉన్నదేం ?
ఈ కాఫీ ఇంత వేడిగా ఉన్నదేం ?

1. ఆ కాయితం ఎఱ్ఱగా ఉన్నదేం ?
2. ఈ టీ చల్లగా ఉన్నదేం ?
3. ఆ పూలు తెల్లగా ఉన్నాయేం ?

Model (ii) :

ఈ పూలు బాగున్నాయి.
ఈ పూలు చాలా బాగున్నాయి.

1. అది మంచి పుస్తకం.
2. ఈ టీ వేడిగా ఉన్నది.
3. ఆ పువ్వు ఎఱ్ఱగా ఉన్నది.

d. Substitution drill.

Model (i) :

నాకు కాఫీ అలవాటు.
టీ
నాకు టీ అలవాటు.
టోస్టుపిటా
పాలు
చేదుకాఫీ

Model (ii) :

కాఫీ ఇంత వేడిగా ఉన్నదేం ?
చేదు
కాఫీ ఇంత చేదుగా ఉన్నదేం ?
టీ ఇంత చల్లగా ఉన్నదేం ? (వేడి)
పాలు ఇంత వేడిగా ఉన్నాయేం ? (చల్ల)
నీళ్లు అంత చల్లగా ఉన్నాయేం ? (ఎఱ్ఱ)

e. Response drill.

Model (i) :

ఈ కాఫీ ఎలా ఉన్నది ?
ఆ కాఫీ రవికి బాగాలేదు, నాకు బాగానే ఉన్నది.

1. ఈ ఇల్లు ఎలా వున్నది ?
2. ఈ పుస్తకం ఎలా వున్నది ?
3. మా ఊరు ఎలా వున్నది ?

**Model (ii) :**

మీకు నా పుస్తకం కావాలా ?

నా దగ్గర పుస్తకం ఉన్నది. మీ పుస్తకం నాకక్కర్లేదు.

1. మీకు నా కలం కావాలా ?
2. [illegible] ల్ల [illegible] కావాలా ?
3. రవికి నా గడియారం కావాలా ?

**Model (iii) :**

మీకు బోర్నవిటా కావాలా ? కాఫీ కావాలా ? (కాఫీ)

నాకు బోర్నవిటా అక్కర్లేదు. కాఫీ చాలు.

1. మీకు ఐదు రూపాయలు కావాలా ? పది రూపాయలు కావాలా ? (ఐదు)
2. మీకు మంచినీళ్లు కావాలా ? పాలు కావాలా ? (మంచినీళ్లు)
3. మీకు కొత్త సంచీ కావాలా ? పాత సంచీ కావాలా ? (పాత సంచీ)

f. Conversation drill.

Model:

A : ఈ ఇల్లు బాగున్నది.
B : మీకెలా వున్నది ?
C : నాకు చాలా బాగున్నది.

1. A : ఈ టీ చేదుగా వున్నది.
2. A : పాలు నాకు చల్లగా వున్నాయి.
3. A : ఈ గది నాకు బాగున్నది.
4. A : ఈ ఊరు నాకు వేడిగా వున్నది.

## EXERCISES

a. Answer the following questions as shown in the model.

**Model (i) :**

ఈ పుస్తకం ఎలా వున్నది ?

ఈ పుస్తకం నాకు చాలా బాగున్నది ; సరళకు బాగాలేదు.

1. మా ఇల్లు ఎలా వున్నది ?
2. మైసూరు ఎలా వున్నది ?
3. పెసరట్టు ఎలా వున్నది ?

**Model (ii) :**

ఈ పుస్తకం ఎలా వున్నది ?

ఈ పుస్తకం బాగానే వున్నది ; ఆ పుస్తకం బాగాలేదు.

1. ఈ ఇల్లు ఎలా వున్నది ?
2. ఆ గది ఎలా వున్నది ?
3. ఈ ఊరు ఎలా వున్నది ?

Model (iii) :

నీకు పది రూపాయలు కావాలా ? (నాలుగు)
నాకు పది రూపాయలు అక్కర్లేదు; నాలుగు రూపాయలు చాలు.

1. నీకు కొత్త సంచీ కావాలా ? (పాత)
2. రవికి రెండు కలాలు కావాలా ? (ఒక)
3. రవికి ఇంత పంచదార కావాలా ? (సగం)

**b. Give four transformed forms of the following sentences, as shown in the model.**

**Model :**

ఆ పుస్తకం బాగున్నది.

Transformed forms

(a) ఆ పుస్తకం బాగానే ఉన్నది.
(b) ఆ పుస్తకం బాగాలేదు.
(c) ఆ పుస్తకం చాలా బాగున్నది.
(d) ఆ పుస్తకం ఎలా ఉన్నది ?

1. మీ ఊరు బాగున్నది.
2. ఈ కాఫీ బాగున్నది.
3. పెసరట్టు బాగున్నది.

**c. Rewrite the following sentences using the cue words given in the parentheses.**

1. ఈ మందు చేదుగా ఉన్నది. (ఎర్ర)
2. నీ చీరె ఆకుపచ్చగా ఉన్నది. (తెల్ల)
3. ఆ కాఫీ చల్లగా ఉన్నది. (వేడి)
4. ఆ గది చల్లగా ఉన్నది. (వేడి)

**d. Fill up the blanks with చాలదు/చాలవు.**

1. నాకు నాలుగు పుస్తకాలు ............
2. సుగుణకు ఇంత టీ ............
3. మాకు ఆ ఇల్లు ................
4. సుశీలకు ఆ మంచినీళ్ళు ................

**VOCABULARY**

| | |
|---|---|
| హోటల్ | hotel |
| చాలా | too much; very |
| చాలవు | will not be sufficient (pl.) |
| ఎలా | how |
| బాగా | good (adv.) |
| ఏమమ్మా | what, my dear! (fem.) (attention drawer) |
| చేదు | bitter |
| తియ్యగా | sweetly (adv.) |
| చప్పగా | insipidly (adv.) |
| ఏమయ్యా | what, man ! |
| కషాయం | dicoction |
| ఇంత | this much |
| పంచదార | sugar |
| అలవాటు | habit |
| అక్కర్లేదు | not necessary |
| తీపి | sweet (n.) |
| అంత | that much |
| సగం | half |
| చాలు | sufficient |
| చాలదు | will not be sufficient (sg.) |

38.1. అక్కర్లేదు 'not necessary' is also a negative form of కావాలి. (ఒద్దు, 37-2, is the other negative form of కావాలి).

నాకు పాలు కావాలి 'I want milk.'

నాకు పాలు అక్కర్లేదు 'I don't want milk.'

38.2. బాగా 'good' is a qualitative adverb and చాలా 'very' is a quantitative adverb.

38.3. ఇంత 'this much' and అంత 'that much' are the quantitative mass adjectives. The corresponding interrogative word is ఎంత (19.3).

38.4. చాలు 'enough' is another defective verb. All the conditions that are given for the other defective verb కావాలి (37.1.) are also applicable to చాలు.

నాకు ఈ కాఫీ చాలు 'This coffee is sufficient for me.'

38.5. బాగా + ఉన్నది can be బాగున్నది and బాగాఉన్నది. Likewise the following are also possible.

బాగున్నాడు/బాగాఉన్నాడు 'He is good.'

బాగున్నాయి/బాగాఉన్నాయి 'They (neut.) are good.'

38.6. Notice the use of dative case suffix in sentences like

నాకు ఈ కాఫీ బాగాలేదు 'This coffee is not tasty for me.'

ఈ టీ శర్మకు బాగున్నది 'This tea is tasty to Sarma.'

అతనికి కాఫీ అలవాటు 'He is habituated to take coffee.'

etc. Here the function of the dative case suffix is to express *possession* of feelings, desires, habits and experiences.

38.7. ఏమమ్మా (fem. non-hon. sg.), ఏమయ్యా (masc. non-hon. sg.) and ఏమండీ (epicene pl. and epicene hon. sg.) are used to attract the attention of the persons addressed.

38.8. _అమ్మా (fem. sg), _అయ్యా (masc. sg.) and _అండీ (epicene hon. sg. and epicene pl.) are the address suffixcs/markers used to attract the attention of the persons addressed. _అమ్మా is used to address females and _అయ్యా is used to address males. _అండీ is used to address both males and females and it denotes respect. _అమ్మా and _అయ్యా are used to address very close and intimate persons. They are also used to address unknown persons of lower strata. _అమ్మా is further used to call female children with affection.

38.9. When the address markers _అమ్మా _అయ్యా and _అండీ are added to words ending in long vowels except ఆ, a glide న్ is inserted between the word and the address marker.

సరే + అమ్మా → సరేనమ్మా 'All right, my dear!'

*saree + ammaa → sareenammaa*

నేనే + అండీ → నేనేనండీ 'It's me, Sir!'

*neenee + andii → neeneenaṇḍii*

సంచీ + అమ్మా → సంచీనమ్మా 'This is a bag, my dear!'

*sancii + ammaa → sanciinammaa*

ఏమో + అయ్యా → ఏమోనయ్యా 'It is not known, Mr.!'

*eemoo + ayyaa → eemoonayyaa*

38.10. ఎలా 'how' is an interrogative manner adverb.

కాఫీ ఎలా వుంది? 'How is the coffee?'

38.11. ఏం (14.1.4.), when added to an assertive sentence, means 'why'.

ఈ కాఫీ ఇంత చేదుగా వున్నదేం? 'Why is this coffee so bitter?'

(వున్నది + ఏం)

# UNIT 10

## Lesson 39

| | |
|---|---|
| మూర్తి : రతిరామ్‌గారూ ! మీ ఊరినుంచి ఇక్కడికి ఎన్ని రోజుల ప్రయాణం ? | Hello, Mr. Ratiram ! How many days do you need to travel from your place to this place ? |
| రతిరామ్ : రెండు రాత్రిళ్లు మూడు పగళ్ల ప్రయాణమండీ. | The journey is for two nights and three days. |
| మూర్తి : అయితే మీ ఊరు యిక్కడ్నించి చాలా దూరమున్నమాట ! | So, your place is far from here ! |
| రతిరామ్ : అవునండీ ! దాదాపు వెయ్యి మైళ్లు. సుమారు ఎనిమిది వందల ఎనభై మైళ్లు రైలు ప్రయాణం. అక్కడ్నించి నూట యిరవై మైళ్లు బస్సు ప్రయాణం. | Yes, sir ! It's about thousand miles. The train journey is about eight hundred and eighty miles. After that, it is one hundred and twenty miles by bus. |
| మూర్తి : మృత్యుంజయ్‌గారూ ! మీ ఊరికి యిక్కడ్నించెంత దూరం ? | Mr. Mrutyunjay ! What's the distance between your place and this place ? |

| | |
|---|---|
| మృత్యుం : నాలుగు వందల తొంభై ఒక్క మైళ్లు. | Four hundred and ninetyone miles. |
| మూర్తి : రెండు రోజుల ప్రయాణమా ? | Is it two days' journey ? |
| మృత్యుం : రెండు రోజులు అక్కర్లేదండీ ! ఒక రాత్రీ ఒక పగలూ చాలు. | We don't need two days, Sir ! It is only one night and a day. |
| మూర్తి : నింగయ్యగారూ ! మీ ఊరెంత దూరం ? | Mr. Ningaiah ! How far is your place ? |
| నింగయ్య : సుమారు వందమైళ్లు. ఒక రాత్రిగాని ఒక పగలుగాని చాలు. | About hundred miles. We need just a night or a day. |
| మూర్తి : శర్మగారూ ! మీ ఊరికి ఎన్ని రోజుల ప్రయాణం ? | Mr. Sarma ! How many days do you require to go to your place ? |
| శర్మ : మా ఊరు యిదే ! | I hail from this place only. |
| మూర్తి : అలాగా ! అయితే మీ యింటికి ఎంత దూరం ? | Oh, I see ! How far is your house ? |
| శర్మ : ఎక్కడ్నించండీ ? | From where, Sir ? |
| మూర్తి : ఇక్కణ్ణించేనండీ. | From here only ! |
| శర్మ : చాలా దగ్గర. సుమారు ఒక ఫర్లాంగు. | It's very near. It is about a furlong. |

## DRILLS

a. Repetition drill.

మైసూరునించి మా ఊరికి రెండు రోజుల ప్రయాణం.
మద్రాసునించి మా ఊరు ఆరు వందల అరవై నాలుగు మైళ్లు.
ఇక్కణ్ణించి మీ ఊరు ఎంత దూరం ?
ఇక్కణ్ణించి మీ ఊరికి ఎంత దూరం ?

మా ఇంటినించి మీ యింటికి సుమారు రెండు ఫర్లాంగులు.
ఆఫీసునించి బస్‌స్టాండుకు దాదాపు నాలుగు మైళ్లు.
మా ఊరినించి మీ ఊరికి సుమారు నూట యాభై మైళ్లు.

b. **Build-up drill.**

ప్రయాణం
రోజుల ప్రయాణం
ఎన్ని రోజుల ప్రయాణం ?
ఊరికి ఎన్ని రోజుల ప్రయాణం ?
మీ ఊరికి ఎన్ని రోజుల ప్రయాణం ?
ఇక్కణ్ణించి మీ ఊరికి ఎన్ని రోజుల ప్రయాణం ?

మైళ్ళు.
నాలుగు మైళ్ళు.
అరవై నాలుగు మైళ్ళు.
నూట అరవై నాలుగు మైళ్ళు.
ఊరికి నూట అరవై నాలుగు మైళ్ళు.
మా ఊరికి నూట అరవై నాలుగు మైళ్ళు.
మైసూరునించి మా ఊరికి నూట అరవై నాలుగు మైళ్ళు.

అన్నమాట.
ఉన్నదన్నమాట.
దూరం ఉన్నదన్నమాట.
చాలా దూరం ఉన్నదన్నమాట.
మైసూరునించి చాలా దూరం ఉన్నదన్నమాట.
ఊరు మైసూరునించి చాలా దూరం ఉన్నదన్నమాట.
మీ ఊరు మైసూరునించి చాలా దూరం ఉన్నదన్నమాట.
అయితే మీ ఊరు మైసూరునించి చాలా దూరం ఉన్నదన్నమాట.

ప్రయాణం
రైలు ప్రయాణం.
నాలుగు మైళ్ళ రైలు ప్రయాణం.
నలభై నాలుగు మైళ్ళ రైలు ప్రయాణం.
నాలుగు వందల నలభై నాలుగు మైళ్ళ రైలు ప్రయాణం.
సుమారు నాలుగు వందల నలభై నాలుగు మైళ్ళ రైలు ప్రయాణం.

c. **Substitution drill.**

**Model (i) :**

మైసూరునించి మా ఊరికి తొంభైఐదు మైళ్ళు.

గుంటూరు
గుంటూరునించి మా ఊరికి తొంభైఐదు మైళ్ళు.

విజయవాడ
మద్రాసు
బెంగుళూరు

**Model (ii) :**

మైసూరునించి మీ ఊరు నూట ఇరవై మైళ్ళు.
ముప్ఫైఐదు
మైసూరునించి మీ ఊరు నూట ముప్ఫైఐదు మైళ్ళు.
తొంభై ఆరు
ఎనభై తొమ్మిది
తొంభై
ఎనభై

**Model (iii) :**

మాపూరినించి మీ ఊరికి రెండు వందల తొంభైఆరు మైళ్ళు.
ఆరు
మాపూరినించి మీ ఊరికి ఆరు వందల తొంభైఆరు మైళ్ళు.
నాలుగు
తొమ్మిది
ఏడు

**Model (iv) :**

తిరుపతినించి మాపూరికి నూటయాభై మైళ్ళు.
రెండు వందలు
తిరుపతినించి మాపూరికి రెండువందల మైళ్ళు.
వంద
తొంభై
నాలుగువందలు
వెయ్యి
ఎనభై

**d. Response drill.**

**Model (i) :**

మీ ఊరు ఇక్కడ్నించి ఎంత దూరం ?
నాలుగు వందల ఎనభై ఏడు.
మా ఊరు ఇక్కడ్నించి నాలుగు వందల ఎనభై ఏడు మైళ్ళు.
ఆరు వందల తొంభై మూడు
నూట ఎనభై ఆరు
వంద
తొంభై తొమ్మిది
వెయ్యి

**Model (ii) :**

మీ ఊరికి ఇక్కడ్నించి ఆరు రోజుల ప్రయాణమా ? (మూడు)
ఆరు రోజులు అక్కర్లేదు ; మూడు రోజులు చాలు.

1. మీ ఊరికి గుంటూరునించి రెండురోజుల ప్రయాణమా ? (ఒక రాత్రి, ఒక పగలు)
2. ఢిల్లీకి ఇక్కడ్నించి మూడు రోజుల ప్రయాణమా ? (మూడు పగళ్ళు, రెండు రాత్రిళ్ళు)
3. మీ ఊరినించి మైసూరుకు నాలుగురోజుల ప్రయాణమా ? (మూడు రాత్రిళ్ళు, నాలుగు పగళ్ళు)

**Model (iii) :**

మా ఊళ్లో ఒక స్కూలు ఉన్నది. (రెండు)
మా ఊళ్లో రెండు స్కూళ్లు ఉన్నాయి.

1. మా ఇల్లు ఇక్కడినించి ఒక మైలు. (నాలుగు)
2. మా ఊరికి ఒక రైలున్నది. (మూడు)
3. మాకు ఒక యిల్లు ఉన్నది. (రెండు)
4. నాకు ఒక చెల్లెలున్నది. (ఇద్దరు)
5. మా ఊళ్లో ఒక సినిమాహాలు ఉన్నది. (ఆరు)

**Model (iv) :**

నీకు ఒక తెలుగు పుస్తకం కావాలా ?
ఒక ఇంగ్లీషు పుస్తకం కావాలా ?

నాకు ఒక తెలుగు పుస్తకం గాని ఒక ఇంగ్లీషు పుస్తకం గాని చాలు.

1. నీకు రెండు రూపాయలు కావాలా ? ఒక పుస్తకం కావాలా ?
2. మీ పాపకు బొమ్మ కావాలా ? పుస్తకం కావాలా ?
3. ఆమెకు ఉప్మా కావాలా ? మినపట్టు కావాలా ?

**e. Expansion drill.**

**Model (i) :**

మా వూరు ఇక్కడినించి దగ్గర.
మా వూరు ఇక్కడినించి చాలా దగ్గర.

1. మా ఇల్లు ఆఫీసునించి దూరం.
2. మీ ఇంటినించి మా ఇల్లు దగ్గర.
3. మా ఊరు ఇక్కడినించి దూరం.

**Model (ii) :**

మా వూరు ఇక్కడినించి నూట నాలుగు మైళ్లు.
(a) మా వూరు ఇక్కడినించి దాదాపు నూటనాలుగు మైళ్లు.
(b) మా వూరు ఇక్కడినించి సుమారు నూట నాలుగు మైళ్లు.

1. మైసూరునించి మీ ఊరికి వెయ్యి మైళ్లు.
2. మా ఊరు మైసూరునించి తొమ్మిదివందల తొంభై మైళ్లు.
3. మా ఊరికి ఇక్కడినించి ఆరురోజుల ప్రయాణం.

## EXERCISES

**a. Answer the following questions.**

1. మీ వూరికి ఇక్కడినించి ఎన్నిరోజుల ప్రయాణం ?
2. మీ వూరు మైసూరునించి ఎంత దూరం ?
3. మైసూరునించి బెంగుళూరుకు సుమారు ఎంత దూరం ?
4. మీ స్కూలునించి మీ యింటికి ఎంత దూరం ?

| | |
|---|---|
| నూట డెబ్బైమూడు | 173 |
| నూట ఎనభై ఎనిమిది | 188 |
| నూట తొంభై | 190 |
| నూట తొంభై ఒకటి | 191 |
| నూట తొంభై నాలుగు | 194 |
| నూట తొంభై ఎనిమిది | 198 |
| నూట తొంభై తొమ్మిది | 199 |

39.5.2. From 200 onwards వంద is used.

| | |
|---|---|
| రెండు వందలు | 'two hundred' |
| మూడు వందలు | 'three hundred' |

అ is added to వందలు before adding other numerals.

| | |
|---|---|
| రెండువందల ఒకటి | 201 |
| రెండువందల రెండు | 202 |
| రెండువందల పది | 210 |
| మూడువందల ముప్పైఆరు | 336 |
| నాలుగువందల యాభై రెండు | 452 |
| ఐదువందల అరవై ఒకటి | 561 |
| ఆరువందల అరవై తొమ్మిది | 669 |
| ఏడువందల ఎనభై ఒకటి | 781 |
| ఎనిమిదివందల తొంభై రెండు | 892 |
| తొమ్మిదివందల పది | 910 |
| తొమ్మిదివందల తొంభై తొమ్మిది | 999 |
| వెయ్యి | 1000 |

39.6. గాని 'or' is added to all the phrases when there is a choice among them.

నాకు కాఫీగాని టీగాని చాలు. 'Coffee or tea is enough for me.'

39.7. The oblique bases of ఇక్కడ, అక్కడ and ఎక్కడ are ఇక్కడి–, అక్కడి– and ఎక్కడి– respectively.

39.8. Recall the Sandhi operation given in (12.6.).

డి + ని — ణ్ణి

*ḍi + ni — ṇṇi*

This can also be written as డ్ని.

ఇక్కడ్నించి 'from here'

నేను మంచివాణ్ణి 'I am a good man.'

But pronunciation of this డ్ని is only ణ్ణి.

# REVIEW 5

## Lesson 40

| | |
|---|---|
| మా ఊళ్ళో ఒక గుడి ఉంది | A temple in our town, |
| ఆ గుడి చుట్టూతోటుంది | A garden around the temple, |
| ఆ గుళ్ళో ఒక బొమ్ముంది — ఆ | An idol in the temple, |
| బొమ్మకు ప్రాణం పదిమంది. | Its life is the people. |
| | |
| మా ఊళ్ళో ఒక బడి ఉంది | A school in our town, |
| ఆ బడి చుట్టూతోటుంది | Around it a garden, |
| ఆ బడిలో ఒకరున్నారు — ఆ | One is there in the school, |
| బడి పిల్లలకు మాష్టారు. | He, pupils' teacher in the school. |
| | |
| గుళ్ళో రోజూ నైవేద్యం | Offerings in the temple daily, |
| ఊళ్ళో లేదు ఐకమత్యం | But people have no unity, |
| ఊళ్ళో పెద్దలు ప్రతిసాయంత్రం | Elders every evening, |
| గుళ్ళో తీరిక కాలక్షేపం | In the temple while away |

వాళ్ళకు లేవు పనులు పాటలు
వాళ్ళకు కావాలి అందరి మాటలు

As they spend time gay
Into others' problems interfering.

మా ఊళ్ళో ఒక గుడి ఉంది
ఆ గుడి చుట్టూ తోటుంది
ఆ గుళ్ళో ఒక బొమ్ముంది _ ఆ
బొమ్మకు ప్రాణం పదిమంది.

A temple in our town,
A garden around the temple,
An idol in the temple,
Its life is the people.

ఆ బడి తోట
రంగుల పూలు
బడిలో పిల్లల వేడుకలు
ఆ బడిపంతులు బోధనలు
పిల్లల భావికి నిచ్చెనలు
ప్రతిసాయంత్రం ఆటలు పాటలు
ఉజ్వల భావికి పూల బాటలు

Colourful blossoms in the garden of the school,
Mirth children make in the school,
Preaches the teacher
For the pupils' future
Every evening sports gay
A bright future's successful way.

మా ఊళ్ళో ఒక బడి ఉంది
ఆ బడి చుట్టూ తోటుంది
ఆ బడిలో ఒకరున్నారు – ఆ
బడి పిల్లలకు మాష్టారు.

A school in our town,
Around it a garden,
One is there in the school,
He, pupils' teacher in the school.

గుళ్ళో తీరిక కాలక్షేపం
బళ్ళో చదువుల మనోవికాసం
గుళ్ళో రోజా అర్చనలు
బళ్ళో భావికి నిచ్చెనలు
గుడి కావాలా
బడి కావాలా ?
ఏం కావాలి మీకు ?

People spend time in the temple,
School to uplift the pupils
Services in the temple,
School providing future to pupils
Temple or school which one do you choose ?
Which one do you choose ?

కాలక్షేపం మాకొద్దు
ఒడలు మెదడులకు పనిముద్దు

We want time not to waste
For body and mind work is taste

కాలక్షేపం మాకొద్దు
ఒడలు మెదడులకు పనిముద్దు.

We want time not to waste
For body and mind work is taste.

మా ఊళ్లో ఒక గుడి వుంది
మా ఊళ్లో ఒక బడి వుంది
మా ఊళ్లో ఒక గుడి వుంది
మా ఊళ్లో ఒక బడి వుంది.

A temple in our town,
A school in our town;
A temple in our town;
A school in our town.

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| చుట్టూ | around | పంతులు | teacher (masc.) |
| తోట | garden | బోధన | teaching |
| ప్రాణం | life | భావి | future |
| బడి | school | నిచ్చెన | ladder |
| రోజూ | daily | ఆట | play, game |
| నైవేద్యం | offering | ఉజ్వల | bright |
| ఐకమత్యం | unity | బాట | path |
| ప్రతి | every | చదువు | education |
| తీరిక | leisure | మనోవికాసం | mental enlightenment |
| కాలక్షేపం | whiling away the time | అర్చన | worship (N) |
| పని | work | మెదడు | mind |
| పాట | song | ఒడలు | body |
| మాట | word | ముద్దు | pretty |
| వేడుక | mirth, merriment | | |

## EXERCISES

a. Fill up the blanks with ఉన్నది/ఉన్నాయి/ఉన్నాడు/ఉన్నావు/ఉన్నారు/ఉన్నాం/ఉన్నాను.

1. సుగుణ నిన్న సాయంత్రం ఇక్కడ......
2. మాష్టరుగారు క్లాసులో.........
3. ఆ గదిలో ఒక పిల్లి.........
4. నా దగ్గర పది రూపాయలు............
5. నువ్వు నిన్న అక్కడ.........
6. మేం హాస్టల్లో............

7. నిన్న సాయంత్రం ఆరుగంటలకు నేను కాలేజీలో............

8. మీరు ఇప్పుడు మైసూరులో............కదూ ?

9. రవి ఇక్కడ.........

10. వాళ్ళందరూ ఆటుమొన్నరాత్రి హాస్టల్లో........

11. మనం ఆ రోజు విజయవాడలో.........

b. Rewrite all the sentences of a. above using the negative forms of the verbs.

c. Fill up the blanks with కు or కి

1. ఇవ్వాళ మా............పాలు కావాలి.

2. ఇప్పుడు రవి.........టీ కావాలి.

3. ఆ పాప.........కాఫీ ఒద్దు.

4. ఈ అమ్మాయి.........ఎన్ని పుస్తకాలు కావాలి ?

d. Fill up the blanks with లేదు or లేవు.

1. ఈ సీసాలో మందు.........

2. ఈ హోటల్లో పాలు............

3. నా దగ్గర మంచినీళ్ళు............

4. మన యింట్లో టీ.........

e. Rewrite the following sentences using అలవాటు or అలవాటు లేదు without changing the meaning.

1. శర్మకు రోజూ కాఫీ కావాలి.

2. సుశీలకు రోజూ కాఫీ అక్కర్లేదు.

3. శారద తమ్ముడికి రోజూ పాలు అక్కర్లేదు.

4. అతనికి టీ కావాలి.

f. 1) Give the plurnal forms of :

| | |
|---|---|
| పగలు | పెసరట్టు |
| రాత్రి | బడి |
| మైలు | గుడి |

2) Identify the number of

| | |
|---|---|
| పాలు | పంచదార |
| టీ | మంచినీళ్ళు |

g. Fill up the blanks using తియ్యగా/చప్పగా/చేదుగా/వేడిగా

1. ఈ కాఫీలో పంచదార లేదు; .........ఉంది.

2. ఈ పాలలో పంచదారలేదు; .........ఉన్నాయి.

3. ఈ పాలు చల్లగా ఉన్నాయి ; .........లేవు.

4. ఈ పాలు చప్పగాఉన్నాయి ; .........లేవు.

**h. Fill up the blanks with కావాలి/అక్కర్లేదు.**

1. శర్మకు జ్వరం లేదు. మందు.........
2. సుబ్బారావుకు రెండేళ్లు. రైల్లో టిక్కెట్టు ...........
3. నాకు పాలు కాలు కావాలి; శర్మకు కూడా ...........
4. నా దగ్గర కలం లేదు. నీ కలం నాకు........

**i. Answer the following questions as shown in the model.**

**Model (i) :**

ఇప్పుడు క్లాసులో ఎవరున్నారు ?
ఇప్పుడు క్లాసులో ఎవరూ లేరు.

1. శర్మ దగ్గర ఏమున్నాయి ?
2. సుశీలకు ఏం కావాలి ?
3. మీ యింట్లో ఎవరున్నారు ?
4. నీకు ఏది కావాలి ? ఈ కలమా ? ఆ కలమా ?

**Model (ii) :**

నీకు పది రూపాయలు కావాలా ? (నాలుగు)
పది రూపాయలు అక్కర్లేదు, నాలుగు రూపాయలు చాలు.

1. శర్మకు రెండు కాయితాలు కావాలా ? (ఒక)
2. రఘుకు బోర్నవీటా కావాలా ? (టీ)
3. సుశీలకు కాఫీ, టిఫిను కావాలా ? (కాఫీ)

**j. Answer the following questions.**

1. మీ ఊరికి ఇక్కణ్ణించి ఎన్నిరోజుల ప్రయాణం ?
2. మీకు రోజూ రాత్రి పది గంటలకు కాఫీ అలవాటు ఉన్నదా ?
3. ఇప్పుడు మీరు ఏ ఊళ్లో ఉన్నారు ?

**k. Write the following numerals in Telugu words.**

| | |
|---|---|
| 796 | 382 |
| 304 | 176 |
| 987 | 104 |
| 1000 | 100 |

# UNIT 11

## Lesson 41

| | |
|---|---|
| శేషాద్రి : రండి రామారావుగారూ ! కూర్చోండి ! | Please come in Mr. Ramarao. Be seated ! |
| రామారావు : మీ ఇల్లు చాలా బాగున్నదండీ ! అద్దె ఎంత ? | Your house is very nice, Sir ! What is the rent ? |
| శేషాద్రి : అద్దె ఇల్లు కాదండీ ! సొంత ఇల్లే ! | This is not a rented house. It's my own house. |
| రామారావు : అందుకే ఇంత బాగున్నది. | That's why it is so nice. |
| శేషాద్రి : శారదా ! ఇలారా ! చూడు వీరు ఎవరో ! | Sarada ! Come here ! See who is here ! |
| శారద : ఓ ! రామారావుగారు కదూ ! నమస్కారమండీ ! ఇంట్లో అందరూ బాగున్నారా ? | Oh ! Mr. Ramarao ! *Namaskaram* ! Is everybody at home doing well ? |
| రామారావు : ఆ ! మీ పాప ఏది ? | Yes. Where is your child ? |

| | |
|---|---|
| శారద : గదిలో ఉన్నది. పాపా ఇలారా ! | **She is in the room. Papa ! Come here.** |
| శేషాద్రి : శారదా ! వారికి కాఫీ ఇవ్వు. | **Sarada ! Give him coffee.** |
| శారద : ముందీ బిస్కెట్లు తీసుకోండి. | **Please have these biscuits first.** |
| రామారావు : ఏం పాపా ! నీ పేరేమిటి ? | **Papa ! What's your name ?** |
| శేషాద్రి : మామయ్యగారికి నీ పేరు చెప్పు. | **Please tell uncle your name.** |
| పాప : లత. | **Latha.** |
| రామారావు : నువ్వు మంచి పాపవి. ఇక్కడికిరా ! ఈ చాక్లెట్టు తీసుకో ! నా దగ్గర కూర్చో ! | **You are a nice child. Come here. Take this chocolate and sit beside me.** |
| శేషాద్రి : వెళ్ళమ్మా ! మామయ్యగారి దగ్గరికి వెళ్ళు. | Go to uncle, dear. |
| రామారావు : లతా ! ఈ బొమ్మ చూడు. బాగున్నదా ? | Latha ! Look at this doll. Is it fine ? |
| పాప : చాలా బాగున్నది. ఇది ఎవరికి ? | It is very fine. For whom ? |
| రామారావు : నీకే ! తీసుకో. ఇదుగో ఈ బిస్కెట్టు కూడా నీకే, తిను. | It is for you ! Take it. This biscuit is also for you. Have it. |
| పాప : నాకు బిస్కెట్టు వద్దు. బొమ్మ కావాలి. బిస్కెట్టు మీరే తినండి ! | I want the doll, but not the biscuit. You please have the biscuit. |
| రామారావు : నీకు బిస్కెట్టు ఎందుకొద్దు ? | Why don't you have the biscuit ? |
| పాప : నాకు ఇప్పుడు ఆకలి లేదు, అందుకు. | I am not hungry now. |

## DRILLS

a. Build-up drill.

చెప్పు !
పేరు చెప్పు !
నీ పేరు చెప్పు !
మామయ్యగారికి నీ పేరు చెప్పు !

రా !
దగ్గరికి రా !
బల్ల దగ్గరికి రా !
నువ్వు ఈ బల్ల దగ్గరికి రా !

కూర్చోండి !

ఇక్కడ కూర్చోండి !

మీరు ఇక్కడ కూర్చోండి !

రండి

దగ్గరికి రండి.

కొంచెం దగ్గరికి రండి.




తిను !

నీకే, తిను !

బిస్కెట్టు నీకే, తిను !

ఈ బిస్కెట్టు నీకే, తిను !

ఇదిగో ఈ బిస్కెట్టు నీకే, తిను !

ఎవరో !

వీరు ఎవరో !

చూడు వీరు ఎవరో !

శారదా ! చూడు వీరు ఎవరో !

**b. Substitution drill.**

**Model (i) :**

ఇక్కడ కూర్చోండి.

అక్కడ

అక్కడ కూర్చోండి.

నా పక్కన

రవి దగ్గర

ఆ కుర్చీలో

**Model (ii) :**

ఈ బిస్కెట్టు తినండి.

చూడు

ఈ బిస్కెట్టు చూడండి.

తీసుకో

ఇవ్వు

c. **Interlocked substitution drill.**

**Model (i) :**

నువ్వు రవికి నీ పేరు చెప్పు.
మీరు..........................
మీరు రవికి మీ పేరు చెప్పండి.
......రఘు...............
మీరు రఘుకు మీ పేరు చెప్పండి.
...............మీ నాన్నగారి పేరు......
మీరు రఘుకు మీ నాన్నగారి పేరు చెప్పండి.

1. గోపీ : నువ్వు నాకు నీ పేరు చెప్పు.
శర్మగారూ : ....................
..................శారద భర్త పేరు....
...............అతను....................
సరళా :.........................
............... మీ తమ్ముడి పేరు....
.......... .... నేను................

**Model (ii) :**

నువ్వు నా పుస్తకం తీసుకో ।
చూడు
నువ్వు నా పుస్తకం చూడు ।
మీరు
మీరు నా పుస్తకం చూడండి ।
మీరు
మీరు నా పుస్తకం చూడండి ।
బొమ్మ
మీరు నా బొమ్మ చూడండి ।

1. నువ్వు ఇడ్లీ తిను ।
మీరు.. ...........
.......పూరీలు.......
........... చూడు
నువ్వు...............
......... తీసుకో
మీరు..................
........... ఇవ్వు
.......మంచి నీళ్ళు....
నువ్వు...... ...........

2. నువ్వు ఇవ్వాళ కాఫీ తీసుకో ।
మీరు..............................
........రేపు.........................
................పుస్తకం...........
.........................ఇవ్వు.
నువ్వు..............................

...............బిస్కెట్లు...........
మీరు..............................
..................................తిను
నువ్వు.........................
............పెసరట్టు..........
.........................చూడు

**d. Response drill.**

**Model (i) :**

రవి పుస్తకం ఎక్కడున్నది ?
శర్మ : చూడు, రవి పుస్తకం ఎక్కడున్నదో !

1. అతని గడియారం ఎక్కడున్నది ?
2. మన ఇంట్లో ఎవరున్నారు ?
3. రవి ఎక్కడున్నాడు ?

**Model (ii) :**

రవీ : చూడు వీరు ఎవరో ! (మామయ్యగారు)
ఓ ! వీరు మామయ్యగారు కదూ !

1. కమలా : చూడు, ఈ పుస్తకం ఎవరిదో ! (రవిది)
2. సరళా : చూడు, ఈ ఇల్లు ఎంత బాగున్నదో ! (మీది)
3. గోపీ : చూడు, ఆ పుస్తకం ఏమిటో ! (తెలుగు)

**Model (iii) :**

చూడండి. ఈ గడియారం ఎంత బాగున్నదో ! (కొత్త)
ఇది కొత్త గడియారం కదూ ! అందుకే అంత బాగున్నది.

1. చూడండి, ఈ ఇల్లు ఎంత బాగున్నదో ! (సొంత)
2. చూడండి, ఈ సంచీ ఎంత బాగున్నదో ! (రవి సంచీ)
3. చూడండి, ఈ పువ్వు ఎంత బాగున్నదో ! (గులాబీ)

**e. Transformation drill.**

**Model (i) :**

నువ్వు రేపు మా ఇంటికి రా.
మీరు రేపు మా ఇంటికి రాండి.

1. నువ్వు ఇప్పుడు ఇడ్లీ తిను.
2. నువ్వు పది గంటలకు ఈ గదికి రా.
3. రవికి నీ పేరు చెప్పు.
5. నువ్వు నా పుస్తకం తీసుకో.

**Model (ii) :**

లతగారూ ! మీరు ఈ పుస్తకం చూడండి.
లతా ! నువ్వు ఈ పుస్తకం చూడు.

1. సరళగారూ ! మీరు ఈ గదిలో కూర్చోండి.
3. శ్యామలగారూ ! మీరు ఐదు గంటలకు ఈ బస్సులో మీ ఇంటికి వెళ్ళండి.
4. శర్మగారూ నాకు మీ కొత్త సంచీ ఇవ్వండి.

## EXERCISES

a. Change the following sentences as shown in the model :

Model (i) :

ఈ పుస్తకం ఎక్కడున్నది ?

అ. చూడు, ఈ పుస్తకం ఎక్కడున్నదో !

ఆ. చూడండి, ఈ పుస్తకం ఎక్కడున్నదో !

1. నా కొత్త గడియారం ఎవరి దగ్గరున్నది ?
2. రవి గదిలో ఎవరున్నారు ?
3. మాష్టరుగారు ఎక్కడున్నారు ?
4. ఆయన ఎవరు ?

Model (ii) :

చూడు, ఈ ఇల్లు ఎంత బాగున్నదో ! (సొంత)

ఇది సొంత ఇల్లు కదా ! అందుకే ఇంత బాగున్నది.

1. చూడు ఈ పుస్తకం ఎంత బాగున్నదో ! (కొత్త)
2. చూడు, ఈ బస్సు ఎంత బాగున్నదో (ఎక్స్‌ప్రెస్)
3. చూడు ఈ సినిమా ఎంత బాగున్నదో ! (పాత)

b. Change the honorific forms into non-honorific and non-honorific into honorific in the following sentences :

1. రవీ ! రేపు నువ్వు మా ఇంటికి రా.
2. సరళగారూ ! మీరు ఆ కుర్చీలో కూర్చోండి.
3. రతిరామ్‌గారూ ! మీరు ఆ పూరీ తినండి.
4. శర్మగారూ ! మీరు ఇవ్వాళ తెలుగు సినిమాకు వెళ్ళండి.
5. కమలా ! నువ్వు కొత్త గడియారం తీస్కో.
6. శారదా ! చూడు అక్కడ ఎవరున్నారో !

c. Fill up the blanks with లో or కి/కు.

1. మీరు ఈ కుర్చీ.........కూర్చోండి !
2. నువ్వు రేపు కాలేజీ.........రా !
3. కమలా ! నువ్వు ఆరు గంటలకు బస్‌స్టాండ్ దగ్గరి.........వెళ్ళు.
4. సుశీలా ! రవి...........నీ కొత్త గడియారం ఇవ్వు.
2. ఏమండీ ! మాష్టరుగారి..........మీ పేరు చెప్పండి.

d. **Produce atleast 16 sentences from the following table taking one word from each column.**

| | | | | | |
|---|---|---|---|---|---|
| నువ్వు<br>మీరు | రవికి<br>కమలకు | ఇప్పుడు<br>రేపు | నీ<br>మీ | పేరు<br>పుస్తకం<br>సంచీ | చెప్పు<br>చెప్పండి<br>ఇవ్వు<br>ఇవ్వండి |

e. **Match the following.**

| A | B | |
|---|---|---|
| 1. రవీ : మీ పుస్తకం | తిను | (   ) |
| 2. గోపీ : రేపు మా ఇంటికి | వెళ్లండి | (   ) |
| 3. కమలా : ఈ కుర్చీలో | ఇవ్వండి | (   ) |
| 4. సరళా : నువ్వీ పెసరట్టు | కూర్చో | (   ) |
| 5. ఏమండీ : మీరిప్పుడు ఆఫీసుకు | రా | (   ) |
| 6. రవిగారూ : మీరీ పుస్తకం కమలకు | తీస్కోండి | (   ) |
| 7. పాపా : మీ అన్నయ్య పేరు | చెప్పు | (   ) |

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| రా | come | తీసుకో/తీస్కో | take |
| కూర్చో | sit | మామయ్య | maternal uncle |
| అద్దె | rent | చెప్పు | say |
| అందుకు | that's why | చాక్లెట్టు | chocolate |
| ఇలా | in this why/manner | వెళ్లు | go |
| చూడు | see | తిను | eat |
| ఇవ్వు | give | ఆకలి | hunger |
| బిస్కెట్టు | biscuit | కొంచెం | a little |

## GRAMMAR NOTES

41.1. In this lesson the imperative forms of the verb are introduced.

Most of the verbal bases introduced in this course can be used as imperative forms in non-honorific singular without any change.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రా | 'Come !' | వెళ్ళు | 'Go !' | తీసుకో | 'Take !' |

There are, however, some bases which will be slightly modified when used in imparative. When such bases occur, an explanation will be given regarding the modifications in the grammar notes (67.2, 68.2).

41.2. Telugu verbal bases, as introduced in this course, can end in both a consonant (Lessons 67, 68) and a vowel. The final vowel can be a short vowel or a long vowel. The final short vowel will always be ఉ. There are also a few ఇ ending bases and one అ ending base; nemely పద (lesson 46). This is a type of defective verb and it occurs in imperative only.

In the case of the ఇ ending bases, the final ఇ can be predicted by the presence of a consonant చ in the final syllable. In other words, if there is a consonant చ in the final syllable, the final vowel will be ఇ. In all other cases of short vowel ending bases, the final vowel will be ఉ.

In the case of long vowel ending bases, the final vowel will be ఆ or ఏ or ఓ.

41.3. In this lesson the following verbal bases are introduced :

| | | | |
|---|---|---|---|
| రా | 'come' | తీసుకురా | 'take' |
| కూర్చో | 'sit' | చెప్పు | 'tell' |
| చూడు | 'see' | వెళ్ళు | 'go' |
| ఇవ్వు | 'give' | తిను | 'eat' |

41.4. All the bases mentioned in 41.3. can be used in imperative non-honorific singular without any change.

| | | | |
|---|---|---|---|
| రా ! | 'Come !' | తిను ! | 'Eat !' |

**41.5.** -అండి is added to the base to form imperative honorific singular and imperative plural.

తిను + అండి → తినండి 'Eat ! (hon. sg. & plural.)

*tinu + aṇḍi → tinaṇḍi*

**41.6.** The final short vowel of verbal bases or verbal derivatives is dropped when followed by a suffix beginning with a vowel.

తిను + అండి → తినండి 'Please eat !'

*tinu + aṇḍi → tinaṇḍi*

వెళ్ళు + అండి → వెళ్ళండి 'Please go !'

*vellu + aṇḍi → vellaṇḍi*

**41.7.** A suffix beginning with అ looses the initial vowel when it follows a base ending in a long vowel.

కూర్చో + అండి → కూర్చోండి 'Please sit !'

*kuurcoo + andi → kuurcoo-ṇḍi*

తీసుకో + అండి → తీసుకోండి 'Please take !'

*tiisukoo + aṇḍi → tiisukoo-ṇḍi*

**41.8.** When అండి follows a mono-syllabic base the long vowel of the base will optionally become short.

రా + అండి → రండి/రాండి 'Please come! '

*raa + aṇḍi → raṇḍi / raaṇḍi*

**41.9.** Recall the sentences of 32.2. :

ఎక్కడున్నదో । 'It is not known where it is.'

అతను ఎవరో । 'It is not known who he is.'

These are similar to the following sentences in the use of the dubitative marker -ఓ.

అది ఏమిటో । 'It is not known what it is.'

అతను ఎవరో । 'It is not known who he is.'

The dubitative marker -ఓ is also used in the sentences like :

చూడు అదేమిటో ।
అదేమిటో చూడు । } 'See what it is !

చూడు అతనెవరో । 'See who he is !'
అతనెవరో చూడు ।

Here the dubitative marker –ఓ is functioning as a conjunction and it conjoins two sentences like :

(1) చూడు and (2) అదేమిటి or అతనెవరు

(For want of a better term, we use the term 'dubitative marker' to refer to the suffix –ఓ in sentences given here. The function of –ఓ here is something more than what the label 'dubitative marker' indicates.)

The dubitative marker –ఓ, when used as a conjuctive particle, is added to the constituent sentence which contains the interrogation.

The other constituent sentence always contains a verb which means 'find out' or 'say' or 'see' or 'know' or the like, that is, a verb indicating 'inference'. Therefore, we can also have a sentence like :

| | |
|---|---|
| ఆయన ఎవరో చెప్పు. | 'Tell who he is.' |
| ఆయన ఎవరు+ఓ చెప్పు | |

41.10. ఇలా 'this way', 'like this' is a manner adverb. But when used with the verbs రా 'come' ఇవ్వు 'give' etc., it adds some locative shade of meaning to the verb.

| | |
|---|---|
| ఇలా రా । | 'Come here!', 'Come this way!' 'Come on!' |
| ఇలా చూడు । | 'Look here!', 'Look at this point!' |
| ఇలా ఇవ్వు । | 'Give it to me !', 'Give it here!' |

etc.

41.11. Notice the use of the dative case suffix in this lesson.

41.11.1. For the motion verbs like రా 'come', and వెళ్ళు 'go', the destinaton noun will be in dative case. (Also see 39.2.)

| | |
|---|---|
| స్కూలుకు వెళ్ళు । | 'Go to the school.' |
| ఇంటికి రా । | 'Come home.' |

41.11.2. When the destination noun is other than a noun of location like house, school, garden, office etc., the dative case suffix is added along with the locative noun దగ్గర (oblique base దగ్గిరి 16.6).

| | |
|---|---|
| శర్మ దగ్గిరికి వెళ్ళు । | 'Go to Sarma.' |
| నా దగ్గిరికి రా । | 'Come to me.' |
| ఆ చెట్టు దగ్గిరికి వెళ్ళు । | 'Go to that tree.' |

When the destination noun is a noun of location it can be used with or without దగ్గర. When used with దగ్గర, it gives the meaning of 'near that object'.

| | |
|---|---|
| స్కూలు దగ్గరికి వెళ్ళు. | 'Go to the place where the school is situated'. |
| స్కూలుకు వెళ్ళు. | 'Go to the school'. |

41.11.3. For the verbs like ఇవ్వు 'give' and చెప్పు 'tell', the noun denoting 'recipient' will be in dativc case (benefactive relationship, 26.1.)

| | |
|---|---|
| ఆయనకు కాఫీ ఇవ్వు. | 'Give him coffee.' |
| ఆయనకు నీ పేరు చెప్పు. | 'Tell him your name.' |

41.11.4. Dative case expresses benefactive relationship (26.1.) in the sentences like

| | |
|---|---|
| ఈ పుస్తకం శర్మకు. | 'This book is for Sarma.' |
| ఆ కాఫీ నాకు. | 'This coffee is for me.' |

41.11.5. Recall the function of the dative case suffix in the expression of feelings, desires, habits and experiences as mentioned in 38.6. In the following sentence also, the function of the dative case is the same.

| | |
|---|---|
| నాకు ఆకలి లేదు. | 'I am not hungry.' |

# UNIT 11

## Lesson 42

| | |
|---|---|
| రావు : రండి శర్మగారూ ! కూర్చోండి. | Come in Mr. Sarma. Take your seat. |
| కమల : లక్ష్మీ ! ఆ ఫాను య్య. లైటు గూడా వెయ్యి. కిటికీ తలుపులు తియ్యి. | Lakshmi! Put on the fan. Put on the light also. Open the windows. |
| శర్మ : ఫాను వెయ్యకు. చలిగా ఉంది. కిటికీ గూడా అక్కర్లేదు ముయ్యి | Don't put on the fan. It is cold. You need not open the windows also; close them. |
| కమల : కిటికీ తలుపులు గట్టిగా వెయ్యకు; మెల్లగా వెయ్యి. కాఫీ తీసుకోండి ! | Don't shut the windows so harsh. Shut them gently. Please take this coffee. |
| శర్మ : నాకు ఇంత కాఫీ అక్కర్లేదు. కొంచెం తియ్యండి. పంచదార కొంచెం కావాలి. అంత వెయ్యకండి, కొంచెం చాలు. | I don't want this much coffee. Please take out a little. I want some sugar. Please don't put that much. A little is enough. |

| | |
|---|---|
| రావు : మీ రవి అడ్రసు చెప్పండి. కమలా ! ఈ డైరీలో రవి అడ్రసు రాయి. చెప్పండి శర్మగారూ ! | Please give me your Ravi's address. Kamala! Write down Ravi's address in this diary. Please tell the address, Mr. Sarma! |
| శర్మ : 28, పోలీసు స్టేషను వీధి, కొత్తపేట, గుంటూరు. | 28, Police Station Street, Kottapeta, Guntur. |
| రావు : కమలా ! ఆ అడ్రసుకింద ఒక గీతగియ్యి ! లక్ష్మీ ! ఇక్కణ్ణుంచి కాఫీ కప్పు తియ్యి ! ఆ బల్లమీద పెట్టు ! | Kamala! Please underline that address. Lakshmi ! Take away this coffee cup. Keep it on that table. |
| కమల : లక్ష్మీ ! ఎక్కడున్నావు? తొందరగా రా ! ఇప్పుడు పూలు కొయ్యకు. ముందు గులాబీ మొక్కలకు నీళ్లు పొయ్యి. తర్వాత పూలు కొయ్యి. | Lakshmi ! Where are you ? Come quickly. Don't pluck the flowers now. Water that rose plants first. After that, you can pluck the flowers. |
| శర్మ : ఆరున్నరకు నాటకం ఉంది కదా ! బయల్దేరండి ! | You know there is a play at 6.30. Let's start. |
| రావు : తొందర ఎందుకు ? ఇప్పుడు ఐదున్నరే ! కమలా ! నువ్వుగూడా బయల్దేరు ! | Why, such a hurry? It's only 5.30 now. Kamala! You also start. |

## DRILLS

**a. Build-up drill.**

| | |
|---|---|
| రాయి ! | చెప్పండి ! |
| అడ్రసురాయి ! | అడ్రసు చెప్పండి ! |
| రమ అడ్రసు రాయి ! | నాన్నగారి అడ్రసు చెప్పండి ! |
| పుస్తకంలో రమ అడ్రసు రాయి ! | రవి నాన్నగారి అడ్రసు చెప్పండి ! |
| ఆ పుస్తకంలో రమ అడ్రసు రాయి ! | |

తియ్యి !
ఏముందో తియ్యి !
జేబులో ఏముందో తియ్యి !

గియ్యి !
గీతలు గియ్యి !
రెండు గీతలు గియ్యి !
కింద రెండు గీతలు గియ్యి !
బొమ్మ కింద రెండు గీతలు గియ్యి !
ఈ బొమ్మ కింద రెండు గీతలు గియ్యి !

వెయ్యకండి
గట్టిగా వెయ్యకండి
తలుపులు గట్టిగా వెయ్యకండి
కిటికీ తలుపులు గట్టిగా వెయ్యకండి.
ఆ కిటికీ తలుపులు గట్టిగా వెయ్యకండి.

కదా !
ఉంది కదా !
నాటకం ఉంది కదా !
ఐదున్నరకు నాటకం ఉంది కదా !
సాయంత్రం ఐదున్నరకు నాటకం ఉంది కదా !
ఇవ్వాళ సాయంత్రం ఐదున్నరకు నాటకం
ఉంది కదా !




b. Substitution drill.

Model (i) :

తొందరగా రాకు. (కూర్చో)
తొందరగా కూర్చోకు.

1. రవీ ! నువ్వు ఈ పుస్తకం ఇవ్వకు. (తీసుకో)
2. గిరిజా ! నువ్వు కిటికీ ముయ్యకు. (తియ్యి)
3. గోపీ ! నువ్వు లైటు చూడకు. (వెయ్యి)
4. శర్మా ! నువ్వు తొందరగా వెళ్ళకు. (బయల్దేరు)

Model (ii) :

మెల్లగా వెళ్ళకండి.
తియ్యి
మెల్లగా తియ్యకండి.
తిను
రా
తీసుకో
రాయి
పొయ్యి

**Model (iii) :**

ఇంత పంచదార అక్కర్లేదు ; కొంచెం తియ్యండి.

టీ

బోర్నవీటా

ఉప్మా

కాఫీ

**Model (iv) :**

ఈ పుస్తకం కుర్చీ దగ్గర పెట్టు.

పక్కన

ఈ పుస్తకం కుర్చీ పక్కన పెట్టు.

లో

మీద

కింద

**c. Response drill.**

**Model (i) :**

బల్లమీద ఏమున్నది ? (పుస్తకం)

బల్లమీద పుస్తకం ఉన్నది.

1. ఈ బల్లకింద ఏమున్నది ? (కలం)
2. ఈ పుస్తకం మీద ఏమున్నది ? (కాయితం)
3. ఆ చెట్టుమీద ఎవరున్నారు ? (సుబ్బారావు)
4. ఈ చెట్టు కింద ఎవరున్నారు ? (గిరిజ)

**Model (ii) :**

సరళ ఏది ? (ఆగదిలో)

సరళ ఆగదిలో వున్నది గదా !

1. నా పుస్తకం ఎక్కడున్నది ? (సంచీలో)
2. శర్మ ఎక్కడున్నాడు ? (గుంటూరులో)
3. పిల్లలు ఎక్కడున్నారు ? (ఇక్కడే)
4. సరళ గడియారం ఎక్కడున్నది ? (పుస్తకం కింద)
5. అతని కలం ఎక్కడున్నది ? (బల్లమీద)

**d. Transformation drill.**

**Model (i) :**

రవీ : తొందరగా తలుపు వెయ్యి

రవీ : తొందరగా తలుపు వెయ్యక.

1. సరళా : ఫాను వెయ్యి.
2. గోపీ : ఆ పుస్తకం అక్కడ పెట్టు.
3. రేపు సాయంత్రం ఆరు గంటలకు మా ఇంటికి రా.
4. నువ్వు ఈ కలం తీసుకో.

**Model (ii) :**

మీరు ఆ కుర్చీలో కూర్చోండి.

మీరు ఆ కుర్చీలో కూర్చోకండి.

1. రంగారూ, మీరా పుస్తకం తీసుకోండి.
2. ఏమండీ, మీరు తొందరగా మా ఇంటికి రండి
3. తొందరగా మొక్కలకు నీళ్లు పొయ్యండి.

**Model (iii) :**

రవిగారూ : మీ మీరిటు చూడకండి.
రవీ : నువ్విటు చూడు.

1. సుగుణా : మీరు మా ఇంటికి రాకండి.
2. సరళగారూ : ఇప్పుడు మీరు లైటు వెయ్యకండి.
3. గిరిజా : మీరీ పుస్తకం అక్కడ పెట్టకండి.

## EXERCISES

a. **Fill up the blanks with the correct forms of the verbs given in the parentheses.**

1. సుగుణ : ఈ గది వేడిగా ఉన్నది.
   కమల : అయితే మీరు ఫాను......(వెయ్యి)
2. సరోజ : నాకు నీ పుస్తకం కావాలి.
   విమల : అదుగో అక్కడున్నది.
   నువ్వు......(తీస్కో)
3. శర్మ : అక్కడ ఒక పులి ఉన్నది.
   గోపి : అయితే మీరు అక్కడికి......(వెళ్లు)
4. రమ : ఈ గదిలో చలిగా ఉన్నది.
   ఉమ : ఆ కిటికీ తలుపులు......(తియ్యి)
5. మోహన్ : ఇక్కడ రామారావు ఉన్నాడు రవి అక్కడ్లేదు.
   జాన్ : అయితే రవిగారూ మీరు ఇక్కడికి
   ......(రా)
6. కమల : ఆ కుర్చీ బాగా లేదు.
   విమల : అయితే నువ్వు ఆ కుర్చీలో
   ......(కూర్చో)

b. **Answer the following questions using the cue words given in the parentheses.**

1. ఈ బల్ల మీద ఏమున్నది ? (రాముడి చొక్కా)
2. ఆ పెట్టెలో ఏమున్నది ? (రవి పుస్తకాలు)
3. ఈ చెట్టు మీద ఎవరున్నారు ? (పిల్లలు)
4. ఏనుగుమీద ఎవరున్నారు ? (రవి)
5. ఈ బల్ల కింద ఏమున్నది ? (పిల్లి)

c. **Rewrite the following sentences as directed.**

1. మీరు తొందరగా ఇంటికి వెళ్లండి. **(negative)**
2. రవికి ఈ పుస్తకం ఇవ్వు. (honorific)
3. మీరు ఫాను వెయ్యండి. **(negative)**
4. కమలా : ఈ పుస్తకం అక్కడ పెట్టు. **(negative)**
5. సరళా : ఆ పుస్తకం తీస్కో. **(negative)**
6. పూలు కొయ్యకు. **(honorific)**
7. రేపు మా ఇంటికి రా. **(negative honorific)**
8. ఈ గదిలో కూర్చోకండి. **(affirmative)**

**d. Match the following.**

| A | B | |
|---|---|---|
| 1. మీరు కిటికీ | కొయ్యి | ( ) |
| 2. నువ్వు ఆ ఫాను | వెయ్యి | ( ) |
| 3. ఈ కప్పులో నీళ్ళు | పెట్టు | ( ) |
| 4. గులాబీ పువ్వు | ముయ్యండి | ( ) |
| 5. ఆ పుస్తకం ఇక్కడ | పొయ్యి | ( ) |

## VOCABULARY

| | |
|---|---|
| ఫాను | fan |
| వెయ్యి | put on, put |
| లైటు | light (N) |
| తియ్యి | put off, take out, open (v) |
| చలి | cold, chill |
| ఉంది | (see ఉన్నది) |
| ముయ్యి | shut, close (v) |
| గట్టి | hard, harsh |
| మెల్లగా | gently, slowly |
| అడ్రసు | address |
| డైరీ | diary |
| రాయి | write |
| పేజీ | page |
| అట్ట | cover page, card board |
| మీద | on, upon |
| పోలీసు స్టేషను | Police Station |
| వీధి | street |
| పేట | zone or part in a town |
| కింద | below |
| గీత | line |
| గియ్యి | draw a line |
| సరే | all right |
| కప్పు | cup |
| పెట్టు | put, place (v) |
| తొందర | quickness |
| కొయ్యి | cut, pluck |
| మొక్క | plant |
| పొయ్యి | pour (v) |
| కదా ! | is it not |
| బయల్దేరు | start [move on] |

## GRAMMAR NOTES

42.1. In this lesson some ఇ ending bases are introduced. Notice the presence of a consonant య్ in the final syllable of the bases. (41 2.)

| | | |
|---|---|---|
| పొయ్యి | *poyyi* | 'pour' |
| తియ్యి | *tiyyi* | 'take off' etc. |

42.2. Negative imperative is also introduced in this lesson -అకు is added to the verbal base to form non-honorific negative imperative and -అకండి for its corresponding honorific singular/plural forms.

వెళ్ళు + అకు → వెళ్ళకు 'Don't go.' (non-hon. sg.) (41.6.)

వెళ్ళు + అకండి → వెళ్ళకండి 'Please don't go.' (hon. sg./pl.) (41.6.)

42.3. The adverbs చలిగా, గట్టిగా and తొందరగా derived respectively from చలి 'cold' (abstract noun), గట్టి 'harsh, strong' (adjective) and తొందర 'quickness' (abstract noun) are used in this lesson. (37.6.).

42.4. ఉన్నది is usually pronounced as ఉంది. In writing both are used.

42.5. మీద 'on, upon' and కింద 'under, below' are postpositions (16.6.) used in locative case. (They can also be used as plece adverbs.)

42.6. Notice the use of the dative case suffix in the following sentence.

మొక్కకు నీళ్ళు పొయ్యి 'Water the plant.'

Here మొక్క 'plant' is the recipient and therefore *it is* benefective relationship. (26.1.)

42.7. Notice the use of కదా.

Also recall the use of కదూ (24.3.) in lessons 24, 28, 31, 36 and 41.

When both the speaker and the listener know the information, కదా is used by the speaker to bring the matter to the notice of the listener. కదూ is used if the speaker's knowledge about the information is not certain and the listener's knowledge, according to the speaker, is definite and the speaker wants confirmation from the listener.

42.8. The emphatic marker -ఏ (6.4.), when added to a word, expresses a stress on *that* word which may be equated with 'only'.

| | |
|---|---|
| ఇప్పుడు ఐదున్నర. | 'Now it is 5.30.' |
| ఇప్పుడు అయిదున్నరే । | 'Now, it is *6.30* only.' |
| శర్మ అక్కడున్నాడు. | 'Sarma is there.' |
| శర్మే అక్కడున్నాడు. | '*Sarma* only is there.' |
| శర్మ అక్కడే ఉన్నాడు. | 'Sarma is *there* only.' |

# UNIT 11

## Lesson 43

| | |
|---|---|
| శర్మ : ఏం జనతాసింగ్ ! ఏమిటా నవల ? | Hello ! Janatha Singh ! What is that novel ? |
| మెహకార్‌సింగ్ : మెస్సులోగూడా పుస్తకమేనా ? పుస్తకాలు నీ గదిలో చదువు. మెస్సులో చదవకు. | You read books in mess too ? You can read books in your room but not in the mess. |
| శర్మ : నారాయణా ! ఈ కంచం బాగాలేదు. మళ్ళీ కడుగు. | Narayana ! This plate is not clean. Wash it again. |
| నారాయణ : మీరు కొంచెం పక్కకు జరగండి. ఆ కంచం బాగానే ఉంది. అక్కడ కూర్చోండి. | Please move a little further. That plate is clean. Please sit there. |
| శర్మ : రతిరామ్ ! నువ్వు కొంచెం జరుగు. | Ratiram ! Please move a little further. |
| రతిరామ్ : ఏమిటి నారాయణా ! నాకు మూడు చపాతీలేనా ? | What Narayana ! Only three chapathies for me ? |

నారా : ఇవ్వాళ చపాతీలు కొంచెమే ఉన్నాయండీ.

Today we have only few chapathies, sir.

రతి : అదినాకు అనవసరం. నాకు మూడు చపాతీలు చాలవు. పది చపాతీలు కావల్సిందే; తీసుకురా !

I'm not concerned with that. I need ten chapathies. You get them.

నారా : అయితే మెస్సు సెక్రెటరీని అడగండి.

Then you contact the mess secretary.

రతి : చూడు మెహకార్ సింగ్ ! రోజూ ఇదే గొడవ. నీకు మూడు చపాతీలు చాలా ?

Look here, Mehakar Singh ! It is the same problem every day. Will three chapathies be sufficient for you ?

మెహ : నన్ను ఏమీ అడగకు. అదుగో సెక్రెటరీ. ఆయనను అడుగు.

Don't ask me anything. There is the secretary. Ask him.

నందకుమార్ : రతిరామ్ ! గొడవ చెయ్యకు ఊర్కో !

Ratiram ! Don't create furore. Be quiet.

శర్మ : రతిరామ్ ! ఒకపని చెయ్యి. నా చపాతీలు తీసుకో !

Ratiram ! Do one thing. You take my chapathies.

రతి : నీ చపాతీలు ఒకటి గూడా నాకు అక్కర్లేదు.

I don't need any of your chapathies.

శర్మ : అయితే పో, సెక్రెటరీనే అడుగు.

Then, go and ask the secretary only.

రతి : ఆ ! నారాయణా ! మూడు చపాతీలు అయితే నాకు అక్కర్లేదు. తీసుకుపో. నాకు కనీసం పది చపాతీలు కావాల్సిందే.

O.K. ! Narayana ! I do't want if it is olny three chapathies. Take them away. I need a minimum of ten chapathies.

## DRILLS

a. Repetition drill.

నువ్వు కాలేజీకిపో.

మీరు కాలేజీకి పోండి.

మీరు హాస్టలుకు పోకండి.

నువ్వు హాస్టలుకు పోకు.

నాకు నాలుగు చపాతీలు తీసుకురా !

మీ ఇంటినించి నాలుగు పుస్తకాలు తీసుకురాండి.

హాస్టలునుంచి కాఫీ తీసుకురాకు.

మెస్సునించి చపాతీలు తీసుకురాకండి.

గొడవ చెయ్యకు ఊర్కో.
గొడవ చెయ్యకండి. ఊర్కోండి.
ఈ పని చెయ్యి. ఊర్కోకు.
ఆ పని చెయ్యండి. ఊర్కోకండి.

మెస్సులో గూడా పుస్తకాలేనా ?
ఇంట్లో గూడా ఆఫీసు పనేనా ?
నాకు రోజుకు కనీసం ఆరు రూపాయలు కావాల్సిందే.
నాకు పది గంటలకు కాఫీ కావాల్సిందే.

**b. Build-up drill.**

చదువు
పుస్తకం చదువు.
తెలుగు పుస్తకం చదువు.
గదిలో తెలుగు పుస్తకం చదువు.
నీ గదిలో తెలుగు పుస్తకం చదువు.
నువ్వు నీ గదిలో తెలుగు పుస్తకం చదువు.

జరగకు.
పక్కకు జరగకు.
ఆ పక్కకు జరగకు.
నువ్వు ఆ పక్కకు జరగకు.

అక్కర్లేదు.
ఒకటి గూడా అక్కర్లేదు.
పుస్తకం ఒకటిగూడా అక్కర్లేదు.
అతని పుస్తకం ఒకటిగూడా అక్కర్లేదు.
నాకు అతని పుస్తకం ఒకటిగూడా అక్కర్లేదు.

అడగకండి.
పుస్తకం అడగకండి.
రవిని పుస్తకం అడగకండి.
ఆయననూ, రవినీ పుస్తకం అడగకండి.
ఇప్పుడు ఆయననూ, రవినీ పుస్తకం అడగకండి.
మీరు ఇప్పుడు ఆయననూ, రవినీ పుస్తకం అడగకండి.

కావాల్సిందే.
రూపాయలు కావాల్సిందే.
పంద రూపాయలు కావాల్సిందే.
కనీసం పంద రూపాయలు కావాల్సిందే.
నెలకు కనీసం పంద రూపాయలు కావాల్సిందే.
నాకు నెలకు కనీసం పంద రూపాయలు కావాల్సిందే

**c. Substitution drill.**

Model (i) :

నువ్వు తొందరగా నా పుస్తకం చదువు. (మీరు)
మీరు తొందరగా నా పుస్తకం చదవండి.

1. నువ్వు తొందరగా ఈ గది కడుగు. (మీరు)
2. నువ్వు కొంచెం పక్కకు జరుగు. (మీరు)
3. నువ్వు నా పుస్తకం తీసుకురా ! (మీరు)
4. నువ్వు ఊర్కో. (మీరు)

**Model (ii) :**

తెలుగు పుస్తకాలు చదువు. (చూడు)

తెలుగు పుస్తకాలు చూడు.

1. ఇంగ్లీషు పుస్తకాలు తీసుకోకు. (చదువు)
2. రవిని చూడకండి (అడుగు)
3. నాలుగు చపాతీలు తినండి. (తీసుకురా)
4. ఆ కంచం తీసుకు రాకండి. (కడుగు)

**Model (iii) :**

నాకు రోజుకు పది చపాతీలు కావాల్సిందే.

నెల

నాకు నెలకు పది చపాతీలు కావాల్సిందే.

గంట

రెండు గంటలు

రెండు రోజులు

**d. Interlocked substitution drill.**

**Model (i) :**

నాకు పది చపాతీలు ఇవ్వు

తీసుకురా

నాకు పది చపాతీలు తీసుకురా

పూరీ

నాకు పది పూరీలు తీసుకురా

రవి

రవికి పది పూరీలు తీసుకురా

తీసుకుపో

రవికి పది పూరీలు తీసుకుపో

1. గోపాలరావుగారికి నాలుగు చపాతీలు కావాలి.

............................ఇవ్వు

రవి..............................

.........................కావాల్సిందే

..................పుస్తకాలు.........

.............. ...................తీసుకుపో

నేను..............................

2. నువ్వు ఈ పుస్తకం చదువు.

మీరు..........................

......................తీసుకురాకు

...........కంచం....................

......................కడుగు

......................తీసుకుపో

**e. Response drill.**

**Model (i) :**

నీకు రోజుకు ఎన్ని చపాతీలు కావాలి ?

(ఎనిమిది)

నాకు కనీసం రోజుకు ఎనిమిది చపాతీలు కావాల్సిందే.

1. నీకు నెలకు ఎన్ని రూపాయలు కావాలి ? (వంద)
2. నీకు గంటకు ఎన్ని ఇడ్లీలు కావాలి ? (రెండు)
3. నీకు రోజుకు ఎన్ని కాయితాలు కావాలి ? (నలభైఎనిమిది)

Model (ii):

నీకు రెండు చపాతీలు చాలా ?

నాకు రెండు చపాతీలు అయితే అక్కర్లేదు తీసుకుపో !

1. నీకు మూడు పుస్తకాలు చాలా ?
2. నీకు నాలుగు బొమ్మలు చాలా ?
3. రవికి పది రూపాయలు చాలా ?

Model (iii):

నీకు నా పుస్తకాలు కావాలా ?

నాకు నీ పుస్తకం ఒకటిగూడా అక్కర్లేదు.

1. శర్మకు సరళ పుస్తకాలు కావాలా ?
2. మీకు మా బొమ్మలు కావాలా ?
3. మనకు వాళ్ల కలాలు కావాలా ?

**f. Transformation drill.**

Model (i):

నాకు ఆరు చపాతీలు కావాలి.

(a) నాకు ఆరు చపాతీలు కావాల్సిందే.

(b) నాకు కనీసం ఆరు చపాతీలు కావాల్సిందే.

1. నాకు మూడు పుస్తకాలు కావాలి.
2. రవికి ఇరవై రూపాయలు కావాలి.
3. నీకు నెలకు వంద రూపాయలు కావాలి.

Model (iii):

ఈ చపాతీలు తీసుకుపోండి.

ఈ చపాతీలు తీసుకుపోకండి.

1. మీరు గంటకు రెండు పుస్తకాలు చదవండి.
2. మీరు ఈ పని చెయ్యండి.
3. మీరు రవిని అడగండి.

Model (ii):

రవికి రెండు చపాతీలు తీసుకురా !

రవికి రెండు చపాతీలు తీసుకురాకు.

1. నువ్వు ఈ కంచం కడుగు.
2. నువ్వు కొంచెం పక్కకు జరుగు.
3. నువ్వు ఊర్కో.

Model (iv):

ఇవి పుస్తకాలే.

ఇవి పుస్తకాలేనండీ.

1. ఇవి నా కాయితాలే.
2. అవి మా ఇళ్లే.
3. ఆ పుస్తకాలు మీవే.

## EXERCISES

**a. Fill up the blanks with the correct forms of the cue words given in the parentheses.**

1. ఆ పుస్తకం............(నేను) అనవసరం.
2. ............(నేను)............(రోజు) పది రూపాయలు కావాల్సిందే.
3. ............(రవి) పది రూపాయలు అడుగు.
4. మీరు కొంచెం............(పక్క) జరగండి.
5. ............(బస్సు) పుస్తకాలు చదవకు.
6. ............(నేను) ఏమీ అడగకండి.

**b. Rewrite as directed :**

**Model (i) :**

1. నాకు రెండు చపాతీలు తీసుకురా. (hon. neg.)
2. రోజూ పుస్తకాలు చదవండి. (non-hon.)
3. నువ్వు రోజూ ఈ పని చెయ్యకు. (hon. affirmative)
4. నువ్వు ఈ గడియారం తీసుకుపోకు. (hon. neg.)
5. నువ్వు ఆ కంచం కడుగు. (non-hon. neg.)

**c. Match the following.**

| A | B | |
|---|---|---|
| 1. నువ్వు తెలుగు పుస్తకాలు | తీసుకుపోండి | (   ) |
| 2. మీరు కంచం | చదవండి | (   ) |
| 3. మీరు ఈ కాయితం | చదువు | (   ) |
| 4. నువ్వు ఆ పని | కడగండి | (   ) |
| 5. ఈ చపాతీ | చెయ్యి | (   ) |

## VOCABULARY

| | |
|---|---|
| మెస్సు | mess |
| చదువు | read, study (v) |
| కంచం | plate |
| కడుగు | wash (v) |
| జరుగు | move a side |
| చపాతీ | chapati |
| అనవసరం | unnecessery |
| తీసుకురా | bring |
| సెక్రెటరీ | secretary |
| అడుగు | ask |
| గొడవ | noise, furore |
| నన్ను | me |
| ఊరుకో | keep quiet |
| చెయ్యి | do |
| పో | go |
| తీసుకుపో | take away |
| కనీసం | at least |

## GRAMMAR NOTES

**43.1.** In this lesson trisyllabic bases which contain short vowels only, are introduced. (The bases which contain three vowels are called trisyllabic bases, as the vowel is an important entity in a syllable.) The second and third vowels will be a short ఉ in all these trisyllabic bases.

| | |
|---|---|
| చదువు *caduvu* | 'read' |
| అడుగు *adugu* | 'ask' |

**43.2.** ఉ, which is the second vowel of the trisyllabic verbal bases, becomes అ when followed by a suffix beginning with అ or ఆ.

| | |
|---|---|
| చదువు + అకు → చదవకు<br>*caduvu + aku* *cadav-aku* | 'Don't read.' (41.6.) |
| అడుగు + అండి → అడగండి<br>*aḍugu + aṇḍi* *aḍag-aṇḍi* | 'Please ask.' (41.6.) |

**43.3.** కావాల్సిందే is an emphacised form of కావాలి 'is required'. (37.1.)

**43.4.** The accusative case suffix ను/ని is also introduced in this lesson. _ని occurs after oblique bases ending in ఇ or ఈ, and _ను occurs elsewhere. (The dative case suffix కి/కు has also got a similar distribution. 28.1.)

| | |
|---|---|
| రవి_ని *ravi-ni* | 'Ravi (accusative)' |
| కుర్చీ_ని *kurchii-ni* | 'chair (accusative)' |
| శర్మ_ను *śarma-nu* | 'Sarma (accusative)' |

**43.5.** The accusative case suffix is used only if the object is a living noun. If the object is a non-living noun, the accusative case suffix is used very rarely.

| | |
|---|---|
| సినిమా చూడు | 'See the movie.' |
| ఆయనను చూడు | 'Look at him.' |
| ఆ కుక్కను చూడు | 'Look at the dog.' |

we can also have sentences like :

ఆ బొమ్మ (ను) చూడు 'Look at that picture.'

ఆ సినిమా (ను) చూడు 'See that movie.'

**43.6.** The accusative case suffix is added to the direct object. Direct object is the noun whicn undergoes or experiences the action denoted by the verb. The dative case suffix is added to the indirect object. Indirect object is the noun denoting the recipient.

i) నాకు[2] నీ పిల్లిని[1] ఇవ్వు 'Give me your cat.'

ii) శర్మకు[2] నీ పేరు[1] చెప్పు 'Tell Sarma your name.'

In the examples cited above, nouns marked[2] are indirect objects as they are the recipients and hence they are inflected by the dative case suffix. The ncuns marked[1] are the direct objects as they undergo or experience the action denoted by the verb and hence they are inflected by the accusative case suffix. But, however, the direct object in the example (ii), పేరు, dosen't show the accusative case suffix as it is a non-living noun. (43.5.)

**43.7.** The first and second person pronouns have some modified forms when declined for accusative case. In this lesson the first person singular pronoun is used in accusative case.

నేను + accusative = నన్ను 'me (accusative)'

నన్ను చూడు 'Look at me.'

**43.8.** Notice the use of the lengthening of the final vowel (inclusive marker 15.2 ; 37.4.) of the interrogative words with the simultaneous use of the negative verb to denote something which we can equate with English expressions like 'nothing, nobody, nowhere' etc. (37.4.)

Also see the following sentences in the similar function of the inclusive marker.

నన్ను ఏమీ అడగకు 'Don't ask me anything.' (Ask me nothing.)

ఏమీ చూడకు 'Don't see anything.' (See nothing.)

etc.

# UNIT 11

## Lesson 44

| | |
|---|---|
| గోపి : రవీ ! నువ్వు నాకొక సహాయం చెయ్యాలి. | Ravi ! You should do me a favour. |
| రవి : ఏమిటి ? | What is it ? |
| గోపి : ఏమీలేదు. గాయత్రీ టాకీసులో తెలుగు సినిమా ఉంది. | There is a Telugu film in Gayatri talkies. |
| రవి : అయితే ఏమిటి ? | What about, then ? |
| గోపి : దానికి వెళ్ళాలి. | I have to go to that cinema. |
| రవి : వెళ్ళు. | Go then ! |
| గోపి : నువ్వు కూడా నాతో రావాలి. | You should also come with me. |
| రవి : నేనెందుకు ? | Why should I ? |
| గోపి : ఎందుకేమిటి ? సినిమాకు. | To see the cinema. |

| | |
|---|---|
| రవి : ఇప్పుడు నాకు పని ఉంది. | I have work now. |
| గోపి : ఏం పని ? | What work ? |
| రవి : మాష్టరుగారితో మాట్లాడాలి. | I have to speak with the teacher. |
| గోపి : రేపు మాట్లాడు. | You can do it tomorrow. |
| రవి : ఇప్పుడే మాట్లాడాలి; నువ్వు వెళ్ళు. | No. I have to talk to him now. You can go. |
| గోపి : నా దగ్గర డబ్బులు లేవు. | I don't have money. |
| రవి : అదా విషయం ! నా దగ్గర ఉన్నాయి తీసుకో ! | Oh ! Is that the matter ? I have money. Take it. |
| గోపి : నువ్వు కూడా రా, పరవాలేదు. | You also come with me. |
| రవి : నాకు వీలు లేదు; నువ్వు వెళ్ళు. | It's not possible to me. You can go. |

## DRILLS

a. Repetition drill.

నువ్వు రేపు సాయంత్రం మాయింటికి రావాలి.
అక్కడ మా నాన్నగారితో మాట్లాడాలి.
మనం బాగా పని చెయ్యాలి.

శర్మ : రవీ ! సినిమాకు రా !
రవి : నాకు పని ఉంది.
శర్మ : పరవాలేదు, రా !
రవి : నాకు వీలులేదు. నువ్వు వెళ్ళు.

కమల : సుగుణా ! నువ్వు ఈ పని చెయ్యి.
సుగుణ : నాకు ఇంకా పని ఉంది.
కమల : పరవాలేదు. ముందీ పని చెయ్యి. తర్వాత ఆ పని చెయ్యి.
సుగుణ : నాకు వీలు లేదు. ఆ పని నువ్వే చెయ్యి.

b. Build-up drill.

మాట్లాడాలి
నీతో మాట్లాడాలి.
ఇవ్వాళ నీతో మాట్లాడాలి.
నేను ఇవ్వాళ నీతో మాట్లాడాలి.

కూర్చోవాలి.
కుర్చీలో కూర్చోవాలి.
ఆ కుర్చీలో కూర్చోవాలి.
నువ్వు ఆ కుర్చీలో కూర్చోవాలి.

రావాలి.
ఇంటికి రావాలి.
మా ఇంటికి రావాలి.
నాతో మా ఇంటికి రావాలి.
సాయంత్రం నాతో మా ఇంటికి రావాలి.
నువ్వు సాయంత్రం నాతో మా ఇంటికి రావాలి.

చెయ్యాలి
సహాయం చెయ్యాలి.
ఒక సహాయం చెయ్యాలి.
నాకు ఒక సహాయం చెయ్యాలి.
నువ్వు నాకు ఒక సహాయం చెయ్యాలి.

c. **Substitution drill.**

**Model (i) :**

వేణు రవితో మాట్లాడాలి.
గోపి
వేణు గోపితో మాట్లాడాలి.
విమల
సుబ్బారావు
మీ నాన్నగారు
అతను
నువ్వు
నేను
వాడు
వాళ్లు

**Model (ii) :**

నేను ఇవ్వాళ పది చపాతీలు తినాలి.
చెయ్యి
నేను ఇవ్వాళ పది చపాతీలు చెయ్యాలి.
తీసుకో
తీసుకురా
ఇవ్వు
అడుగు

**Model (iii) :**

రవి సుబ్బారావుతో మాట్లాడాలి.
వెళు
పో
చెప్పు

d. **Response drill.**

రవి : నువ్వీపని చెయ్యాలి.
(గుంటూరు_వెళ్లు)
నాకు వీలు లేదు. నేను గుంటూరు వెళ్లాలి.

1. సుగుణా : నువ్వు సాయంత్రం మా ఇంటికి రావాలి. (కొత్త పుస్తకం_చదువు)
2. గోపి : నువ్వు ఈ పెట్టె మా ఇంటికి తీసుకు రావాలి. (మాష్టరుగారు_మాట్లాడు)
3. సరళా : నువ్వు నాతో సినిమాకు రావాలి. (ఈ పని_చెయ్యి)
4. ఏమండీ, మీరు ఒకగంట ఇక్కడ కూర్చోవాలి. (సినిమా_పో)

**e. Transformation drill.**

**Model :**

రవీ ! నువ్వు నాతో రా !

రవీ ! నువ్వు నాతో రావాలి.

1. గోపీ ! నువ్వు రామారావుతో మాట్లాడు !
2. ఏమండీ ! మీరు ఈ పుస్తకం మా ఇంటికి తీసుకురాండి !
3. గోపాలరావుగారూ ! మీరు ఆ పెట్టె తీసుకు పోండి !
4. సుగుణా ! నువ్వు కమలతో ఆ విషయం చెప్పు !

**EXERCISES**

**a. Fill up the blanks with suitable suffixes given in the parentheses.**

1. నేను రవి............మాట్లాడాలి. (తో, కి)
2. రామారావు ! నువ్వు హరి............ పది రూపాయలు ఇవ్వాలి. (ని, కి)
3. సుబ్బారావు ! నువ్వు నా............గుంటూరు రావాలి. (తో, కు)
4. హరీ ! రవి............నీ పేరు చెప్పు (కి, ని)
5. గిరిజా ! నువ్వు కమల............వాళ్ల ఇంటికి వెళ్లు. (కి, తో)

**b. Change the following as shown in the model.**

**Model (i) :**

రామారావుగారూ ! మీరు ఈ పుస్తకం చదవండి.

రామారావుగారూ ! మీరు ఈ పుస్తకం చదవాలండి.

1. శర్మగారూ ! మీరు మాష్టరుగారితో మాట్లాడండి !
2. రవీ ! నువ్వు ఇవ్వాళ బెంగుళూరు వెళ్లు !
3. కమలా ! నువ్వు రేపు సరళ గదికి రా !
4. సుశీలా ! నువ్వు ఈ మందు తీసుకో !

**Model (ii) :**

రవీ నువ్వు కమలతో మాట్లాడాలి.

రవీ ! నువ్వు కమలతో మాట్లాడు.

1. కమలా ! మీరు ఆ గదిలో కూర్చోవాలండీ !
2. ఏమండీ ! మీరీపని చెయ్యాలండీ !
3. కమలా ! నువ్వు ఆ పుస్తకం తీసుకురావాలి.
4. విమలా ! నువ్వీ కంచం కడగాలి.

**Model (iii) :**

గోపాలరావు ! నువ్వు ఇవ్వాళ మా ఇంటికి రావాలి. (రవి దగ్గర_వెళ్లు)

నేను రవి దగ్గరికి వెళ్లాలి. నాకు వీలులేదు.

1. కమలా నువ్వు చపాతీలు చెయ్యాలి. (పుస్తకం_చదువు)
2. రతిరామ్ ! నువ్వు ఈ పని చెయ్యాలి. (మా ఊరు_వెళ్లు)
3. గోపాలరావు ! ఈ పుస్తకం చదువు. (సినిమా_వెళ్లు)

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| సహాయం | help | విషయం | matter |
| సినిమా | cinema | పరవాలేదు | doesn't matter |
| మాట్లాడు | speak, talk (v) | వీలు | possibility |
| డబ్బులు | money | | |

## GRAMMAR NOTES

**44.1.** In this lesson the obligatory form of the verb is introduced. ఆలి/వాలి is the suffix added to the verbal base to form obligatory form. This form implies that the action indicated by the verb is to be performed obligatorily by the subject.

| | |
|---|---|
| నేను ఇవాళ శర్మను చూడాలి. | 'I have to see Sarma today.' |
| అతను ఈ పుస్తకం తీసుకోవాలి.. | 'He has to take this book.' |

**44.1.1.** _వాలి occurs after long vowel ending bases and _ఆలి occurs elsewhere.

| | |
|---|---|
| తీసుకో_వాలి | 'One should take.' |
| రా_వాలి | 'One should come.' |
| పో_వాలి | 'One should go.' |
| తిను_ఆలి → తినాలి | 'One should eat.'(41.6.) |
| మాట్లాడు_ఆలి → మాట్లాడాలి | 'One should talk.' (41.6.) |
| చదువు_ఆలి → చదవాలి | 'One should read.' (43.2. ; 41.6.) |

**44.2.** _తో is the sociative case suffix.

| | |
|---|---|
| నువ్వు నాతో మాట్లాడకు. | 'Don't speak to me.' |
| నాతో రా. | 'Come with me.' |

**44.3.** The phrases (a) పరవాలేదు 'Doesn't matter, don't worry, all right' and (b) వీలు లేదు 'Not possible' (negative expression for వీలు ఉంది 'it is possible') are very often used in conversations. (a) is used when the speaker wants to console or convince the listner. (b) is used to express the impossibility of something.

**44.4.** Notice he use of purposive function of the dative case suffix in sentences like :

| | |
|---|---|
| నేను సినిమాకు పోవాలి | 'I have to go to (see) a movie.' |

**44.5.** Notice the possesive function of the dative case suffix. (28.2.)

| | |
|---|---|
| నాకు పని ఉంది | 'I have some work.' |

# UNIT 12

## Lesson 45

| | |
|---|---|
| కమల : రవీ ! ఈ మామిడి తోట ఎవరిది ? | Ravi ! Whose mango grove is this ? |
| రవి : మాదే. మీకు మామిడి కాయలు కావాలా ? | Ours only. Do you want mangoes. |
| విమల : నాకు ఒక కాయ చాలు. | One is enough for me. |
| కమల : నువ్వు చెట్టు ఎక్కు రవీ ! కాయలు కొయ్యి. | Ravi ! You climb the tree and pluck the mangoes. |
| మోహన్ : నేను ఎక్కుతున్నాను. | I am climbing it. |
| రవి : జాగ్రత్త ! మెల్లగా ఎక్కు. ఆ కొమ్మను ఊపు. | **Be careful. Climb slowly. Rock that branch.** |
| మోహన్ : ఊపుతున్నాను. | **I am rocking it.** |
| రవి : ఏ కొమ్మను ఊపుతున్నావు ? ఆ చిన్న కొమ్మకు కాయలు లేవు. ఆ పెద్ద కొమ్మను ఊపు. | **Which branch are you rocking ? That small branch doesn't have any mangoes. Rock that big branch.** |

| | |
|---|---|
| మోహన్ : సరే, కాయలు రాలుతున్నాయా ? | Okay. Are the fruits falling down ? |
| విమల : ఆ ! రాలుతున్నాయి. | Yes, they are. |
| మోహన్ : కాయలన్నీ మీరు ఏరుతున్నారా ? | Are you picking up all the mangoes ? |
| కమల : ఆ ! ఏరుతున్నాం. | Yes. We are. |
| మోహన్ : ఎవరు ఏరుతున్నారు ? | Who is picking them up ? |
| కమల : నేను ఏరుతున్నాను. రవి ఏరుతున్నాడు. విమలగూడా ఏరుతున్నది. | I am picking up. Ravi is picking. Vimala also is picking. |
| మోహన్ : నేను చెట్టుమీదినించి దిగుతున్నాను. కాయలు చాలా ? | I am getting down from the tree. Are the mangoes sufficient ? |
| రవి : ఆ ! చాలు. కిందికి రా ! జాగ్రత్త. కొమ్మ విరుగుతున్నది. | Yeah ! Enough. Come down. Be careful. The branch is breaking down. |
| మోహన్ : పరవాలేదు. జాగ్రత్తగానే దిగుతున్నాను. | It's all right. I am getting down the branch carefully. |

**DRILLS**

a. Repetition drill.

నేను చెట్టు ఎక్కుతున్నాను.
మేం చెట్టు ఎక్కుతున్నాం.
నువ్వు చెట్టు ఎక్కుతున్నావు.
మీరు చెట్టు ఎక్కుతున్నారు.
అతను చెట్టు ఎక్కుతున్నాడు.
రవి చెట్టు ఎక్కుతున్నాడు.
కమల చెట్టు ఎక్కుతున్నది.
వాళ్లు చెట్టు ఎక్కుతున్నారు.

అది చెట్టు ఎక్కుతున్నది.
అవి చెట్టు ఎక్కుతున్నాయి.

కొమ్మ విరుగుతున్నది.
కొమ్మలు విరుగుతున్నాయి.

దుమ్ము రాలుతున్నది.
కాయలు రాలుతున్నాయి.

**b. Build-up drill.**

విరుగుతున్నది.
కొమ్మ విరుగుతున్నది.
ఆ కొమ్మ విరుగుతున్నది.
జాగ్రత్త ! ఆ కొమ్మ విరుగుతున్నది.

దిగుతున్నాను.
కిందికి దిగుతున్నాను.
జాగ్రత్తగానే కిందికి దిగుతున్నాను.
నేను జాగ్రత్తగానే కిందికి దిగుతున్నాను.
పరవాలేదు, నేను జాగ్రత్తగానే కిందికి దిగుతున్నాను.

ఎక్కుతున్నాడు.
చెట్టు ఎక్కుతున్నాడు.
జాగ్రత్తగానే చెట్టు ఎక్కుతున్నాడు.
రవి జాగ్రత్తగానే చెట్టు ఎక్కుతున్నాడు.
పరవాలేదు, రవి జాగ్రత్తగానే చెట్టు ఎక్కుతున్నాడు.

**c. Substitution drill.**

**Model (i) :**

సరళ కాయలు ఏరుతున్నది.
రవి
రవి కాయలు ఏరుతున్నాడు.
నేను
నువ్వు
మేం
మీరు
వాళ్లు
అది

**Model (ii) :**

మేం రైలు దిగుతున్నాం. (నేను)
నేను రైలు దిగుతున్నాను.

మోహన్ బస్సు దిగుతున్నాడు. (గీత)
నువ్వు బల్లమీదినించి దిగుతున్నావు. (మీరు)
నేను గోడ ఎక్కుతున్నాను. (వాళ్లు)
వాడు రైలు ఎక్కుతున్నాడు. (అతను)

**d. Response drill.**

**Model (i) :**

ఎవరు చెట్టు ఎక్కుతున్నారు ? (అతను)
అతను చెట్టు ఎక్కుతున్నాడు.

1. ఎవరు ఏనుగు మీదినించి దిగుతున్నారు ? (నేను)
2. ఎవరు మామిడికాయలు ఏరుతున్నారు? (మేం)
3. ఎవరు పుస్తకం ఊపుతున్నారు ? (మీరు)
4. ఎవరు చెట్టు ఎక్కుతున్నారు ? (నువ్వు)
5. ఎవరు బస్సు దిగుతున్నారు ? (వాళ్లు)

Model (ii) :

మీరు మామిడి కాయలు ఏరుతున్నారా? (గీత)

మేం కాదు. గీత మామిడి కాయలు ఏరుతున్నది.

1. నువ్వు రైలు ఎక్కుతున్నావా ? (రవి)
2. రవి బస్సు దిగుతున్నాడా ? (నేను)
3. మోహన్ సంచీ ఊపుతున్నాడా ? (మేం)

Model (iii) :

రవీ : నువ్వు కొమ్మ ఊపుతున్నావా ? (మోహన్)

అ : నేను కొమ్మ ఊపుతున్నాను. మోహన్ గూడా ఊపుతున్నాడు.

1. మోహన్ : నువ్వు మామిడి కాయలు ఏరుతున్నావా ? (గీత)
2. సరళా : మీరు రైలు ఎక్కుతున్నారా ? (నువ్వు)
3. రామారావ్ : వాళ్లు మేడమీదినించి దిగుతున్నారా ? (మేం)
4. సుశీలా : గీత బస్సు దిగుతున్నదా ? (వాళ్ల తమ్ముడు)

## EXERCISES

a. Fill up the blanks with the present tense forms of the verbs given in the parentheses.

1. నేను సంచీ............(ఊపు)
2. కమల కాయితాలు............(ఏరు)
3. మేం రైలు............(ఎక్కు)
4. మీరు బస్సు............(ఎక్కు)
5. నువ్వు బస్సు............(దిగు)
6. దుమ్ము............(రాలు)
7. కొమ్మలు............(విరుగు)
8. రవి కొమ్మలు............(ఊపు)
9. మోహన్ రవీ చెట్టుమీదినించి............(దిగు)

b. Frame at least 35 sentences from the following table using the present tense forms of the verbs given in the 3rd column.

| | | |
|---|---|---|
| రవి | | |
| నేను | | |
| సరళ | చెట్టు | ఏరు |
| నువ్వు | మామిడికాయలు | ఎక్కు |
| మీరు | కాయితాలు | దిగు |
| మేం | రైలు | |
| మనం | | |
| అతను | | |
| వాళ్లు | | |

**c. Match the following.**

| A | B | |
|---|---|---|
| 1. అతను చెట్టు | ఎక్కుతున్నావు | (  ) |
| 2. రవీ ! నువ్వు పూలు | ఏరుతున్నది | (  ) |
| 3. నేను చెట్టుమీదినించి | విరుగుతున్నది | (  ) |
| 4. సరళ పూలు | ఎక్కుతున్నాడు | (  ) |
| 5. కొమ్మ | కొయ్యి ! | (  ) |
| 6. నువ్వు | దిగుతున్నారా ? | (  ) |
| 7. మీరు చెట్టు మీదినించి | దిగుతున్నాను. | (  ) |

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| మామిడి | mango (adj.) | ఊపు | shake, swing, rock (v) |
| కాయ | unripen fruit | రాలు | fall down |
| ఎక్కు | climb | ఏరు | pick up |
| జాగ్రత్త | careful | దిగు | get down |
| కొమ్మ | branch | విరుగు | break (v) |

## GRAMMAR NOTES

45.1. In this lesson the present tense is introduced. What we refer here by present tense s present continuous tense and the exact present tense doesn't exist in Telugu. The present continous tense expresses progression of the action.

45.1.1. The present tense is formed by adding present tense suffix –తున్నా/–తున్న and personal suffix to the verbal base.

Present tense → verbal base + {–తున్నా / –తున్న} + personal suffix.

45.1.2. –తున్న occurs before feminine inferior and neuter singular suffix –ది.

ఎక్కు–తున్న–ది 'She/it is climbing.'

and –తున్నా occurs elsewhere :

ఎక్కు–తున్నా–ను 'I am climbing.'

ఎక్కు–తున్నా–డు 'He is climbing.'

**45.2.** The tense forms in Telugu contain a suffix, (called personal suffix) corresponding to the subject of the sentence, which is called concord. Recall the concord in the case of the verb ఉన్నది, ఉన్నాయి, ఉన్నాడు etc. (36.1.)

**I person**

| | | |
|---|---|---|
| sg. | నేను ఎక్కుతున్నాను. | 'I am climbing.' |
| pl. | మేం/మనం ఎక్కుతున్నాం. | 'We are climbing.' |

**II person**

| | | |
|---|---|---|
| sg. | నువ్వు ఎక్కుతున్నావు. | 'You are climbing.' |
| hon. sg./pl. | మీరు ఎక్కుతున్నారు. | |

**III person**

| | | |
|---|---|---|
| masc. sg. | వాడు/అతను/రవి ఎక్కుతున్నాడు. | 'He/Ravi is climbing.' |
| masc & fem. hon. sg. | ఆయన/ఆవిడ ఎక్కుతున్నారు. | 'He/she is climbing.' |
| epicene pl. | వాళ్లు ఎక్కుతున్నారు. | 'They/those people are climbing.' |
| fem. inf./ neuter sg. | అది ఎక్కుతున్నది | 'She/it is climbing.' |
| neuter pl. | అవి/పిల్లులు ఎక్కుతున్నాయి. | 'They/cats are climbing.' |

**45.3** The locative words like మీద, దగ్గర, కింద when added to a noun, can also take case suffixes. మీది, దగ్గరి (41.11.2.) and కింది are the corresponding oblique bases.

| | |
|---|---|
| చెట్టుమీదినించి | 'from the upper part of the tree' |
| చెట్టుకిందినించి | 'from the lower part of the tree' |
| చెట్టుదగ్గరినించి | 'from the tree' |

**45.4.** Notice the use of the dative case suffix in locative function (30.7.) in sentences like.

| | |
|---|---|
| ఈ కొమ్మకు కాయలు లేవు. | 'There are no fruits on this branch.' |

# UNIT 12

## Lesson 46

| | |
|---|---|
| వెంకటరామయ్య : ఏమోయ్, రామారావ్ ! ఎటు వెళ్తున్నావు ? | Hey ! Ramarao. Where are you going ? |
| రామా : రైలు స్టేషనుకు వెళ్తున్నానండీ ! మా అమ్మగారు వస్తున్నారు. గుంటూరునించి మా అక్కయ్యను తీసుకోస్తున్నారు. | I am going to the railway station, sir. My mother is arriving. She' is bringing my elder sister from Guntur. |
| వెంకట : పద, నేనుగూడా స్టేషనుకే వెళ్తున్నాను. ఇప్పుడు నువ్వు ఏం చదువుతున్నావు ? | Come on ; let's go ! I am also going to the station. What are you studying ? |
| రామా : బి. ఇ. చదువుతున్నాను. | I am studying B. E. |
| వెంకట : నీ చదువుకోసం మీ నాన్నగారు చాలా కష్టపడుతున్నారు. నువ్వుగూడా కష్టపడు. బాగా చదువు. | Your father is striving hard to educate you. You (should) also work hard. Study well. |
| రామా : చూడండి, ఎవరో కుర్రాడు అటు పరిగెత్తుతున్నాడు. | See, sir. Some boy is running in that direction. |

వెంకట : అవును. దొంగలాగా ఉన్నాడు. పారిపోతున్నాడు. అడుగో ఆ పోలీసుకు చెప్పు, వెళ్లు.

Yes. He looks like a thief. He is running away. You go and inform that policeman.

రామా : అక్కర్లేదండీ ! పోలీసులు గూడా వాడికోసం పరిగెత్తుతున్నారండీ !

No need, sir. The police are also running after him.

వెంకట : అడుగో చూడు. ఆ దొంగ ఇటు వస్తున్నాడు. నువ్వు గూడా పరిగెత్తు ! పట్టుకో !

Look here. That thief is coming in this direction. You also run. Catch him.

రామా : అక్కర్లేదండీ ! పోలీసులు వాణ్ణి తీసుకుపోతున్నారు. రండి.

No need, sir. The police are taking him away. Come on; let's go, sir.

వెంకట : జనం హడావుడిగా వెళ్తున్నారు. బండి వస్తున్నదా ?

People are going in a hurry. Is the train arriving ?

రామా : అవునండీ ! చూడండి. ఆయన మిమ్మల్ని ఏదో అడుగుతున్నారు.

Yes. sir. He is asking you something.

వెంకట : ఏంకావాలండీ !

What do you want please ?

శేఖర్ : మీరేనా వెంకటరామయ్యగారు ? నేను శేఖర్ని.

Are you Mr. Venkataramaiah ? I am Sekhar.

వెంకట : మీ కోసమే వస్తున్నాను. పదండి.

I am coming here only for you. Come on; let us go.

**DRILLS**

a. Repetition drill.

నేను మా నాన్నగారికోసం రైలుస్టేషనుకు వెళ్తున్నాను.
నేను నీకోసం మాయింటినించి నీ పుస్తకం తీసుకొస్తున్నాను.
పిల్లలు మామిడికాయలకోసం హడావుడిగా ఇటువస్తున్నారు.
రామారావు నన్ను డబ్బులు అడుగుతున్నాడు.
పోలీసులు దొంగకోసం అటు పరిగెత్తుతున్నారు.

పోలీసులు దొంగను ఎటు తీసుకుపోతున్నారు ?
రవి మిమ్మల్ని ఏమిటో అడుగుతున్నాడు.
ఎవరో విద్యార్థి మీకోసం వస్తున్నాడు.

అతను దొంగలాగా ఉన్నాడు.
ఆయన రామారావులాగా ఉన్నాడు.
ఇది కొత్త బస్సులాగా ఉన్నది.

**b. Build-up drill.**

వస్తున్నది.
ఇటు వస్తున్నది.
మీకోసం ఇటు వస్తున్నది.
అమ్మాయి మీకోసం ఇటు వస్తున్నది.
ఎవరో అమ్మాయి మీకోసం ఇటు వస్తున్నది.

అడుగుతున్నాడు.
ఏదో అడుగుతున్నాడు.
మిమల్ని ఏదో అడుగుతున్నాడు.
అతను మిమల్ని ఏదో అడుగుతున్నాడు.
చూడండి, అతను మిమల్ని ఏదో అడుగుతున్నాడు.

కష్టపడుతున్నారు.
చాలా కష్టపడుతున్నారు.
చదువుకోసం చాలా కష్టపడుతున్నారు.
తమ్ముడి చదువుకోసం చాలా కష్టపడుతున్నారు.
మా తమ్ముడి చదువుకోసం చాలా కష్టపడుతున్నారు.
నాన్నగారు మా తమ్ముడి చదువుకోసం చాలా కష్టపడుతున్నారు.
మా నాన్నగారు మా తమ్ముడి చదువుకోసం చాలా కష్టపడుతున్నారు.

c. Substitution drill.

Model (i):

నేను మెల్లగా వెళ్తున్నాను.
అడుగు
నేను మెల్లగా అడుగుతున్నాను.
పో
తీసుకురా
రా

Model (ii):

రామారావు మా నాన్నగారిని అడుగుతున్నాడు.
నేను
రామారావు నన్ను అడుగుతున్నాడు.
మీరు
వాడు
అక్కయ్య

**EXERCISES**

**a. Fill up the blanks with the present tense forms of the verbs given in the parentheses.**

1. దొంగలు హడావుడిగా............(పారిపో)
2. రవి చెట్టు దగ్గరికి............(వెళ్లు)
3. ఆమె గుంటూరునించి............(రా)
4. నేను రవిని ఇక్కడికి............(తీసుకురా)
4. నువ్వు ఏం............? (చదువు)

**b.** **Fill up the blanks with the nouns/pronouns given in the parentheses using one of the following case suffixes along with them :**

కి/కోసం/ని.

1. రవి...........(మీరు) అడుగుతున్నాడు.
2. పోలీసులు.......(అతను) పరిగెత్తుతున్నారు.
3. రవి మా...........(ఊరు) వస్తున్నాడు.
4. గోపి..........(కాలేజి) వెళ్తున్నాడు.
5. సరళ...........(వారు) అడుగుతున్నది.
6. సుశీల...........(ఆమె) వెళ్తున్నది.

**c.** **Write the present tense forms of the following verbs with నేను, మీరు, ఆయన, ఆమె as subjects.**

| | |
|---|---|
| రా | చదువు |
| తీసుకుపో | వెళ్లు |
| జరుగు | |

**d.** **Produce atleast 16 sentences from the following table taking one word from each column.**

| | | |
|---|---|---|
| రవి<br>నువ్వు<br>మేం<br>నేను<br>వాళ్లు<br>సరళ | అటు<br>ఇటు<br>ఎటు | రా<br>వెళ్లు<br>పరిగెత్తు |

## VOCABULARY

| | |
|---|---|
| ఏమోయ్ | hey (attention drawer) |
| ఎటు | in which direction |
| రైలు స్టేషను | Railway station |
| పద | proceed |
| స్టేషను | station |
| కష్టపడు | struggle (v) |
| కుర్రాడు | boy |
| అటు | in that direction |
| పరిగెత్తు | run (v) |
| దొంగ | thief |
| పారిపో* | run away (v) |
| పోలీసు | police |
| ఇటు | in this direction |
| పట్టుకో* | catch (v) |
| జనం | people |
| హడావుడి | hurry |
| బండి | cart, vehicle, train |
| మిమ్మల్ని | you (hon./pl., acc.) |

## GRAMMAR NOTES

46.1. When some suffixes are added certain verbal bases modify their shapes in different ways. We will now classify these verbal bases taking such modifications into consideration. There are also some verbal bases which do not exhibit any modifications. The verbal bases introduced in the earlier lesson (No. 45) belong to that class of verbs which does not exhibit any changes. In this lesson also some more verbs which belong to this class are introduced along with a few bases which show some changes (46.2.).

| | |
|---|---|
| చదువు_తున్నా_ను | 'I am reading.' |
| కష్టపడు_తున్నా_డు | 'He is suffering/struggling.' |
| పరిగెత్తు_తున్నా_డు | 'He is running.' |
| పారిపో*_తున్నా_రు | 'They are running away.' |
| తీసుకుపో*_తున్నా_డు | 'He is taking away.' |
| పో*_తున్నా_వు | 'You are going.' |

46.2. వెళ్ళు becomes వెళ్_, రా becomes _వస్, తీసుకురా becomes తీసుకో*స్_ when followed by a suffix beginning with త.*

| | | |
|---|---|---|
| వెళ్ళు | : వెళ్_తున్నా_డు | 'He is going.' |
| రా | : వస్_తున్నా_ం | 'We are coming.' |
| తీసుకురా | : తీసుకో*స్_తున్నా_వు | 'You are bringing.' |

* When we say a suffix beginning with త, ద etc., we are non-committal about the quality of the vowel on the consonants త్, ద్ etc.

**46.3.** ఎటు 'in which direction' అటు 'in that direction' and ఇటు 'in this direction' are directional adverbs.

**46.4.** –కోసం is the purposive case suffix :

నేను శర్మకోసం వెళ్తున్నాను 'I am going for Sarma.'
పోలీసులు దొంగ కోసం పరిగెత్తుతున్నారు 'Police are running for the thief.'

**46.5.** The accusative case form of మీరు is మిమ్మల్ని.

**46.6.** పద ! 'come on, let's go' is a type of defective verb. This is used only in imperative.

పద ! 'Come on, let's go.'

పదండి ! 'Please come on, let's go.'

This is the only base in Telugu which ends in అ. (41.2.)

**46.7.** –లాగా 'like' is an adverbializer of manner and it is added to oblique bases.

అతను శర్మలాగా ఉన్నాడు 'He looks like Sarma.'
అతను నీలాగా చదువుతున్నాడు 'He is reading like you.'

# UNIT 12

## Lesson 47

| | |
|---|---|
| రవి : బాలూ ! ఎందుకు కుంటుతున్నావు ? | Balu ! Why are you limping ? |
| బాలు : నా కాలు నెప్పిగా ఉంది. నువ్వు ముందు వెళ్ళకు. | My leg is paining. Don't go fast (before me). |
| రవి : అయితే నా చెయ్యి పట్టుకో. | Then hold my hand. |
| బాలు : నీ చేతిలో పుస్తకాలున్నాయి కదా ! | You have books in your hand ! |
| రవి : పరవాలేదు. రెండు చేతులలో లేవుగదా ! | Doesn't matter. I don't have the books in both the hands. |
| బాలు : ఎందుకు నీ ఎడమకంటికి నీళ్ళు వస్తున్నాయి ? కళ్ళు ఎర్రగా ఉన్నాయి గూడా ! | Why are tears there in your left eye ? Your eyes also look red. |
| రవి : రెండు కళ్ళు ఎర్రగా ఉన్నాయా ? | Are the two eyes red ? |

| | |
|---|---|
| బాలు : ఎడమ కన్ను బాగా ఎర్రగా ఉంది. కుడికన్ను కొంచెం ఎర్రగా ఉంది. | The left eye is very red and the right one is also red but a little. |
| రవి : ఎడమ కంట్లో ఏదో ఉంది. అందుకే కన్ను నెప్పిగా ఉంది. తల గూడా నెప్పిగా ఉంది. | There is something in my left eye. That's why it is paining. I have headache also. |
| బాలు : గాలి విపరీతంగా ఉంది. కళ్లల్లో దుమ్ము పడుతున్నది. కళ్లజోడు పెట్టుకో ! | The wind is blowing fast. The dust is getting into the eyes. Put on the spectacles. |
| రవి : జాగ్రత్త ! నీ జేబుకు చిల్లి ఉంది. డబ్బులు కింద పడ్తున్నాయి. | Be careful ! You have a hole in your pocket and the coins are dropping down. |
| బాలు : ఇదేమిటి ? ఈ దోవలో ఇన్ని ముళ్లు ఉన్నాయి ? ఈ ముల్లు చూడు. ఎంత పెద్దదో ! | What is this ? There are so many thorns in this way. See how big is this thorn. |
| రవి : అవును ! జాగ్రత్తగా రా ! ఎండ గూడా తీవ్రంగా ఉంది. కాళ్లు కాలుతున్నాయి. | Yes ! Walk carefully. It is also very hot. My feet are burning. |
| బాలు : గిరి, శర్మ గూడా వస్తున్నారా ? | Are Giri and Sarma coming ? |
| రవి : ఆ ! వాళ్లు మనవెనక వస్తున్నారు. వాళ్ల దగ్గర ఎక్కువ పుస్తకాలున్నాయి. | Yes. They are coming behind us. They have more books. |
| బాలు : అవును, మన దగ్గర అన్ని పుస్తకాలు లేవు. మన సంచీ బరువుతక్కువ. | Yes. We don't have so many books. Our bag is less heavier (than their bag). |

## DRILLS

### a. Build-up drill.

ఉంది.
ఏదోవుంది.
కంట్లో ఏదోవుంది.
నీ ఎడమ కంట్లో ఏదోవుంది.

ఉంది.
నెప్పిగావుంది.
బాగా నెప్పిగావుంది.
కన్ను బాగా నెప్పిగావుంది.
కుడికన్ను బాగా నెప్పిగావుంది.
నా కుడికన్ను బాగా నెప్పిగావుంది.

వస్తున్నాయి.
నీళ్లు వస్తున్నాయి.
కంటికి నీళ్లు వస్తున్నాయి.
కుడి కంటికి నీళ్లు వస్తున్నాయి.
అతని కుడి కంటికి నీళ్లు వస్తున్నాయి.
ఎందుకు అతని కుడి కంటికి నీళ్లు వస్తున్నాయి?

ఉన్నాయి.
ముళ్లున్నాయి.
ఇన్ని ముళ్లున్నాయి.
దోవలో ఇన్ని ముళ్లున్నాయి.
ఇదేమిటి, దోవలో ఇన్ని ముళ్లున్నాయి?

### b. Substitution drill.

Model (i):

కాలు నెప్పిగావుంది.
తల
తల నెప్పిగావుంది.
చెయ్యి
ఎడమకాలు
కుడికన్ను
రెండు కళ్లూ
కాలు

Model (ii):

జేబుకు చిల్లివుంది.
సంచీలు
సంచీలకు చిల్లులు ఉన్నాయి.
పెట్టె
చొక్కా
జేబులు
కాయితాలు

**Model (iii) :**

ఈ దోవలో అన్ని చెట్లున్నాయి.

ఎక్కువ

ఈ దోవలో ఎక్కువ చెట్లున్నాయి.

ఎన్ని

తక్కువ

ఇన్ని

**Model (iv) :**

రవి శర్మ వెనక వెళ్తున్నాడు.

పక్కన

రవి శర్మ పక్కన వెళ్తున్నాడు.

ముందు

కుడిపక్కన

ఎడమపక్కన

**Model (v) :**

ఇదేమిటి, ఈ పెట్టెలో ఇన్ని పుస్తకాలున్నాయి ?

సంచీ కలం

ఇదేమిటి, ఈ సంచీలో ఇన్ని కలాలున్నాయి ?

ఊరు స్కూలు

చెయ్యి గీత

దోవ ముల్లు

ఇల్లు గది

**c. Interlocked substitution drill.**

**Madel :**

| | |
|---|---|
| ఎండ తీవ్రంగా ఉంది. | జ్వరం...................... |
| గాలి | ........తీవ్రం................ |
| గాలి తీవ్రంగా ఉంది | తలనెప్పి...................... |
| విపరీతం | ........విపరీతం.............. |
| గాలి విపరీతంగా ఉంది | ఎండ........................ |

**d. Response drill.**

**Model (i) :**

రవి ఎక్కడున్నాడు? (ఇల్లు)
రవి ఇంట్లో వున్నాడు.

1. మందు ఎక్కడ వెయ్యాలి? (కన్ను)
2. దుమ్ము ఎక్కడ పడుతున్నది? (కళ్ళు)
3. రవి కలం ఎక్కడున్నది? (నా చెయ్యి)

**Model (ii) :**

శర్మ దగ్గర యిరవై కలాలున్నాయి.
అన్ని కలాలు నా దగ్గర లేవు.

1. వాళ్ళ ఊళ్ళో ఇరవై నాలుగు మామిడి చెట్లున్నాయి.
2. సుబ్బారావు దగ్గర పది గులాబీ పూలున్నాయి.
3. మావూరికి నాలుగు రైళ్ళున్నాయి.

**e. Transformation drill.**

**Model (i) :**

ఎడమకన్ను కొంచెం ఎర్రగా వుంది.
ఎడమకన్ను బాగా ఎర్రగా వుంది.

1. కుడికాలు కొంచెం నెప్పిగా వుంది.
2. తల కొంచెం నెప్పిగా వుంది.
3. నీ చెయ్యి కొంచెం వేడిగా వుంది.

**Model (ii) :**

నా కాలు నెప్పిగా వుంది.
నా కాళ్లు నెప్పిగా ఉన్నాయి.

1. నా చెయ్యి చల్లగా వుంది.
2. నీ కన్ను ఎర్రగా వుంది.
3. ఇక్కడ ముల్లుంది.

## EXERCISES

a. Fill up the blanks with the present tense forms of the verbs given in the parentheses.

1. నేను............(కుంటు)
2. కాఫీ............(కాలు)
3. పుస్తకం కింద............(పడు)
4. ఆయన............(కుంటు)
5. రవి కింద............(పడు)

b. Answer the following questions using the cue words.

1. శర్మయిల్లు ఎక్కడున్నది? (స్కూలువెనక)
2. రైలుస్టేషను ఎక్కడున్నది? (పోలీసు స్టేషను ముందు)
3. మా యిల్లు ఎక్కడున్నది? (రవి ఇంటికి కుడి పక్కన)
4. దుమ్ము ఎక్కడ పడుతున్నది? (నీ కన్ను)
5. సంచీ ఎక్కడున్నది? (నా చెయ్యి)

c. Answer the following questions using the adverbs suggested in the parentheses.

1. ఎండ ఎట్లా వున్నది ? (తీవ్రంగా)
2. గాలి ఎట్లా వున్నది ? (చల్లగా)
3. గుంటూరులో ఎండ ఎట్లా వున్నది ? (విపరీతంగా)
4. కాఫీ ఎట్లా వున్నది. (వేడిగా)

d. Rewrite the following sentences changing the *underlined* nouns into opposite number.

1. ఇక్కడ ముల్లున్నది.
2. మా ఇళ్లు మైసూరులోవున్నాయి.
3. రవి కన్ను ఎర్రగావున్నది.
4. మా అమ్మగారి కాళ్లు నెప్పిగావున్నాయి.
5. మా ఊళ్లో సినిమాహాలున్నది.
6. అతని చేతులు చల్లగావున్నాయి.

## VOCABULARY

| | |
|---|---|
| కుంటు | limp (v) |
| చెయ్యి | hand |
| ఎడమ | left (adj.) |
| కన్ను | eye |
| కుడి | right (adj.) |
| తల | head |
| విపరీతం | severity |
| దుమ్ము | dust (n) |
| పడు | fall (v) |
| కళ్లజోడు | spectacles |
| పెట్టుకో | put on, wear |
| జేబు | pocket |
| చిల్లి | hole |
| దోవ | path, way |
| ఇన్ని | these many |
| ముల్లు | thorn |
| తీవ్రం | severity |
| కాలు | burn (v) |
| వెనక | behind |
| ఎక్కువ | more |
| అన్ని | those many |
| బరువు | weight |
| తక్కువ | less |

## GRAMMAR NOTES

47.1. Oblique bases and plural forms of certain irregular nouns are introduced in this lesson :

| Noun | | Oblique base | plural form |
|---|---|---|---|
| కన్ను | 'eye' | కంటి– | కళ్లు |
| చెయ్యి | 'hand' | చేతి– | చేతులు |

47.2. కన్ను + లో → కంట్లో (like ఇంట్లో 31.4.)

47.3. The use of dative case suffix in locative function (30.7. ; 45.4.) may be seen in sentences like :

> ఎందుకు నీ ఎడమ కంటికి నీళ్లు వస్తున్నాయి ? 'Why are tears there in your left eye?'
> నీ జేబుకు చిల్లి ఉంది. 'There is a hole in your pocket.'

47.4. విపరీతంగా, తీవ్రంగా and నెప్పిగా are the adverbs derived from abstract nouns విపరీతం, తీవ్రం 'severity' and నెప్పి 'pain'.

47.5. The locative case suffix -లో becomes -ల్లో when occurs after nouns which have a cluster of consonants in the final syllable :

| | | |
|---|---|---|
| నీళ్లు + లో → నీళ్లల్లో | 'in the water' | (21.1.) |
| చెట్లు + లో → చెట్లల్లో | 'in the trees' | |

47.6. పడు 'fall', when followed by a suffix beginning with త, drops the final vowel normally. But in writing పడుతున్నాడు is also possible.

47.7. వెనక 'behind' is the opposite form of ముందు 'first, ahead'.

47.8. అన్ని 'those many' and ఇన్ని 'these many' are the quantitative adjectives used with neuter count nouns.

| | |
|---|---|
| అన్ని బల్లలు | '(those many banches) so many banches' |
| ఇన్ని పిల్లులు | '(these many cats) so many cats' |

అన్ని and ఇన్ని are the corresponding demonstrative forms of ఎన్ని 'how many'.

# UNIT 12

## Lesson 48

| | |
|---|---|
| గోపి : రవీ ! ఇక్కడేం చేస్తున్నావు ? | Ravi ! What are you doing here ? |
| రవి : మామిడి పళ్లు కోస్తున్నాను. ఏమిటి ఆ సంచీ ? అందులో ఏముంది ? | I am cutting the mangoes. What is that bag ? What is in it ? |
| గోపి : ఏమీలేదు. ఖాళీ సంచీ. నాకు గూడా ఒక పండు ఇవ్వు. | There is nothing in it. It is empty. Give me a fruit. |
| రవి : తీసుకో ! నువ్వు బైటికి వెళ్తున్నావా ? | Take it. Are you going out ? |
| గోపి : లేదు. అదుగో చూడు ! ఆ పండు చాలా బాగుంది. అది కొయ్యి. ఏమిటి బ్లేడుతో కోస్తున్నావు ? కత్తి ఉంది గదా ! | No. Look there ! That fruit is good. Cut that one. Why are you cutting with a blade ? There is a knife ! |
| రవి : కత్తికి పదును లేదు. | That knife is not sharp. |
| గోపి : మీ తమ్ముడు లోపల ఏం చేస్తున్నాడు ? | What is your brother doing inside ? |

| | |
|---|---|
| రవి : శర్మకు ఉత్తరం రాస్తున్నాడు. తలుపు కొట్టు. వాడు నీ కోసమే ఎదురు చూస్తున్నాడు. వాడి దగ్గర శర్మ అడ్రసు లేదు. | He is writing a letter to Sarma. Tap the door. He is waiting for you. He does not have Sarma's address. |
| మోహన్ : గోపీ ! లోపలికి రా ! ఈ ఉత్తరం మీద శర్మ అడ్రసు రాయి. | Gopi ! Come in. Please write Sarma's address on this letter. |
| గోపి : శర్మ అడ్రసు డైరీలో ఉంది. వెతుకు. | Sarma's address in the diary. Search for it. |
| మోహన్ : ఇందులో ఎక్కడా లేదు. | It is no where here in the diary. |
| గోపి : ఇంకొక సారి వెతుకు. ఎందులో చూస్తున్నావు ? అది పాత డైరీ ! | Search for it once again. Where are you looking into ? That is an old diary. |
| రవి : బైట ఎవరో తలుపు కొడుతున్నారు. తలుపు తియ్యి మోహన్ ! | Some one is knocking the door out side. Open the door, Mohan ! |
| గోపి : నేను తీస్తున్నాను. బైట ఎవరూ లేరు. గాలికి తలుపులు చప్పుడు చేస్తున్నాయి. | I am opening the door. There is no one out side. The doors are rattling because of the wind. |
| రవి : సరే ! ఆ కుర్చీని తలుపు దగ్గరికి నెట్టు. | Okay ! Push that chair to that door. |
| గోపి : ఇందులో ఏవో కాయితాలున్నాయి. | There are some papers in this. |
| రవి : వాటి మీద ఈ పుస్తకం పెట్టు. | Keep this book on them. |

**DRILLS**

**a. Build-up drill.**

| | |
|---|---|
| లేదు. | లేరు. |
| ఏమీలేదు. | ఎవరూ లేరు. |
| ఇంట్లో ఏమీ లేదు. | గదిలో ఎవరూ లేరు. |
| ఆ ఇంట్లో ఏమీ లేదు. | ఆ గదిలో ఎవరూ లేరు. |

చేస్తున్నాయి.
చప్పుడు చేస్తున్నాయి.
తలుపులు చప్పుడు చేస్తున్నాయి.
కిటికీ తలుపులు చప్పుడు చేస్తున్నాయి.
గాలికి కిటికీ తలుపులు చప్పుడు చేస్తున్నాయి.

నెట్టు.
దగ్గరికి నెట్టు.
బల్ల దగ్గరికి నెట్టు.
కుర్చీని బల్ల దగ్గరికి నెట్టు.
ఈ కుర్చీని బల్ల దగ్గరికి నెట్టు.
సరే, ఈ కుర్చీని బల్ల దగ్గరికి నెట్టు.

**b. Substitution drill.**

**Model (i) :**

రవి ఉత్తరం చదువుతున్నాడు (రాయి)
రవి ఉత్తరం రాస్తున్నాడు.

1. గోపి మామిడి పళ్లు ఏరుతున్నాడు. (కొయ్యి)
2. నేను పుస్తకం చదువుతున్నాను. (తియ్యి)
3. నువ్వు ఉత్తరం రాస్తున్నావు. (చూడు)
4. సరళ తలుపు తీస్తున్నది. (కొట్టు)
5. అతను కుర్చీని తీసుకోస్తున్నాడు. (నెట్టు)

**Model (ii) :**

సుశీల కలంతో రాస్తున్నది.
పెన్సిలు కొట్టు
సుశీల పెన్సిలుతో కొడుతున్నది.
కాలు నెట్టు
కత్తి కొయ్యి
పెన్సిలు రాయి

**c. Response drill.**

**Model (i) :**

రవి ఏం చేస్తున్నాడు ? (పుస్తకం_వెతుకు)
రవి పుస్తకం వెతుకుతున్నాడు.

1. గోపాలరావు ఏం చేస్తున్నాడు ? (కిటికీ_తియ్యి)
2. నేను ఏం చేస్తున్నాను ? (చపాతీలు_చెయ్యి)
3. సరళ ఏం చేస్తున్నది ? (ఉత్తరం_రాయి)
4. గీతా కమలా ఏం చేస్తున్నారు ? (పూలు_కొయ్యి)
5. నువ్వు ఏం చేస్తున్నావు ? (కుక్కను_కొట్టు)
6. శర్మ ఏం చేస్తున్నాడు ? (నన్ను_నెట్టు)
7. అతను బైటికి వెళ్తున్నాడా ? (లోపలికి_రా)

Model (ii) :

స్కూలులో రవి ఉన్నాడు.

శర్మ : నువ్వు స్కూలుకు వెళ్ళకు; అక్కడ రవి ఉన్నాడు.

1. ఇంట్లో గోపాలరావుగారున్నారు.
2. లోపల పులి ఉన్నది.
3. బైట కుక్క ఉన్నది.
4. చెట్టు దగ్గర ఏనుగు ఉన్నది.

Model (iii) :

ఈ గదిలో ఎవరున్నారు ?

ఆ గదిలో ఎవరూ లేరు.

1. నా సంచీలో ఏమున్నాయి ?
2. నీ జేబులో ఏమున్నది ?
3. మన ఇంట్లో ఎవరున్నారు ?
4. మీ కుక్క ఎక్కడున్నది ?
5. వాళ్ళ కలాలు ఎక్కడున్నాయి ?

d. Transformation drill.

Model :

ఆ పుస్తకంలో ఏముంది ?

అందులో ఏముంది ?

1. ఈ సంచీలో ఏముంది ?
2. ఆ పెట్టెలో నీ గడియారం ఉంది.
3. కొత్త చొక్కా ఏ పెట్టెలో ఉంది ?
4. నా సంచీ ఏ అలమరలో ఉంది ?

## EXERCISES

a. Rewrite the following sentences changing the verb into present tense with the nouns given in the parentheses as subject.

Model :

ఆ మామిడి చెట్టు ఎక్కు : (నేను)

నేను ఆ మామిడి చెట్టు ఎక్కుతున్నాను.

1. కుక్కను కొట్టు : (మీరు)
2. ఈ పని చెయ్యి : (నువ్వు)
3. ఈ పండు కొయ్యి : (మేం)
4. తలుపు తియ్యి : (సీత)
5. పుస్తకం చూడు : (ఆయన)
6. బైటకి వెళ్ళు : (పిల్లలు)
7. చెట్లకు నీళ్ళు పొయ్యి : (పిల్లలు)
8. రవికి ఉత్తరం రాయి. (ఎవరు)
9. శర్మను లోపలికి నెట్టు : (మనం)

**b. Answer the following questions in negation.**

1. సుబ్బారావు గుంటూరులో ఎక్కడున్నాడు ?
2. సరళ పుస్తకం మీద ఏమున్నది ?
3. మీ ఇంటి దగ్గర ఎవరున్నారు ?
4. మీ దగ్గర ఏమున్నాయి ?

**c. Conjugate the following verbs for present tense with నేను, మేం, నువ్వు, ఆయన, సీత and పిల్లి as subject.**

వెళ్లు     చూడు     తియ్యి     కొట్టు

**d. Frame at least 35 sentences from the following table using the present tense forms of the verbs given in the 3rd column.**

| | | |
|---|---|---|
| నువ్వు<br>రవి<br>ఆమె | బైట<br>లోపల<br>బైటకి<br>లోపలికి | వెళ్లు<br>రా<br>చెయ్యి<br>రాయి<br>చదువు |

**e. Match the following.**

| A | B | |
|---|---|---|
| 1. రవి | చెట్టు ఎక్కుతున్నాడు | (    ) |
| 2. సీత | పూలు కోస్తున్నారు | (    ) |
| 3. నేను | లోపలికి వెళ్తున్నావు | (    ) |
| 4. నువ్వు | కుక్కను కొడుతున్నాను | (    ) |
| 5. పిల్లి | ఉత్తరం రాస్తున్నది | (    ) |

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| పండు | fruit | కొట్టు | beat, hit, knock(v) |
| ఖాళీ | empty | ఎదురుచూడు | await, look for |
| బైట | out side | వెతుకు | search(v) |
| కత్తి | knife | -సారి | time (as in first *time*, second *time* etc.) |
| పదును | sharpness | చప్పుడు | sound, noise |
| లోపల | inside | నెట్టు | push(v) |
| ఉత్తరం | letter | | |

## GRAMMAR NOTES

48.1. య్యి/యి ending verbs change the final syllable to స and lengthen the penultimate vowel, if it is short, when followed by a suffix beginning with త.

కొయ్యి + తున్నా-డు → కోస్-తున్నాడు — 'He is cutting.'
*kayyi + tunnaa-du → koos-tunnaaḍu*

రాయి + తున్నా-ను → రాస్-తున్నాను — 'I am writing.'
*raayi + tunnaa-nu → raas-tunnaanu*

48.2. చూడు 'see' becomes చూస when followed by a suffix beginning with త.

చూడు + తున్నా-వు → చూస్తున్నావు — 'You are seeing.'
*cuuḍu + tunnaa-vu → cuustunnaavu*

48.3. ట్టు ending bases change their final syllable to డ when followed by a suffix beginning with త.

కొట్టు - తున్నాడు → కొడ్తున్నాడు — 'He is beating.'
*koṭṭu — tunnaaḍu → koḍtunnaaḍu*

48.4. The oblique bases of లోపల 'inside' and బైట 'out side' are లోపలి- and బైటి- respectively.

48.5. The plural form of పండు 'fruit' is పళ్ళు.

48.6. The instrumental case suffix* తో is also introduced in this lesson.

కలంతో రాయి। — 'Write with a pen.'
కత్తితో కొయ్యి। — 'Cut with a knife.'

---

* the suffix -తో is both for instrumental case and sociative case (44.2.).

**48.7.** Notice the causal relationship manifested by the dative case suffix in sentences like:

గాలికి తలుపులు చప్పుడు చేస్తున్నాయి. 'The doors are rattling because of the wind.'

**48.8.** The benefactive function of the dative case suffix (26.1.) is found in the sentence:

శర్మకు ఉత్తరం రాస్తున్నాడు. 'He is writing a letter to Sarma.'

**48.9.** It is the locative function (30.7. ; 45.4.) of the dative case suffix in the sentence:

ఈ కత్తికి పదును లేదు. 'This knife is not sharp.'

**48.10.** It is the destinative function of the dative case suffix (39.2.) in the sentence:

ఆ కుర్చీని తలుపు దగ్గరికి నెట్టు. 'Push that chair to the door.'

**48.11.** The locative forms of అది, ఇది and ఏది are అందులో, ఇందులో and ఎందులో (in addition to దానిలో, దీనిలో and దేనిలో) respectively.

అది : అందులో/దానిలో

ఇది : ఇందులో/దీనిలో

ఏది : ఎందులో/దేనిలో

# UNIT 12

## Lesson 49

| | |
|---|---|
| రవి : రామారావు ! ఇక్కడేం చేస్తున్నావు ? | Ramarao ! What are you doing here ? |
| రామా : మా చెల్లెలికి రేడియో కొంటున్నాను. | I am buying a Radio for my sister. |
| రవి : పెద్ద బజార్లో ఇంకొక కొట్టుంది. అక్కడ కొను. ఆ కొట్లో మంచి మంచి మోడల్సు ఉన్నాయి. | There is a shop in the main market. You buy there. There are very good models in that shop. |
| కొట్టువాడు : ఇవ్వాళ పెద్ద బజారు కొట్లకు సెలవు. మా దగ్గర కూడా ఉన్నాయండీ కొత్త మోడల్సు. | The shops in the main market observe holiday today. We too have new models, sir ! |
| రవి : ఈ పాప ఎవరు ? మీ చెల్లెలి కూతురా ? | Who is this baby ? Is she your niece (sister's daughter) ? |
| రామా : అవును. | Yes. |
| రవి : ఏం పాపా ! ఏమిటి తింటున్నావు ? | Papa ! What are you eating ? |

| | |
|---|---|
| పాప : చాక్లెట్టు తింటున్నాను. | I am eating a chocolate. |
| రామా : ఏదీ, ఈ రేడియో పెట్టండి. | Please tune this radio. |
| "ఆకాశవాణి, ఇప్పుడు మీరు సినిమా పాటలు వింటున్నారు." | "ALL INDIA RADIO, NOW YOU ARE LISTENING TO FILM SONGS..." |
| "ఊఁ అను ! ఊఁ ఊఁ అను ! ఔనను, ఔనౌనను........" | "SAY YES ! SAY YES, YES !... .." |
| గిరి : ఈ మోడలు బాగా లేదన్నయ్యా ! | This model is not good, brother ! |
| రామా : ఈ కంపెనీదే యింకొక మోడలు ఏదీ లేదా ? | Don't you have some other model of this company ? |
| కొట్టువాడు : ఉందండీ ! ఇదిగో, యిది చూడండి. | Yes, sir. We have it. Please see this. |
| గిరి : ఇది బాగుంది. | This is good. |
| రామా : సరే యిది యివ్వండి. | All right. Give this. |
| కొట్టు : అలాగే ! | Okay. |

**DRILLS**

**a. Build-up drill.**

| | |
|---|---|
| అంటున్నాడు. | కొంటున్నాడు. |
| వెళ్ళాలి అంటున్నాడు. | బొమ్మలుకొంటున్నాడు. |
| సినిమాకు వెళ్ళాలి అంటున్నాడు. | మంచి బొమ్మలు కొంటున్నాడు. |
| ఇవ్వాళ సినిమాకు వెళ్ళాలి అంటున్నాడు. | మంచి మంచి బొమ్మలు కొంటున్నాడు. |
| రవి ఇవ్వాళ సినిమాకు వెళ్ళాలి అంటున్నాడు. | అతను మంచి మంచి బొమ్మలు కొంటున్నాడు. |

అంటున్నది.
కావాలి అంటున్నది.
బొమ్మ కావాలి అంటున్నది.
కోతి బొమ్మ కావాలి అంటున్నది.
చెల్లెలు కోతి బొమ్మ కావాలి అంటున్నది.
మా చెల్లెలు కోతి బొమ్మ కావాలి అంటున్నది.

**b. Substitution drill.**

**Model (i) :**

రవి బొమ్మలు చూస్తున్నాడు.
పుస్తకం చదువు
రవి పుస్తకం చదువుతున్నాడు.

1. చపాతీలు తిను
2. నాటకం విను
3. గడియారం కొను
4. 'కలం కావాలి' అను

**Model (ii) :**

రవి పూరీ తింటున్నాడు.
సరళ చపాతీ
సరళ చపాతీ తింటున్నది.

1. వాళ్లు మామిడి కాయలు
2. మీరు ఉప్మా
3. నేను పళ్లు
4. నువ్వు పెసరట్టు
5. అవి చపాతీలు

**Model (iii) :**

మా ఊళ్లో పెద్ద పెద్ద కొట్లు ఉన్నాయి. (మంచి)
మా ఊళ్లో మంచి మంచి కొట్లు ఉన్నాయి.

1. ఈ ఇంట్లో పెద్ద పెద్ద గదులున్నాయి. (చిన్న)
2. ఆ [illegible]టలో మంచి మంచి చెట్లున్నాయి. (పెద్ద)
3. ఆ [illegible]దిలో మంచి మంచి కుర్చీలున్నాయి. (కొత్త)

**c. Response drill.**

**Model (i) :**

రవి ఏం చేస్తున్నాడు ? (పుస్తకం—చదువు)
రవి పుస్తకం చదువుతున్నాడు.

1. సీత ఏం చేస్తున్నది ? (కలం—కొను)
2. మేం ఏం చేస్తున్నాం ? (మినపట్టు—తిను)
3. నువ్వు ఏం చేస్తున్నావు ? (నీ మాటలు—విను)

**Model (ii)**

నేను ఏమంటున్నాను ? (రవి మంచివాడు)
నువ్వు 'రవి మంచివాడు' అంటున్నావు.

1. మేం ఏమంటున్నాం ? (ఇక్కడ [illegible]లేదు)
2. కమల ఏమంటున్నది ? (పుస్తకం కావాలి)
3. మనం ఏమంటున్నాం ? (కలం [illegible])
4. మీరు ఏమంటున్నారు ? (ఇవాళ సినిమాకు పోవాలి)

Model (iii) :

బొమ్మ ఎక్కడున్నది ? (మా ఇల్లు)
బొమ్మ మా ఇంట్లో ఉన్నది.

1. చాక్లెట్టు ఎక్కడున్నది ? (నా చెయ్యి)
2. కలం ఎక్కడున్నది ? (కొట్టు)
3. దుమ్ము ఎక్కడ పడుతున్నది ? (కళ్లు)

## EXERCISES

a. Answer the following questions based upon the text of the lesson.

1. రామారావు ఏం చేస్తున్నాడు ?
2. పాప ఏం చేస్తున్నది ?

b. Answer the following questions using the cue words.

1. సీత ఏం చేస్తున్నది ? (కలం—కొను)
2. మనం ఏం చేస్తున్నాం ? (మాస్టరుగారి మాటలు—విను)
3. కుక్కలు ఏం చేస్తున్నాయి ? (బిస్కట్లు—తిను)

c. Rewrite the following sentence adding మంచి మంచి, కొత్త కొత్త, పెద్ద పెద్ద and చిన్న చిన్న in appropriate place.

రవి పుస్తకాలు చదువుతున్నాడు.

d. Conjugate the following verbs for present tense with నేను, మనం, మీరు, నువ్వు, సీత and కుక్కలు as subjects.

1. తిను
2. విను

c. Match the following.

| A | B | |
|---|---|---|
| 1. రవి చపాతీలు | వింటున్నాడు | (  ) |
| 2. గోపి నా మాటలు | కొంటున్నాడు | (  ) |
| 3. రతిరామ్ కలం | అంటున్నాడు | (  ) |
| 4. బాబు 'బొమ్మలు కావాలి' | తింటున్నాడు | (  ) |

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| రేడియో | radio | విను | listen |
| కొను | buy | ఊఁ | yes |
| బజారు | bazaar | అను | say, utter |
| కొట్టు | shop | ఔను | see అవును |
| మోడలు | model | కంపెనీ | company |
| సెలవు | holiday | అలాగే ! | all right |
| ఆకాశవాణి | Akashavani (All India Radio) | | |

## GRAMMAR NOTES

49.1. In this lesson another group of verbs which behave in a different way in present tense is introduced. Those are :

| | | | | | |
|---|---|---|---|---|---|
| అను | 'say, utter', | కొను | 'buy' | తిను | 'eat' (lesson 41) |
| విను | 'listen' | | | | |

Hereafter these verbs will be referred to as 'అను' group.

49.2. When a suffix beginning with త follows the అను group of verbs, the త of the suffix changes into ట and the final ను of the bases becomes ం (అనుస్వారం).

| | |
|---|---|
| అను_తున్నాడు → అంటున్నాడు | 'He is saying/uttering.' |
| విను_తున్నా_ను → వింటున్నాను | 'I am hearing.' |
| కొను_తున్నా_వు → కొంటున్నావు | 'You are buying.' |
| తిను_తున్నా_యి → తింటున్నాయి | 'They are eating.' |

49.3. When an adjective is reduplicated the quality or quantity expressed by the adjective will be intensified or stressed.

| | |
|---|---|
| కొత్త కొత్త పుస్తకాలు | 'very new books' |
| పెద్ద పెద్ద చెట్లు | 'very big trees' |

Such reduplication occurs only when the noun is in plural number.

**49.4.** Notice the purposive/benefactive function of the dative case suffix. (26.1. ; 44.4.)

మా తమ్ముడికి రేడియో కొంటున్నాను. 'I am buying a radio for my brother.'

మా చెల్లెలికి బొమ్మలు కొంటున్నాను. 'I am buying dolls for my sister.'

Purposive case suffix కోసం (46.4.) can also be used in the place of the dative case suffix in the above examples.

మా తమ్ముడికోసం రేడియో కొంటున్నాను.

మా చెల్లెలికోసం బొమ్మలు కొంటున్నాను.

**49.5.** Notice the use of the dative case suffix in the following sentences :

| | |
|---|---|
| ఇవ్వాళ కొట్లకు సెలవు. | 'The shops observe holiday today.' |
| రేపు మాకు సెలవు. | 'It is holiday for us tomorrow.' |

**49.6.** ఊఁ is the nasalized ఊ. This is used to express acceptance.

| | |
|---|---|
| "వస్తున్నావా ?" | 'Are you coming.' |
| "ఊఁ" | 'Yes.' |

**49.7.** Notice the sandhi in the following :

కొట్టు + లో → కొట్లో 'in the shop'

*kooṭṭu + loo → koṭ-loo*

# UNIT 12

## Lesson 50

| | |
|---|---|
| వెంకటేశ్వర్లు : రండి సుబ్బరామయ్యగారూ ! ఈ సోఫాలో కూర్చోండి. | Come in, Mr. Subbaramaiah. Please si in this sofa. |
| సుబ్బ : పరవాలేదు, ఈ కుర్చీలో కూర్చుంటున్నాను. | Don't worry ! I am sitting in this chair. |
| వెంక : ఏమిటి అలా ఉన్నారు ? ఆరోగ్యం బాగాలేదా ? | Why do you look like that ? Is not your health alright ? |
| సుబ్బ : లేదు. కొన్ని రోజులనించి గుండెల్లో నెప్పి వస్తున్నది. | No. I am suffering from heart pain for the last few days. |
| వెంక : మందు తీసుకుంటున్నారా ? | Are you taking any medicine ? |
| సుబ్బ : ఆ ! ఈ ఇంట్లో ఎన్ని రోజులనించి ఉంటున్నావు ? | Yes. How long are you staying in this house ? |

వెంక : నాలుగు నెలలనించి ఉంటున్నాను.

I am here for the last four months.

సుబ్బ : ఇల్లు బాగుంది. ఇక్కడే ఉండు. మీ ఇంటి వాడి దగ్గర బాగా డబ్బు ఉందా ?

The house is nice. Be here only. Does your landlord possess a lot of money ?

వెంక : ఆ ! చాలా వుంది. కొంత ఈ ఊళ్ళో బ్యాంకులో వుంది. కొంత వాళ్ళ ఊళ్ళో ఉంది.

Yeah. There is a good lot. Some amount is there in the bank in this town. Some amount is in his home town.

సుబ్బ : మీ బాబు ఏడీ ? నిద్రపోతున్నాడా ?

Where is your son ? Is he sleeping ?

వెంక : లేదండీ. పాలు తాగుతున్నాడు. గీతా ! బాబును తీసుకురా !

No. He is drinking milk. Geetha ! Bring Babu here.

సుబ్బ : నిల్చుంటున్నాడా ?

Does he stand ?

వెంక : ఆ ఇప్పుడిప్పుడే నిల్చుంటున్నాడు. బాబూ ! నిల్చోరా ! గీతా ! సుబ్బరామయ్య గారికి గూడా అన్నం వడ్డించు. పద.

Yes. He is standing only in these days. Babu ! Stand up. Geetha ! Serve food to Mr. Subbaramaiah also.

సుబ్బ : అరె ! నవ్వుతున్నాడే ! ఏంరా ? నీకు నవ్వు వస్తున్నదా ? సర్లేరా, నవ్వు !

Oh ! He is laughing. What, my dear boy ! Are you getting a fit of laugh (on seeing me) ? All right laugh !

## DRILLS

**a. Build-up drill.**

ఉన్నావు.
అలా ఉన్నావు.
ఏమిటి, అలా ఉన్నావు ?

వస్తున్నది.
నెప్పి వస్తున్నది.
గుండెల్లో నెప్పి వస్తున్నది.
రోజులనించి గుండెల్లో నెప్పివస్తున్నది.
కొన్ని రోజులనించి గుండెల్లో నెప్పి వస్తున్నది.

చదువుతున్నాడు.
పుస్తకాలు చదువుతున్నాడు.
తెలుగు పుస్తకాలు చదువుతున్నాడు.
ఇప్పుడే తెలుగు పుస్తకాలు చదువుతున్నాడు
ఇప్పుడిప్పుడే తెలుగు పుస్తకాలు చదువుతున్నాడు.

**b. Substitution drill.**

**Model :**

రవి కళ్లజోడు చూస్తున్నాడు. (పెట్టుకో)
రవి కళ్లజోడు పెట్టుకుంటున్నాడు.

1. సరళ అక్కడ మాట్లాడుతున్నది. (కూర్చో)
2. మనం పుస్తకాలు చదువుతున్నాం. (తీసుకో)
3. నేను రవిని చూస్తున్నాను. (పట్టుకో)
4. సరళ పూలు కొంటున్నది. (పెట్టుకో)

**c. Response drill.**

**Model (i) :**

మీ కలాలు ఎక్కడున్నాయి ? (రవి, శర్మ)
కొన్ని శర్మ దగ్గరున్నాయి. కొన్ని రవి దగ్గరున్నాయి.

1. నా కాయితాలు ఎక్కడున్నాయి ? (సరళ, విమల)
2. మన ఫోటోలు ఎక్కడున్నాయి ? (గోపి, రాము)
3. మా ఇళ్లు ఎక్కడున్నాయి ? (విజయవాడ, గుంటూరు)

**Model (ii) :**

పంచదార ఎవరికి కావాలి ? (నాకు, రవికి)
కొంత నాకు కావాలి, కొంత రవికి కావాలి.

1. ఉప్మా ఎవరికి కావాలి ? (నాకు, అతనికి)
2. సుశీల డబ్బు ఎక్కడున్నది ? (రవి దగ్గర, శర్మ దగ్గర)
3. పంచదార ఎవరు తీసుకొస్తున్నారు ? (సరళ, సుశీల)

**EXERCISES**

a. Answer the following questions based upon the text of the lesson.

1. సుబ్బరామయ్యగారి ఆరోగ్యం బాగా ఉన్నదా ?
2. కళ్లజోడు ఎవరు పెట్టుకుంటున్నారు ఎన్నిరోజులనించి ?
3. బాబు ఏం తాగుతున్నాడు ?

b. Fill up the blanks with ఎంత/ఎన్ని/కొంత/కొన్ని.

1. ఇది............పంచదార ?
2. ఇవి............పుస్తకాలు ?
3. ............పుస్తకాలు నీవి.
4. ............దూరం రైలు ప్రయాణం.
5. ............మైళ్లు బస్సు ప్రయాణం.

**c. Answer the following questions using the cue words given in the parentheses.**

1. సురేష్, శర్మ ఏం చేస్తున్నారు ? (కళ్ళజోడు—పెట్టుకో)
2. మనం ఏం చేస్తున్నాం ? (పుస్తకాలు—తీసుకో)
3. రవి ఏం చేస్తున్నాడు ? (నిద్రపో)
4. కమల ఏం చేస్తున్నది ? (కుర్చీలో—కూర్చో)

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| అలా | in that manner | బ్యాంకు | bank |
| ఆరోగ్యం | health | నిద్రపో | sleep(v) |
| గుండె | heart | తాగు | drink(v) |
| ఉండు | be, wait, stay(v) | నిల్చో | stand(v) |
| ఇంటివాడు | house owner | అన్నం | cooked rice, food |
| డబ్బు | money | వడ్డించు | serve food |
| కొంత | some (mass) | అరె ! | oh ! |
| నవ్వు | laugh(v) | ఏంరా ! | hey (masc. inferior) ! (attention drawer) |
| నవ్వు | laughter | | |

## GRAMMAR NOTES

50.1. —కో ending verbs, ఉండు 'be, stay, wait', నిల్చో 'stand' and కూర్చో 'sit' can also be identified as 'అసు group'* of bases, if not indicated otherwise.

50.2. The changes in this group of bases before a suffix beginning with త (besides the త of the suffix changing to ట) are as follows :

(i) ఉండు drops is final డు.

ఉండు → ఉం + తున్నాడు → ఉంటున్నాడు.

(ii) the final ఓ of the remaining bases changes to ఉం.

నిల్చో → నిల్చుం + తున్నాడు → నిల్చుంటున్నాడు.
కూర్చో → కూర్చుం + తున్నాడు → కూర్చుంటున్నాడు.
తీసుకో → తీసుకుం + తున్నాడు → తీసుకుంటున్నాడు.

50.3. ఇప్పుడిప్పుడు 'just recently' is a reduplicated form of ఇప్పుడు 'now'.

* అసు group of bases : [i] $(C)\bar{V}$ సు type of bases (optional consonant, short vowel and సు), [ii] ఓ ending bases except పో and [iii] ఉండు.

50.4. అలా 'that way, like that' is the corresponding remote manner adverb of ఇలా 'this way, like this', the proximate manner adverb (41.10.) Like ఇలా this also adds some locative shade of meaning to the verb when the verb is రా 'come' ఇవ్వు 'give' పో/వెళ్ళు 'go' etc.

| | |
|---|---|
| అలా రా. | 'Come in that way.' |
| అలా చూడు. | 'Look there.'<br>'Look at that point.'<br>'Look in that manner.' |
| అలా వెళ్ళు. | 'Go there.'<br>'Go in that way.' |
| అలా చదువు. | 'Read like that.'<br>'Read in that manner.' |
| అలా మాట్లాడకు. | 'Don't talk like that.'<br>'Don't talk in that manner.' |

50.5. -అరా is masculine inferior marker corresponding to -అండి. This is used with imperative singular (affirmative) form of the verb while addressing the intimate people, children and persons of inferior relationship.

| | | | |
|---|---|---|---|
| రా + అరా → రారా! | (41.7.) | 'Come !' | (inferior) |
| తిను + అరా → తినరా! | (41.6.) | 'Eat !' | |
| రా ! | | 'Come !' | (non-honorific) |
| తిను ! | | 'Eat !' | |
| రా + అండి → రాండి! | (41.7.) | 'Please come !' | (honorific) |
| తిను + అండి → తినండి! | (41.6 ) | 'Please eat !' | |

50.6. ఏంరా ! 'hey !' (masculine inferior singular) is used to attract the attention of the persons addresed. This is used to address people who are very much lower in status or intimate, and children. (38.7.)

50.7. కొంత 'some' is the neuter indefinite mass pronoun/adjective.

| | |
|---|---|
| కొంత డబ్బు | 'some money' |
| కొంత పంచదార | 'some sugar' |

Recall the neuter indefinite count pronoun కొన్ని (24.1.) which is used to denote countable objects where as కొంత is used to denote uncountable mass nouns.

కొన్ని పుస్తకాలు 'some books'

కొంత పంచదార 'some sugar'

**50.8.** –నుంచి the ablative case suffix (39.1.) is used with time expressing nouns also in this lesson. Recall that this suffix was used with place nouns in lesson 39.

నాలుగు గంటలనుంచి చదువుతున్నాను

'I have been reading since 4 o'clock.'

**50.9.** డబ్బు 'money' is used for large amount of money and డబ్బులు 'money' (lesson 44) is for small amount of money.

అతని దగ్గర డబ్బు ఉంది. 'He has lot of money.'

అతని దగ్గర డబ్బు లేదు. 'He has no money' (He is not a rich man/ He doesn't have money with him.)

అతని దగ్గర డబ్బులు ఉన్నాయి. 'He has money (which is not a large amount).'

అతని దగ్గర డబ్బులు లేవు. 'He has no money.' (This sentence doesn't mean that he is a poor man.)

# REVIEW 6

## Lesson 51

మైసూరు,
ఆగస్టు 25, 1980.

Mysore,
August 25, 1980.

ప్రియమైన నాన్నగారికి నమస్కారం.

My dear father,

ఇక్కడ నేను క్షేమం. అక్కడ మీరూ, అమ్మ, చిరంజీవి గిరిజా, మోహన్ క్షేమంగా ఉన్నారా ? మైసూరులో వాతావరణం బాగా బాగుంది. చల్లగా ఉంది. ఇప్పుడు ఇక్కడ వర్షాకాలం.

Regards. I am doing well here. I hope you, mother, *Chiranjiivi* Girija and Mohan are doing well. The climate in Mysore is fine. This is rainy season here now and it is cold.

మాకు క్లాసులు బాగా జరుగుతున్నాయి. కొత్త భాష కాబట్టి ఉత్సాహంగానే ఉంది. నేనిక్కడ హాస్టల్లో ఉంటున్నాను. మా హాస్టలు ఇన్స్టిట్యూట్

Our classes are on the full swing. It is interesting to learn because it is a new language. I am residing in the hostel. Our hostel is located about a mile from

నించి సుమారు మైలు దూరంలో ఉన్నది. హాస్టల్లో మెస్సు ఉంది. మెస్సులో ఎక్కువగా అన్నం పెడుతున్నారు. ఇక్కడి ప్రజల ఆహారం అన్నం. నేను గూడా మెల్లగా ఇక్కడి పరిస్థితికి అలవాటు పడుతున్నాను. గిరిజ స్కూలుకు వెళ్తున్నదా? ప్రతి ఆదివారం తమ్ముడు ఇంటికి వస్తున్నాడా? వాడి పరీక్ష సంగతి వెంటనే రాయండి. వాడికి గూడా స్కూలు అడ్రసుకు ఉత్తరం రాస్తున్నాను. నా స్వెట్టరు నా దగ్గర లేదు. బహుశ అది ఇంట్లోనే ఉండాలి. ఇక్కడ చాలా చలిగా ఉంది. నాకు స్వెట్టరు కావాలి. వెంటనే దాన్ని పోస్టులో పంపండి. అమ్మగారికి నమస్కారాలు. పిల్లలకు ఆశీస్సులు. వెంటనే ఉత్తరం రాయండి.

ఇంతే సంగతులు

ఇట్లు
మీ కుమారుడు,
వినోద్ కుమార్.

our institute. There is a mess in the hostel. Rice is served more (often and in quantity) in the mess. The staple food of the people here is rice. I am also slowly getting accustomed to the situation here. Does Girija go to school regularly? Does my younger brother come home every Sunday? Please write to me about his examination soon. I am also writing to him to his school address. I don't have my sweater with me. Probably it is left at home. It is very cold here. I need the sweater. Please send it by post. Please give my regards to mother and blessings to the youngsters. Please reply immediately.

I close here.

Your son,
VINOD KUMAR.

## EXERCISES

a. Change the verbs of the following sentences into negative imperatives.

1. నువ్వు మెల్లగా మాట్లాడు.
2. రవిగారూ! మీరు కొత్త స్వెట్టరు కొనండి.
3. సుశీలా! నువ్వు ఆ పుస్తకం ఎక్కడున్నదో వెతుకు!
4. శర్మా! నువ్వు ఆ తలుపు మూయ్యి!
5. పాపా! నువ్వు ఆ తలుపు తియ్యి!
6. నువ్వు ఈ బిస్కెట్లు తీసుకో!
7. శారదా! రేపు నువ్వు మా ఇంటికి రా!

**b. Change the following as shown in the model.**

**Model :**

అన్నం తిను. నిద్రపో.
ముందు అన్నం తిను, తర్వాత నిద్రపో.

1. శర్మతో మాట్లాడు. ఈ పని చెయ్యి.
2. కుక్కను కొట్టు. తలుపు వెయ్యి.
3. లైటు వెయ్యి. కిటికీలు తియ్యి.

**c. Answer the following questions as shown in the model.**

Model (i) :

మీ ఊళ్లో ఎన్ని కాలేజీలున్నాయి?
మా ఊళ్లో ఒక కాలేజీ ఉంది.

1. మీ ఊళ్లో ఎన్ని గుళ్లున్నాయి?
2. మీ ఊళ్లో ఎన్ని బళ్లున్నాయి?
3. నీ దగ్గర ఎన్ని మామిడి పళ్లున్నాయి?
4. ఇక్కడ ఎన్ని ముళ్లున్నాయి?
5. ఆ కుక్కకు ఎన్ని కళ్లున్నాయి?
6. ఈ బొమ్మకు ఎన్ని కాళ్లున్నాయి?
7. ఈ బజార్లో ఎన్ని కొట్లున్నాయి?
8. ఆ బొమ్మకు ఎన్ని చేతులున్నాయి?

Model (ii) :

శర్మకు ఏం కావాలి? (చపాతీలు)
శర్మకు చపాతీలు కావాల్సిందే!

1. నారాయణకు ఎన్ని చపాతీలు కావాలి? (ఆరు)
2. ఇప్పుడు నువ్వు ఎక్కడికి వెళ్లాలి? (బెంగుళూరు)
3. రేపు రవి ఎవరితో మాట్లాడాలి? (మాష్టారితో)

Model (iii) :

నేనిప్పుడు ఏం చెయ్యాలి? (చపాతీ_ఉప్మా)
నువ్విప్పుడు చపాతీగానీ ఉప్మాగానీ చెయ్యి.

1. మేం ఇప్పుడు ఏ పుస్తకం కొనాలి? (తెలుగు_ఇంగ్లీషు)
2. నేనిప్పుడు ఎక్కడికి పోవాలి? (బజారు_కాలేజీ)
3. మేం రేపు ఎవరితో మాట్లాడాలి? (రవి_శర్మ)

**d. Fill up the blanks using కొంత or కొన్ని.**

1. శర్మకు...........పుస్తకాలు కావాలి.
2. సుశీల దగ్గర...........డబ్బుంది.
3. ...........దూరం నేను వెళ్ళాలి.
4. మా ఊరు ఇక్కడినుంచి...........మైళ్ల దూరంలో ఉంది.

**e. Fill up the blanks with suitable case suffixes.**

1. నేను సుశీల...........మాట్లాడాలి.
2. సుగుణ...........కాఫీ అలవాటు.
3. పాప బాబును పుస్తకం...........కొడుతున్నది.
4. ఈ అడ్రసు...........ఒక ఉత్తరం రాయి.
5. సుశీల తారచి...........డబ్బులు అడుగుతున్నది.

**f. Combine the following.**

1. ఇల్లు + లో =
2. కొట్టు + లో =
3. కన్ను + లో =
4. కళ + లో =
5. బడి + లో =
6. చెయ్యి + లో =
7. మీరు + ని =

**g. Match the following.**

| A | | B | |
|---|---|---|---|
| 1. | సుశీల | చదువుతున్నాం | (   ) |
| 2. | మాష్టరుగారు | పరిగెత్తుతున్నాయి | (   ) |
| 3. | నువ్వు | అన్నం తింటున్నది | (   ) |
| 4. | కుక్కలు | మాట్లాడుతున్నావు | (   ) |
| 5. | నేను | జరుగుతున్నాడు | (   ) |
| 6. | అతను | వస్తున్నాను | (   ) |
| 7. | మనం | తొందరగా వెళ్ళండి | (   ) |
| 8. | మీరు | ఉత్తరం రాస్తున్నారు | (   ) |

**h. Give your responses to the following sentences as shown in the model :**

**Model (i):**

శర్మ పాఠం చదువుతున్నాడు.
అయితే నువ్వు గూడా చదువు.

1. సుబ్బారావు శర్మతో మాట్లాడుతున్నాడు.
2. సుశీల ఉత్తరం రాస్తున్నది.
3. వాళ్లు హాస్టల్లో ఉంటున్నారు.
4. పిల్లలు పూలు కొంటున్నారు.
5. పాప బిస్కెట్లు తీసుకుంటున్నది.
6. రవి కుక్కను కొడుతున్నాడు.

**Model (ii) :**

అతను దొంగ.
అతను దొంగ కాదు. దొంగలాగా ఉన్నాడు.

1. ఆమె శారద.
2. ఈమె మీ చెల్లెలు.
3. ఆయన మన ప్రిన్సిపాల్.
4. ఇది మన పుస్తకం.

i. Use the following verbs in your own sentences in present tense :

| | | |
|---|---|---|
| కొను | రాయి | చదువు |
| పెట్టు | కష్టపడు | అలవాటుపడు |
| పెట్టుకో | రా | తిను |

J. Change the following into adverbs and use them in your own sentences :

| | | |
|---|---|---|
| జాగ్రత్త | గట్టి | చలి |
| చలన | తొందర | కొత |

**VOCABULARY**

| | | | |
|---|---|---|---|
| ప్రియమైన | dear | కాబట్టి | because |
| క్షేమం | safe | ఉత్సాహం | interest |
| చిరంజీవి | long living | ప్రజలు | people |
| వాతావరణం | climate | ఆహారం | food |
| వర్షాకాలం | rainy season | పరిస్థితి | situation |
| జరుగు | take place, occur | అలవాటుపడు | accustom, habituate |

| | | | |
|---|---|---|---|
| పరీక్ష | examination | పోస్టు | post |
| సంగతి | matter, news | పంపు | send |
| వెంటనే | immediately | ఆశీస్సు | blessing |
| స్వెట్టరు | sweater | ఇట్లు | saying so |
| బహుశ | perhaps | కుమారుడు | son |

**NOTES :**

51.1. ప్రియమైన 'dear' is used to express affection, love and intimacy. This is used in letters.

51.2 చిరంజీవి 'long living' is used in letters to refer to children.

51.3. ఇట్లు 'saying so' is used in letters before conclusion.

# UNIT 13

## Lesson 52

| | |
|---|---|
| రవి : మాష్టరుగారూ ! నేను లోపలికి రావచ్చా ? | May I come in, sir ? |
| మాష్టరు : రా ! అక్కడ మోహన్ ఏం చేస్తున్నాడు ? | Yes. Come in. What is Mohan doing there ? |
| రవి : కిటికీలోనుంచి రోడ్డు వైపు చూస్తున్నాడు. | He is looking at the road through the window. |
| మాష్టరు : రోడ్డు మీద ఏమున్నది ? | What is there on the road ? |
| రవి : రోడ్డు మీద జనం గుమిగూడుతున్నారు. | A crowd of people is gathering on the road. |
| మాష్టరు : ఎందుకు ? | Why ? |
| రవి : అక్కడ ఏదో వింత జరుగుతున్నది. ఒక అబ్బాయి కాయితాలతో రకరకాల పూలు తయారు చేస్తున్నాడు. | Something is happening there. Someone is making different kinds of flowers with paper. |
| మాష్టరు : మోహన్ ! వింత తర్వాత చూడవచ్చు. ముందు పాఠం విను. | Mohan! You can watch the fun later but pay attention to the lesson first. |

## DRILLS

**a. Substitution drill.**

**Model (i) :**

రవి కిటికీలోనించి చూస్తున్నాడు. (గది)

రవి గదిలోనించి చూస్తున్నాడు.

1. పాప ఇంట్లోనించి వస్తున్నది. (స్కూలు)
2. కమల గదిలోనించి మాట్లాడుతున్నది. (ఇల్లు)
3. అతను పెట్టెలోనించి తీస్తున్నాడు. (సంచీ)

**Model (ii) :**

నేను ఇప్పుడు అన్నం తినవచ్చా ?

చపాతీలు చెయ్యి

నేను ఇప్పుడు చపాతీలు చెయ్యవచ్చా ?

పాఠం చదువు.

పాట పాడు.

ఇంటికి వెళ్లు.

**b. Response drill.**

**Model :**

రవి ఎటు చూస్తున్నాడు ?

రవి నా వైపు చూస్తున్నాడు.

1. శర్మ ఎటు వెళ్తున్నాడు ? (బజారు)
2. సుశీల ఎటు చూస్తున్నది ? (కమల)
3. మీరు ఎటు వెళ్తున్నారు ? (గుడి)
4. శర్మ ఎటునించి వస్తున్నాడు ? (స్కూలు)

## EXERCISES

**a. Answer the following questions as shown in the model.**

**Model :**

మీరు ఎక్కడికి వెళ్తున్నారు ? (మా హాస్టలు)

నేను మా హాస్టలు వైపు వెళ్తున్నాను.

1. సరోజ ఎటు చూస్తున్నది ? (బోర్డు)
2. రవిని శర్మ ఎక్కడికి తీసుకుపోతున్నాడు ? (ఆ చెట్టు)
3. మీరు ఎవరి వైపు చూస్తున్నారు ? (వాడు)

b. Complete the following sentences as shown in the model.

Model :

శర్మ వచ్చాడు. మీరు అతనితో ......... (మాట్లాడు)

శర్మ వచ్చాడు మీరు అతనితో మాట్లాడవచ్చు.

1. రైలు వచ్చింది. మీరు ...........(ఎక్కు)

2. ఇప్పుడు టైం 12 గంటలు. మీరు అన్నం ......... (తిను)

3. సరళ పూలు కోస్తున్నది. మీరు పళ్లు ......... (కొయ్యి)

c. Answer the following questions based upon the text of the lesson.

1. మోహన్ పాఠం వింటున్నాడా ?
2. మోహన్ ఏం చేస్తున్నాడు ?
3. రోడ్డు మీద జనం ఏం చేస్తున్నారు ?
4. అప్పాయి దేనితో బొమ్మలు చేస్తున్నాడు ?

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| రోడ్డు | road | రకరకాలు | different types |
| గుమిగూడు | gather (v. intr.) | తయారు చెయ్యి | prepare, make (v) |
| వింత | fun, strange | పాఠం | lesson |

## GRAMMAR NOTES

52.1. In this lesson directional case suffix -వైపు is introduced.

నా వైపు చూడు. 'Look towards me.'

స్కూలు వైపు వెళ్లు. 'Go towards the school.'

52.2. -లోనుంచి (locative case suffix లో, 22.1., + నుంచి ablative case suffix, 39.1.) means 'through'.

కిటికీలోనుంచి చూడు. 'Look through the window.'

52.3. In this lesson -వచ్చు form of the verb ('may' form) is also introduced. -వచ్చు form of the verb is used to sanction permission. It is also used with interrogative marker -ఆ to request permission.

శర్మ బైటికి వెళ్ళ వచ్చు. 'Sarma is permitted to go out.'
నేను లోపలికి రావచ్చా? 'May I come in ?'

52.3.1. _వచ్చు is added to the infinitive form of the verb.

వెళ్ళ — వచ్చు 'One may go.'
రా — వచ్చు 'One may come.'

52.3.2. Infinitive is a type of verbal base to which certain auxiliary verbs are added. _అ is added to the base to form infinitive form.

Infinitive → verbal base + అ

వెళ్ళు + అ → వెళ్ళ
*veḷḷu + a → veḷḷa* (41.6.)
తిను + అ → తిన
*tinu + a → tina*

రా + అ → రా
*raa + a → raa* (41.7.)
తీసుకో + అ → తీసుకో
*tiisukoo + a → tiisukoo*

చదువు + అ → చదవ
*caduvu + a → cadava* (43.2.; 41.6.)

52.4. Notice the use of the instrumental case suffix _తో (48.6.) in sentences like :

కాయితంతో పూలు తయారు చేస్తున్నాడు.
'He is making flowers with paper.'

In such sentences, the noun denoting the 'material used to prepare something' takes the instrumental case, though it is not the instrument as in the case of the following sentence :

అతను కత్తితో కోస్తున్నాడు. 'He is cutting with a knife.'

# UNIT 13

## Lesson 53

| | |
|---|---|
| శర్మ : ఏం ప్రసాద్ ! కళ్లజోడు ఎన్ని రోజుల నించి పెట్టుకుంటున్నావు ? నువ్వు కళ్లజోడు పెట్టుకోటం ఇప్పుడే చూస్తున్నాను. | Hello! Prasad! How long have you been wearing glasses? I see you wearing for the first time just now. |
| ప్రసాద్ : నాలుగు రోజులనించే పెట్టుకుంటున్నాను. మీ పేటలో ఇళ్లు ఖాళీగా ఉన్నాయా ? | I started wearing them for the last four days only. Do you have any quarters vacant in your area? |
| శర్మ : ఎందుకు ? | Why? |
| ప్రసాద్ : నాకు కావాలి. | I want one. |
| శర్మ : ఏం ? మీ ఇల్లు బాగానే ఉంది గదా ! | What? Your house is alright. Isn't it? |
| ప్రసాద్ : ఇల్లు బాగానే ఉంది. కాని ఉండటం చాలా కష్టంగా ఉంది. | The house is good but it is getting difficult to stay in that house. |

శర్మ : ఏం ? ఇంటివాడు మంచివాడు కాదా ?

Why ? Is not your landlord a good man ?

ప్రసాద్ : ఇంటివాడు మంచివాడే. కాని ఇల్లంతా చీకటి. వెలుతురు లేదు. ఎప్పుడూ లైటు ఉండాలి. అంతే కాదు. ఆఫీసుకు చాలా దూరంగూడా ! రావటం పోవటం ఎంతో కష్టం.

The landlord is good. But the house is entirely dark. We have to keep the light on always. That is not all. It is also far off from the office. I find it very difficult to go and come back.

శర్మ : మీ పేటలో ఇళ్ల కంటె మా పేటలో ఇళ్ల అద్దెలు ఎక్కువ.

The house rents are higher in our area than in your area.

ప్రసాద్ : అయితే ఏం ? మా పేటలో ఇళ్ల కంటె మీ పేటలో ఇళ్లు బాగున్నాయి. పెద్దవి గూడా. మీ ఇంటివాడు మంచివాడేనా ?

So what ? The houses in your locality are more convenient than in our locality. They are big too. Is your landlord a good man ?

శర్మ : ఆ ! మా పేటలో అందరూ మంచివాళ్లే. చెడ్డవాళ్లే లేరు. మా ఇంటి పక్కన ఒక ఇల్లుంది, రా !

Yeah ! All people in our locality are good. None is bad. We have one house vacant beside my house. Come with me.

ప్రసాద్ : ఇప్పుడు నాకు టైం చాలదు. బస్సు గూడా ఉందో లేదో ! రేపు మా తమ్ముడు అటు రావాలి. వాడికి మీ పేటలో కొంచెం పని వుంది. అప్పుడు వాడికి చూపించు.

I don't have time now. And I don't know whether bus is available or not now. My brother will have to come to your locality tomorrow. He has some work there. You can show it to him then.

## DRILLS

a. Repetition drill.

గీతా ! నువ్వు ఆ కుర్చీలో కూర్చోటం ఎంతో కష్టం.

సరళా ! నువ్వు మల్లెపూలు పెట్టుకోటం ఇప్పుడే చూస్తున్నాను.

రవీ ! పగలు నిద్రపోవటం మంచిది కాదు.

గోపీ ! రేపు అటు పోవటం చాలా కష్టం.

గిరిజా ! మీ ఇంటికి రావటం నాకు ఎంతో ఇష్టం.

శర్మా ! ఎక్కువగా తినటం మంచిది కాదు.

చీకట్లో వెళ్లటం మంచిది కాదు.

ఈ పుస్తకం అతనికి చూపించటం మంచిది కాదు. నాకు చూపించు.

అందరూ మంచి వాళ్ళే.
ఎప్పుడూ తినటం మంచిది కాదు.
గది అంతా చీకటి.
ఇల్లంతా బాగున్నది.

శర్మ కంటె రవి మంచివాడు.
సుబ్బారావు కంటె శర్మ పెద్దవాడు.
నీ కంటె నేను చిన్నవాణ్ణి.

నా పుస్తకం కంటె నీ పుస్తకం ఖరీదు ఎక్కువ.
మా ఇంటి కంటె మీ ఇల్లు పెద్దది.

శర్మ అక్కడ ఉన్నాడో లేదో !
ఇప్పుడు బస్సు ఉందో లేదో !
నా సంచిలో డబ్బులు ఉన్నాయో లేవో !
మా నాన్నగారు ఇప్పుడు ఇంట్లో ఉన్నారో లేరో !

b. **Build-up drill.**

చూస్తున్నాను.
ఇప్పుడే చూస్తున్నాను.
తినటం ఇప్పుడే చూస్తున్నాను.
పూరీలు తినటం ఇప్పుడే చూస్తున్నాను.
నువ్వు పూరీలు తినటం ఇప్పుడే చూస్తున్నాను.

ఉండాలి.
లైటు ఉండాలి.
ఎప్పుడూ లైటు ఉండాలి.
గదిలో ఎప్పుడూ లైటుండాలి.
మా గదిలో ఎప్పుడూ లైటుండాలి.

కష్టం.
ఎంతో కష్టం.
పోవటం ఎంతో కష్టం.
రావటం పోవటం ఎంతో కష్టం.
ఆఫీసుకు రావటం పోవటం ఎంతో కష్టం.
ఇంటినించి ఆఫీసుకు రావటం పోవటం ఎంతో కష్టం.

బాగున్నాయి.
పుస్తకాలు బాగున్నాయి.
మీ పుస్తకాలు బాగున్నాయి.
మా పుస్తకాల కంటె మీ పుస్తకాలు బాగున్నాయి.

c. **Substitution drill.**

**Model (i) :**

ఈ గదిలో తినటం మంచిది కాదు.
ఉండు
ఈ గదిలో ఉండటం మంచిది కాదు.
నిద్రపో
కూర్చో
నిల్చో
చదువు

**Model (ii) :**

రవి ఆ గదిలో ఉన్నాడో లేదో !
సీత
సీత ఆ గదిలో ఉన్నదో లేదో !
శర్మగారు
నా కుక్క
రవి పుస్తకాలు
మీరు

**Model (iii) :**

రవి కంటె శర్మ చిన్నవాడు. (పెద్ద)

రవి కంటె శర్మ పెద్దవాడు.

1. నా పుస్తకం కంటె నీ పుస్తకం పెద్దది. (కొత్త)
2. అతని కంటె ఇతను పెద్దవాడు. (మంచివాడు)
3. ఈ కాఫీ కంటె ఆ కాఫీ మంచిది. (వేడి)

**d. Interlocked substitution drill.**

**Model :**

శర్మ కంటె సుబ్బారావు చిన్నవాడు.

సీత

శర్మ కంటె సీత చిన్నది.

నేను

నా కంటె సీత చిన్నది

పెద్ద

నా కంటె సీత పెద్దది.

నాకంటె సీత పెద్దది.

రవి..................

.........సురేష.........

అతను..................

.........సరళ.........

.....................చిన్న

**e. Response drill.**

**Model (i):**

రవీ! ఇప్పుడు నువ్వు స్కూలుకు వెళ్తున్నావా?

ఇప్పుడు స్కూలుకు వెళ్లటం చాలా కష్టం.

1. సుగుణా నువ్వు ఇప్పుడు పూలు కోస్తున్నావా?
2. శారదా! ఇప్పుడు కలం కొంటున్నావా?
3. విమలా! ఇప్పుడు మా ఇంటికి పోతున్నావా?
4. సుశీలా! కళ్లజోడు పెట్టుకుంటున్నావా?
5. రమా! ఆ కుర్చీలో కూర్చుంటున్నావా?
6. ఉమా! రమను తీసుకొస్తున్నావా?

**Model (ii) :**

లైటు ఎప్పుడు ఉండాలి?

లైటు ఎప్పుడూ ఉండాలి.

1. శర్మకు కాఫీ ఎప్పుడు కావాలి?
2. శారదకు డబ్బులు ఎప్పుడు కావాలి?
3. ఎప్పుడు చదవటం మంచిది కాదు?

## EXERCISES

a. Answer the following questions based upon the text of the lesson.

1. ప్రసాద్ కళ్లజోడు ఎన్ని రోజులనుంచి పెట్టుకుంటున్నాడు ?
2. ప్రసాద్‌కు ఆ ఇంట్లో ఉండటం ఎందుకు కష్టంగా ఉంది ?

b. Make at least 10 sentences using కంటె bringing out the comparison among గిరి, రవి, శర్మ and సురేష్.

గిరికి మూడేళ్లు.
రవికి రెండేళ్లు.

ంవేళ్లు.

Model :

గిరి కంటె రవి చిన్నవాడు.
రవి కంటె గిరి పెద్దవాడు.

c. Fill up the blanks with the gerund forms of the verbs given in the parentheses.

Model :

రవికి పుస్తకం ......... (ఇవ్వు) మంచిది కాదు.
రవికి పుస్తకం ఇవ్వటం మంచిది కాదు.

1. ఈ పని .........(చెయ్యి) ఎంతో కష్టం.
2. పగలు ..........(నిద్రపో) మంచిది కాదు.
3. అక్కడ .........(ఉండు) చాలా కష్టం.
4. బస్సులో .........(చదువు) ఎంతో కష్టం.
5. ఆ కళ్లజోడు .........(పెట్టుకో) మంచిది.
6. ఎండలో మీ ఇంటికి .........(రా) చాలా కష్టం.
7. చీకటిలో ఆ దోవలో ..........(పో) మంచిది కాదు.

d. Answer the following questions as shown in the model.

Model (i):

నిన్న రవి ఇంట్లో ఉన్నాడా ?
నిన్న రవి ఇంట్లో ఉన్నాడో లేదో !

1. అక్కడ నా పుస్తకం ఉన్నదా ?
2. సుజాతా వాళ్లు ఇప్పుడు ఇంట్లో ఉన్నారా ?
3. అతని జేబులో డబ్బులు ఉన్నాయా ?
4. సుబ్బారావు ఇప్పుడు గుంటూరులో ఉన్నాడా ?

Model (ii) :

శర్మకు ఎప్పుడు టీ కావాలి ?
శర్మకు ఎప్పుడూ టీ కావాలి.

1. ఎప్పుడు చెట్టెక్కటం మంచిది కాదు ?
2. నీకు ఎప్పుడు మంచినీళ్లు కావాలి ?
3. సుశీలకు ఎప్పుడు పుస్తకాలు కావాలి ?

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| కష్టం | difficulty | చెడ్డ | bad |
| అంతా | all over, every where | చూపించు | show |
| చీకటి | darkness | ఎప్పుడూ | always |
| వెలుతురు | light (N) | ఆటో | autorickshaw |
| ఆఫీసు | office | | |

## GRAMMAR NOTES

53.1. In this lesson the gerund form of the verb is introduced. Gerund is a type of verbal noun expressing the actual action of the verb. -అటం/-వటం is added to the verbal base to form gerund in Telugu.

తినటం 'eating'

రావటం 'coming'

53.1.1. -వటం is added to the monosyllabic bases like రా 'come', పో 'go' etc. (The compound verbal bases which are formed by adding రా and పో i.e., తీసుకురా 'bring', తీసుకుపో 'take away', నిద్రపో 'sleep', పారిపో 'run away' etc., will behave like రా and పో.)

| | |
|---|---|
| రా-వటం | 'coming' |
| పో-వటం | 'going' |
| తీసుకురా-వటం | 'bringing' |
| నిద్రపో-వటం | 'sleeping' |
| పారిపో-వటం | 'running away' |

53.1.2. -అటం is added to the other bases.

| | |
|---|---|
| తిను + అటం → తినటం | 'eating' (41.6) |
| తీసుకో + అటం → తీసుకోటం | 'taking' (41.7) |

53.2. Comparative marker -కంటె is also introduced in this lesson. This is used to compare two or more objects.

| | |
|---|---|
| శర్మకంటె రవి పెద్దవాడు | 'Ravi is older than Sarma.' |
| నీ పుస్తకం కంటె నా పుస్తకం చిన్నది. | 'My book is smaller than your book' |

53.3. Notice the use of the dubitative marker -ఓ (32.2) in the sentences like:

| | |
|---|---|
| ఇప్పుడు బస్సు ఉందో లేదో । | 'Whether or not there is a bus now.' |
| అతను సుబ్బారావో కాదో । | 'Whether or not he is Subbarao.' |

Here, it expresses uncertainty.

# UNIT 13

## Lesson 54

| | |
|---|---|
| గోపా : పాపా ! నీ అక్కయ్య ఏం చేస్తున్నదమ్మా ? | Papa ! What's your elder sister doing now? |
| పాప : పెద్దక్కయ్య వంట ఇంట్లో ఉన్నదండీ. వంట చేస్తున్నది. చిన్నక్కయ్య పక్కవాళ్ల అమ్మాయితో ఆడుతున్నది. దానికి ఎప్పుడూ ఆటలేనండీ ! | The eldest sister is in the kitchen, sir. She is cooking. The elder sister is playing with a girl from next door. She always plays. |
| గోపా : నువ్వు కూడా ఆడు. | You can also play. |
| పాప : ఉదయం ఆడటం మంచిది కాదండీ ! | Playing in the morning is not good, sir. |
| గోపా : అలాగా ! నువ్వు చాలా మంచిదానివి. నీ పేరేమిటి, చెప్పు ! | Oh ! You are a good girl. What is your name ? |
| పాప : సుగుణ. నేను మంచిదాన్ని, మా అక్కయ్య మంచిది కాదండీ. | Suguna. I am a good girl. My elder sister is not a good girl. |

గోపా : మీరు ఇద్దరూ మంచివాళ్ళే. నువ్వు ఇప్పుడు ఏం చదువుతున్నావు ?

Both of you are good. What are you studying presently ?

పాప : ఇప్పుడు నేను చదవటం లేదండీ. పుస్తకానికి అట్ట వేస్తున్నాను.

I am not studying anything now, sir. I am putting on a wrapper to this book.

గోపా : అదికాదమ్మా ! నువ్వు ఇప్పుడు ఎన్నో తరగతి చదువుతున్నావు అంటున్నాను.

No, not that my dear! What class are you in now ? That is my question.

పాప : రెండో తరగతి చదువుతున్నానండీ.

I am in the second standard, sir.

గోపా : అలాగా ! ఇప్పుడు మీ బళ్ళో ఏం పాఠం చెప్తున్నారు ?

Oh ! What lesson is taught to you in the school now ?

పాప : ఇప్పుడు పాఠాలు చెప్పటం లేదండీ. కథలు, పాటలు చెప్తున్నారు.

They are not teaching any lessons now. They are telling stories and giving rhymes to practice.

గోపా : ఏది, ఒక పాట పాడు.

Then, sing a rhyme.

పాప : పాడుతున్నాను వినండి.

I will sing ; listen sir.

## DRILLS

a. Repetition drill.

నేను ఆడుతున్నాను.
నువ్వు ఆడటం లేదు.

అతను రాస్తున్నాడు.
ఇతను రాయటంలేదు.

ఆమె తింటున్నది.
ఈమె తినటం లేదు.

పాటలు చెప్తున్నారు.
పాఠాలు చెప్పటంలేదు.

కథలు మంచివి.
నేను మంచివాణ్ని.
నువ్వు మంచి దానివి.
మీ చెల్లెళ్లు మంచి వాళ్లు.
మనం మంచివాళ్లం.

**b. Build-up drill.**

ఆటలే.

ఎప్పుడూ ఆటలే.

రవికి ఎప్పుడూ ఆటలే.

అంటున్నాను.

చేస్తున్నావంటున్నాను.

ఏం చేస్తున్నావంటున్నాను.

ఇప్పుడేం చేస్తున్నావంటున్నాను.

నువ్విప్పుడేం చేస్తున్నావంటున్నాను.

లేదు.

ఆడటం లేదు.

ఆటలు ఆడటం లేదు.

అమ్మాయితో ఆటలు ఆడటం లేదు.

పక్కవాళ్ల అమ్మాయితో ఆటలు ఆడటం లేదు.

సీత పక్కవాళ్ల అమ్మాయితో ఆటలు ఆడటం లేదు.

c. Substitution drill.

Model (i):

రవి పాడటం లేదు.

సీత

సీత పాడటం లేదు.

నేను

నువ్వు

మేం

మనం

మీరు

వాడు

ఆయన

వాళ్లు

అవి

Model (ii) :

నేను అడగటం లేదు.

తిను

నేను తినటం లేదు.

చదువు

కొయ్య

ఆడు

పరిగెత్తు

చూడు

రాయి

రా

పో

కూర్చో

తీసుకో

**Model (iii) :**

రవికి ఎప్పుడూ ఆటలే.
పాటలు
రవికి ఎప్పుడూ పాటలే.
పుస్తకాలు.
నాటకాలు
చపాతీలు
సినిమాలు
కథలు

**Model (iv) :**

పుస్తకంలో ఏముంది ?
కొట్టు
కొట్లో ఏముంది ?
గుడి
బడి
డబ్బు
కళ్ళు
ఇల్లు
పెట్టె

**d. Interlocked substitution drill.**

**Model :**

సరళ మంచిది.
........పెద్ద
సరళ పెద్దది.
నేను........
నేను పెద్దదాన్ని.
........కొత్త
నేను కొత్తదాన్ని.
నువ్వు........
నువ్వు కొత్తదానివి.
........చిన్న
నువ్వు చిన్నదానివి.
మీరు............
మీరు చిన్నవాళ్ళు.

ఈ పెన్సిలు కొత్తది.
... ........పెద్ద.
మీ అమ్మాయి........
నేను............... ....
.......చిన్న............
నువ్వు........... ........
........మంచి............
మనం................
................పెద్ద
ఆమె....................
. ..............కొత్త
మీరు... ................
వాళ్ళు....................

**e. Response drill.**

**Model (i) :**

అట్ట దేనికి వేస్తున్నావు ? (పుస్తకం)
అట్ట పుస్తకానికి వేస్తున్నాను.

1. ఎక్కడికి వెళ్తున్నావు ? (నాటకం)
2. రవి ఎక్కడికి వెళ్తున్నాడు ? (శివాలయం)
3. శర్మ ఎందుకు మందు తీసుకుంటున్నాడు ? (ఆరోగ్యం)
4. నువ్వు ఎందుకు మందు తీసుకుంటున్నావు ? (జ్వరం)

**Model (ii) :**

రవీ : మీ తమ్ముడు ఆరో తరగతి చదువుతున్నాడా ? (మూడు)

ఆరో తరగతి చదవటం లేదండీ : మూడో తరగతి చదువుతున్నాడు.

1. సరళా : నువ్వు రెండో తరగతి చదువుతున్నావా ? (ఒకటి)
2. సుశీలా : నువ్వు ఎనిమిదో తరగతి చదువుతున్నావా ? (ఏడు)
3. శర్మా : నువ్వు పదో తరగతి చదువుతున్నావా ? (తొమ్మిది)

**Model (iii) :**

రవీ : నువ్వు అన్నం తింటున్నావా ?

లేదండీ : నేను అన్నం తినటం లేదు.

1. శర్మా : రతిరామ్ నీ గదిలో ఉంటున్నాడా ?
2. శేషూ : ఇప్పుడు నువ్వు నాటకానికి పోతున్నావా ?
3. శర్మా : పిల్లి చెట్టు ఎక్కుతున్నదా ?
4. కమలా : లక్ష్మి నీ చెయ్యి పట్టుకుంటున్నదా ?

f. Transformation drill.

Model :

అతను పాటలు పాడటం లేదు.

అతను పాటలు పాడుతున్నాడు.

1. శర్మ ఇంటికి వెళ్లటం లేదు.
2. మాష్టరుగారు పాఠం చెప్పటం లేదు.
3. సుశీల అన్నం తినటం లేదు.
4. నేను నీకు నా పేరు చెప్పటం లేదు.

## EXERCISES

a. Answer the following questions based on the text of the lesson.

1. పాప పెద్దక్కయ్య ఏం చేస్తున్నది ?
2. పాప ఇప్పుడు ఏం చేస్తున్నది ?
3. ఇప్పుడు బళ్లో ఏం చేస్తున్నారు ? పాఠాలు చెప్తున్నారా ?

b. Change the following sentences into present negative.

1. రవి అన్నం తింటున్నాడు.
2. సరళ తలుపు వేస్తున్నది.
3. మోహన్ బడికి పోతున్నాడు.
4. కమల వంట చేస్తున్నది.
5. పాప కింద కూర్చుంటున్నది.

c. Answer the following questions using the cue words given in the parentheses.

అ :

1. రవి ఎక్కడికి వెళ్తున్నాడు ? (నాటకం)
2. మీరు ఎందుకు మందు తింటున్నారు ? (జ్వరం)
3. ఈ ఊళ్లో ఉండటం ఎవరికి కష్టంగా ఉంది ? (జనం)
4. గోపి ఎందుకు వస్తున్నాడు ? (అన్నం)

ఆ :

1. సుశీల ఏం చేస్తున్నది ? (కలం-కొను)
2. శర్మ ఏం చేస్తున్నాడు ? (కథ - చెప్పు)
3. మోహన్ ఏం చేస్తున్నాడు ? (పాఠం-చెప్పు)
4. మనం ఏం చేస్తున్నాం ? (వంట-చెయ్యి)

d. Substitute the adjectives with the ones suggested in the parentheses.

Model :

రవీ : సీత మంచిది. (పెద్ద)
రవీ : సీత పెద్దది.

1. సరళా : నువ్వు చిన్నదానివి. (మంచి)
2. గిరిజా నువ్వు మంచిదానివి. (పెద్ద)
3. కమలా మనం చిన్నవాళ్లం. (మంచి)

## VOCABULARY

| | |
|---|---|
| వంటయిల్లు | kitchen |
| వంట | cooking |
| ఆడు | play(v) |
| ఉదయం | morning |
| పాడు | sing |

## GRAMMAR NOTES :

54.1. In this lesson the present negative is introduced. The negative verb లేదు is added to the gerund form (c.f. 53.1.) of the verb to form the present negative.

| | |
|---|---|
| మాట్లాడటం లేదు | 'is not talking' |
| శర్మ నాతో మాట్లాడటం లేదు | 'Sarma is not talking to me' |
| నేను ఇప్పుడు గుంటూర్లో ఉండటం లేదు. | 'I am not living in Guntur now.' |

Notice that, unlike in present tense, there is no concord between the verb and the subject in present negative. For all the person-gender-number nouns లేదు is added to the gerund form.

నేను వెళ్తున్నాను.
'I am going.'

మేం వెళ్తున్నాం.
'We (excl.) are going'

మనం వెళ్తున్నాం.
'We (incl.) are going.'

నువ్వు వెళ్తున్నావు.
You (inf. sg.) are going.'

మీరు వెళ్తున్నారు.
'You (pl. & hon. sg.) are going.'

వాడు వెళ్తున్నాడు.
'He (inf. & eql. sg.) is going.'

ఆయన వెళ్తున్నారు.
'He (hon.) is going.'

అది/ఆమె వెళ్తున్నది.
'She (inf. & eql.) is going.'

ఆమె/ఆవిడ వెళ్తున్నారు.
'She (hon.) is going.'

వారు వెళ్తున్నారు.
'He/She (formal) is going.'

వాళ్లు వెళ్తున్నారు.
'They (human) are going.'

అది వెళ్తున్నది.
'It is going.'

అవి వెళ్తున్నాయి.
'They (neuter) are going.'

నేను వెళ్లటం లేదు.
'I am not going.'

మేం వెళ్లటం లేదు.
'We (excl.) are not going.'

మనం వెళ్లటం లేదు.
'We (incl.) are not going.'

నువ్వు వెళ్లటం లేదు.
'You (inf. sg.) are not going.'

మీరు వెళ్లటం లేదు.
'You (pl. & hon. sg.) are not going.'

వాడు వెళ్లటం లేదు.
'He (inf. & eql.) is not going.'

ఆయన వెళ్లటం లేదు.
'He (hon.) is not going.'

అది/ఆమె వెళ్లటం లేదు.
'She (inf. & eql.) is not going.'

ఆమె/ఆవిడ వెళ్లటం లేదు.
'She (hon.) is not going.'

వారు వెళ్లటం లేదు.
'He/She (formal) is not going.'

వాళ్లు వెళ్లటం లేదు.
'They (human) are not going.'

అది వెళ్లటం లేదు.
'It is not going.'

అవి వెళ్లటం లేదు.
'They (neuter) are not going.'

54.2. The verbal base చెప్పు 'say, narrate, inform' becomes చెప్_ when followed by a suffix beginning with త.

చెప్పు + తున్నా_ను → చెప్_తున్నా_ను → చెప్తున్నాను 'I am saying.'
*ceppu+ tunnaa-nu—cep-tuunaa-nu*

Remember that వెళ్ళు 'go' also reduces its final consonant cluster to a single consonant when followed by a suffix beginning with త. (46.2.).

వెళ్ళు + తున్నాను → వెళ్_తున్నాను → వెళ్తున్నాను 'I am going.'
*vellu+ tunnaa-nu—vel-tunnaa-nu*

54.3. Remember that _వాడు is a nominalizer and it is added to the adjectives to make masculine nouns (27.2.). _ది is the corresponding feminine nominalizer.

ఆమె మంచి_ది 'She is a good lady.'
అతను మంచి_వాడు 'He is a good man.' (27.2)
వాళ్ళు మంచి_వాళ్ళు 'They are good people.' (27.2.)

54.4. To form oblique base, the _ది ending nominalized forms change the final _ది to _దాని.

నువ్వు మంచిదాని_వి 'You are a good girl.' (7.4.)
నేను మంచిదాని_ని → నేను మంచిదాన్ని 'I am a good girl/woman.' (54.6.)

54.5. The అం ending nouns change the final అం to ఆని when followed by the accusative or dative case suffix.

పుస్తకం + accusative case → పుస్తకాని + accusative case
*pustakam* *pustakaani*

→ పుస్తకాని_ని → పుస్తకాన్ని
*pustakaani-ni* *pustakaanni* (54.6)

(The accusative suffix is ని for the ఇ/ఈ ending oblique bases, c.f. 43.4.)

కలం + dative case → కలాని + dative case → కలానికి
*kalam* *kalaani* *kalaani-ki*

(The dative case suffix is కి for the ఇ/ఈ ending oblique bases, c.f. 28.1.)

54.6. Notice the following Sandhi process :

దాని + ని → దాన్ని (accusative form of అది)

*daani+ni— daanni*

పుస్తకాని + ని → పుస్తకాన్ని (accusative form of పుస్తకం)

*pustakaani+ni→pustakaanni*

A short vowel between two identical consonants will be dropped.

# UNIT 14

## Lesson 55

| | |
|---|---|
| రవి : గోపీ ! నువ్వు చదువుతున్న పుస్తకం ఏమిటి ? | Gopi ! What is the book you are reading ? |
| గోపి : ........................................ | |
| రవి : వినిపించటం లేదా ? అన్నం తింటూ ఏమిటి చదువుతున్నావు ? | Are you not able to listen ? What are you reading while eating ? |
| గోపి : అన్నం తింటూ చదవటం లేదు. చదువుతూ అన్నం తింటున్నాను. | I am not reading while eating. I am eating my food as I am reading. |
| రవి : రెండూ ఒకటే. అట్లా అన్నం తింటూ నవల చదవకు. | Both are the same. Don't read the novel while you are eating. |
| గోపి : ఏం ? | Why ? |

| | |
|---|---|
| రవి : అన్నం తింటూ నవల చదవటం మంచిది కాదు. | Reading the novel while eating is not good. |
| గోపి : ఇది నవల కాదు. నీకు సరిగ్గా కనిపించటం లేదా ? | This is not a novel. Are you not able to see properly ? |
| రవి : కనిపిస్తున్నది. అది నవలే. అబద్ధమాడుతున్నావు. | I see it properly. That is a novel. You are lying. |
| గోపి : ఏమిటి ? పెద్దగా చెప్పు. నువ్వు అంటున్న మాటలు ఎవరికీ వినిపించటం లేదు. | What ? Say it aloud. It is not audible what you are saying. |
| రవి : నేను పెద్దగానే మాట్లాడుతున్నాను. నా మాటలు అందరికీ వినిపిస్తున్నాయి. అందరూ వింటున్నారు కూడా ! నువ్వు నవల చదువుతున్నావు. అందుకే నీకు వినిపించటం లేదు. అన్నం తిను. తర్వాత నవల చదువు. ఆపుతున్నావా లేదా ? ఏమిటి ఆలోచిస్తున్నావు ? | I am talking aloud only. My words are heard by all. All of them are listening to them also. You are reading a novel. That's why you could not hear. You stop reading that novel first. Take your food and then read the novel. Are you stopping or not ? What are you contemplating on ? |
| గోపి : నేను ఏమీ ఆలోచించటం లేదు. | I am not contemplating on anything. |
| రవి : సరే ! ముందు నాకీ విషయం చెప్పు ! నువ్వు సాయంత్రం ఎక్కడికి వెళ్తున్నావు ? | Alright. First tell me this. Where are you going this evening ? |
| గోపి : ఎక్కడికీ వెళ్లటం లేదు. | I am not going anywhere. |

## DRILLS

a. Repetition drill.

రవి అన్నం తింటూ చదువుతున్నాడు.

గోపి కాలేజీకి వెళ్తూ నాతో మాట్లాడుతున్నాడు.

ఆమె పూలు కోస్తూ శ్యామలతో మాట్లాడుతున్నది.

రవి చెప్తున్న మాటలు నాకు వినిపించటం లేదు.

సరళ పాడుతున్న పాట చాలా బాగున్నది.

నువ్వు తింటున్న చపాతీలు బాగున్నాయా ?

సరళ కోస్తున్న పూలు ఏం పూలు ?

రవి ఆలోచిస్తున్నాడు. నువ్వు గూడా ఆలోచించు.
లత అన్నం వడ్డిస్తున్నది. నువ్వు గూడా వడ్డించు.
నేను నీకు నా పుస్తకం చూపిస్తున్నాను. నువ్వు గూడా నీ పుస్తకం చూపించు.

**b. Build-up drill.**

లేదు.
వినిపించటం లేదు.
ఎవరికీ వినిపించటం లేదు.
మాటలు ఎవరికీ వినిపించటం లేదు.
అంటున్నమాటలు ఎవరికీ వినిపించటం లేదు.
నువ్వు అంటున్నమాటలు ఎవరికీ వినిపించటం లేదు.

చెయ్యి.
పని చెయ్యి.
ఈ పని చెయ్యి.
నువ్వీ పని చెయ్యి.
ముందు నువ్వీ పని చెయ్యి.
సరే, ముందు నువ్వీ పని చెయ్యి.

ఏమిటి ?
పుస్తకం ఏమిటి ?
చదువుతున్న పుస్తకం ఏమిటి ?
నువ్వు చదువుతున్న పుస్తకం ఏమిటి ?
రవీ ! నువ్వు చదువుతున్న పుస్తకం ఏమిటి ?

మాట్లాడుతున్నాడు.
రాస్తూ మాట్లాడుతున్నాడు.
ఉత్తరం రాస్తూ మాట్లాడుతున్నాడు.
అతనికి ఉత్తరం రాస్తూ మాట్లాడుతున్నాడు.
రవి అతనికి ఉత్తరం రాస్తూ మాట్లాడుతున్నాడు

**c. Substitution drill.**

**Model (i) :**

రవి పళ్లు తింటూ మాట్లాడుతున్నాడు.
ఏరు
రవి పళ్లు ఏరుతూ మాట్లాడుతున్నాడు.
తీసుకురా
తీసుకుపో
కోయ్య
కోసు
తీసుకో
చూపించు

**Model (ii) :**

నేను పుస్తకం చదువుతున్నాను. (చూపించు
నేను పుస్తకం చూపిస్తున్నాను.

1. రవి అన్నం తింటున్నాడు. (వడ్డించు)
2. సరళ చదువుతున్నది. (ఆలోచించు)
3. మనం పాఠం రాస్తున్నాం. (చూపించు)
4. నాకు సినిమా వినిపిస్తున్నది. (కనిపించు)

Model (iii) :

నువ్వు తీసుకోస్తున్న పుస్తకం రవిది.
చదువు
నువ్వు చదువుతున్న పుస్తకం రవిది.

రాయి
తీసుకుపో
అట్టవెయ్యి
చూడు

d. Response drill.

Model (i) :

రవి అన్నం తింటున్నాడా ?
మాట్లాడుతున్నాడా ?

a) రవి అన్నం తింటూ మాట్లాడుతున్నాడు.
b) రవి మాట్లాడుతూ అన్నం తింటున్నాడు.

1. సరళ నాటకం చూస్తున్నదా ?
టీ తాగుతున్నదా ?

2 గణపతి ఇంటికి ఎస్తున్నాడా ?
రవితో మాట్లాడుతున్నాడా ?

3. పోలీసులు దొంగలను కొడుతున్నారా ?
తీసుకుపోతున్నారా ?

4. మీరు మామిడిపళ్ళు తింటున్నారా ?
కోస్తున్నారా ?

Model (ii) :

నేను ఉత్తరం రాస్తున్నాను.
నువ్వు రాస్తున్న ఉత్తరం నాకు చూపించు.

1. నేను పుస్తకం కొంటున్నాను.
2. రవి చపాతీలు తింటున్నాడు.
3. సరళ మామిడిపండు కోస్తున్నది.
4. మేం పూలు ఏరుతున్నాం.
5. ఆమె కలం తీసుకుంటున్నది.

e. Transformation drill.

Model (i) :

నేను నీ పుస్తకం చూస్తున్నాను.
నీ పుస్తకం నాకు కనిపిస్తున్నది.

1. రవిని నేను చూస్తున్నాను.
2. నేను ఆ ఇళ్ళను చూస్తున్నాను.
3. నువ్వు గీస్తున్న బొమ్మ నేను చూస్తున్నాను.

Model (ii) :

నేను నీ పాట వింటున్నాను.
నీ పాట నాకు వినిపిస్తున్నది.

1. నీ మాటలు నేను వింటున్నాను.
2. రవి అంటున్నమాటలు నేను వింటున్నాను.
3. గీత పాడుతున్న పాట రవి వింటున్నాడు.

**EXERCISES**

**a.** Combine the following pairs of sentences using the adverbial participle as shown in the model :

Model :

నేను ఆలోచిస్తున్నాను. రాస్తున్నాను.
నేను ఆలోచిస్తూ రాస్తున్నాను.

1. రవి బడికి వెళ్తున్నాడు. గోపితో మాట్లాడుతున్నాడు.
2. కమల పండు తింటున్నది. పాఠం చదువుతున్నది.
3. విమల మాష్టరుగారిని చూస్తున్నది. వింటున్నది.
4. మోహన్ చెట్టు దిగుతున్నాడు. నన్ను చూస్తున్నాడు.
5. గోపి పుస్తకం తీసుకుంటున్నాడు. కాఫీ తాగుతున్నాడు.

**b.** Combine the following pairs of sentences using adjectival participles (relative participles) as shown in the model.

Model :

నేను పుస్తకం చదువుతున్నాను. అది చాలా బాగున్నది.
నేను చదువుతున్న పుస్తకం చాలా బాగున్నది.

1. రవి కాఫీ తాగుతున్నాడు. అది చేదుగా ఉన్నది.
2. కమల పుస్తకాలు కొంటున్నది. అవి తెలుగు పుస్తకాలు.
3. నువ్వు పండు తీసుకుంటున్నావు. అది మామిడిపండు.
4. మీరు సినిమా చూస్తున్నారు. అది కొత్తది.

**c.** Answer the following questions based upon the text of the lesson.

1. గోపి ఏం చేస్తున్నాడు ?
2. రవి మాటలు గోపికి ఎందుకు వినిపించటం లేదు ?
3. గోపి సాయంత్రం ఎక్కడికి వెళ్తున్నాడు ?

**VOCABULARY**

| | |
|---|---|
| అట్లా | in that manner |
| సరిగ్గా | exactly, correctly |
| కనిపించు | appear, be visible |
| అబద్ధమాడు | lie, give a false statement |
| వినిపించు | be audible |
| ఆపు | stop (v.,tr.) |
| ఆలోచించు | think |

**GRAMMAR NOTES :**

55.1. In this lesson participle forms of the verb are introduced. The participle is a derivative of the verbal base. It can be an adverbial participle or an adjectival participle.

Verbal Participle → verb + participle suffix
అడుగు + తున్న → అడుగుతున్న
అడుగు + తూ → అడుగుతూ

An adverbial participle is that form which functions as an adverb, i.e., it modifies a verb. Adjectival participle is that form which functions as an adjective, i.e., it qualifies a noun.

In other words, a derived form of a verb (i) which functions as an adverb is called adverbial participle and (ii) which functions as an adjective is called adjctival participle. The adjectival participle is also called relative participle.

55 2. _తూ is added to a verbal base to form *non-past/progressive adverbial participle.

చదువు_తూ తింటున్నాడు 'He is eating while readtng.'

తింటూ మాట్లాడుతున్నాడు 'He is talking while eating.'

(తిను + తూ → తింటూ 49.2.)

This nonpast adverbial participle expresses simultaneous action.

55.3. _తున్న is added to a verbal base to form **present/progressive adjectival participle

చదువు_తున్న పుస్తకం 'reading book'

తింటున్న మనిషి nominative or subjective case

(తిను + తున్న → తింటున్న 49.2.)

55.3.1. The adjectival participle can express various case relationships :

పండు తింటున్న మనిషి nominative or subjective case

'The man who is eating a fruit.'

నేను చూస్తున్న సినిమా objective or accusative case

(చూడు + తున్న → చూస్తున్న 48.2.)

'The film which I am seeing.'

* The adverbial participles can be in past or non-past tense. As this expresses the progression of the action, this can also be called progressive adverbial participle.

** As this expresses the progression or continuation of the action, this can also be called progressive adjectival participle.

నేను ఉంటున్న ఇల్లు — Locative case
(ఉండు + తున్న → ఉంటున్న 50.2.)
'The house which I am living in.'

etc.

55.4. ఇంచు ending bases change the final ఇంచు to ఇస్ when followed by a suffix beginnin with త.

వినిపించు–తున్నది → వినిపిస్ – తున్నది → వినిపిస్తున్నది
*vinipincu-tunnadi → vinipis-tunnadi* — 'It is audible.'

55.5. అట్లా is a variant of అలా. (50.4)

55.6. వినిపించు 'to be audible' and కనిపించు 'to be visible' take dative subject like defectiv verbs కావాలి, వద్దు, చాలు etc. (37.1.)

| | |
|---|---|
| నాకు వినిపిస్తున్నది. | 'It is audbile to me.' |
| రవికి కనిపిస్తున్నది. | 'It is visible to Ravi.' |

55.7. The inclusive marker can go with case forms also. (15.2.)

| | |
|---|---|
| ఈ పుస్తకం ఎవరికి కావాలి ? | 'Who wants this book ?' |
| ఎవరికీ వద్దు. | 'Nobody wants.' |
| నువ్వు ఎవరిని చూస్తున్నావు ? | 'Whom are you seeing ?' |
| నేను ఎవరినీ చూడటం లేదు. | 'I am not seeing anybody.' |
| నీకు డబ్బు ఎక్కడ్డించి వస్తున్నది ? | 'Where are you getting money from ?' |
| నాకు డబ్బు ఎక్కడ్డించీ రావటం లేదు. | 'I am not getting money from any place. |
| అక్కడ ఎవరు ఉన్నారు ? | 'Who is there ?' |
| ఎవరూ లేరు. | 'Nobody is there.' |

# UNIT 14

## Lesson 56

| | |
|---|---|
| శర్మ : రవీ ! గిరిని మధ్యాహ్నం రెండు గంటల లోగా ఇక్కడికి రమ్మను. | Ravi ! Ask Giri to come here before 2 o' clock in the afternoon. |
| రవి : ఇవ్వాళ వాడికి తీరిక లేదు. ఇవ్వాళే కాదు. ఈ వారంలోనే తీరిక లేదు. | He is not free today. It is not only this day ; he is not free during all this week. |
| శర్మ : ఎందుకు ? | Why ? |
| రవి : వాడికి ఏవో పనులున్నాయి. | He has some work. |
| శర్మ : సరే ! నా పుస్తకం వాడి దగ్గరుంది. అది రేపు పొద్దున నాకు పంపించమను. | All right. My book is with him. Ask him to send it to me before tomorrow morning. |
| మురళి : అన్నయ్యా ! రవిని కొంచెం సేపు ఉండమను. | Brother ! Ask Ravi to stay for sometime. |

శర్మ : రవీ ! నిన్ను మా తమ్ముడు ఉండమంటున్నాడు. ఆగు.

**Ravi ! My brother wants you to stay for sometime. Wait.**

రవి : ఎందుకు ?

**Why ?**

శర్మ : వాడు కూడా వస్తున్నాడేమో !

**May be, he is coming with you.**

రవి : మురళీ ! నువ్వు కూడా వస్తున్నావా ?

**Murali ! Are you also coming ?**

మురళి : ఇప్పుడు నేను రావటానికి వీలు లేదు. మన కాలేజీ నాటకానికి గిరికి కూడా కొన్ని టిక్కెట్లు ఇవ్వు. వాణ్ణి ఒక టిక్కెట్టు తీసుకోమను. మిగిలినవి వాడి స్నేహితులకు ఇవ్వమను.

**It is not possible for me to go out now. Give some tickets for our college drama to Giri. Let him take one ticket. (Ask him to take one.) Let him give the other tickets to his friends. (Ask him to give the other tickets to his friends.)**

రవి : అట్లాగే !

**Okay.**

మురళి : ఇంకొక సంగతి. వాణ్ణి ఇవ్వాళ సాయంత్రం స్టేషనుకు పొమ్మను. నాటకం వాళ్ళు ఆరు గంటల రైల్లో వస్తున్నారు.

**One more thing. Ask him to go to the Railway Station this evening. The Drama troupe is coming by the 6 o'clock train.**



## DRILLS

**a. Substitution drill.**

**Model (i) :**

రవిని పదిగంటలలోగా రమ్మను.

ఎనిమిది

రవిని ఎనిమిది గంటలలోగా రమ్మను.

పన్నెండు

మూడు

రెండు

**Model (ii) :**

రవి నన్ను తినమంటున్నాడు.

చదువు

రవి నన్ను చదవమంటున్నాడు.

ఆడు

కూర్చో

నిద్రపో

ఉండు

**Model (iii) :**

కమలా ! సుగుణను పది రోజులలోగా ఈ పుస్తకం చదవమను.

నాలుగు నెలలు

కమలా ! సుగుణను నాలుగు నెలలలోగా ఈ పుస్తకం చదవమను.

ఒక సంవత్సరం

మూడు రోజులు

ఒక వారం

పది నెలలు

**b. Response drill.**

**Model (i) :**

ఇక్కడ రవి లేడు. (శర్మ)

రవేకాదు శర్మగూడా లేడు.

1. రేపు వాళ్ళు వస్తున్నారు (మేం)
2. ఈ సంచిలో కొత్త పుస్తకాలున్నాయి. (కాయితాలు)
3. ఆ హోటల్లో పాలు లేవు. (కాఫీ)

**Model (ii) :**

ఆ గదిలో ఎవరున్నారు ? (సుబ్బారావు)

సుబ్బారావున్నాడేమో !

1. ఇప్పుడు ఇక్కడికి ఎవరొస్తున్నారు ? (శర్మగారు)
2. ఈ పని ఎవరు చేస్తున్నారు ? (సరళ)
3. గోపి ఎక్కడికి వెళ్తున్నాడు ? (కాలేజీకి)

Model (iii) :

సరళ ఏమంటున్నది ? (రవీ : ఈ పుస్తకం చదువు)

సరళ రవిని ఈ పుస్తకం చదవమంటున్నది.

1. మీ నాన్నగారేమంటున్నారు ? (కమలా : ఆ మొక్కలను చూడు)
2. మాష్టరుగారు ఏమంటున్నారు ? (శర్మా : ఆ కుర్చీలో కూర్చో)
3. ప్రసాద్ ఏమంటున్నాడు ? (మోహన్ : ఇంటికి పో)
4. రవి ఏమంటున్నాడు ? (గోపీ : గడియారం పెట్టుకో)
5. వాడు ఏమంటున్నాడు ? (నారాయణా : కొంచెం జరుగు)

Model (iv) :

రవి ఏమంటున్నాడు ? (రెండు గంటలు_చదువు)

రవి రెండు గంటల సేపు చదవమంటున్నాడు.

1. కమల ఏమంటున్నది. (పది నిమిషాలు_ఉండు)
2. విశ్వనాథంగారేమంటున్నారు ? (రెండు గంటలు_కూర్చో)
3. నువ్వు ఏమంటున్నావు ? (కొంచెం_మాట్లాడు)
4. మనం ఏమంటున్నాం ? (ఎక్కువ_పని చెయ్యి)

**c. Transformation drill.**

Model (i) :

రవీ కొంచెం సేపు ఉండు.

రవిని కొంచెం సేపు ఉండమను.

1. సుగుణా : ఈ పూలమొక్కలకు నీళ్లు పొయ్యి.
2. గోపీ : ఆ సోఫాలో కూర్చో.
3. సరళా : మీ చెల్లెలికి ఒక ఉత్తరం రాయి.
4. కుటుంబరావు : మా ఇంటికి రా.
5. శర్మా : నువ్వివ్వాళ బడికి పో.

**d. Conversation drill.**

Model (i) :

రాజు : రవీ : ఇంటికి వెళ్లు.
రవి : ఎందుకు ? (అన్నం_తిను)
రాజు : అన్నం తినటానికి.

1. రాజు : పోలీసులు పరిగెత్తాలి.
   రవి : ఎందుకు ? (దొంగను_పట్టుకో)
   రాజు : ....................
2. రాజు : నువ్వు సరళను రమ్మను.
   రవి : ఎందుకు ? (పూలు_కొయ్యి)
   రాజు : ....................
3. రాజు : సుబ్బారావును గుంటూరు పొమ్మను.
   రవి : ఎందుకు ? (గిరిని_చూడు)
   రాజు : ....................

4. రాజు : మీ నాన్నగారిని మా ఇంటికి రమ్మను.
రవి : ఎందుకు ? (శర్మగారితో_మాట్లాడు)
రాజు : ....................

5. రాజు : నాకు నీళ్లు కావాలి.
రవి : ఎందుకు ? (కంచం_కడుగు)
రాజు : ....................

## EXERCISES

a. Answer the following questions based on the text of the lesson.

1. రవి పుస్తకం ఎవరి దగ్గర ఉంది ?
రవి దాన్ని ఎప్పుడు ఇవ్వమంటున్నాడు?

2. మురళి రవిని ఎందుకు ఉండమంటున్నాడు ?

b. Answer the following questions as shown in the model.

Model :

గిరి ఏమంటున్నాడు ?
(రవీ ! కొంచెం సేపు ఉండు)
గిరి రవిని కొంచెం సేపు ఉండమంటున్నాడు.

1. సుగుణ ఏమంటున్నది ?
(కమలా ! కొంచెం జరుగు)

2. వెంకటేశ్వర్లు ఏమంటున్నాడు ?
(పది నిమిషాలలోగా బయటికి పో)

3. సోమసుందరం ఏమంటున్నాడు ?
(శర్మా ! ఈ పుస్తకం తీసుకో)

4. మాష్టరుగారు ఏమంటున్నారు ?
(ఆ తలుపు తియ్యి)

5. ప్రసాద్ ఏమంటున్నాడు ?
(రేపు సినిమాకు రా)

c. Change the following as shown in the model.

Model (i) :

a. అన్నం తిను !
అన్నం తినమను !

b. అన్నం తినండి !
అన్నం తినమనండి !

1. దొంగను పట్టుకోండి !
2. రేపు పొద్దున మా ఇంటికి రా
3. ఈ టిక్కెట్టు తీసుకోండి !
4. ఈ పుస్తకం చదువు !

**Model (ii) :**

ఈ కలం ఎవరు తీసుకుంటున్నారు ? (రవి)
ఈ పుస్తకం రవి తీసుకుంటున్నాడేమో ।

1. రవి ఏ సినిమాకు పోతున్నాడు ? (తెలుగు సినిమాకు)
2. పోలీసులు ఎవరిని తీసుకుపోతున్నారు ? (దొంగలను)
3. సరళ ఏం కోస్తున్నది ? (పూలు)
4. శ్యామల ఎవరితో మాట్లాడుతున్నది ?

**Model (iii) :**

రవి ఎందుకు వెళ్తున్నాడు ? (అన్నం_తిను)
రవి అన్నం తినటానికి వెళ్తున్నాడు.

1. లీల ఎందుకు వస్తున్నది? (గిరిజను_చూడు)
2. రమ ఎందుకు వస్తున్నది? (లతను_తీసుకుపో)
3. గిరి రవిని ఎందుకు రమ్మంటున్నాడు ? (టికెట్టు_తీసుకోమను)
4. సరోజ హోటలుకు ఎందుకు వెళ్తున్నది ? (కాఫీ_తాగు)

**d.** Rewrite the following sentences as shown in the model.

**Model (i) :**

నేను అన్నం తినటానికి ఇంటికి వెళ్తున్నాను. (పాట_పాడు)
అన్నం తినటానికే కాదు పాట పాడటానికి గూడా.

1. శర్మ పుస్తకం చదవటానికి కళ్ళజోడు అడుగుతున్నాడు (ఉత్తరం_రాయి)
2. గుంటూరు వెళ్ళటానికి నాకు తీరిక లేదు. (సినిమా_చూడు)
3. రావు తలుపు వేస్తున్నాడు. (కిటికీ_ముయ్యి)

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| మధ్యాహ్నం | afternoon | నిన్ను | you (acc) |
| వారం | week | ఆగు | stop, wait (v. intr.) |
| పొద్దున | morning | టికెట్టు | ticket |
| _సేపు | time | అట్లాగే | all right |

## GRAMMAR NOTES :

56.1. In this lesson the informatory verb is introduced. అను is added to a verbal base to form informatory verb. When అను is added to a base, _అమ్ comes between the base and the అను form.

తిను + అను → తిను_అమ్_అను → తినమను 'Ask some one to eat.' (41.6)

వెళ్ళు + అను → వెళ్ళు_అమ్_అను → వెళ్ళమను 'Ask someone to go.' (41.6.)

తీసుకో + అను → తీసుకో_అమ్_అను → తీసుకోమను 'Ask someone to take.' (41.7.)

56.2. The informatory verbal bases of రా and పో are రమ్మను 'ask someone to come' and పొమ్మను 'ask someone to go' respectively.

రమ్మను + తున్నాడు → రమ్మంటున్నాడు 'He is asking someone to come.' (49.2)

పొమ్మను + అటం–లేదు → పొమ్మనటంలేదు 'Someone is not asking to go.' (41.6.)

56.3. The informatory verb always takes the direct object which will be in accusative case. (43.6.)

శర్మను రమ్మనకు. 'Don't ask Sarma to come.'

నన్ను తినమంటున్నావా ? 'Are you asking me to eat ?'

56.4. నిన్ను is the accusative case form of నువ్వు. (recall నన్ను 43.7.)

56.5. –లోగా 'within' is a postposition (16.6.). The postposition is added to an oblique base like a case suffix.

రెండు గంటల లోగా 'within two hours'

56.6. Remeber that –ఓ is added to interrogative words to express uncertainty or doubt. (32.2.)

అతను ఎవరో ! 'It is not known who he is.'

అది ఏమిటో ! 'It is not known what it is.'

Also remember that –ఓ is added to express uncertainty about choice. (53.3.)

అక్కడ పుస్తకం ఉందో లేదో ! 'Whether or not the book is there.'

To express uncertainty in assertive sentences (in interrogative sentences see 32.2.) ఏమో (ఏం + ఓ) is added to the sentence as a whole.

ఇది శర్మ పుస్తకమేమో ! 'May be, this is Sarma's book.'

ఇప్పుడు అతను వస్తున్నాడేమో ! 'May be, he is coming now.'

ఇవ్వాళ స్కూలు లేదేమో ! 'May be, the school is closed today.'

56.7. –సేపు 'time' does not occur in isolation. It always occurs with quantitative adjectives like అంత, ఇంత, కొంత, కొంచెం, ఎక్కువ etc., and with time expressions like గంట.

అంత సేపు 'that much time'

ఇంత సేపు 'this much time'

| | |
|---|---|
| ఎంత సేపు | 'how much time' |
| కొంత సేపు | 'some time' |
| కొంచెం సేపు | 'a little while' |
| ఎక్కువ సేపు | 'more time' |
| అరగంట సేపు | 'half an hour time' |
| గంట సేపు | 'one hour time' |

56.8. అట్లాగే and అలాగే (lesson 49) are variants.

56.9. Remember that అం ending nouns change the final అం to అని before accusative and dative case suffixes. (54.5.)

The gerunds (అటం forms) also behave in this way as they also end in అం.

వెళ్ళటం + కి → వెళ్ళటానికి 'for going'

*veḷḷaṭam + ki → veḷḷaṭaani-ki*

56.10. The dative case suffix expresses purposive relationship when used with అటం forms (gerunds).

| | |
|---|---|
| వెళ్ళటానికి | 'for going' |
| తినటానికి | 'for eating' |
| నేను రావటానికి వీలు లేదు. | 'I have no time to come.' |

The dative case suffix expresses purposive relationship where there is a possibility of inserting a verbal noun. (44.4.)

| | |
|---|---|
| సినిమాకు పోదాం. | 'Let's go for a movie.' |
| (సినిమా చూడటానికి పోదాం.) | |

# REVIEW 7

## Lesson 57




హలో! ఆకాశవాణి విజయవాడ
కేంద్రమేనా? కాస్త మా అమ్మాయిని
భోజనానికి వెళ్ళమనండి నాయనా,
రేడియోలో!


చూడు! బైట 144 సెక్షనుంది.
వాళ్ళందరినీ ఒకేసారి బైటకి పంపకు!




**EXERCISES**

a. Give your responses to the following sentences as shown in the model:

Model (i):

శర్మా : నువ్వు రవితో మాట్లాడు.
నేను రవితో మాట్లాడటం మంచిది కాదు.

1. సుశీలా : కమలకు ఒక ఉత్తరం రాయి.
2. శారదా : నువ్వు సాయంత్రం సుశీల యింటికి పో.
3. గోపీ : నువ్వు రాత్రి మా యింటికి రా.
4. పాపా : కప్పులో కాఫీ పొయ్యి.
5. కమలా : నువ్వు నా సంచీలోనించి పది రూపాయలు తీసుకో.
6. మాష్టరుగారిని యివ్వాళ సెలవు అడుగు.

**Model (ii) :**

నేను ఇప్పుడు ఇంటికి పోవాలి.
పరవాలేదు. రేపు పోవచ్చు.

1. శర్మ ఇప్పుడు పాఠం చదవాలి.
2. నేనిప్పుడు ఒక సినిమా చూడాలి.
3. నువ్వు ఇప్పుడు కమలతో మాట్లాడాలి.
4. నేను ఇప్పుడు ఒక పుస్తకం కొనాలి.
5. సుగుణ ఇప్పుడు మందు తీసుకోవాలి.

**Model (iii) :**

రవి మాట్లాడటం లేదు.
నేను మాట్లాడుతున్నాను.

1. సరళ అన్నం వడ్డించటంలేదు.
2. సుశీలకు నా మాటలు వినిపించటంలేదు.
3. శారదకు ఈ బొమ్మ కనిపించటంలేదు.
4. అతను ఆ విషయం ఆలోచించటంలేదు.

**b.** **Answer the following questions using cue words as shown in the model.**

**Model (i) :**

శర్మ అన్నం తింటున్నాడా ? (కాఫీ_తాగు)
శర్మ అన్నం తినటం లేదు. కాఫీ తాగుతున్నాడు.

1. రమ పాఠం చదువుతున్నదా? (పూలు_కొయ్యి)
2. కమల స్కూలుకు పోతున్నదా ? (ఇల్లు_వెళ్లు)
3. సుశీల ఉత్తరం రాస్తున్నదా ? (అన్నం_తిను)
4. విజయ నీ కలం తీసుకుపోతున్నదా ? (పుస్తకం_తీసుకురా)
5. వాళ్లు మాట్లాడుతున్నారా ? (ఏదో_ఆలోచించు)

**c.** **Complete the following sentences.**

1. శర్మ : నువ్వు మంచివాడివి.
   సుశీలా : నువ్వుగూడా మంచి............
2. కుమార్ : నువ్వు పెద్దవాడివి.
   నేను గూడా పెద్ద............
3. సుశీలా : నేను చిన్నవాణ్ణి.
   నువ్వు గూడా చిన్న............
4. కమల తెలుగుది.
   రమా : నువ్వు గూడా తెలుగు .........

**d.** **Complete the following sentences using the dative forms of the gerund of the verb suggested in the parentheses.**

1. అక్కడికి ఎందుకు వెళ్తున్నావు ?
   సరళను................(చూడు)
2. బజారుకు ఎందుకు వెళ్తున్నావు ?
   కలం................(కొను)
3. రవిని ఎందుకు రమ్మంటున్నావు ?
   కాలేజీకి................(పో)
4. ఆస్పత్రికి ఎందుకు పోతున్నావు ?
   మందు................(తీసుకో)

**e. Answer the following questions as shown in the model :**

**Model :**

ఇక్కడికి ఎవరు వస్తున్నారు ?
ఇక్కడికి ఎవరూ రావటం లేదు.

1. నువ్విప్పుడు ఎక్కడికి వెళ్తున్నావు ?
2. నువ్వు ఎవరిని చూస్తున్నావు ?
3. ఇవ్వాళ ఎవరు మాట్లాడుతున్నారు ?
4. నువ్వు పాఠం ఎవరికి చెప్తున్నావు ?

**f. Read the following three sentences and frame at least 4 sentences using కంటె.**

శర్మకు నాలుగేళ్ళు.
సరళకు పదేళ్ళు.
శారదకు పన్నెండేళ్ళు.

Model :

శర్మకంటె శారద ఎనిమిదేళ్ళు పెద్ద.

**g. Combine the following pairs of sentences as shown in the model :**

Model (i) :

వాడు వెళ్తున్నాడు. చదువుతున్నాడు.
వాడు వెళ్తూ చదువుతున్నాడు.

1. సుశీల అడుగుతున్నది. చెప్తున్నది.
2. వాళ్ళు పరిగెత్తుతున్నారు. మాట్లాడుతున్నారు.
3. మీరు రాస్తున్నారు. చూస్తున్నారు.
4. పిల్లలు బిస్కెట్లు తింటున్నారు. పక్కను కొడ్తున్నారు.

Model (ii) :

నువ్వు మాట్లాడు. విను.
నువ్వు మాట్లాడ్తూ విను.

1. బజారు వెళ్ళండి. మాట్లాడండి.
2. సుశీలా ! నువ్వు అన్నం తిను. కమలతో మాట్లాడు.
3. రమా ! నువ్వు బొమ్మగియ్యి. నన్ను చూడు.
4. కమలా ! పుస్తకం తీసుకో. పాఠం విను.

Model (iii) :

నువ్వొక పుస్తకం చదువుతున్నావు.
ఆ పుస్తకం నాకివ్వు.
నువ్వు చదువుతున్న పుస్తకం నాకివ్వు.

1. నువ్వు ఒక పండు తింటున్నావు.
   ఆ పండు ఏమిటి ?
2. నువ్వు మాటలు అంటున్నావు.
   ఆ మాటలు నాకు వినిపించటం లేదు.
3. శర్మ ఒక ఉత్తరం రాస్తున్నాడు.
   ఆ ఉత్తరం ఎవరికి ?
4. నువ్వు ఒక ఇంట్లో ఉంటున్నావు.
   ఆ ఇల్లు ఎక్కడున్నది ?

**h.** **Rewrite the following as shown in the model.**

**Model :**

శర్మ దగ్గర కలం లేదు ; కాయితం లేదు.

శర్మ దగ్గర కలమే కాదు కాయితం గూడా లేదు.

1. ఇవ్వాళ శర్మ రావటం లేదు ; రమ రావటం లేదు.
2. నేను పాలు తాగుతాను ; టీ తాగుతాను.
3. క్లాసులో సుబ్బారావు లేడు ; శర్మ లేడు.

**i.** **Complete the following conversations as shown in the model.**

**Model :**

కమల : శారదా ! ఈ పుస్తకం చదువు.

రమ : శారదా ! నీకు వినిపించటం లేదా ? కమల నిన్ను పుస్తకం చదవమంటున్నది.

శారద : కమలనే చదవమను.

కమల : నేను చదవమనటం లేదు. మాష్టరు గారు చదవమంటున్నారు. ఆ మాటే నీతో చెప్తున్నాను.

1. రవి : శర్మా ! నువ్వు సుబ్బారావు దగ్గరికి పో !
   గోపి : ....................
   శర్మ : ....................
   రవి : ....................
2. అరుణ : గిరిజా ! ఒక బొమ్మ గియ్యి.
   సరోజ : ....................
   గిరిజ : ....................
   అరుణ : ....................
3. రమ : గోపీ ! నువ్వు తెలుగు పుస్తకం తీసుకు రా !
   రవి : ....................
   గోపి : ....................
   రమ : ................
4. గౌరి : గిరిజా! రవి పుస్తకం ఎక్కడుందో వెతుకు.
   రమ : ....................
   గిరిజ : ................
   గౌరి : ................

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| కాస్త | a little కొంచెం | కేంద్రం | centre |
| టోపీ | cap | భోజనం | meal |
| నాయన | my dear ! (masc.) | స్టూలు | stool |
| చెవి | ear | మొయ్యి | carry |
| ఆస్పత్రి | hospital | గొడుగు | umbrella |
| అసలు | (an emphasizing word) | కూర | curry |
| హలో ! | hello ! | | |

# UNIT 15

## Lesson 58

| | |
|---|---|
| రవి : వెంకటేశ్వర్లూ ! సుబ్బారావు ! మనల్ని కృష్ణమూర్తి వాళ్ళ ఇంటికి రమ్మంటున్నాడు. | Venkateswarlu ! Subbarao ! Krishnamurty wants us to go to his house. |
| సుబ్బా : మమ్మల్ని గూడా రమ్మంటున్నాడా ? | Is he asking us also to come ? |
| రవి : ఆ ! మీరు ఇప్పుడు వెళ్ళండి. నేను సాయంత్రం వస్తాను. | Yeah ! You go now. I will go in the evening. |
| సుబ్బా : మేం కూడా సాయంత్రమే వస్తాం. | We will also go in the evening. |
| రవి : మీరు వాళ్ళ నాన్నగారితో మాట్లాడాలి గదా ! | You have to talk to his father. Don't you ? |
| సుబ్బా : అవును. | Yes. |
| రవి : ఆయన ఈ టైములో రోజూ ఇంటి దగ్గర ఉంటారు. ఇప్పుడే వెళ్ళండి. | He will be at home at this time daily. You go right now. |

సుబ్బా : సరే ! నువ్వు సాయంత్రం వస్తావా ? — Okay. Will you come in the evening ?

రవి : ఆ ! సాయంత్రం నాతో శారద గూడా వస్తుంది. — Yeah. Sarada will also come with me in the evening.

సుబ్బా : ఇప్పుడు వెళ్ళటానికి మాకు బస్సు దొరుకుతుందా ? — Will there be a bus for us to go now ?

రవి : ఆ! చాలా దొరుకుతాయి. అక్కడ నిల్చోండి. పదమూడో నెంబరు బస్సు వస్తుంది. — Yeah. There will be many. You wait there. Bus number thirteen will come.

సుబ్బా : టిక్కెట్టు ఎంత ? — What is the fare ?

రవి : ముప్పై పైసలు తీసుకుంటాడు. — He will charge thirty paise.

**DRILLS**

**a. Build-up drill.**

రమ్మంటున్నాడు
ఇంటికి రమ్మంటున్నాడు.
వాళ్ళ ఇంటికి రమ్మంటున్నాడు.
కృష్ణమూర్తి వాళ్ళ ఇంటికి రమ్మంటున్నాడు.
మనల్ని కృష్ణమూర్తి వాళ్ళ ఇంటికి రమ్మంటున్నాడు.

దొరుకుతుందా ?
బస్సు దొరుకుతుందా ?
మాకు బస్సు దొరుకుతుందా ?
వెళ్ళటానికి మాకు బస్సు దొరుకుతుందా ?
ఇప్పుడు వెళ్ళటానికి మాకు బస్సు దొరుకుతుందా ?

**b. Substitution drill.**

**Model (i) :**

రవి ఒక గంటలోగా వస్తాడు.
తిను
రవి ఒక గంటలోగా తింటాడు.
చదువు
తీసుకో
వెళ్ళు
కొను
రమ్మను

**Model (ii) :**

నేను ఇంటికి వెళ్తాను.
నువ్వు
నువ్వు ఇంటికి వెళ్తావు.
మేం
మనం
మీరు
వాడు
వాళ్ళు
అది
అవి

**Model (iii) :**

గిరిజ రవిని డబ్బులు అడుగుతుంది.
శర్మ
గిరిజ శర్మను డబ్బులు అడుగుతుంది.
నేను
నువ్వు
మీరు
మేం
మనం
ఆయన
అతను
ఆమె
అది
వాడు

**c. Interlocked substitution drill.**

**Model :**

నేను రేపు ఎనిమిది చపాతీలు తింటాను.
సీత ................................
సీత రేపు ఎనిమిది చపాతీలు తింటుంది.
................................ తీసుకురా.
సీత రేపు ఎనిమిది చపాతీలు తీసుకొస్తుంది.
... ... ... ... పుస్తకాలు.. .........
సీత రేపు ఎనిమిది పుస్తకాలు తీసుకొస్తుంది.
మేం ................................
మేం రేపు ఎనిమిది పుస్తకాలు తీసుకొస్తాం.
... ... ... ... ... ... ... ... చదువు.
మేం రేపు ఎనిమిది పుస్తకాలు చదువుతాం.

గోపి ఎల్లుండి ఆరు పుస్తకాలు చదువుతాడు.
సీత .... .... .... .... .... .... .... .... ....
... ... ... ... ... ... ... తీసుకుపో
... ... ... .... కాయితాలు ... ......
మేం ... ...... .... .... .... .... .... ......
.... .... .... .... .... .... ........తీసుకురా
.................. గడియారాలు ...........
.................................... కొను
మనం ....................................
నువ్వు ....................................
.................. నవల ...............
.................... ..................చదువు
రవీ, గోపీ .... .... .... .... .... .... ....

**d. Response drill.**

**Model :**

నువ్వెప్పుడు వస్తావు ? (రేపు)
నేను రేపు వస్తాను.

1. శర్మ ఎన్నో తారీకున ఇక్కడికి వస్తాడు ? (ఆరు)
2. సరళ రేపు ఎక్కడికి వస్తుంది ? (మీ ఇంటికి)
3. మీరు ఎప్పుడు గుంటూరు వెళ్తారు ? (ఎనిమిదో తారీకు)
4. ఇప్పుడు మాకు ఏ బస్సు దొరుకుతుంది ? (రెండో నెంబరు)

## EXERCISES

a. Fill up the blanks with the accusative forms of the pronouns given in the parentheses.

1. నేను ............ (మీరు) పది పుస్తకాలు అడుగుతాను.
2. శర్మ ............ (నేను) వాళ్ల ఇంటికి రమ్మంటాడు.
3. సీత ............ (మనం) పేర్లు అడుగుతుంది.
4. మేం ............ (నువ్వు) ఆగమంటున్నాం.
5. నువ్వు ............ (వాడు) కాఫీ తాగమంటున్నావు.

b. Produce atleast 40 sentences from the following table selecting one word from each column.

| | | | |
|---|---|---|---|
| నేను<br>నువ్వు<br>ఆయన<br>మనం<br>మేం<br>వాడు<br>మీరు<br>సీత<br>అవి | రేపు | అన్నం<br>పుస్తకం<br>నా మాట | తిను<br>తీసుకురా<br>చదువు<br>కొను<br>విను |

c. Match the following.

| A | B | |
|---|---|---|
| 1. నేను | నాతో చదువుతాడు | ( ) |
| 2. మనం | నన్ను రమ్మంటారు | ( ) |
| 3. సీత | గుంటూరు వెళ్తాను | ( ) |
| 4. రవి | చదువుతుంది | ( ) |
| 5. వాళ్లు | అన్నం తింటాం | ( ) |

d. Answer the following questions based upon the text of the lesson.

1. కృష్ణమూర్తి ఎవరిని వాళ్ళ ఇంటికి రమ్మంటున్నాడు ?
2. వెంకటేశ్వర్లు, సుబ్బారావు ఇప్పుడే ఎందుకు వెళ్ళాలి ?
3. సాయంత్రం రవితో ఎవరు వస్తారు ?

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| మనల్ని | us (incl.) | దొరుకు | be available, be found |
| మమ్మల్ని | us (excl.) | పైస | paisa |

## GRAMMAR NOTES :

58.1. In this lesson future (and habitual) tense is introduced. -తా/-తుం is the future tense suffix. The future tense forms are formed by the combination of the verbal base, the future tense suffix and the personal suffix in the said order.

future tense → verbal base + future tense suffix + personal suffix.

చదువు-తా-ను 'I will read.'

The same personal suffixes used in present tense are used here also. (45.2.)

58.1.1. -తుం occurs before feminine inferior and neuter singular suffix ది.

| | |
|---|---|
| ఆమె చదువు-తుం-ది | 'She will read.' (future) |
| కుక్క చెట్టు ఎక్కు-తుం-ది | 'The dog will climb the tree.' (habitual) |

58.1.2. -తా occurs elsewhere.

| | |
|---|---|
| నేను చదువుతాను. | 'I will read.' |
| మేం/మనం పండు తింటాం[1]. | 'We will eat a fruit.' |
| నువ్వు ఏం చేస్తావు[2]? | 'What will you do?' |
| మీరు సినిమా చూస్తారా[3]? | 'Will you see a movie?' |
| వాడు ఇంటికి వెళ్తాడు[4]. | 'He will go home.' |

1 తిను-తా-ం (49.2)
2 చెయ్యి-తా-వు (48.1)
3 చూడు-తా-రు (48.2)
4 వెళ్ళు-తా-డు (46.2)

| | |
|---|---|
| అతను పాఠం చెప్తాడు[5]. | 'He will teach a lesson.' |
| రామారావు వాణ్ణి కొడ్తాడు[6]. | 'Ramarao will beat him.' |
| ఆయన ఇక్కడ ఉంటారు[7]. | 'He will stay here.' |
| అవి మనకు కనిపిస్తాయి[8]. | 'Those will be visible to us.' |
| కుక్కలు వస్తాయి[9]. | 'Dogs will come.' |

**58.2.** Remember that the I and II person pronouns in Telugu have different forms in accusative case constructions. (43.7.)

మనల్ని 'us' is the accusative case form of మనం.

మమ్మల్ని 'us' is the accusative case form of మేం.

నన్ను 'me' is the accusative case form of నేను.

నిన్ను 'you' is the accusative case form of నువ్వు. (56.4.)

మిమ్మల్ని 'you (pl.)' is the accusative case form of మీరు (46.5.)

**58.3.** గదా ? is the alternative form of కదా ? (42.7.)

The bound-words (words which are not used in isolation) and not suffixes like కోసం etc., beginning with క change the initial క to గ optionally.

అతను సుబ్బారావు గదా ? (also సుబ్బారావు కదా ?)

అతను రామారావు గదూ ? (also రామారావు కదూ ? 24.3.)

శర్మ గూడా ఉన్నాడు. (also శర్మ కూడా 30.10.)

(In lesson 30, గూడా is introduced. But it is originally కూడా.)

**58.4.** Notice the benefactive function (26.1.) of the dative case suffix in the following sentence :

| | |
|---|---|
| మాకు బస్సు దొరుకుతుందా ? | 'Do we get a bus? (Will a bus be available for us ?) |

---

[5] చెప్పు_తా_డు (54.2.)

[6] కొట్టు_తా_డు (48.3.)

[7] ఉండు_తా_డు (50.2.)

[8] కనిపించు_తా_యి (55.4.)

[9] రా_తా_యి (46-2.)

# UNIT 15

## Lesson 59

| | |
|---|---|
| శర్మ : రవీ ఇవ్వాళ సాయంత్రం నేను ఒక మాజిక్ చేస్తున్నాను. దానికి కొన్ని ఏర్పాట్లు చెయ్యాలి. నువ్వు కొంచెం సహాయం చేస్తావా ? | Ravi ! I am going to perform magic this evening. We need to make some arrangements for it. Will you help me a little ? |
| రవి : నేను ఇంటికి వెళ్ళాలి. మా నాన్నగారు తిడారు. | I have to go home. My father will scold me. |
| శర్మ : తిట్టటం ఎందుకు ! మీ నాన్నగారితో నేను చెప్తాను. | Why should he scold you ? I will speak to your father. |
| రవి : సరే ! ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు ? | All right. What do you want me to do now ? |
| శర్మ : నేను ఈ బల్లను అవతలికి నెడ్తాను. నువ్వు పట్టుకో ! చాలు ! | I will push this table out. You hold it. That's enough. |

| | |
|---|---|
| రవి : ఇంకా ఏం చెయ్యాలి ? | What am I to do further ? |
| శర్మ : ఆ గ్లాసు ఇవతల పెట్టు. ఈ కుర్చీ ఇవతలికి జరుపు. ఈ కుండ ఆ రెండు బల్లల మధ్య పెట్టు. ఈ గుడ్డ ఆ కుండ మీద కప్పు. ఆ కుర్చీ ఇటు పక్కకు తిప్పు. | Keep that tumbler this side. Push this pot between those two tables. Cover this cloth over that pot. Turn that chair this side. |
| రవి : తిప్పుతున్నాను. | I am turning it. |
| శర్మ : ఆగు, నేను తిప్పుతాను. నువ్వు ఆ అద్దం అవతల పెట్టు. | Wait. I will turn it. You keep this mirror on that side. |
| రవి : పెడ్తున్నాను. | I am keeping it. |
| శర్మ : ఈ దారం తీసుకో. దీన్ని ఆ కర్రకు చుట్టు. | Take this thread and wind it to that stick. |
| రవి : ఈ పెద్ద కర్రకేనా ? | To 'his big stick ? |
| శర్మ : కాదు. చిన్నకర్రకు చుట్టు. పెద్దకర్రకు తాడు చుట్టాలి. | No. You wind it to the small one. You have to put a rope round the big stick. |
| రవి : అలాగే ! | Okay. |
| శర్మ : సాయంత్రం నాకు ఇద్దరు మనుషులతో పని ఉంటుంది. నాకు నువ్వు ఇద్దరు కుర్రాళ్లను ఏర్పాటు చెయ్యాలి. | In the evening I need two persons for my work. You have to arrange two boys for me. |
| రవి : అలాగే చేస్తాను. కాని ఇద్దరు మనుషులు దొరకటం కష్టం. ఒక మనిషిని తీసుకొస్తాను. | All right, I will do it. But it is not possible to get two boys. I will bring one. |
| శర్మ : సరే ! నువ్వు మళ్లీ సాయంత్రం ఐదు గంటలకు రా ! ఆలస్యం చెయ్యకు. ఈ విషయం మీ స్నేహితులకు కూడా చెప్పు ! | Okay ! You come at 5 o' clock in the evening. Don't delay. Inform also your friends about this programme. |

## DRILLS

**a. Build-up drill.**




చెయ్యాలి.

ఏర్పాట్లు చెయ్యాలి.

కొన్ని ఏర్పాట్లు చెయ్యాలి.

నువ్వు కొన్ని ఏర్పాట్లు చెయ్యాలి.

దానికి నువ్వు కొన్ని ఏర్పాట్లు చెయ్యాలి.

నెడ్తాను.

అవతలికి నెడ్తాను.

బల్లను అవతలికి నెడ్తాను.

ఆ బల్లను అవతలికి నెడ్తాను.

నేను ఆ బల్లను అవతలికి నెడ్తాను.




ఉంటుంది.

పని ఉంటుంది.

మనిషితో పని ఉంటురది.

ఒక మనిషితో పని ఉంటుంది.

మధ్యాహ్నం నాకు ఒక మనిషితో పని ఉంటుంది.

ఇవ్వాళ మధ్యాహ్నం నాకు ఒక మ్పషితో పని ఉంటుంది.

**b. Substitution drill.**

**Model (i) :**

రవీ : ఆ కుర్చీని అక్కడ పెట్టు.

ఇక్కడ

రవీ : ఆ కుర్చీని ఇక్కడ పెట్టు.

అవతల

ఆ పకన

ఈ పక్కన

**Model (ii) :**

రవి ఆ బల్ల నెడ్తాడు. (జరుపు)

రవి ఆ బల్ల జరుపుతాడు.

1. శర్మ రతిరామ్‌ను కొడ్తాడు. (తిట్టు)
2. సరళ గిరిజను తిడ్తుంది. (నెట్టు)
3. వాళ్లు తలుపు కొడ్తారు. (నెట్టు)
4. ఆయన దారం అక్కడ పెడ్తారు. (చుట్టు)

**Model (iii) :**

రవి తలుపు తీస్తాడు. (ముయ్యి)

రవి తలుపు మూస్తాడు.

1. శారద పాను వేస్తుంది. (తియ్యి)
2. రమా, ఉమా పూలు తీస్తారు. (కొయ్యి)
3. శర్మ ఉత్తరం చూస్తాడు. (రాయి)
4. సరోజ బొమ్మ గీస్తుంది. (చూడు)

**c. Response drill.**

**Model :**

రవి ఆ కుర్చీని ఏం చేస్తాడు ? (అటు-తిప్పు)

రవి ఆ కుర్చీని అటు తిప్పుతాడు.

1. శర్మ ఏం చేస్తాడు ? (గుడ్డ-కప్పు)
2. గోపి ఏం చేస్తాడు ? (పాఠం-చెప్పు)
3. సరళ ఏం చేస్తుంది ? (చేతులు-తిప్పు)
4. కమల ఏం చేస్తుంది ? (కుక్కను-కొట్టు)
5. మనం ఏం చేస్తాం ? (బల్లను-నెట్టు)
6. శర్మ ఏం చేస్తాడు ? (నిన్ను-తిట్టు)

## EXERCISES

**a. Fill up the blanks with the future tense forms of the verbs suggested in the parentheses.**

1. శర్మ : రవి రేపు............ (రా)
2. గోపీ : సీత ఎల్లుండి............ (వెళ్లు)
3. సరోజా : మీ అమ్మగారు ఎప్పుడు ఇంట్లో ............ ? (ఉండు)

4. రామారావు : కర్మ పాము............(వెయ్యి)
5. నేనొక బొమ్మను............(గియ్యి)
6. నువ్వు ఆ కుక్కను............ (కొట్టు)
7. కమల ఆ పుస్తకం ఇటు............ (తిప్పు)
8. మాస్టరుగారు పాఠం............ (చెప్పు)
9. ఆలస్యం అయితే రామారావును మీరు ............ (తిట్టు)
10. కర్మను మనం పది రూపాయలు............ (అడుగు)

b. Fill up the blanks with the plural forms of the nouns given in the parentheses.

1. అక్కడ ఇద్దరు............ (కుర్రాడు) ఉన్నారు.
2. నాటకానికి............ (ఏర్పాటు) చెయ్యి :
3. నాకు పది మంది............ (మనిషి) కావాలి.

c. Conjugate the following verbs for future tense each time with one of the pronouns/nouns given bellow as subjects.

నేను     నువ్వు     సీత     మేం     అవి

1. వెళ్లు
2. తిప్పు
3. చెప్పు
4. కొయ్యి
5. చుట్టు
6. నెట్టు

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| మాజిక్ | magic | కప్పు | close, cover (v) |
| ఏర్పాటు | arrangement | తిప్పు | rotate, turn (v.tr.) |
| తిట్టు | scold (v) | అద్దం | glass, mirror |
| అవతల | that side | దారం | thread (n) |
| గ్లాసు | tumbler | కర్ర | stick (n) |
| ఇవతల | this side | చుట్టు | wind (v. tr.) |
| జరుపు | move aside (v.tr.) | తాడు | rope (n) |
| కుండ | pot | మనిషి | person |
| మధ్య | middle, centre | ఆలస్యం | delay (n) |
| గుడ్డ | cloth | కొబ్బరి | coconut |

**GRAMMAR NOTES :**

**59.1.** In this lesson two verbal bases కప్పు 'cover' and తిప్పు 'turn' are introduced. These two bases do not behave like చెప్పు 'say' (54.2.) though they end in ప్పు.

| | |
|---|---|
| చెప్పు + తున్నాడు ⟶ చెప్తున్నాడు | 'He is saying.' (54.2.) |
| తిప్పు + తున్నాడు ⟶ తిప్పుతున్నాడు | 'He is rotating.' |
| కప్పు + తున్నాడు ⟶ కప్పుతున్నాడు | 'Ha is covering.' |
| చెప్తాడు | 'He will say.' (54.2.) |
| తిప్పుతాను | 'I will rotate.' |
| కప్పుతావు | 'You will cover.' |

**59.2.** ఇవతల 'this side' and అవతల 'that side' are also introduced in this lesson along with their oblique bases ఇవతలి and అవతలి respectively.

**59.3.** The plural form of మనిషి is మనుషులు.

**59.4.** చెప్పు means 'tell, narrate, inform, report'. When used with పాఠం it also means 'teach'. When it means 'narrate, tell or teach, the noun standing for the recipient will take dative case suffix కు/కి (41.11.3.).

| | |
|---|---|
| రమ కమలకు కథ చెప్పింది. | 'Rama narrated a story to Kamala.' |
| శర్మ నాకు పాఠం చెప్తాడు | 'Sarma will teach me the lesson.' |
| అతను నీకు పేరు చెప్తాడా ? | 'Does he tell his name to you ?' |

But when చెప్పు means 'inform' or 'report', the noun standing for the 'informed' or 'reported' (ie. recipient of the information) takes either sociative case suffix తో or dative case suffix కు/కి.

| | |
|---|---|
| శర్మ నీకు ఈ సంగతి చెప్తాడా ?<br>శర్మ నీతో ఈ సంగతి చెప్తాడా ? | 'Does Sarma inform this matter to you ?' |

**59.5.** Notice the use of dative case suffix in 'directional' function.

| | |
|---|---|
| ఆ కుర్చీ ఈ పక్కకు తిప్పు. | 'Turn that chair towards this side.' |

# UNIT 15

## Lesson 60

| | |
|---|---|
| గోపి : రవీ ! ఇప్పటిదాకా ఏం చేస్తున్నావు ? | What are you doing till now ? |
| రవి : కేరంబోర్డు ఆడుతున్నాను. ఎందుకు ? | I am playing carroms. Why ? |
| గోపి : ఇవ్వాళ కొత్త సినిమా ఉంది పోదామా ? | There is a new movie. Shall we go ? |
| రవి : రేపు పోదాం. ఇవ్వాళ నాటకం చూద్దాం. | We will go tomorrow. Let's see a play today. |
| గోపి : శర్మ సినిమాకే వెళ్దాం అంటున్నాడు. | Sarma says that we will go to movie only. |
| రవి : శర్మను సినిమాకే వెళ్ళనుము. మనం ఇవ్వాళ నాటకానికి పోదాం. సినిమాకు రేపు పోదాం. ఈ సినిమా ఇంకా ఎప్పటిదాకా ఉంటుంది ? | Let Sarma go to movie. We will see a play today. We will go to movie tomorrow. How long will this movie be screened? |
| గోపి : ఇంకా నాలుగు రోజులదాకా ఉంటుంది. | It will be about four days. |

రవి : అయితే పరవాలేదు సినిమా రేపు చూద్దాం.

Then it's all right. We will go to the movie tomorrow.

గోపి : నాటకం ఎనిమిది గంటలకు. అప్పటి దాకా ఇక్కడే ఉందామా ?

The play is at 8 o' clock. Shall we stay here till then ?

రవి : ఇక్కడే కూర్చుందాం. నువ్వు చదరంగం ఆడ్తావు గదా ! కాసేపు ఆడ్దాం. తరవాత అలా రోడ్డు మీద కాసేపు తిరుగుదాం.

We will sit here. You will play chess. Won't you ? Let us play chess for some time. Then we go for a walk on the road.

గోపి : సుబ్బారావు గూడా నాటకానికి వస్తాడేమో !

Subbarao may also come for the play.

రవి : పద ! వాళ్ళింటిదాకా వెళ్దాం. వాడు గూడా వస్తాడేమో అడుగుదాం.

Come on! We will go to his house. We will ask him if he would also come.

గోపి : నాకు ఆకలిగా ఉంది.

I am hungry now.

రవి : దారిలో వసంత విహార్‌లో వేడి ఇడ్లీ ఉంటుంది, తిందాం.

There will be hot *idli* available on the way at 'Vasantha Vihar'. Let's have it.

గోపి : సైకిలు తీసుకు పోదామా ?

Shall we take the bicycle ?

రవి : సైకిలు ఒద్దు. దాన్ని ఇక్కడే పెడ్దాం.

Bicycle is not required. Let's leave it here only.

## DRILLS

**a. Build-up drill.**

ఉంటుంది

ఎప్పటి దాకా ఉంటుంది ?

ఇంకా ఎప్పటిదాకా ఉంటుంది ?

సినిమా ఇంకా ఎప్పటిదాకా ఉంటుంది ?

**b. Substitution drill.**

**Model :**

ఇప్పుడు మనం పాఠం చదువుదాం.
ఇంటికి పో
ఇప్పుడు మనం ఇంటికి పోదాం.

పాఠం విను
బజారుకు వెళ్ళు
రోడ్డు మీద తిరుగు
పాటలు పాడు

**c. Response drill.**

Model (i) :

ఇప్పుడు మనం ఏం చేద్దాం ? (ఫాను_వెయ్యి)
ఇప్పుడు మనం ఫాను వేద్దాం.

1. రేపు మనం ఏం చేద్దాం ? (బొమ్మలు_గియ్యి)
2. ఎల్లుండి మనం ఏం చేద్దాం ? (సినిమా_చూడు)
3. శనివారం మనం ఏం చేద్దాం ? (శర్మతో_మాట్లాడు)
4. ఇప్పుడు మనం ఏం చేద్దాం ? (ఇక్కడ_నిల్చో)
5. ఈ పుస్తకాన్ని ఏం చేద్దాం ? (బల్లమీద_పెట్టు)

Model (ii) :

ఈ సినిమా ఎప్పటిదాకా ఉంటుంది ? (పదో_తారీకు)
ఈ సినిమా పదో తారీకుదాకా ఉంటుంది.

1. శర్మ మైసూరులో ఎప్పటిదాకా ఉంటాడు ? (ఎల్లుండి)
2. సరళ ఇక్కడ ఎప్పటిదాకా ఉంటుంది ? (సోమవారం)
3. మీరు అక్కడ ఎప్పటిదాకా ఉంటారు ? (రెండు_నెలలు)

Model (iii) :

అప్పటిదాకా ఏంచేస్తున్నావు ? (అన్నం_తిను)
అప్పటిదాకా అన్నం తింటున్నాను.

1. అప్పటిదాకా ఏం చేద్దాం ? (చదరంగం_ఆడు)
2. అప్పటిదాకా ఏం చేద్దాం ? (నవల_చదువు)
3. ఇప్పటిదాకా ఏం చేస్తున్నావు ? (రవితో_మాట్లాడు)

## EXERCISES

**a. Answer the following questions based upon the text of the lesson.**

1. రవి ఇప్పటిదాకా ఎం చేస్తున్నాడు.
2. శర్మ ఎక్కడికి వెళ్దాం అంటున్నాడు ?
3. ఆ సినిమా ఇంకా ఎప్పటిదాకా ఉంటుంది ?
4. రవీ, గోపీ సుబ్బారావు వాళ్లింటికి ఎందుకు వెళ్తున్నారు ?

**b. Answer the following sentences using the cue words.**

1. మనం ఇప్పుడు ఏం చేద్దాం ? (పుస్తకం–తీసుకో)
2. మనం ఇప్పుడు ఎవరి ఇంటికి వెళ్దాం. (శర్మ–ఇల్లు)
3. మనం ఇప్పుడు ఏం చదువుదాం ? (కొత్త పాఠం–చదువు)
4. మనం రేపు ఏం చేద్దాం ? (చదరంగం–ఆడు)
5. అప్పటి దాకా ఏం చేద్దాం ? (పూలు–కొయ్యి)
6. మనం ఏం చేద్దాం ? (ఈ బల్ల–నెట్టు)

c. Match the following.

| A | B | |
|---|---|---|
| 1. పాటలు | అడుగుదాం | (        ) |
| 2. ఆటలు | మాట్లాడ్దాం | (        ) |
| 3. రవితో | పాడ్దాం | (        ) |
| 4. గుంటూరు | వెళ్దాం | (        ) |
| 5. రవిని | ఆడ్దాం | (        ) |

## VOCABULARY

| | |
|---|---|
| కేరంబోర్డు | carrom board |
| కాసేపు | a short while |
| తిరుగు | go round, wander |
| దారి | way |
| సైకిలు | bicycle |

## GRAMMAR NOTES :

**60.1.** In this lesson hortative form of the verb is introduced. Hortative form expresses a proposal by the speaker involving both the speaker and the listener to perform the action indicated by the verb. Therefore for the hortative verb, the subject will always be మనం 'we', the I person inclusive plural pronoun.

**60.1.1.** **-దాం is added to the verbal base to form hortative.**

చదువు-దాం 'Let us read.'

**60.2.** **The changes, if any the verbal bases undergo before a suffix beginning with ద, are similar to those changes they (the verbal bases) undergo before a suffix beginning with త.**

(i) యి/య్యి ending bases change the final syllable to స్ and the penultimate vowel is lengthened if it is a short one. (48.1.)

చెయ్యి + దాం → చేస్ + దాం → చేద్దాం 'Let us do.' (see 60.3.)

(ii) ట్టు ending bases change the final syllable to ద్. (48.3)

కొట్టు + దాం → కొద్-దాం → కొద్దాం 'Let us beat.'

(iii) అను group changes the final ను to ం (అనుస్వారం). (49.2.)

అను + దాం → అందాం 'Let us say.'

(iv) ఉండు becomes ఉం. (50.2.)

ఉండు + దాం → ఉందాం 'Let us stay.'

ఓ ending bases of అను group change the final ఓ to ఉం (50.2.)

నిల్చో + దాం → నిల్చుందాం 'Let us stand.'

కూర్చో + దాం → కూర్చుందాం 'Let us sit.'

తీసుకో + దాం → తీసుకుందాం Let us take.'

(v) రా becomes వస్- and తీసుకురా becomes తీసుకొస్-. (46.2.)

రా + దాం → వస్ + దాం → వద్దాం 'Let us come.'
తీసుకురా + దాం → తీసుకొస్ + దాం → తీసుకొద్దాం 'Let us bring.' (see 60.3.)

(vi) చూడు becomes చూస్-. (48.2.)

చూడు-దాం → చూస్ + దాం → చూద్-దాం → చూద్దాం 'Let us see.' (See 60.3.)

(vii) వెళ్ళు becomes వెళ్- (46.2.) and చెప్పు becomes చెప్-. (54.2.)

వెళ్ళు + దాం → వెళ్-దాం → వెళ్దాం 'Let us go.'

చెప్పు + దాం → చెప్-దాం → చెప్దాం 'Let us tell.'

**60.3.** **స్ becomes ద్ when followed by a suffix beginning with ద.**

స్ + దాం → ద్దాం

| | |
|---|---|
| చేస్‌_దాం → చేద్దాం | 'Let us do.' |
| చూస్‌_దాం → చూద్దాం | 'Let us see.' |
| వస్‌_దాం → వద్దాం | 'Let us come.' |
| తీసుకోస్‌_దాం → తీసుకోద్దాం | 'Let us bring.' |

**60.4.** దాకా is a postposition meaning 'till'.

| | |
|---|---|
| నేను సాయంత్రందాకా ఇక్కడే ఉంటాను. | 'I will be here till evening.' |
| మా ఇంటిదాకా వెళ్ళు. | 'Go upto my house.' |

**60.5.** The oblique bases of అప్పుడు 'then', ఇప్పుడు 'now' and ఎప్పుడు 'when' are అప్పటి, ఇప్పటి and ఎప్పటి respectively.

**60.6.** డు ending bases normally drop the final ఉ when followed by a suffix beginning with త or ద. (However, if the suffix is beginning with తు or తూ the final ఉ is optionally dropped in writing.) (See also 47.6.)

ఆడు + తున్నాను → ఆడ్తున్నాను/ఆడుతున్నాను.

ఆడు + తా_డు → ఆడ్తాడు.

ఆడు + దాం → ఆడ్దాం.

# UNIT 15

## Lesson 61

శర్మ : రవీ ! ఇప్పుడా స్కూటరు కడగటం ?

Ravi ! Is this the time to wash the scooter?

రవి : ఇవ్వాళ ఆదివారం గదా ?

Today is Sunday. Isn't it ?

శర్మ : నేనివ్వాళ శ్రీరంగపట్నం వెళ్దాం అనుకుంటున్నాను. నువ్వుగూడా రారాదూ !

I am planning to go to Srirangapatnam today. Why don't you also come ?

రవి : స్కూటరు మీదా ?

By scooter ?

శర్మ : అవును.

Yes.

రవి : నాకుగూడా శ్రీరంగపట్నం చూద్దాం అని ఉంది. కాని ఈ ఆదివారం హాయిగా ఇంట్లో ఉందాం అనుకుంటున్నాను.

I too want to see Srirangapatnam. But I want to be at home this Sunday.

శర్మ : పరవాలేదు బయల్దేరు.

Doesn't matter. Come on.

రవి : కాదు. ఇవ్వాళ మనం శ్రీరంగపట్నం వెళ్ల వద్దు. జూకు వెళ్దాం.

No. Let's not go to Srirangapatnam today. Let's go to zoo.

శర్మ : ఏం ?

Why ?

రవి : ఇవ్వాళ శ్రీరంగపట్నంలో ఏదో ఉత్సవం జరుగుతున్నది. జనం చాలా మంది వస్తారు. ఆ జనంలో వెళ్లటం కష్టం.

There is a festival in Srirangapatnam today. There will be a lot of people. It will not be possible to go in that heavy rush.

శర్మ : సరే ! ఇవ్వాళ జూ చూద్దాం. మా ఆవిడె గూడా వస్తున్నది. మీ ఆవిణ్ణిగూడా తీసుకు రారాదూ !

All right ! We will go to the zoo today. My wife will also be coming. Why don't you bring your wife too ?

రవి : అలాగే ! అందరం వెళ్దాం.

Okay ! All of us will go.

## DRILLS

a. Build-up drill.

అనుకుంటున్నాను.

చూద్దాం అనుకుంటున్నాను.

పావను చూద్దాం అనుకుంటున్నాను.

మీ పావను చూద్దాం అనుకుంటున్నాను.

ఇవ్వాళ మీ పావను చూద్దాం అనుకుంటున్నాను.

ఉంది.

చేద్దాం అని ఉంది.

పని చేద్దాం అని ఉంది.

ఆ పని చేద్దాం అని ఉంది.

నాకు ఆ పని చేద్దాం అని ఉంది.



**b. Substitution drill.**

**Model (i) :**

మనం ఇవ్వాళ పుస్తకం కొనవద్దు.
అడుగు
మనం ఇవ్వాళ పుస్తకం అడగవద్దు.
తీసుకో
చదువు
తీసుకురా
రాయి

**Model (ii) :**

కమలా : నువ్విప్పుడు అన్నం తినరాదూ :
పాఠం చదువు
కమలా : నువ్విప్పుడు పాఠం చదవరాదూ :
ఇంటికి పో
బొమ్మలు చూడు
కలం తీసుకురా
పూలు కొయ్యి

**Model (iii) :**

శర్మకు నాటకం చూద్దాం అని ఉంది.
(పుస్తకం_చదువు)
శర్మకు పుస్తకం చదువుదాం అని ఉంది.

1. గిరిజకు పాఠం రాద్దాం అని వుంది. (పాట_పాడు)
2. మా పాపకు బిస్కెట్లు తిందాం అని ఉంది. (పాలు_తాగు)
3. కమలకు గుంటూరు వెళ్దాం అని ఉంది. (ఇంటికి_రా)
4. ఆయనకు జూకు వెళ్దాం అని వుంది. (ఇక్కడే_ఉండు)

**c. Response drill.**

Model (i) :

సరళా: ఇంటికి ఎప్పుడు వెళ్తున్నావు ? (రేపు)
రేపు వెళ్దాం అనుకుంటున్నాను.

1. హరీ : నువ్వు ఈ సంవత్సరం పరీక్ష రాస్తావా ? (వచ్చేసంవత్సరం)
2. కమలా : మీ నాన్నగారు ఆరో తారీకు పుస్తకం కొంటారా ? (ఏడో తారీకు)
3. రవీ: ఇప్పుడు లతతో మాట్లాడ్తావా? (రేపు)
4. రఘూ : ఇప్పుడు కాఫీ తాగుతావా? (ఎల్లుండి)

**d. Transformation drill.**

**Model (i) :**

మనం సినిమా చూద్దాం.
మనం సినిమా చూడవద్దు.

1. మనం రవితో మాట్లాడ్దాం.
2. మనం ఇవ్వాళ సరళ ఇంటికి పోదాం.
3. మనం రేపు ఒక కలం కొందాం.

**Model (ii) :**

నాకు నాటకం చూద్దాం అని వుంది.
నేను నాటకం చూద్దాం అనుకుంటున్నాను.

1. నాకు ఇంటికి పోదాం అని వుంది.
2. ఆమెకు ఒక పాట రాద్దాం అని వుంది.
3. రనుకు పూలు కోద్దాం అని వుంది.

**e. Conversation drill.**

**Model :**

రమ : సరళా ! నేను పెసరట్టు చేస్తాను. (పాఠం చదువు)

సరళ : పెసరట్టు నేను చేస్తాను. నువ్వు పాఠం చదవరాదూ !

రమ : ఇప్పుడు నాకు పెసరట్టు చేద్దాం అని ఉంది.

సరళ : సరే, అయితే నువ్వే పెసరట్టు చెయ్యి. నేను పాఠం చదువుతాను.

1. విమల : పార్వతీ ! ఇప్పుడు నేను బొమ్మ-గీస్తాను. (ఉత్తరం-రాయి)

   పార్వతి : ..................

   విమల : ..................

   పార్వతి : ..................

2. గోపి : రాముా ! నేను ఇక్కడికి రవిని తీసుకొస్తాను. (శర్మ-తీసుకురా)

   రాము : ..................

   గోపి : ..................

   రాము : ..................

3. కమల : మోహన్ ! ఈ సంచీ నేను కొంటాను. (కలం-కొను)

   మోహన్ : ..................

   కమల : ..................

   మోహన్ : ..................

**EXERCISES**

**a. Rewrite the following sentences filling up the blanks with the correct forms of the verbs given in the parentheses.**

1. నేను ఇవ్వాళ ఇంట్లో అన్నం......... (తిను) అనుకుంటున్నాను.
2. రమ రేపు కాలేజికి...........(రా) అనుకుంటున్నది.
3. వాళ్ళు ఇక్కడ.........(కూర్చో) అనుకుంటున్నారు.
4. సుగుణ ఒక పుస్తకం.........(తీసుకో) అనుకుంటున్నది.

**b. Answer the following questions as shown in the model :**

**Model (i) :**

మనం ఇవ్వాళ మామిడిపళ్లు తిందామా ? (రేపు)

మనం ఇవ్వాళ మామిడిపళ్లు తినవద్దు. రేపు తిందాం.

1. మనం ఈ గదిలో కూర్చుందామా ? (ఆగది)
2. మనం కన్నడ పుస్తకం తీసుకుందామా ? (తెలుగు)
3. మనం ఇప్పుడు రవిని తిద్దామా ? (శర్మ)
4. మనం ఇప్పుడు పూలు కోద్దామా ? (ఏరు)

Model (ii) :

నువ్వివ్వాళ ఏం చేద్దాం అనుకుంటున్నావు ? (సినిమా_చూడు)

నేనివ్వాళ సినిమా చూద్దాం అనుకుంటున్నాను.

1. శర్మ ఇవ్వాళ ఏం చేద్దాం అనుకుంటున్నాడు ? (గుంటూరు_వెళ్ళు)
2. రమ ఈ సంవత్సరం ఏం చేద్దాం అనుకుంటున్నది ? (బి.ఏ._చదువు)
3. అతను ఏం చేద్దాం అనుకుంటున్నాడు ? (లైటు_వెయ్యి)

c. **Rewrite the following sentences as shown in the model.**

Model (i) :

నేను ఇంటికి వెళ్తాను.

నాకు ఇంటికి వెళ్దాం అని వుంది.

1. నేను శర్మతో మాట్లాడ్తాను.
2. సరళ ఇక్కడే ఉంటుంది.
3. ఆమె ఒక నవల రాస్తుంది.
4. వాళ్ళు సినిమాకు వెళ్తారు.

Model (ii) :

శర్మా ! అక్కడికి రా !

శర్మా ! అక్కడికి రారాదూ !

1. సుగుణా ! నువ్వు మాట్లాడు !
2. గోపీ ! అక్కడ కూర్చో !
3. ఆనందరావు ! నువ్వు పూలు కొయ్యి !

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| స్కూటరు | scooter | | |
| అనుకో | think, plan (v) | జూ | zoo |
| కాని | but | ఉత్సవం | festival, celebration |
| హాయిగా | happily | పత్రిక | magazine |

## GRAMMAR NOTES :

61.1. In this lesson the sentence pattern Hortative + the verb అనుకో 'plan, think' is introduced.

ఇవ్వాళ నేను సినిమా చూద్దాం అనుకుంటున్నాను.

'I am thinking/planning to see a movie today.'

In this pattern of sentences, the subject need not be మనం, though the hortative form is used. (60.1.)

శర్మ గుంటూరు వెళ్దాం అనుకుంటున్నాడు. 'Sarma is planning to go to Guntur.'

నువ్వు ఏం చేద్దామనుకుంటున్నావు ? 'What are you planning to do?'

**61.2. Another syntactic pattern to express desire is also introduced in this lesson. The pattern is as follows :**

Horatative + అని వుంది

| | |
|---|---|
| నాకు శ్రీరంగపట్నం చూద్దాం అని వుంది. | 'I have a desire to see Srirangapatnam.' |
| నాకివ్వాళ కాఫీ తాగుదాం అని వుంది. | 'I have a desire to take coffee today.' |
| అతనికి తెలుగు సినిమా చూద్దాం అని వుంది. | 'He has a desire to see a Telugu movie.' |

**As in 61.1. మనం need not be the subject in this pattern also, though the hortative form is used. In this pattern, the subject will always be in dative case. Recall the use of dative case suffix in expressing possession of feelings, desires and habits. (38.6.)**

**61.3. Suggestive from of the verb is also introduced in this lesson. By this form, the speaker suggests some action for the listener to perform and expects complaince.**

| | |
|---|---|
| వెళ్ళరాదూ । | 'Why don't you go ?' |

**61.3.1.** -రాదూ is added to infinitive (52.3.2.) to form the suggestive form.

Suggestive → Infinitive + రాదూ

| | |
|---|---|
| వెళ్ళ-రాదూ । | 'Why don't you go ?' |
| ఇవ్వాళ సుమ్వాక సినిమా చూడరాదూ । | 'Why don't you see a movie today ?' |

**61.4.** Negative hortative is also introduced in this lesson (60.1.). -వద్దు is added to the infinitive (52.3.2.) to form negative hortative.

Negative Hortative → Infinitive + వద్దు.

వెళ్ళ-వద్దు 'Let us not go.'

| | |
|---|---|
| మనం ఇప్పుడు ఇంటికి వెళ్దాం. | 'Let's go home now.' |
| మనం ఇప్పుడు ఇంటికి వెళ్ళవద్దు. | 'Let's not go home now.' |
| మనం మాట్లాడవద్దు. | 'Let's not talk.' |

**61.5. Notice the use of the -అటం forms of the verbs (gerund) (53.1.) in sentences like the following.**

| | |
|---|---|
| ఇప్పుడా అన్నం తినటం ? | 'Is this the time of taking food ?' |
| అక్కడికి వెళ్ళటం కష్టం. | 'Going there is difficult.' |

**61.6. -ఆవిడ, when used with a plural pronominal adjective, means 'wife'. (15.5.)**

| | |
|---|---|
| మీ ఆవిడ | 'your wife' |
| మా ఆవిడ | 'my wife' |
| వాళ్ళ ఆవిడ | 'his wife' |

# UNIT 16

## Lesson 62

| | |
|---|---|
| శర్మ : సుబ్బారావు ! గోపీ నేనూ సినిమాకు వెళ్తున్నాం ; వస్తావా ! రవీ ! నువ్వు కూడా రా ! | Subbarao! Gopi and I are going to a movie. Will you come with us? Ravi! You also come with us. |
| సుబ్బా : ఇవ్వాళ నేను రాను. రవి కూడా రాడు. మేం మార్కెట్టుకు వెళ్లాలి. మీరు కూడా రాండి. సినిమాకు రేపు పోదాం. | I will not come today. Ravi also will not come. We have to go to market. You also come with us. We will go to the movie tomorrow. |
| గోపి : మేం రాము. ఇవ్వాళ ఆదివారం. కొట్లు ఉండవు. ఇప్పుడు సినిమాకు పోదాం. రాండి. | We will not go. Today is Sunday. Shops will not be open. Come, we will go to the movie |
| రవి : ఇప్పుడు టైం ఆరుంబావు. టిక్కెట్లు దొరకవు. | It's now 6.15. Tickets will not be available. |

శర్మ : పరవాలేదు. దొరుకుతాయి. మీరిద్దరూ బయల్దేరండి. — Don't worry. They will be available. You two proceed!

సుబ్బా : సరే కొంచెం సేపు కూర్చోండి. వెళ్దాం. — Okay. Please sit down for sometime. We will go. (Let's go.)

శర్మ : నేను కూర్చోను. నువ్వు బయల్దేర్తావా బయల్దేరవా? — I will not sit. Will you start or not?

సుబ్బా : బస్సు అందుతుందా? — Can we get the bus?

రవి : బస్సు అందదు. టైం చాలదు. ఆటోలో వెళ్దాం. — We can't get the bus. There is no time. We will go by auto. (Let's go by auto.)

సుబ్బా : అదుగో ప్రసాద్, మోహన్ వస్తున్నారు. వాళ్ళుగూడా వస్తారేమో అడుగుదాం. — See there! Prasad and Mohan are coming. We will ask them if they will also come.

శర్మ : వాళ్ళురారు. వాళ్ళు ఇప్పుడు సినిమానించే వస్తున్నారు. — They won't come. They are returning from the movie only.



## DRILLS

### a. Build-up drill.

అడుగుదాం.
మాట్లాడ్తారేమో అడుగుదాం.
నీతో మాట్లాడ్తారేమో అడుగుదాం.
ఆయన నీతో మాట్లాడ్తారేమో అడుగుదాం.

చూద్దాం.
వస్తాడేమో చూద్దాం.
వెంటనే వస్తాడేమో చూద్దాం.
అతను గూడా వెంటనే వస్తాడేమో చూద్దాం.

### b. Substitution drill.

Model (i) :

రవి గూడా వస్తాడేమో అడుగుదాం.
పో
రవి గూడా పోతాడేమో అడుగుదాం.
తిను
చూడు
బయల్దేరు
ఉండు

Model (ii) :

నేను సెలవులలో ఇంటికి పోను.
నువ్వు
నువ్వు సెలవులలో ఇంటికి పోవు.
మేం
మనం
మీరు
వాడు
అతను
సీత
వాళ్ళు

Model (iii) :

రవి వెంటనే బయల్దేరడు.
కమల
కమల వెంటనే బయల్దేరదు.
నేను
మేం
నువ్వు
బస్సు
రైళ్ళు
మీరు
వాళ్ళు

### c. Response drill.

Model :

నువ్వు సినిమాకు వస్తావా ?
నేను సినిమాకు రాను.

1. శర్మ ఇవ్వాళ నాటకానికి వస్తాడా ?
2. సరళ కాఫీ తాగుతుందా ?
3. మీ కుక్క బిస్కెట్లు తింటుందా ?
4. మనం సినిమాకు పోతామా ?
5. మేం ఇప్పుడు ఈ గదిలో కూర్చుంటామా ?
6. మీరు శనివారం రవితో మాట్లాడ్తారా ?

## EXERCISES

a. Answer the following questions based upon the text of the lesson.

1. శర్మ, గోపి ఇవ్వాళ మార్కెట్టుకు వెళ్తారా ?
2. ప్రసాద్, మోహన్ ఎక్కణ్ణించి వస్తున్నారు ?
3. సుబ్బారావు సినిమాకు ఎందుకు 'రాను' అంటున్నాడు ?

b. Fill up the blanks with the future negative forms of the verbs suggested in the parentheses.

1. రవి ఇవ్వాళ సినిమాకు............ (పో)
2. సరళ ఎల్లుండి నాటకం............ (చూడు)
3. కుక్కలు మామిడిపళ్ళు............ (తిను)
4. మాష్టరుగారు హిందీలో........(మాట్లాడు)
5. మీరు సాయంత్రం............ (చదువు)
6. మనం పగలు............ (నిద్రపో)
7. నువ్వు ఫాను............ (వెయ్యి)
8. నేను చెట్లు............ (ఎక్కు)

c. Answer the following questions as shown in the model :

Model :

శర్మ అన్నం తింటాడా ?

శర్మ అన్నం తినడు.

1. మనం రేపు బెంగుళూరు వెళ్తామా ?
2. సోమవారం సినిమా టిక్కెట్లు అందుతాయా ?
3. వాళ్ళు పూలు కోస్తారా ?
4. శర్మ సీతో మాట్లాడ్తాడా ?
5. సుబ్బారావు ఈ కుర్చీలో కూర్చుంటాడా ?

d. Match the following.

| A | B |
|---|---|
| 1. నేను రవితో | మాట్లాడరు ( ) |
| 2. సరళ నాతో | మాట్లాడవు ( ) |
| 3. మనం వాళ్ళతో | మాట్లాడదు ( ) |
| 4. నువ్వు శర్మతో | మాట్లాడను ( ) |
| 5. మీరు గోపితో | మాట్లాడం ( ) |

## VOCABULARY

| | |
|---|---|
| అందు | be available, be in one's reach |
| ఈ | one, ఒక |
| గయ్యాళి | quarrelsome (fem.) |
| వేషం | character in a drama |
| డైలాగు | dailogue |

## GRAMMAR NOTES

**62.1. In this lesson future negative is introduced.**

Unlike the present negative (54.1.), the future negative is formed in the following pattern:

Future Negative → Verbal base + Negative suffix అ + Personal suffix

వెళ్ళ్ + అ + ను → వెళ్ళను 'I will not go.'

The personal suffix* is the concord and it is in agreement with the person-gender-number of the subject.

| | |
|---|---|
| నేను రాను (రా-అ-ను 41.7.) | 'I will not come.' |
| మేం/మనం రాం (రా-అ-ం** 41.7.) | 'We will not come.' |
| నువ్వు వెళ్ళవు (వెళ్ళ్-అ-వు 41.6.) | 'You will not go.' |
| మీరు చదవరు (చదువు-అ-రు 43.2., 41.6.) | 'You will not read.' |
| వాడు/అతను తినడు (తిను-అ-డు 41.6) | 'He will not eat.' |
| ఆమె/ఆయన/వారు రాయరు (రాయు-అ-రు 41.6.) | 'She/he will not write.' |
| వాళ్ళు పని చెయ్యరు (చెయ్యి-అ-రు 41.6.) | 'They will not work.' |
| ఆమె/అది పోదు (పో-అ-దు 41.7.) | 'She/it will not go.' |
| అవి చెట్టు ఎక్కవు (ఎక్కు-అ-వు 41.6.) | 'They (neuter) will not climb the tree.' |

62.2. Remember that the final vowel of డు ending bases will be dropped when followed by a suffix beginning with త or ద (60.6.). The same rule is applicable to రు ending and లు ending bases.

బయల్దేరు + తున్నావు → బయల్దేరుతున్నావు/బయల్దేర్తున్నావు.

రాలు-తున్నాయి, రాల్తున్నాయి/రాలుతున్నాయి.

బయల్దేర్తాం.

ఎండలో కాళ్ళు కాల్తాయి.

* The personal suffixes which are used with the negative verb లే- (36.2.) are used here.

** The 1st person plural suffix (అనుస్వారం) can also be written as ము.

| | |
|---|---|
| మేం ఇక్కడ లేం/లేము. | మేం ఇప్పుడు రాం/రాము. |
| మేం సాయంత్రం వస్తాం/వస్తాము. | మనం అన్నం తింటున్నాం/తింటున్నాము. |

# UNIT 16

## Lesson 63

| | |
|---|---|
| శర్మ : గోపీ ! ఇలా రా. | Gopi ! Come here. |
| గోపి : ఎందుకు ? | Why ? |
| శర్మ : నీకొక మాట చెప్తాను. | I will tell you something. |
| గోపి : ఏమిటి ? | What is it ? |
| శర్మ : నువ్వు వస్తే చెప్తాను. | I will tell you if you come. |
| గోపి : నువ్వు చెప్తే వస్తాను. | If you tell me, I will come. |
| శర్మ : సరే ! మా ఆఫీసులో ఒక టైపిస్టు ఉద్యోగం ఖాళీగా ఉంది. అప్లై చేస్తావా ? | All right ! There is a vacancy for the post of a typist in our office. Will you apply for it ? |

గోపి : ఖాళీ ఉంటే అప్లై చేస్తాను. అప్లై చేస్తే నాకు వస్తుంది అంటావా ?

I will apply if there is a vacancy. Will I get it if I apply?

శర్మ : ముందే ఎట్లా చెప్తాను ?

How can I tell you beforehand ?

గోపి : నువ్వు వస్తుంది అంటే అప్లై చేస్తాను.

I will apply if you guarantee that I will get it.

శర్మ : నువ్వు ముందు అప్లై చెయ్యి. వాళ్లు ఒక పరీక్ష పెడ్తారు. ఆ పరీక్షలో ఎవరికి ఎక్కువ మార్కులు వస్తే ఆ ఉద్యోగం వాళ్లకు వస్తుంది.

You first apply. They will conduct a test (for the candidates). Whoever scores maximum marks in the test will get that job.

గోపి : పరీక్షను గురించి వివరంగా కనుక్కో !

Please find out about the examination in detail.

శర్మ : రేపు నువ్వు రా ! ఆ వివరాలు నువ్వే కనుక్కుంటే బాగుంటుంది. నేను అడిగితే బాగుండదు.

You come tomorrow. It will be better if you find out those details. It doesn't look nice if I ask for them.

గోపి : అలాగే వస్తాను.

Okay. I will come.

శర్మ : నిర్లక్ష్యం చెయ్యకు. ఈ అవకాశం పోతే మళ్లీ రాదు. నువ్వు అక్కడికి వస్తే నీగురించి మా మేనేజరుకు చెప్తాను.

Don't neglect it. If you lose this opportunity you will not get it again. If you come there I will talk to our manager about you.

## DRILLS

a. Build-up drill.

అంటావా ?
వస్తాడు అంటావా ?
అడిగితే వస్తాడు అంటావా ?
నేను అడిగితే వస్తాడు అంటావా ?
రవి నేను అడిగితే వస్తాడు అంటావా ?

బాగుంటుంది.
మాట్లాడితే బాగుంటుంది.
నువ్వు మాట్లాడితే బాగుంటుంది.
వివరాలు నువ్వు మాట్లాడితే బాగుంటుంది.
ఆ వివరాలు నువ్వు మాట్లాడితే బాగుంటుంది.

**b. Substitution drill.**

**Model (i) :**

రవి మాట్లాడితే నేను మాట్లాడ్తాను.

ఎక్కు

రవి ఎక్కితే నేను ఎక్కుతాను.

దిగు

తిప్పు

కప్పు

**Model (ii) :**

నువ్వు ఆడ్తే అతను ఆడ్తాడు.

జరుగు

నువ్వు జరిగితే అతను జరుగుతాడు.

చదువు

జరుపు

అడుగు

**Model (iii) :**

సరళ పోతే నేను పోతాను.

రా

సరళ వస్తే నేను వస్తాను.

కొను

కూర్చో

వెళ్లు

**Model (iv) :**

నువ్వు తలుపు తీస్తే శర్మ తియ్యడు. (వెయ్యి)

నువ్వు తలుపు వేస్తే శర్మ వెయ్యడు.

1. నువ్వు బొమ్మను తీసుకుంటే కమల తీసుకోదు. (చూడు)
2. గీత పూలు ఏరితే రమ ఏరదు. (కొయ్యి)
3. లత ఉత్తరం అడిగితే రవి అడగడు. (రాయ్యి)

**c. Response drill.**

**Model (i) :**

శర్మ వస్తాడు.

శర్మ వస్తే నేను వెళ్తాను.

1. రవి కూర్చుంటాడు.
2. వాణ్ణి రమ్మంటాను.
3. సరళ మాట్లాడ్తుంది.

**Model (ii) :**

శర్మ ఏం చేస్తున్నాడు? (నువ్వు-మాట్లాడు)

(a) నీగురించి మాట్లాడుతున్నాడు.

(b) నిన్ను గురించి మాట్లాడుతున్నాడు.

1. కమల ఏం చేస్తున్నది? (పరీక్ష-ఆలోచించు)
2. రవి ఏం చేస్తున్నాడు? (శర్మ-మాట్లాడు)
3. మీరు ఏం చేస్తున్నారు? (కొత్తయిల్లు-ఆలోచించు)

**d. Transformation drill.**

**Model :**

నువ్వు వస్తే చెప్తాను.
నువ్వు చెప్తే వస్తాను.

1. రవి వస్తే నేను వెళ్తాను.
2. కాఫీ తాగితే మంచినీళ్లు తీసుకోస్తాను.
3. నువ్వు మాట్లాడ్తే నేను వింటాను.
4. సరళ పూలు ఏరితే విమల కాయలు కోస్తుంది.
5. మాష్టరుగారు పరీక్ష పెడ్తే పిల్లలు బాగా చదువుతారు.
6. నువ్వు అక్కడికి వెళ్తే నేను కనుక్కుంటాను.
7. నువ్వు అప్లై చేస్తే ఉద్యోగం వస్తుంది.

## EXERCISES

a. Combine the following pairs of sentences as shown in the model.

నువ్వు రా. చెప్తాను.
నువ్వు వస్తే చెప్తాను.

1. నువ్వు చపాతీలు చెయ్యి. తింటాను.
2. మీరు రాండి. పాఠం చెప్తాను.
3. బాగా చదువు. మంచి మార్కులు వస్తాయి.
4. నువ్వు ఇక్కడే ఉండు. బస్సు అందుతుంది.
5. నువ్వు చపాతీలు తిను. కాఫీ తీసుకోస్తాను.
6. నువ్వు టీ తీసుకురా. నేను ఉప్మా తింటాను.
7. మీరు ఇంటికి పోండి. కమల కనిపిస్తుంది.

b. Fill up the blanks with the conditional forms of the verbs given in the parentheses.

1. నువ్వు........(రా) నేను అన్నం తింటాను.
2. శర్మ అన్నం........(తిను) పాలు తాగుతాను.
3. రవి పాలు.......(తాగు) వాడు నిద్రపోతాడు.
4. గోపి ........ (నిద్రపో) వాడు వెళ్తాడు.
5. నేను ఆఫీసుకు ........ (వెళ్లు) వివరాలు కనుక్కుంటాను.
6. నువ్వు ........ (కూర్చో) ఆమె పాడ్తుంది.
7. శర్మ ........ (మాట్లాడు) మనం వింటాం.

c. Answer the following questions based upon the text of the lesson.

1. ఉద్యోగం ఎవరి ఆఫీసులో? అది ఏం ఉద్యోగం?
2. ఆ ఉద్యోగం ఎవరికి ఇస్తారు?
3. గోపి శర్మ ఆఫీసుకు వెళ్తే శర్మ ఏం చేస్తాడు?

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| టైపిస్టు | typist | గురించి | about |
| ఉద్యోగం | employment, job | వివరం | detail |
| అప్లై | apply | కనుక్కో | enquire |
| ఎట్లా | how | నిర్లక్ష్యం | negligence |
| పరీక్ష పెట్టు | give a test | అవకాశం | opportunity |

## GRAMMAR NOTES

**63.1.** In this lesson the conditional is introduced.

The conditional is formed by adding -ఇతే to the verbal base.

Conditonal → Verbal base + ఇతే

ఆడు-ఇతే → ఆడితే 'if someone plays'

కప్పు-ఇతే → కప్పితే 'if someone covers it'

**63.2.** ఉ, which is the second vowel of the trisyllabic verbal bases, becomes ఇ when followed by a suffix beginning with ఇ (43.2).

చదువు-ఇతే → చదివితే 'if someone reads'

*caduvu-itee* → *cadivu-itee* → *cadivitee* (41.6).

**63.3.** When -ఇతే is added to those bases which undergo changes, such as యి becoming -స్ 48.1.; -ట్టు becoming -ద్ 48.3., etc. before a suffix beginning with త్, the following changes will take place :

(i) the conditional suffix -ఇతే is treated as beginning with త్. All the changes which occur in the combination of such bases plus a suffix beginning with త్, will take place.

(ii) ఇ of ఇతే is dropped :

రాయి + ఇతే → రాస్ + ఇతే → రాస్ + తే → రాస్తే 'if someone writes' (48.1)

చూడు + ఇతే → చూస్ + ఇతే → చూస్ + తే → చూస్తే 'if someone sees' (48.2)

రా + ఇతే → వస్ + ఇతే → వస్ + తే → వస్తే 'if someone comes' (46.2)

నెట్టు + ఇతే → నెద్ + ఇతే → నెద్ + తే → నెద్తే 'if someone pushes' (48.3)

తిను + ఇతే → తిం + ఇతే → తిం + తే → తింటే 'if someone eats' (49.2)

వెళ్ళు + ఇతే → వెళ్ + ఇతే → వెళ్ + తే → వెళ్తే 'if someone goes (46.2)

చెప్పు + ఇతే → చెప్ + ఇతే → చెప్ + తే → చెప్తే 'if someone tells' (54.2)

**63.3.1.** The conditional form of పో is పోతే.

పోతే 'if someone goes'

నిద్రపోతే 'if someone sleeps'

పారిపోతే 'if someone runs away'

**63.4.** A short vowel, between డ and త; ర and త; ల and త; and ళ and త is dropped in speech and optionally dropped in writing (60.6 and 62.2).

| | |
|---|---|
| కాలితే/కాల్తే | 'if burns' |
| ఆడితే/ఆడ్తే | 'if plays' |
| బయల్దేరితే/బయల్దేర్తే | 'if starts' |

**63.5.** గురించి 'about' is a postposition (16.6). It is added to an oblique base or an accusative case form :

| | |
|---|---|
| నాకు మీ కొత్త ఇంటి గురించి చెప్పు.<br>నాకు మీ కొత్త ఇంటిని గురించి చెప్పు. | 'Tell me about your new house.' |
| నేను నీ గురించి ఆలోచిస్తున్నాను.<br>నేను నిన్ను గురించి ఆలోచిస్తున్నాను. | 'I am thinking about you.' |

**63.6.** ఎట్లా 'how' is a variant of ఎలా (38.10).

# UNIT 16

## Lesson 64

| | |
|---|---|
| రవి : గిరీ ! శర్మ ఎంత సేపటిలోగా వస్తాడు ? నిన్నట్నుంచి వాడితో మాట్లాడాలనుకుంటున్నాను. | Giri! By what time Sarma will come? I am thinking of talking to him since last evening. |
| గిరి : నేను మొన్నట్నుంచి అనుకుంటున్నాను. | I am planning since the day before. |
| రవి : నాకు వాడితో ముఖ్యమైన పని ఉంది. అది రేపటిలోగా చెయ్యాలి. వాడు ఎప్పటికి వస్తాడు ? | I have an important business with him. That has to be done by tomorrow. By what time he would come? |
| గీత : ఇంకొక గంటలో వస్తాడు. నీకు ఏం ఇవ్వను ? కాఫీ ఇవ్వనా టీ యివ్వనా ? | He will come in an hour. What can I serve you? Can I give you coffee or tea? |
| రవి : కాఫీ తాగితే నాకు కడుపులో నెప్పి వస్తుంది. | I get stomach pain if I drink coffee. |

గిరి : అయితే నువ్వు రోజూ కాఫీ తాగవా ? — Then, don't you drink coffee daily ?

రవి : రోజూ తాగను. అప్పుడప్పుడు తాగుతాను. — Not daily. I will drink it now and then.

గిరి : మరి, టీ దొరకకపోతే ఏం చేస్తావు ? — What will you do if you don't get tea ?

రవి : ఊరుకుంటాను. — I will keep quite.

గిరి : పాలు తాగవా ? — Don't you drink milk ?

రవి : పాలు ముట్టుకుంటే నాకు డోకు వస్తుంది. — I will vomit if I take milk.

గీత : ఇదుగో టీ. పంచదార ఇంకా కొంచెం వెయ్యనా ? — Take this tea. Shall I add some more sugar ?




రవి : అక్కర్లేదు. టీ బాగుంది. ఇప్పుడు శర్మ రాకపోతే ఏం చెయ్యను ? — Not necessary. Tea is fine. What am I to do if Sarma doesn't turn up now ?

గిరి : కొంచెం సేపు చూడు. అప్పటికి గూడా రాకపోతే వాళ్ల యింటికే వెళ్లు. మేం గూడా రామా ?

Wait for sometime. If he doesn't come by then go to his house. Shall we also come with you ?

రవి : రాండి పోదాం. అక్కణ్ణించి మా యింటికి పోదాం.

Come on. Let's go. From there we will go to my house.

గిరి : మేం మీ యింట్లో ఏం చెయ్యం ? మీ ఆవిడె కూడా ఉండదు.

What are we to do in your house ? Your wife also will not be there.

రవి : వాళ్ల స్కూలుకు ఇవ్వాళ సెలవు. ఇంట్లోనే వుంది.

It's a holiday today for her school. She is at home only.

a. Substitution drill.

Model (i) :

రవి గంటలో వస్తాడు.

అరగంట

రవి అరగంటలో వస్తాడు.

ఐదు నిమిషాలు

రెండు రోజులు

ఆరు గంటలు

Model (ii) :

టీ ఇవ్వనా ?

తాగు

టీ తాగనా ?

చెయ్యి

అడుగు

తీసుకో

Model (iii) :

రవి అప్పటినించీ వస్తున్నాడు.

నిన్న

రవి నిన్నటినించీ వస్తున్నాడు.

మొన్న

అటు మొన్న

ఎప్పుడు

ఇప్పుడు

Model (iv) :

రవి రాకపోతే శర్మ రాడు.

పో

రవి పోకపోతే శర్మ రాడు.

తిను

తీసుకురా

కనుక్కో

ఊరుకో

Model (v) :

ఏ మామిడి పండు తినను ?

చూడు.

ఏ మామిడి పండు చూడను ?

కొను

తీసుకురా

కొయ్యి

**b. Interlocked substitution drill.**

వాడు అన్నం తినాలి అనుకుంటున్నాడు.

.... పండు ..........................

వాడు పండు తినాలి అనుకుంటున్నాడు.

నువ్వు ..............................

నువ్వు పండు తినాలి అనుకుంటున్నాను.

...............ఇవ్వు....................

నువ్వు పండు ఇవ్వాలి అనుకుంటున్నావు.

.......పుస్తకం...........................

వాడు.................................

...........చదువు.......................

సీత ..................................

...........రాయి .......................

.......ఉత్తరం..........................

...........తినకో.......................

మనం ...............................

**c. Response drill.**

Model (i) :

రవి ఏమనుకుంటున్నాడు ?
(గుంటూరు వెళ్ళాలి)

రవి గుంటూరు వెళ్ళాలి అనుకుంటున్నాడు.

1. సుబ్బారావు ఏమనుకుంటున్నాడు ? (సినిమా చూడాలి)
2. శర్మ ఏమనుకుంటున్నాడు ? (నిద్రపోవాలి)
3. మాష్టరుగారు ఏమనుకుంటున్నారు. (పరీక్ష పెట్టాలి)
4. సరళ ఏమనుకుంటున్నది ? (పాట పాడాలి)

Model (ii) :

రవి రాడు.

రవి రాకపోతే నేను రాను.

1. ఇవ్వాళ శర్మ చదవడు.
2. రవి నిద్రపోడు.
3. మాష్టరుగారు కూర్చోరు.

**d. Transformation drill.**

Model (i) :

నేను అన్నం తిననా ?

మేం అన్నం తినమా ?

1. నేను పాఠం చదవనా ?
2. నేను పాలు తాగనా ?
3. నేను బడికి వెళ్ళనా ?

Model (ii) :

నేను ఏ పుస్తకం కొనను ?

మేం ఏ పుస్తకాలు కొనం ?

1. నేను ఏ పాఠం చదవను ?
2. నేను ఏ సినిమాకు వెళ్ళను ?
3. నేను ఎవరితో మాట్లాడను ?

**Model (iii) :**

నువ్వు వస్తే శర్మ తింటాడు.
నువ్వు రాకపోతే శర్మ తినడు.

1. రవి తింటే నేను మాట్లాడ్తాను.
2. శర్మ గుంటూరు వెళ్తే రవి బెజవాడ వెళ్తాడు.
3. శారద టీ చేస్తే మీరు తాగుతారు.

**Model (iv) :**

నువ్వు వస్తే వాడు ఉండడు.
నువ్వు రాకపోతే వాడు ఉంటాడు.

1. శర్మ మాట్లాడితే నువ్వు మాట్లాడవు.
2. కమల చదవమంటే ఆమె చదవదు.
3. మీరు పాను వెయ్యమంటే రవి వెయ్యడు.

**e. Combination drill.**

**Model :**

శర్మ రాడు. మనం వెళ్తాం.
శర్మ రాకపోతే మనం వెళ్తాం.

1. కమల అన్నం తినదు. ఆయన గూడా తినదు.
2. మోహన్ మార్కెట్టుకు వెళ్ళడు. రవి రాడు.
3. మాష్టరుగారు రారు. పిల్లలుగొడవ చేస్తారు.
4. నువ్వు నిద్రపోవు. నిన్ను కొడ్తాను.

## EXERCISES

**a. Answer the following questions based upon the text of the lesson.**

1. రవి ఎప్పటినించీ శర్మతో మాట్లాడాలను కుంటున్నాడు ?
2. రవి టీ దొరకకపోతే ఏం చేస్తాడు ?
3. రవి కాఫీ ఎందుకు తాగడు ? పాలు ఎందుకు తాగడు ?

**b. Answer the following sentences using the cue words.**

1. శర్మ ఎప్పటిలోగా ఈ పని చెయ్యాలి అనుకుంటున్నాడు (రేపు)
2. గోపి ఎంత సేపటిలో వస్తాడు ? (అరగంట)
3. నువ్వు ఏమనుకుంటున్నావు ? (కలం కొనాలి)
4. సరళ ఏమనుకుంటున్నది ? (నిన్ను చూడాలి)

**c. Fill up the blanks with the negative conditional forms of the verbs given in the parentheses.**

1. నువ్వు............(రా) ఆమె అన్నం తినదు.
2. శర్మ.........(ఉండు) నేను మాట్లాడ్తాను.
3. సుబ్బయ్య...... (మాట్లాడు) మనం వినం.
5. మందు...... (తీసుకో) తలనెప్పి వస్తుంది.

**d. Match the following.**

| A | B | |
|---|---|---|
| 1. నేను | ఏం చెయ్యం | (    ) |
| 2. మేం | ఏం చేద్దాం | (    ) |
| 3. మనం | ఏం చెయ్యను | (    ) |

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| ముట్టుకో | touch (v) | పద్ధతి | procedure |
| డోకు | vomiting | జుట్టు | hair |

## GRAMMAR NOTES

**64.1.** In this lesson the use of future negative as a 'request question' is introduced.

This use can be in two modes of questions, viz.,

(i) Yes/no interrogation (7.1.), and

(ii) Interrogation using an interrogative word (7.1.).

(i) Request question (yes/no type)→Future negative + Interrogation marker ఆ.

రేపు మేం గుంటూరు వెళ్ళమా ?
(వెళ్ళం + ఆ) (6.7.) — 'Shall we go to Guntur tomorrow ?'

ఇప్పుడు నేను తలుపు తియ్యనా ?
(తియ్యను + ఆ) (41.6) — 'Shall I open the door now ?'

(ii) Request question with an interrogative word → Interrogative word + Future negative form of the verb.

| | |
|---|---|
| ఇప్పుడు నేను ఏం చెయ్యను ? | 'What shall I do now ?' |
| నీకు ఎన్ని పళ్ళు ఇవ్వను ? | 'How many fruits shall I give you ?' |
| నేను ఎంతమందితో మాట్లాడను ? | 'How many people shall I speak to ?' |
| రేపు మేం ఎన్ని పూలు కొయ్యం ? | 'How many flowers shall we pluck tomorrow ?' |
| ఇప్పుడు మేం ఎక్కడికి వెళ్ళం ? | 'Where shall we go now ?' |

In this type of sentences, the subject will always be in first person.

**64.2.** Negative conditional is also introduced in this lesson. _అకపోతే is added to the verbal base to form negative conditional.

Negative conditional → verbal base + అకపోతే

చదువు + అకపోతే → చదవకపోతే 'if some one does not read' (43.2; 41.6)

రా + అకపోతే → రాకపోతే 'if someone does not come' (41.7)

64.3. The following oblique bases are also introduced :

| oblique base | nominative base | |
|---|---|---|
| పేపటి_ | పేపు | 'time' |
| మొన్నటి_ | మొన్న | 'day before yesterday' |
| నిన్నటి_ | నిన్న | 'yesterday' |
| రేపటి_ | రేపు | 'tomorrow' |
| అప్పటి_ | అప్పుడు | 'then' |
| ఎప్పటి_ | ఎప్పుడు | 'when' |
| ఇప్పటి_ | ఇప్పుడు | 'now' |

64.4. Notice the sentence :

నేను వాడితో మాట్లాడాలి అనుకుంటున్నాను. 'I am thinking that I should speak to him.'

Note the difference between the following :

(i) వాడితో మాట్లాడాలి అనుకుంటున్నాను. 'I am thinking that I should speak to him.'

(ii) వాడితో మాట్లాడ్దాం అనుకుంటున్నాను. (61.1) 'I am planning to speak to him.'

The sentence (i) is more obligatory and (ii) is just a proposal.

64.5. అప్పుడప్పుడు (అప్పుడు + అప్పుడు) 'now and then, rarely', is the reduplicated form of అప్పుడు 'then'.

# REVIEW 8

## Lesson 65

రామయ్య : ఇదేనండీ మా పొలం. — This is our farm, sir.

పాత్రో : ఎన్ని ఎకరాలండీ ? — How many acres is it, sir?

రామయ్య : నాలుగు ఎకరాలు. మీదేవూరు బాబూ ? — Four acres. Which place do you hail from ?

పాత్రో : మా వూరు పూరీ దగ్గర. ఒరిస్సాలో ఉంది. ఈ ఎద్దులు మీవేనా ? — My village is near Puri. It is in Orissa. Are these oxen yours?

రామయ్య : అవును బాబూ ! — Yes, sir.

పాత్రో : ఆవులు గూడా ఉన్నాయా ? — Do you have cows also?

రామయ్య : ఒక ఆవు, ఒక గేదె ఉన్నాయి బాబూ ! — I have a cow and a buffalo, sir.

| | |
|---|---|
| పాత్రో : మీ పొలంలో ఏమేమి పండుతాయి ? | What do you grow in your land ? |
| రామయ్య : మెట్ట పంటలన్నీ పండుతాయండీ ! ముఖ్యంగా మెరప, కంది, పొగాకు ఎక్కువగా వేస్తాం. | We have all dry crops, sir. We grow chillies, red-gram and tobacco more. |
| పాత్రో : వరి పండదా ? | Doesn't paddy grow here ? |
| రామయ్య : ఇది మెట్ట భూమి గదా ! మాగానిలో వరి పండుతుంది. మాకు పంటలకు వర్షాలే ఆధారం. | This is a dry land, you see. Paddy grows only in wet lands. We have to depend on rain for our crops. |
| పాత్రో : పొలం ఎప్పుడు దున్నుతారండీ ? | When do you plough the land ? |
| రామయ్య : ఈ నెలలో దున్నాలి. రెండు మూడు రోజుల్లో. దున్నుతాం ఈ సవంత్సరం ఇప్పటిదాకా మంచి వర్షాల్లేవండీ. ఇంకొక నెలలో మంచి వర్షం పడక పోతే కష్టం. | We have to plough it in this month. We will plough it in two or three days. We did not have good rains so far during this year. It will lead to difficulties, if it does not rain for another month. |
| పాత్రో : చెరువులేవీ లేవా ఇక్కడ ? | Don't yon have any lakes here ? |
| రామయ్య : ఇటువైపు చెరువులు లేవండీ. వచ్చే సంవత్సరం నాగార్జునసాగర్ కాలవ నీళ్లు వస్తాయంటున్నారు. అప్పుడు ఒక ఎకరం మాగాని చేద్దాం అనుకుంటున్నాను. | There are no lakes in these areas. They say that we get water from Nagarjuna Sagar canals. I am planning to convert one acre into wet land then. |
| పాత్రో : మొత్తం మాగాని చెయ్యరాదూ ? | Why don't you convert the entire land into wet land ? |
| రామయ్య : ఎలా చెయ్యనండీ ? చాలా డబ్బు కావాలి. | How can I do it, sir ? A large amount of money is needed. |

| | |
|---|---|
| పాత్రో : మీ పక్క పొలంలో బావి ఉందే ! ఏతం గూడా ఉంది. | There is a well in the neighbouring land. Isn't it ? There is a device also to draw the water from the well. |
| రామయ్య : అవునండీ ! అప్పుడప్పుడు ఆ నీళ్ళే మేం గూడా పొలానికి పెట్టుకుంటాం. | Yes. We draw water from that well sometimes for our land also. |

## EXERCISES

a. Fill up the blanks with the conditional forms of the verbs given in the parentheses.

1. వర్షాలు........ (పడు) పంటలు పండుతాయి.
2. నువ్వు........(రా) సుశీల మాట్లాడుతుంది.
3. రమ పూలు (కొయ్యి) నేను ఏర్తాను.
4. కమల కాఫీ........(తీసుకో) నేను తీసుకోను.
5. వాళ్ళు అన్నం ........ (తిను) నువ్వు తినవా?

b. Answer the following questions using the cue words.

1. సుబ్బారావు ఏంచేస్తాడు ? (సినిమా—చూడు)
2. గోపి ఇప్పుడు ఏం చేస్తాడు ? (దారం—చుట్టు)
3. పాప ఏం చేస్తుంది ? (బిస్కెట్లు—తిను)
4. నువ్వేం చేస్తావు ? (టోపీ—పెట్టుకో)
5. రామయ్య ఏం చేస్తాడు ? (పొలం—దున్ను)
6. లీల ఏం చేస్తుంది ? (పాట—పాడు)

c. Answer the following questions using the hortative forms of the verbs as shown in the model.

Model (i) :

శర్మ ఏమంటున్నాడు ? (పాఠం—చదువు)
శర్మ పాఠం చదువుదాం అంటున్నాడు.

1. సరళ ఏమంటున్నది ? (పూలు—కొయ్యి)
2. పాప ఏమంటున్నది ? (పండు—తిను)
3. రమ తమ్ముడు ఏమంటున్నాడు ? (సాయంత్రం—రా)
4. రవి ఏమంటున్నాడు ? (ఊరు—వెళ్ళు)
5. వాళ్ళు ఏమంటున్నారు ? (సినిమా—చూడు)

d. (a) Read the following dialogue and frame similar dialogues using the phrases given below.

రాము : గోపీ ! నువ్వు ఇప్పుడు బెంగుళూరు వెళ్ళరాదూ ?
గోపి : ఇప్పుడు ఎలా వెళ్ళను ? రేపు వెళ్తాను.

1. పూలు కొయ్యి
2. సినిమా చూడు
3. పాఠం చదువు
4. ఇంటికి రా
5. డబ్బు తీసుకో
6. ఉత్తరం రాయి
7. బల్ల నెట్టు
8. పుస్తకం కొను

(b) Read the following dialogue and frame similar dialogues using the phrases given in (a) above.

రాము : ఏమండీ ! మీరిప్పుడు బెంగుళూరు వెళ్ళరాదూ ?
గోపి : ఇప్పుడెలా వెళ్ళం? రేపు వెళ్తాం.

e. Give your responses to the following sentences in both ways as shown in the model.

Model :

శర్మ పాఠం చదువుతున్నాడు.
(a) నేను కూడా చదవనా ?
(b) మేం కూడా చదవమా ?

1. కమల అన్నం తింటున్నది.
2. రమ ఉత్తరం రాస్తున్నది.
3. రామయ్య పొలం దున్నుతున్నాడు.
4. సుబ్బారావు సంచీ తీసుకుంటున్నాడు.
5. శ్యామల భోజనం వడ్డిస్తున్నది.
6. వాళ్ళు ఆలోచిస్తున్నారు.
7. అతను ఇక్కడికి వస్తున్నాడు.

f. Give your responses to the following sentences as shown in the model.

వాడు మాట్లాడ్తాడు.
మనం కూడా మాట్లాడదాం.

1. ఆమె పూలు కోస్తుంది.
2. వాళ్ళు అన్నం తింటారు.
3. అతను డబ్బు తీసుకుంటాడు.
4. వాడు సినిమా చూస్తాడు.
5. పాప ఇప్పుడు వస్తుంది.

g. Frame conversations as shown in the model.

Model (i) :

రావు : నేను శర్మతో మాట్లాడాలి.
రవి : నేనూ శర్మతో మాట్లాడదాం అనుకుంటున్నాను. (గీత)
రావు : శర్మతో మాట్లాడకు. గీతతో మాట్లాడరాదూ !

1. రావు : నేను ఇప్పుడు ఇంగ్లీషు పాఠం రాయాలి.
రవి : .... .... .... ... .... ....(తెలుగు)
రావు : .... .... .... .... .... .... ....

2. గీత : నేనిప్పుడు ఇడ్లీ తినాలి.
సీత : .... .... .... .... .... (మినపట్టు)
గీత : .... .... .... .... .... .... ....

3. మోహన్ : నేనిప్పుడు నాటకానికి వెళ్ళాలి.
రాము : .... .... .... .... .... (సినిమా)
మోహన్ : ... ... ... ... ... ...

4. గిరిజ : నేను రేపొక కలం తీసుకురావాలి.
అరుణ : ... ... ... ... ...(కాయితం)
గిరిజ : .... .... .... .... .... .... ....

5. సుశీల : నేను 6 గంటలకు రావాలి.
   సుగుణ : .... .... .... .... (5 గంటలు)
   సుమతి : .... .... .... .... .... ....

6. మాలతి : నేనిప్పుడు మల్లెపూలు పెట్టుకోవాలి.
   మాధవి : ... ... ... ... (గులాబీ)
   మాలతి : ... ... ... ... ... ... ...

Model (ii) :

వాసు : సుబ్బారావు ఇక్కడికి రావాలి.
వేణు : అయితే నువ్వు వాణ్ణి రమ్మనాలి.
వాసు : నేను రమ్మంటేనే వాడు వస్తాడా ?
వేణు : అవును. నువ్వు రమ్మనకపోతే వాడు రాడు.

1. వాసు : శర్మ పాట పాడాలి.
   వేణు : .... .... .... .... ....
   వాసు : ... ... ... ... ...
   వేణు : ... ... ... ... ...

2. గిరిజ : కమల పూలు కొయ్యాలి.
   సుగుణ : ... ... ... ... ...
   గిరిజ : ... ... ... ... ...
   సుగుణ : .... .... .... .... ....

3. సరళ : ఆమె పాలు తీసుకోవాలి.
   విమల : ... ... ... ... ...
   సరళ : .... .... .... .... ....
   విమల : .... .... .... .... ....

4. వాణి : సుగుణ మాట్లాడాలి.
   గిరిజ : .... .... .... .... ....
   వాణి : .... .... .... .... ....
   గిరిజ : .... .... .... .... ....

h. Give negative replies to the following questions.

1. మోహన్ ! ఇప్పుడు నువ్వు ఇంటికి వెళ్తావా ?
2. శ్యామలా ! మొక్కలకు నీళ్లు పోస్తావా ?
3. రమా ! ఈ బస్సు గుంటూరు పోతుందా ?
4. మీ ఇంటికి ఇవ్వాళ శర్మ, రవి వస్తారా ?
5. అతను రేపు సినిమా చూస్తాడా ?
6. మేం ఇప్పుడు ఇడ్లీ తింటామా ?
7. మనం ఇప్పుడు రావును తీసుకోస్తామా ?
8. రామయ్య పొలం దున్నుతాడా ?

i. Transform the following sentences as shown in the model using **one** plural form in the place of **both** the underlined words.

Model :

వాణ్ణీ రవినీ శర్మ తిడ్తాడు.
వాళ్లను శర్మ తిడ్తాడు.

1. నిన్నూ నన్నూ శర్మ డబ్బు అడుగుతాడు.
2. నన్నూ వాణ్ణీ సుబ్బారావు చూస్తాడు.
3. నిన్నూ నిన్నూ నేను కొడ్తాను.
4. ఆమెనూ అతన్నీ రవి చూస్తున్నాడు.
5. అతనికీ వాళ్లకూ పుస్తకాలు చూపించకు.
6. మిమ్మల్నీ నన్నూ ఎవరు చూస్తున్నారు ?
7. నీకూ మాకూ కమల పాఠం చెప్తుంది.

**j. Give the plural forms of the following nouns.**

బావి          తాడు          మనిషి

## VOCABULARY

| | |
|---|---|
| పొలం | field, farm |
| ఎకరం | acre |
| ఎద్దు | ox |
| ఆవు | cow |
| గేదె | buffalo |
| పండు | ripe, yield (v) |
| మెట్టపంట | dry crop |
| ముఖ్యం | importance |
| మెరప/మిరప | chillies |
| కంది | red-gram |
| పొగాకు | tobacco |
| వరి | paddy |
| మాగాని/మాగాణి | low lying land with irrigation |
| మెట్టభూమి | dry land |
| పంట | crop (n) |
| వర్షం | rain (v) |
| ఆధారం | source, support (n) |
| దున్ను | plough (v) |
| చెరువు | lake, tank |
| డబ్బు | money |
| కాలవ | canal |
| బావి | well (n) |
| ఏతం | a device to draw water from wells |




## CULTURAL NOTE :

**65.1. 'బాబూ !' is a polite and humble way of addressing men. It's also used to address male children (14.8).**

# UNIT 17

## Lesson 66

వెంకటేశ్వర్లు : రవీ ! నిన్న సాయంత్రం నువ్వూ, సరళా మా ఇంటికి వచ్చారా ?

Ravi ! Did you and Sarala come to my house last evening ?

రవి : అవును. ఐదు గంటలకు వచ్చాం. అప్పుడు నువ్వు లేవు. నీ స్కూటరూ, సైకిలూ ఉన్నాయి. నీకోసం చాలా సేపు చూశాం. మీ తమ్ముణ్ణి గూడా అడిగాం. ఆస్పత్రికి వెళ్ళాడు అన్నాడు.

Yes. We came there at 5 o' clock. You were not at home then. But your scooter and bicycle were there only. We waited for you a long time. We enquired your brother about you also. He told us that you had gone to the hospital.

వెంక : అవును.

Yes.

రవి : ఆస్పత్రికి ఎందుకు వెళ్ళావు ?

Why did you go to the hospital ?

వెంక : చెవిలో నెప్పిగా ఉంది.

I had pain in the ear.

| | |
|---|---|
| రవి : మందు తీసుకున్నావా ? | Did you have any medicine ? |
| వెంక : తీసుకున్నాను. | Yes, I had it. |
| రవి : నెప్పి తగ్గిందా ? | Was the pain gone ? |
| వెంక : ఇప్పుడిప్పుడే తగ్గుతున్నది. సాయంత్రానికి పూర్తిగా తగ్గుతుంది అన్నారు డాక్టరు. | It is coming down slowly now. " It will be gone completely by the evening," said the doctor. |
| రవి : సరే, నీ రేడియో బాగుచేశాను. | I repaired your radio. |
| వెంక : అలాగా ! తీసుకొచ్చావా ? | Oh! Did you bring it ? |
| రవి : ఇదుగో. | Here it is. |
| వెంక : కమల నిన్న సాయంత్రమే తీసుకురమ్మన్నది. దానికి కావాల్సిన సామాను దొరికిందా ? | Kamala wanted me to get it by the last evening itself. Were the required parts for it available here ? |
| రవి : ఆ ! | Yes. |

a. Substitution drill.

Model (i) :

నేను నిన్న సినిమా చూశాను.
ఫాను వెయ్యి
నేను నిన్న ఫాను వేశాను.
పూలు కొయ్యి
లైటు తియ్యి
బొమ్మ గియ్యి
పని చెయ్యి
రవిని చూడు

Model (ii) :

రవి అన్నం తిన్నాడు.
పుస్తకం కొను
రవి పుస్తకం కొన్నాడు.
పాఠం విను
పండు తీసుకో
కళ్ళజోడు పెట్టుకో
ఈ మాట అను
గుంటూరులో ఉండు

Model (iii) :

కమల సరళతో మాట్లాడింది.
చెప్పు
కమల సరళతో చెప్పింది.
ఆడు
పాడు
వెళ్ళు

Model (iv) :

రవి నిన్న చెప్పాడు.
చదువు
రవి నిన్న చదివాడు.
తిరుగు
వెతుకు
జరుగు

Model (v) :

సీత పాఠం చెప్పింది.
పాట పాడు
సీత పాట పాడింది.
పాఠం చదువు
పుస్తకం వెతుకు
పక్కకు జరుగు

Model (vi) :

నేను పుస్తకం తీసుకున్నాను.
నువ్వు
నువ్వు పుస్తకం తీసుకున్నావు.
మేం
మీరు
రవి
సీత
వాళ్ళు
కోతులు

b. Response drill.

Model (i) :

ఇక్కడికి ఎవరు వచ్చారు ?
శర్మ
ఇక్కడికి శర్మ వచ్చాడు.

1. నిన్న మీ ఇంటికి ఎవరొచ్చారు ? (కమల)
2. మొన్న ఇక్కడికి ఏం వచ్చాయి ? (కోతులు)
3. పొద్దున మీ ఇంటికి ఎవరొచ్చారు ? (వాళ్ళు)
4. నిన్న రాత్రి మీ గదికి ఎవరొచ్చారు? (నువ్వు)

Model (ii) :

శర్మ ఏం చేశాడు ? (పూలు-కొయ్యి)
శర్మ పూలు కోశాడు.

1. కమల ఏం చేసింది ? (కుర్చీలో-కూర్చో)
2. కుక్కలు ఏం చేశాయి ? (బిస్కెట్లు-తిను)
3. మీరు ఏం చేశారు ? (చెట్టు-ఎక్కు)
4. రవి ఏం చేశాడు ? (రేడియో-బాగుచెయ్యి)
5. గోపి ఏం చేశాడు ? బొమ్మలు-తీసుకురా)
6. నేను ఏం చేశాను ? (పాఠం-చదువు)
7. కుక్క ఏం చేసింది ? (దొంగను-పట్టుకో)

**c. Transformation drill.**

**Model (i) :**

రవి వస్తున్నాడు.

రవి వచ్చాడు.

1. సరళ పూలు కోస్తున్నది.
2. కుక్కలు గోడ ఎక్కుతున్నాయి.
3. మనం అన్నం తింటున్నాం.
4. నువ్వు తలుపు తీస్తున్నావు.
5. మీరు కూర్చుంటున్నారు.

**Model (ii) :**

రైలు వెళ్తుంది.

రైలు వెళ్లింది.

1. రవి పూలు కొంటాడు.
2. విమల కాయలు ఏరుతుంది.
3. నేను చెట్టుమీదినించి దిగుతాను.
4. మా నాన్నగారు వస్తారు.
5. అతను బొమ్మలు గీస్తాడు.
6. ఆయన రేడియో బాగు చేస్తారు.
7. మనం ఆ విషయం కనుక్కుంటాం.
8. రమ కలం వెతుకుతుంది.

**d. Combination drill.**

**Model :**

నాకు పుస్తకాలు కావాలి.

అవి అక్కడ ఉన్నాయి.

నాకు కావాల్సిన పుస్తకాలు అక్కడ ఉన్నాయి.

1. పాపకు బొమ్మలు కావాలి.
   అవి ఆ కొట్లో లేవు.
2. శర్మకు కొత్త గుడ్డ కావాలి.
   అది ఆ కొట్లో దొరికింది.
3. సుగుణకు కలం కావాలి.
   అది నా దగ్గర ఉంది.
4. నీకు పుస్తకం కావాలి.
   అది ఎవరి దగ్గరున్నది?

## EXERCISES

**a. Answer the following questions using the cue words.**

1. రవి నిన్న ఏం చేశాడు? (మామిడి పళ్లు–కొయ్యి)
2. శర్మ మొన్న ఏం చేశాడు? (చపాతీలు–తిను)
3. గోపి నిన్న ఏం చేశాడు? (నవల–చదువు)
4. రమ ఏం చేసింది? (కుర్చీలో–కూర్చో)
5. నువ్వేం చేశావు? (డబ్బులు–తీసుకో)
6. శ్యామల ఏం చేసింది? (ఇక్కడే–ఉండు)

**b. Combine the following pairs of sentences as shown in the model.**

**Model :**

విమలకు ఎర్ర రంగు చీరె కావాలి.

అది ఆ కొట్లో దొరికింది.

విమలకు కావాల్సిన ఎర్ర రంగు చీరె ఆ కొట్లో దొరికింది.

1. రవికి పుస్తకం కావాలి.
   అది మోహన్ దగ్గరుంది.
2. సుబ్బారావుకు కుర్చీ కావాలి.
   అది ఇక్కడ లేదు.
3. నీకు కలం కావాలి.
   అది ఎక్కడుంది ?
4. శ్యామలకు రేడియో కావాలి.
   అది ఎక్కడ దొరుకుతుంది ?
5. మీకు బస్సు కావాలి.
   అది ఇప్పుడే వెళ్లింది.

c. Fill up the blanks with the past tense forms of the verbs given in the parentheses.

1. రవి నిన్న సాయంత్రం నాటకం గురించి ......... (కనుక్కో)
2. శ్యామల మొన్న గుంటూరు ........ (వెళ్లు)
3. నేను నిన్ననే గుంటూరునించి .........(రా)
4. మీరు నా రేడియో ............ (తీసుకురా)
5. మనకు నిన్న బస్సు ............ (దొరుకు)
6. నువ్వు నా మాటలు ......... (విను)
7. వాళ్లు అక్కడ ......... (ఉండు)

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| తగ్గు | reduce (v. intr.) | బాగుచెయ్యి | make good, repair (v) |
| పూర్తి | completion | సామాను | thing, goods, commodities. |

## GRAMMAR NOTES

66.1. In this lesson past tense is introduced. -æ/-ఇం is the past tense suffix. The past tense forms are formed by the combination of verbal base + person suffix in the said order. The same personal suffixes (45.2) used in present and future tenses are used here also.

66.1.1. -ఇం occurs before feminine inferior and neuter singular suffix -ది.

| | | |
|---|---|---|
| ఆమె పాఠం చదివింది (చదువు-ఇం-ది) | 'She read the lesson.' | (63.2 ; 41.6) |
| కుక్క చెట్టు ఎక్కింది. (ఎక్కు-ఇం-ది) | 'The dog climbed the tree.' | (41.6) |

**66.1.2.** -æ* occurs before other personal suffixes.

| | |
|---|---|
| నేను వెళ్లాను (వెళ్ల్-æ-ను)** | 'I went' (see 66.2) |
| మేం/మనం వెళ్లాం (వెళ్ల్-æ-ం) | 'We went.' |
| నువ్వు వెళ్లావు (వెళ్ల్-æ-వు)<br>మీరు వెళ్లారు (వెళ్ల్-æ-రు) | 'You went.' |
| వాడు/అతను వెళ్లాడు (వెళ్ల్-æ-డు) | 'He went.' |
| ఆమె/ఆయన/వారు/వాళ్లు వెళ్లారు (వెళ్ల్-æ-రు) | 'She/He/They went.' |
| అవి వెళ్లాయి (వెళ్ల్-æ-యి) | 'They (neut.) went.' |

**66.2.** æ has no symbol in Telugu script. We write the symbol of అ for æ. In other words, the past tense marker æ is written as అ and pronounced æ.*

| | | |
|---|---|---|
| తాగు-æ-ను → తాగాను | *taagænu* | 'I drank.' |
| వెళ్లు-æ-ను → వెళ్లాను | *veḷḷænu* | 'I went.' |

**66.3.** యి/య్యి ending bases change the final syllable to స్ and lengthen the penultimate vowel, if it is short, when followed by a suffix beginning with ఇ or æ. (48.1.)

| | | |
|---|---|---|
| కొయ్యి-æ-ను → కోస్-æ-ను → కోశాను | *koosænu* | 'I cut.' (see 66.3.1.) |
| రాయి-ఇం-ది → రాస్-ఇం-ది → రాసింది | *raasindi* | 'She wrote.' |
| బాగుచెయ్యి-æ-డు → బాగుచేస్-æ-డు → బాగుచేశాడు | *baaguceesæḍu* | 'He repaired.' (66.3.1.) |

**66.3.1.** స్ + æ is written as శా.

**66.4.** రా 'come' becomes వచ్చ్; తీసుకురా 'bring' becomes తీసుకోచ్చ్ and చూడు 'see' becomes చూస్ when followed by a suffix beginning with ఇ or æ.

| | |
|---|---|
| రా + æ-ను → వచ్చ్-æ-ను → వచ్చాను | 'I came.' |
| రా + ఇం-ది → వచ్చ్-ఇం-ది → వచ్చింది | 'She/It came.' |
| తీసుకురా + æ-డు → తీసుకోచ్చ్-æ-డు → తీసుకోచ్చాడు | 'He brought.' |
| తీసుకురా + ఇం-ది → తీసుకోచ్చ్-ఇం-ది → తీసుకోచ్చింది | 'She brought.' |
| చూడు + æ-ను → చూస్-æ-ను → చూశాను | 'I saw.' |
| చూడు + ఇం-ది → చూస్-ఇం-ది → చూసింది | 'She/It saw.' |

* æ is a long vowel (see 7.5.2.).

** A short vowel is dropped when followed by æ according to 41.6.

66.5. అను group of verbs (49.1; 50.1) will take a different past tense suffix *-ఆ/-అ. -అ occurs before feminine inferior singular and neuter singular suffix -ది, and ఆ occurs before other personal suffixes. The following changes take place in the అను group of bases before the past tense suffix -ఆ/-అ.

(i) The final ను of the bases becomes న్న్.
(ii) The final ఓ of the bases becomes ఉన్న్.
(iii) The base ఉండు becomes ఉన్న్.

| | |
|---|---|
| అను + ఆ-డు → అన్న్-ఆ-డు → అన్నాడు | 'He said.' |
| తిను + ఆ-ను → తిన్న్-ఆ-ను → తిన్నాను | 'I ate.' |
| విను + ఆ-వు → విన్న్-ఆ-వు → విన్నావు | 'You heard.' |
| కొను + అ-ది → కొన్న్-అ-ది → కొన్నది | 'She bought.' |
| తీసుకురమ్మను-అ-ది → తీసుకురమ్మన్న్-అ-ది → తీసుకురమ్మన్నది | 'She asked to bring.' (56.1.) |
| తీసుకో + ఆ-రు → తీసుకున్న్-ఆ-రు → తీసుకున్నారు | 'They took/You (pl.) took.' |
| తీసుకో-అ-ది → తీసుకున్న్-అ-ది → తీసుకున్నది | 'She took.' |
| నిల్చో + ఆ-యి → నిల్చున్న్-ఆ-యి → నిల్చున్నాయి | 'They (neut.) stood.' |
| కూర్చో + అ-ది → కూర్చున్న్-అ-ది → కూర్చున్నది | 'She/It sat.' |
| ఉండు + ఆ-ను → ఉన్న్-ఆ-ను → ఉన్నాను** | 'I was.' |
| ఉండు + అ-ది → ఉన్న్-అ-ది → ఉన్నది** | 'She/It was.' |

66.6. ఉ, which is the second vowel of the trisyllabic bases, becomes ఇ when followed by a suffix beginning with ఇ or ఆ (63.2.)

| | |
|---|---|
| చదువు + ఆ-ను → చదివు-ఆ-ను → చదివాను | 'I read.' (41.6.) |
| అడుగు + ఆ-డు → అడిగు + ఆ-డు → అడిగాడు | 'He asked.' (41.6.) |

66.7. కావాల్సిన 'required' is the adjectival participle (55.1.) of కావాలి. This functions like an adjective.

| | |
|---|---|
| నాకు పుస్తకం కావాలి. | 'I want a book.' |
| నాకు కావాల్సిన పుస్తకం | 'the book which I required' |

* This past tense suffix occurs only with limited number of verbal bases. Unless it is specified, the normal past tense suffix is -ఆ/-ఇం as mentioned in 66.1.

** ఉన్నాను, ఉన్నది etc., which were introduced in the lessons 29, 30, 34 and 36 are the past tense forms of ఉండు. These past tense forms of ఉండు are also used in non-future (29.1.).

# UNIT 17

## Lesson 67

శర్మ : రవీ! నేను అర్జెంటుగా మార్కెట్టుకు వెళ్లాలి. నీ స్కూటరు యివ్వు.

Ravi! I have to go to the market urgently. Lend me your scooter.

రవి : నా స్కూటరు హారను కొంచెం ట్రబులు ఇచ్చింది. నిన్న బాగు చెయ్యటానికి ఇచ్చాను. ఇందాక కనిపించాడు. రేపు ఇస్తాను అన్నాడు.

The horn of my scooter gave trouble. Yesterday I gave it for repairing. He met me a few minutes ago. He told that he would give it tomorrow.

శర్మ : అయితే నీ సైకిలు యివ్వు.

Then, give me your bicycle.

రవి : తీసుకో. కొంచెం సేపు ఆగు. వాన కురుస్తున్నది.

Take it. But wait for some time. It's raining.

శర్మ : నిన్న మా పేటలో బ్రహ్మాండమైన వాన కురిసింది.

It rained cats and dogs yesterday in our area.

రవి : అవును. యిక్కడ గూడా కురిసింది. అప్పుడు నేను ఆఫీసునించి యింటికి వస్తున్నాను. ఆ వానలో పూర్తిగా తడిశాను. అందుకే జలుబు చేసింది.

Yes. It rained here also. I was returning home from office at that time. I got drenched in that rain completely. That's why I have a cold.

శర్మ : అదుగో వాన ఇప్పుడే వెలుస్తున్నది. నేను బజారులో చెయ్యాల్సిన పనులు చాలా ఉన్నాయి.

See, it is clearing now. I will go. I have to do a lot of work in the market.

రవి : ఇంకా కాసేపు ఆగు. ఈ వానలో తడవటం మంచిది కాదు.

Wait for some more time. It is not good to get drenched in this rain.

శర్మ : ఈ వాన ఇప్పుడు పూర్తిగా తగ్గదు. ఇది ఇట్లానే కురుస్తూ ఉంటుంది. నేను వస్తాను.

It will not stop completely now. It will rain continuously. I will go.

రవి : బజారులో మోహనరావును కలు. అతని దగ్గర నా గొడుగు ఉంది. అది తీసుకో.

You meet Mohana Rao in the market. My umbrella is with him. Take that one.

శర్మ : నేను మోహనరావును కలిస్తే తీసుకుంటాను. వాడికి గొడుగిస్తే పాడు చేస్తాడు. ఎప్పుడూ ఇవ్వకు. వస్తాను. సైకిలు రాత్రికి పంపించనా ? రేపు పంపించనా ?

If I meet him I will take it. If you give umbrella to Mohanrao he will spoil it. Don't give it to him any more. Shall I send you the bicycle by tonight or tomorrow?

రవి : పరవాలేదు. రేపు పంపించు.

Don't worry. You send it tomorrow.

శర్మ : రేపు ఉదయం పంపిస్తాను.

I will send it tomorrow morning.

## DRILLS

a. Repetition drill.

రవి వానలో తడిశాడు.
నా పుస్తకం తడిసింది.
వాళ్లు వానలో తడుస్తున్నారు.
నువ్వు వానలో తడు !
మనం వానలో తడుద్దాం.

ఈ వాన ఇప్పుడు వెలవదు.
వానలు కురిస్తే మంచిది.
వానలు కురవాలి.
ఇప్పుడు వాన కురుస్తున్నది.
నిన్న గూడా వాన కురిసింది.

నాకు నీ పుస్తకం ఇవ్వు.
నీకు నేను డబ్బు ఇస్తాను.
రవికి శర్మ రేడియో ఇచ్చాడు.
మనం ఆయనకు పుస్తకం ఇద్దాం.

నేను రవిని కలిశాను.
నువ్వు మాష్టరుగారిని కలు।
తుంగభద్ర కృష్ణలో కలుస్తుంది.
యమున గోదావరిలో కలవదు.

**b. Build-up drill.**

ఉన్నాయి
చాలా వున్నాయి.
పనులు చాలా వున్నాయి.
చెయ్యాల్సిన పనులు చాలా వున్నాయి.
అక్కడ చెయ్యాల్సిన పనులు చాలా వున్నాయి.
నేను అక్కడ చెయ్యాల్సిన పనులు చాలా వున్నాయి.

ఉంటుంది
కురుస్తూ వుంటుంది.
ఇట్లానే కురుస్తూ వుంటుంది.
పది రోజులదాకా ఇట్లానే కురుస్తూ వుంటుంది.
వాన పది రోజులదాకా ఇట్లానే కురుస్తూ వుంటుంది.
ఈ వాన పదిరోజులదాకా ఇట్లానే కురుస్తూ ఉంటుంది.

**c. Substitution drill.**

**Model (i) :**

రవి చదువుతూ వుంటాడు.
సరళ—ఆడు
సరళ ఆడ్తూ వుంటుంది.
రైలు—రా
బస్సు—వెళ్లు
నువ్వు—నిద్రపో
మనం—రాయి

**Model (ii) :**

మనం చదవాల్సిన పుస్తకం రవి చదివాడు.
చూడు
మనం చూడాల్సిన పుస్తకం రవి చూశాడు.
రాయి
ఇవ్వు
కొను
తీసుకో

**Model (iii) :**

రవి సరళకు స్కూటరు ఇచ్చాడు.
కమల
కమల సరళకు స్కూటరు ఇచ్చింది.
నేను

నువ్వు
మీరు
మనం
వాళ్లు

**d. Response drill.**

**Model :**

రవికి జలుబు ఎందుకు చేసింది ?

రవి వానలో తడిశాడు.

1. సరళకు జలుబు ఎందుకు చేసింది ?
2. నాకు ఎందుకు జలుబు చేసింది ?
3. మనకు ఎందుకు జలుబు చేసింది ?
4. నీకు ఎందుకు జలుబు చేసింది ?
5. మీకు ఎందుకు జలుబు చేసింది ?

**e. Transformation drill.**

Model (i) :

రవి వానలో తడిశాడు.

a. రవి వానలో తడుస్తాడు.

b. రవి వానలో తడుస్తున్నాడు.

1. సరళ వానలో తడిసింది.
2. వాన కురిసింది.
3. నేను రవిని కలిశాను.
4. వాన వెలిసింది.
5. కమల నాకు కాఫీ యిచ్చింది.

Model (ii) :

రవి వానలో తడుస్తున్నాడు.

రవి వానలో తడవటం లేదు.

1. గోపి, మోహన్ వానలో తడుస్తున్నారు.
2. వాన వెలుస్తున్నది.
3. వాన కురుస్తున్నది.
4. నేను రామారావును కలుస్తున్నాను.
5. నేను కమలకు పుస్తకం ఇస్తున్నాను.

**EXERCISES**

a. Answer the following questions based on the text of the lesson.

1. రవి వానలో ఎప్పుడు తడిశాడు ?
2. రవి స్కూటరును ఏం చేశాడు ?
3. శర్మ బజారుకు ఎందుకు వెళ్తున్నాడు ?
4. శర్మ మోహనరావు దగ్గర్నించి గొడుగు తీసుకుంటాడా ?

**b. Change the following past tense forms into present affirmative and negative, and future affirmative and negative.**

1. రవి వానలో తడిశాడు.
2. కమల రవికి గొడుగు యిచ్చింది.
3. వాన వెలిసింది.
4. కమల అన్నం వడ్డించింది.
5. నేను రవిని కలిశాను.

**c. Give the past tense forms of the following verbs with నేను, మనం, అవి, సరళ as subjects:**

తడు, కలు, ఇవ్వు.

d. Match the following.

| A | B | |
|---|---|---|
| 1. కమల | తడిశాడు | (    ) |
| 2. రవి | వెలిసింది | (    ) |
| 3. వానలు | ఇచ్చింది | (    ) |
| 4. గోపిని | కురిశాయి | (    ) |
| 5. వాన | కలిశాను | (    ) |

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| అర్జెంటు | urgent | తడుస్ | get drenched; become wet |
| హారన్ | horn | జలుబు | cold (n) |
| ట్రబులు | trouble (n) | వెలుస్ | fade out (v. intr.) |
| ఇందాక | a while ago | ఇట్లా | in this manner |
| వాన | rain (n) | కలుస్ | meet (v. intr.) |
| కురుస్ | rain (v) | పంపించు | send |
| బ్రహ్మాండమైన | heavy; huge | పాడు చెయ్యి | spoil (v. intr.) |

## GRAMMAR NOTES

67.1. In this lesson the స్ ending verbal bases are introduced.

తడుస్-తున్నా-ను → తడుస్తున్నాను — 'I am getting drenched.'

(వాన) కురుస్-తున్న-ది → కురుస్తున్నది — 'It is raining.'

తడుస్ + దాం → తడుద్-దాం (60.3.) → తడుద్దాం — 'Let us get drenched.'

67.2. The స్ ending bases drop the final స్ when they are used in imperative inferior singular.

కలుస్ → కలు! — 'Meet'!

తడుస్ → తడు! — 'Get dreanched!'

67.3. A disyllabic base ending in a consonant also changes (like trisyllabic bases 43.2.; 66.6.) its second vowel ఉ

(i) to అ when followed by a suffix beginning with అ or ఆ

and (ii) to ఇ when followed by a suffix beginning with ఇ or æ.

కలుస్ + ఆలి → కలస్_ఆలి → కలవ్_ఆలి (67.5)
→ కలవాలి 'One should meet.'

*kalus+aali→ kalas-aali→ kalav-aali*

తడుస్ + అకు → తడస్_అకు → తడవ్_అకు (67.5.)
→ తడవకు 'Don't get drenched.'

*taḍus+aku→ taḍas-aku→ taḍav-aku*

కురుస్ + అటం → కురస్_అటం → కురవ్_అటం (67.5.)
→ కురవటం 'raining'

*kurus+aṭam→ kuras-aṭam→ kurav-aṭam*

కలుస్ + æ-ను → కలిస్_æ-ను → కలిశాను (66.3.1.) 'I met.'

*kalus+ æ-ను→ kalis-æ-nu*

తడుస్_ఇం_ది → తడిస్_ఇంది → తడిసింది 'It/She got drenched.'

*taḍus-in di→ taḍis-in-di*

కురుస్ + ఇతే → కురిస్_ఇతే → కురిస్తే (67.4.) 'if it rains'

*kurus+itee→ kuris-itee→ kuristee*

67.4. A short vowel between స and త is dropped.

కురిస్_ఇతే → కురిస్తే (67.3.) 'if it rains'

67.5. The స ending bases change the final స to వ when followed by a suffix beginning with అ or ఆ.

కలుస్ + అటం → కలవ్_అటం (67.3.) → కలవటం 'meeting'

*kulus+aṭam→ kalav-aṭam*

కురుస్ + ఆలి → కురవ్_ఆలి (67.3.) → కురవాలి 'It should rain.'

*kurus+aali→ kurav-aali*

తడుస్ + అండి → తడవ్_అండి (67.3.) → తడవండి 'Please get drenched.'

*taḍus+anḍi→ taḍav-anḍi*

67.6. ఇవ్వు 'give' becomes ఇస్– when followed by a suffix beginning with త or ద and it (ఇవ్వు) becomes ఇచ్చ్– when followed by a suffix beginning with ఇ or æ.

ఇవ్వు + తా–ను → ఇస్–తా–ను → ఇస్తాను 'I will give.'
*ivvu+taa-nu → is-taa-nu*

ఇవ్వు + ఇతే → ఇస్–ఇతే → ఇస్తే (63.3.) 'if (some one) gives'
*ivvu+itee → is-itee → istee*

ఇవ్వు + దాం → ఇస్–దాం → ఇద్–దాం (60.3.) → ఇద్దాం 'Let us give.'
*ivvu+daam → is-daam → id-daam*

ఇవ్వు + æ-ను → ఇచ్చ్-æ-ను → ఇచ్చాను 'I gave.'
*ivvu+ æ-nu → icc-æ-nu → iccænu*

67.7. The obligatory adjectival participle is formed by adding –సిన to the obligatory form. (44.1.).

67.7.1. The final vowel of the obligatory form is dropped before a suffix begnning with స.

చెయ్యాలి + సిన → చెయ్యాల్సిన 'that one has to do'
నేనీ పని చెయ్యాలి. 'I have to do this work.'
నేను చెయ్యాల్సిన పని (చెయ్యి + అల్సిన) 'the work which I have to do' (41.6.)

67.8. Future continuous is also introduced in this lesson. It is formed by adding the future tense form of the verb ఉండు to the non-past adverbial participle (55.2.) of the verb.

Future continuous → Non-past Adverbial Participle + Future Tense form of ఉండు.

కురుస్తూ ఉంటుంది. 'It will be raining./ It will rain continuously.

67.9. –చెయ్యి is used with the noun జలుబు 'cold' to mean 'catch cold'.

నాకు జలుబు చేసింది. 'I caught cold.'

67.10. –ఇట్లా 'this way'; 'this manner' is a variant of ఇలా (41.10.).

## CULTURAL NOTE

While taking leave from a person, one is expected to say that నేను వస్తాను 'I will come' and not that నేను వెళ్తాను 'I will go'.

# UNIT 17

## Lesson 68

| | |
|---|---|
| కమల : గీతా ! మీ అమ్మను పిలు. | Gita ! Call your mother. |
| గీత : ఆమె పనిలో ఉన్నది అత్తయ్యగారూ ! పిలిస్తే పలకదు. | She is busy with her work, auntie ! She will not answer if I call. |
| కమల : పెద్దగా పిలు. పలుకుతుంది. | Call loudly. She will answer. |
| గీత : మీరే పిలవండి. అదుగో మా అమ్మే వచ్చింది. | You please call her. See there. My mother has come. |
| సరోజ : లోపలికి రా కమలా ! | Come in Kamala. |
| గీత : అమ్మా ! నన్ను సరళ పిలిచింది. వెళ్తున్నాను. | Mummy ! Sarala called me. I am going. |
| కమల : ఎందుకు మీ బాబు మొహం అట్లా ఉన్నది ? | Why does your son look like that ? |

సరోజ : ఇప్పటి దాకా ఏడ్చాడు. ఎందుకో నిన్న ట్నుంచి ఊరికినే ఏడుస్తున్నాడు.

He was weeping till now. He has been weeping since yesterday (without any cause).

కమల : నడుస్తున్నాడా ?

Is he walking ?

సరోజ : ఇంకా నడవటం లేదు. మా గీత ఎని మిదో నెలలోనే నడిచింది. లక్ష్మీ ! మను షుల మీద దుమ్ము పడుతున్నది. నెమ్మ దిగా ఊడు.

He has not started walking yet. Our Gita started walking in her eighth month itself. Lakshmi! The dust is falling on us. Sweep slowly:

లక్ష్మి : నెమ్మదిగానే ఊడుస్తున్నానండీ ! గాలి ఎక్కువగా ఉన్నది.

I am sweeping only slowly, madam! The wind is blowing heavily.

సరోజ : అయితే ఇక్కడ ఊడవకు. వరండా ఊడు.

Then, don't sweep here. Sweep the verandah.

లక్ష్మి : ఊడ్చానమ్మగారూ ! వంట ఇల్లు ఊడ వాలి.

I swept it already, madam. I have to sweep the kitchen.

సరోజ : సరే ! కమలా ! లే ! మనం ఆ గదిలో కూర్చుందాం.

All right. Get up Kamala ! We will sit in the other room.

కమల : కిటికీలు తెరుద్దామా ? గాలి రావటం లేదు.

Shall we open the windows? We don't get the breeze inside.

సరోజ : అలాగే. లక్ష్మి ఆ కిటికీలు తెరు !

Okay! Lakshmi! Open those windows.

లక్ష్మి : తెరిచానమ్మగారూ ! మీరు కొంచెం లేవండి. సోఫా తుడుస్తాను.

I opened the windows. madam! You please get up. I have to clean the sofa.

సరోజ : సోఫా తుడవటం ఇప్పుడా ? బల్లలు తుడిచావా ?

Is this the time for cleaning the sofa? Did you clean the tables?

లక్ష్మి : ఇందాక తుడిచానమ్మగారూ !

I have cleaned them already, madam.

సరోజ : లేస్తాం. కొంచెం ఆగు.

We will get up. Wait for sometime.

లక్ష్మి : నేను ఇవ్వాళ పెందలాడి పోవాలమ్మ గారూ !

I will have to go early today, madam!

సరోజ : సరే ! లేచాం, తుడు !

Okay! Got up. Clean it.

## DRILLS

### a. Repetition drill.

రవి తలుపు తెరిచాడు.
సరళ తలుపు తెరుస్తుంది.
విమలా! తలుపు తెరవకు.
పాప కిటికీలు తెరవటం లేదు.
సరళా! కిటికీలు తెరు!

బాబు రవిని పిలిచాడు.
శర్మ రవిని పిలుస్తాడు.
సరళ కమలను పిలవదు.
సరళా! కమలను పిలు!

పాప ఏడ్చింది.
శర్మ ఏడుస్తాడు.
రవి ఏడవటం లేదు.
లక్ష్మీ! వరండా నేను ఊడవను; నువ్వు ఊడు!

శర్మ లేచాడు.
సరళ లేవటంలేదు.
నువ్వు లేవకు.
రవి లేవాలి.
కమలా! తొందరగా లే!
మీరు లేవండి.
ఎవరు లేస్తారు?

### b. Build-up drill.

నాన్నగారూ!
ఉన్నాను నాన్నగారూ!
పనిలో ఉన్నాను నాన్నగారూ!
ఇప్పుడు పనిలో ఉన్నాను నాన్నగారూ!
నేనిప్పుడు పనిలో ఉన్నాను నాన్నగారూ!

మాట్లాడుతున్నాడు.
అట్లా మాట్లాడుతున్నాడు.
ఊరికినే అట్లా మాట్లాడుతున్నాడు.

ఉన్నది
అట్లా వున్నది.
చెయ్యి అట్లా వున్నది.
నీ చెయ్యి అట్లా వున్నది.
ఎందుకు నీ చెయ్యి అట్లా వున్నది?

మొన్నటినించి ఊరికినే అట్లా మాట్లాడుతున్నాడు.
ఎందుకో మొన్నటినించి ఊరికినే అట్లా మాట్లాడుతున్నాడు.

### c. Substitution drill.

**Model (i):**

కమల నడిచింది
పిలుచ్
కమల పిలిచింది
తుడుచ్

లేచ్
ఊడుచ్
ఏడుచ్
తెరుచ్

**Model (ii) :**

శర్మ ఊరికినే వెళ్లాడు.
రా
శర్మ ఊరికినే వచ్చాడు.
ఏడుచ్
పిలుచ్
పలుకు
లేచ్
తుడుచ్

**Model (iii) :**

కమల చదువుతున్నది.
పిలుచ్
కమల పిలుస్తున్నది.
ఊడుచ్
ఏడుచ్
లేచ్
తుడుచ్

**Model (iv) :**

శర్మ ఇంకా చదవటంలేదు.
నడుచ్
శర్మ ఇంకా నడవటం లేదు.
లేచ్
పలుకు
ఏడుచ్
తెరుచ్

**d. Response drill.**

**Model (i) :**

కమల ఏడుస్తూ వస్తున్నదా? (ఆడు)
కమల ఏడుస్తూ రావటం లేదు. ఆడుతూ వస్తున్నది.

1. శర్మ చదువుతూ కిటికీలు తెరుస్తున్నాడా? (ఏడుచ్)
2. రవి నిన్ను అడుగుతూ చదువుతున్నాడా? (పిలుచ్)
3. మనం తడుస్తూ మాట్లాడుతున్నామా? (తుడుచ్)
4. లక్ష్మి ఊడుస్తూ పాట పాడుతున్నదా? (లేచ్)
5. సీత మాట్లాడుతూ పాఠం చదువుతున్నదా? (నడుచ్)

**Model (ii) :**

శర్మ ఏం చేస్తున్నాడు? (వానలో–తడుస్)
శర్మ వానలో తడుస్తున్నాడు.

1. సరళ ఏం చేస్తున్నది? (మాట్లాడుతూ–సోఫాలు తుడుచ్)
2. మనం ఏం చేస్తున్నాం? (ఊడుస్తూ–పిలుచ్)
3. వాళ్లు ఏం చేస్తున్నారు? (అలస్యంగా–లేచ్)
4. మీరు ఏం చేస్తున్నారు? (తొందరగా–నడుచ్)
5. లక్ష్మి ఏం చేస్తున్నది? (నెమ్మదిగా–ఊడుచ్)

Model (iii) :

శర్మ : మనం ఇప్పుడు ఏం చేద్దాం ? (రవిని-పిలుచ్)

రవిని పిలుద్దాం

1. లక్ష్మి : మనం ఏం చేద్దాం ? (కిటికీ-తెరుచ్)
2. రవి : మనం రేపు ఏం చేద్దాం? (తొందరగా-లేచ్)
3. గోపి : మనం ఏం చేద్దాం ? (రవిని-కలుస్)
4. గిరిజా : మనం ఏం చేద్దాం ? (ఉత్తరం-రాయి)

## EXERCISES

a. Fill up the blanks with the past tense forms of the imperative forms of the verbs given in the parentheses.

1. శర్మ ఏడుస్తూ — (లే)
2. రవి కిటికీలు — (తెరు)
3. విమల వానలో — (తడు)
4. కమల బల్లలు — (తుడు)
5. రామారావు నన్ను — (పిలు)
6. శర్మ — (ఆడు)
7. లక్ష్మి — (ఏడు)

b. Answer the following questions based on the text of the lesson.

1. గీత ఎందుకు బయటికి వెళ్తున్నది ?
2. బాబు ఎందుకు ఏడుస్తున్నాడు ? ఎప్పటినించి ఏడుస్తున్నాడు ?
3. గీతవాళ్ల అమ్మ ఏం చేస్తున్నది ?
4. సరోజ ఎందుకు 'కమలా : మనం ఆ గదిలో కూర్చుందాం' అంటున్నది ?

c. Given below are the imperative forms of some verbs. Rewrite them changing into past tense, future tense and prestent negative with నేను and కమల as subjeets, and into hortative with మనం as subject.

| | | | | |
|---|---|---|---|---|
| పిలు : | కలు : | ఏడు : | లే : | రా : |
| రాయి : | తడు : | తుడు : | ఆడు : | పడు : |

Model నడు :

నేను నడిచాను.
సరళ నడిచింది. } Past tense

నేను నడుస్తాను.
సరళ నడుస్తుంది. } Future tense

నేను నడవటం లేదు.
సరళ నడవటం లేదు. } Present negative

మనం నడుద్దాం. Hortative

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| అత్తయ్య | aunt | ఊడుచ్ | sweep (v) |
| పిలుచ్ | call (v.tr.) | వరండా | verandah |
| పలుకు | respond | వంట ఇల్లు | kitchen |
| మొహం | face (n) | లేచ్ | get up |
| ఏడుచ్ | weep | తెరుచ్ | open (v. tr.) |
| ఊరికనే | with no reason | తుడుచ్ | wipe (v) |
| నడుచ్ | walk (v) | పెందలాడి | early |

## GRAMMAR NOTES

68.1. In this lesson the –చ్ ending bases are introduced. These bases may be in the following shapes.

Shape (i) : *(C) $\breve{V}$ C ఉచ్ *piluc* – పిలుచ్ 'call'

Shape (ii) : *(C) $\bar{V}$ C ఉచ్ *uuḍuc* – ఊడుచ్ 'sweep'

Shape (iii) : *C $\bar{V}$ చ్ *leec* – లేచ్ 'get up'

పిలుచ్ + ఇం_ది → పిలిచ్_ఇం_ది → పిలిచింది 'She called.' (67.3)

పిలుచ్ + ఆ- ను → పిలిచ్-ఆ_ను → పిలిచాను 'I called.'

68.2. The చ్ ending bases drop the final చ్ when they are used in imperative inferior singular (67.2).

పిలుచ్ → పిలు ! 'Call!'

ఊడుచ్ → ఊడు ! 'Sweep!'

లేచ్ → లే ! 'Get up!'

68.3. The final చ్ becomes వ్ when followed by a suffix beginning with అ or ఆ (67.5.)

పిలుచ్ + అటం → పిలువ్ + అటం (67.3.) →
పిలవ్_అటం → పిలవటం 'calling'

తెరుచ్ + ఆలి → తెరవ్ + ఆలి (67.3.) తెరవ్_ఆలి → తెరవాలి 'One should open.'

లేచ్ + అకు → లేవ్_అకు → లేవకు 'Don't get up.'

---

C consonant; $\bar{V}$ long vowel; $\breve{V}$ short vowel; ( ) optional

68.4. The final చ్ becomes స్ when followed by a suffix beginning with త.

పిలుచ్ + తా-డు → పిలుస్-తా-డు → పిలుస్తాడు 'He will call.'

లేచ్ + తా-డు → లేస్-తా-డు → లేస్తాడు 'He will get up.'

నడుచ్ + ఇతే → నడిచ్ + ఇతే (67.3.) →

నడిస్-ఇతే (63.3.) → నడిస్-తే → నడిస్తే 'If someone walks.'

68.5. The final చ్ becomes డ్ when followed by a suffix beginning with ద (60.3.).

పిలుచ్ + దాం → పిలుడ్-దాం → పిలుద్దాం 'Let us call.'

ఊడుచ్ + దాం → ఊడుడ్-దాం → ఊడుద్దాం 'Let us sweep.'

లేచ్ + దాం → లేడ్-దాం → లేద్దాం 'Let us get up.'

68.6. The చ్ ending bases of (C) $\bar{V}$ C ఉ చ్ [shape (ii) of 68.1.] drop their second vowel ఉ when followed by a suffix beginning with ఇ or æ.

ఏడుచ్ + æ-డు → ఏడ్చ్-æ-డు → ఏడ్చాడు 'He wept.'

*eeḍuc+æ-du— eeḍc-æ-ḍu.*

ఊడుచ్ + ఇం-ది → ఊడ్చ్-ఇం-ది → ఊడ్చింది 'She swept.'

*uuḍuc+in-di→ uuḍc-in-di*

68.7. అమ్మగారు 'madam' is used by the people of lower strata to address ladies of higher strata.

# UNIT 17

## Lesson 69

కమల : ఏమండీ! ఇవ్వాళ టిఫినుకు బ్రెడ్డు కాలుస్తున్నాను. తినండి.

My dear! I am preparing bread toast for breakfast. Please have it.

రామారావు : ఇలా కాలిస్తే బాగుండదు. ఇంకొంచెం కాల్చు. చాలు. మాడ్చకు. అదుగో మాడుతున్నది.

If you toast it like this, it is no good. You have to toast it for some more time. That's enough. Don't over toast it. See, it is burning.

కమల : పెనం బాగా వేడిగా ఉంది.

The pan is very hot.

రామా : చూడు ఎట్లా మాడ్చావో! బ్రెడ్ కాల్చటం ఇట్లానా? రవీ! ఇంకొక బ్రెడ్ తే!

See how you have burnt it. Is this the way of toasting the bread? Ravi! Get another bread.

రవి : తెస్తాను. డబ్బులివ్వండి.

I will get it. Please give me money.

| | |
|---|---|
| రామా : ఇదుగో! తొందరగా తేవాలి. | Here it is. You have to get it soon. |
| రవి : అయిదు రూపాయలకు ఆ కొట్లో చిల్లర ఉండదు. | You will not have change for five rupees in that shop. |
| రామా : ఇంకొక కొట్లో మార్చు. | Change it in another shop. |
| రవి : ఈ నోటు ఇట్లా చినిగిందేం? చూడండి. పట్టుకుంటే ఇంకొంచెం చినుగుతున్నది. ఇది మారదు. | Why is this five-rupee note torn like this? If you hold it, it will be torn further. This will not be accepted. |
| రామా : మారుతుంది. వెళ్ళరా! | It will be accepted. You go. |
| కమల : ఇప్పుడు ఆ నోటు మార్చటం ఎందుకు? నా దగ్గర చిల్లర ఉంది. ఆ కొట్టువాడికి మనం రెండు రూపాయలు బాకీ ఉన్నాం. | Why do you change that five-rupee note now? I have change. We owe two rupees to that shop-keeper. |
| రామా : ఆ బాకీ తీరింది గదా! మళ్లీ అప్పు చేశావా? | The previous loan was cleared. Did you borrow again? |
| కమల : ఉదయం కూరగాయలు తెచ్చాను. | I brought vegetables in the morning. |
| రామా : సరే! ముందు వాడి బాకీ తీర్చు! మిగిలిన డబ్బుతో బ్రెడ్ తీసుకురా! | All right! You clear his account first. Get bread with the balance amount. |
| కమల : స్కూలు ఎప్పుడు తెరుస్తారు? గీతను స్కూల్లో చేర్చాలిగదా! | When will the school be reopened? We have to admit Gita in the school. |
| రామా : చేరుద్దాం. రేపే తెరుస్తారు. | We will admit (her). The school will be reopened tomorrow only. |
| గీత : నేను అన్నయ్యవాళ్ల స్కూల్లో చేర్తాను. | I will join the school where the elder brother is studying. |
| రామా : ఏడవకమ్మా, అన్నయ్యది హైస్కూలు గదా! ఈ సంవత్సరం ఎలిమెంటరీ స్కూల్లో చేరు. తర్వాత హైస్కూలు. | Don't you cry, my dear! Your brother is in a high school. You join the elementary school this year. Later you can go to high school. |

రవి : నాన్నగారూ ! ఇదుగో బ్రెడ్. ఆ కొట్టు దగ్గర హడావుడిగా ఉంది.

Daddy! Here is the bread. There is some commotion at that shop.

కమల : ఎందుకురా హడావుడి ?

Why?

రవి : ఇందాక పెద్ద గాలివాన వచ్చిందిగదా ! అప్పుడు ఆ కొట్టు పందిరి కూలింది.

There has been a high gale and rain, you know! Then the outer roof (pandal) of the shop fell down.

గీత : నాన్నగారూ ! ఈ తుపాకీ పేలటంలేదు. మీరు పేల్చండి.

Daddy! This gun is not working. You please fire it.

రవి : ఏది ? నాకు ఇవ్వవే ! నేను పేలుస్తాను. మళ్లీ నీకే ఇస్తానే !

Let me see! Give it to me. I will fire it. Don't worry. I will give it back to you.

## DRILLS

a. Repetition drill.

బ్రెడ్డు కాలింది.
సుశీల బ్రెడ్డు కాల్చింది.
పెసరట్టు మాడింది.
ఆమె పెసరట్టు మాడ్చింది.
నా చొక్కా మారింది.
నువ్వు నా చొక్కా మార్చావు.
నా బాకీ తీరింది.
నేను బాకీ తీర్చాను.
నేను మొన్న స్కూల్లో చేరాను.
నన్ను మా నాన్నగారు స్కూల్లో చేర్చారు.
ఈ తుపాకీ పేలింది.
నువ్వు తుపాకీ పేల్చు !
నిన్న పందిరి కూలింది.
ఈ పందిరిని ఎవరు కూల్చారు ?

సరళా ! బ్రెడ్డు కాల్చు.
గోపీ ! బ్రెడ్డు కాలుస్తున్నావా ?
నువ్వు బ్రెడ్డు కాలిస్తే బాగుండదు.
బ్రెడ్ కాల్చటం ఇట్లానా ?

మీరు ఈ రూపాయికి చిల్లర మార్చండి.
శర్మ వారానికి ఒక చొక్కా మారుస్తాడు.
అతను రోజూ చొక్కా మార్చడు.

పోలీసులు తుపాకీలు పేలుస్తున్నారు.
పిల్లలు తుపాకీలు పేల్చారు.

పళ్లు రాలుతున్నాయి.
రాము పూలు రాలుస్తున్నాడు.
నువ్వు ఆకులు రాల్చు.

నీ పుస్తకం ఇలా తే।
నేను నీకొక కలం తెచ్చాను.
రేపు శర్మ మనకు ఒక గడియారం తెస్తాడు.
నేను ఐతికి కలం తేవటంలేదు. నువ్వు తేవాలి.

బాబూ ఇలా రారా।
గోపీ అటు చూడరా।
పాపా ఇలా రావే।
సరళా। ఒక పాట పాడవే।

b. Build-up drill.

ఉంటుంది
చిల్లర ఉంటుంది
ఐదు రూపాయలకు చిల్లర ఉంటుంది.
అతని దగ్గర ఐదు రూపాయలకు చిల్లర ఉంటుంది.

ఉన్నాను
బాకీ ఉన్నాను.
నాలుగు రూపాయలు బాకీ ఉన్నాను.
నేను నాలుగు రూపాయలు బాకీ ఉన్నాను.
అతనికి నేను నాలుగు రూపాయలు బాకీ ఉన్నాను.

c. Substitution drill.

Model (i) :

శర్మ పుస్తకం తెచ్చాడు.
రూపాయి_మార్చు
శర్మ రూపాయి మార్చాడు.
కాయితం_కాల్చు
బాకీ_తీర్చు
తుపాకీ_పేల్చు

Model (ii) :

నువ్వు బ్రెడ్డు కాలిస్తే నేనూ కాలుస్తాను.
రూపాయి_మార్చు
నువ్వు రూపాయి మారిస్తే నేనూ మారుస్తాను.
పందిరి_కూల్చు
ఉప్మా_మాడ్చు
బాకీ_తీర్చు

d. Response drill.

Model (i) :

సుగుణ ఏం చెయ్యాలి? (రూపాయి మార్చు)
సుగుణ రూపాయి మార్చాలి.

1. అతను ఏం చెయ్యాలి? (తుపాకీ_పేల్చు)
2. మనం ఏం చెయ్యాలి? (బాకీ_తీర్చు)
3. శ్రీధర్ ఏం చేస్తే బాగుంటుంది? (ఇల్లు_మార్చు)
4. మీ నాన్నగారు ఏం చేస్తున్నారు? (పళ్లు_తే)

Model (ii) :

పందిరి ఎందుకు కూలింది? (శర్మ)
శర్మ కూల్చాడు.

1. పాప స్కూల్లో ఎలా చేరింది? (మా నాన్నగారు)
2. పుస్తకం ఎందుకు మారింది? (నేను)
3. ఉప్మా ఎందుకు మాడింది? (సరళ)
4. బాకీ ఎలా తీరింది? (నువ్వు)

**e. Transformation drill.**

**Model (i) :**

ఈ చొక్కా మారుతుంది. (అతను)

అతను ఈ చొక్కాను మారుస్తాడు.

1. ఆ ఇల్లు కూలింది. (ఎవరో)
2. పాప స్కూల్లో చేరితే మంచిది. (మనం)
3. బ్రెడ్డు మాడితే బాగుండదు. (నువ్వు)
4. ఈ బాకీలు తీరటం ఎప్పుడు ? (అతను)

**Model (ii) :**

అతను ఈ నోటు మార్చడు.

ఈ నోటు మారదు.

1. ఈ బాకీ తీరిస్తే మంచిది.
2. నేను ఈ కలం మారుస్తాను.
3. అతన్ని కాలేజీలో చేర్చాలి.
4. నేను బ్రెడ్డు కాల్చటంలేదు.

## EXERCISES

a. Fill up the blanks with the correct forms of the verbs given in the parentheses.

1. గోపి నిన్న తుపాకి.........(కాల్చు)
2. సరోజ ఇప్పుడు తుపాకీ...........(పేల్చు)
3. నువ్వు పూలు......(రాల్చు) నేను ఏర్తాను.
4. ఆ పుస్తకం...........(తే) మంచిది కాదు.

b. Answer the following questions as shown in the model.

Model :

ఈ పళ్లు రాలాయేం ? (రమ)

రమ రాల్చింది.

1. శ్రీధర్ ఆ కాలేజీలో చేరుతున్నాడేం ? (నేను)
2. పెసరట్టు మాడుతున్నదేం ? (గిరిజ)
3. ఆ పందిరి కూలిందేం ? (వాళ్లు)
4. మన బాకీ తీరటంలేదేం ? (మనం)

c. Change the following sentences as shown in the model.

Model :

సుగుణను కాలేజీలో చేర్చటం మంచిది.

సుగుణ కాలేజీలో చేరటం మంచిది.

1. ఈ తుపాకిని ఎలా పేలుస్తున్నావు ?
2. నువ్వు కాయితాన్ని కాలిస్తే నేను చూస్తాను.
3. ఆ ఆకులను రాల్చాలి.
4. ఈ బాకీని ఎలా తీర్చావు ?

d. Make sentences with the present negative, future tense, hortative, past tense and obligatory forms of the following verbs with మనం as subject and the suggested nouns as objects.

| Verb | Object |
|---|---|
| కాల్చు | మినపట్టు |
| మార్చు | సంచీ |
| రాల్చు | పూలు |
| కూల్చు | చెట్టు |
| తే | గడియారం |

**Model :**

Verb : కాల్చు Object : మినపట్టు

| | |
|---|---|
| Peresent negative | మనం మినపట్టు కాల్చటం లేదు. |
| Future tense | మనం మినపట్టు కాలుస్తాం. |
| Hortative | మనం మినపట్టు కాలుద్దాం. |
| Past tense | మనం మినపట్టు కాల్చాం. |
| Obligatory | మనం మినపట్టు కాల్చాలి. |

## VOCABULARY

| | |
|---|---|
| బ్రెడ్డు/బ్రెడ్ | bread |
| కాల్చు | fry (v.tr.) |
| ఇంకొంచెం | some more |
| మాడ్చు | burn (v.tr.) |
| మాడు | burn (v.intr.) |
| పెనం | frying pan |
| తే | bring |
| చిల్లర | change of coins |
| మార్చు | chage (v. tr.) |
| నోటు | note (n) |
| చినుగు | be torn |
| మారు | change (v. intr.) |
| బాకీ ఉండు | owe (v. intr.) |
| బాకీ | loan, debt |
| తీరు | be cleared (as a loan) |
| అప్పు | loan, debt |
| కూరగాయలు | vegetables |
| తీర్చు | clear (v. tr.) |
| చేర్చు | join (v. tr.) |
| చేరు | join, reach (v. intr.) |
| హైస్కూలు | high school |
| ఎలిమెంటరీ స్కూలు | elementary school |
| గాలివాన | storm, rain with gales |
| పందిరి | pandal |
| కూలు | collapse, fall down |
| తుపాకి | gun |
| పేలు | blast (v. intr.) |
| పేల్చు | blast (v. tr.) |

## GRAMMAR NOTES

69.1. In this lesson some intransitive verbs and their transitive counter parts are introduced.

కాలు  'burn, fry'

కాల్చు  'make something to get burnt/fried/toasted'

Intransitive verbs are those which have no object. (43.6)

బ్రెడ్డు కాలుతున్నది  'The bread is getting toasted'

The verb may be inherently intransitive (పో, రా, కాలు, జరుగు etc.) or inherently transitive (తిను, కొట్టు etc.).

Those transitive verbs derived from an intransitive verbs are called derived transitives.

కాలు  'burn' (intr.)

కాలు + చు → కాల్చు  'make some thing to get burnt/toasted' (tr.)

69.2. -చు is added to డు, లు, రు ending intransitive bases to form transitives. The final డు, లు, రు lose their vowel when -చు follows.

| | |
|---|---|
| మాడు | 'burn' (intr.) |
| మాడు + చు → మాడ్-చు → మాడ్చు | 'burn something' (tr.) |
| కాలు | 'burn' (intr.) |
| కాలు + చు → కాల్-చు → కాల్చు | 'make something to get burnt; toast something' |
| మారు | 'change' (intr.) |
| మారు + చు → మార్-చు → మార్చు | 'change something' (tr.) |
| ఈ బ్రెడ్డు కాల్చు ! | 'Toast this bread.' |
| పాపను స్కూల్లో చేర్చాలి. | 'We have to admit Papa to the school. |
| గిరిజ తుపాకీ పేల్చింది. | 'Girija fired the pistol.' |
| నేనీ రూపాయి మార్చను. | 'I will not change this rupee.' |

69.3. The final డ్చు, ర్చు, ల్చు of the bases become డుస్, రుస్, లుస్ respectively when followed by conditional suffix -ఇతే and any suffix beginning with త or ద.

| | |
|---|---|
| కాల్చు + తా-ను → కాలుస్-తా-ను → కాలుస్తాను | 'I will fire it.' |
| మార్చు + తుం-ది → మారుస్-తుం-ది → మారుస్తుంది | 'She will change it.' |
| మాడ్చు + ఇతే → మాడుస్-ఇతే → మాడిస్-ఇతే (67.3.)→ మాడిస్-తే (67.4.)→ మాడిస్తే | 'If someone burns it.' |
| (బాకీ) తీర్చు + దాం → తీరుస్-దాం → తీరుద్-దాం (60.3.)→ తీరుద్దాం | 'Let's clear the debt.' |

69.4. Another monosyllabic base తే 'bring' is introduced in this lesson (రా and పో are the other monosyllabic bases introduced so far). The pronunciation of the vowel of this base is like æ.

| | | | |
|---|---|---|---|
| తే ! | | *(tæ)* | 'Bring!' |
| తేండి ! | (తే+అండి) | *(tændi)* | 'Please bring.' (41.7.) |
| తేవాలి | | *(tævaali)* | 'One should bring.' (44.1.1.) |
| తేవటం | | *(tævaṭam)* | 'bringing' (53.1.1.) |

69.4.1. తే becomes (i) తేస్ before a suffix beginning with త and (ii) తెచ్చ్ before a suffix beginning with ఇ or æ. (67.6)

| | |
|---|---|
| తే + తాను → తెస్-తా-ను → తెస్తాను | 'I will bring it.' |
| తే + దాం → తెస్-దాం (60.2.) → తెద్-దాం (60.3.) → తెద్దాం | 'Let us bring.' |
| తే + ఇతే → తెస్-ఇతే (63.3.) → తెస్తే | 'if someone brings' |
| తే + ఇం-ది → తెచ్చ్-ఇం-ది → తెచ్చింది | 'She brought it.' |
| తే + æ-ను → తెచ్చ్-æ-ను → తెచ్చాను | 'I brought it.' |

Remember that ఇవ్వు, రా and తీసుకురా also behave in this way in the same environment.

| | |
|---|---|
| ఇవ్వు → ఇస్-and ఇచ్చ్- | (67.6.) |
| రా → వస్-and వచ్చ్-<br>తీసుకురా → తీసుకొస్-and తీసుకొచ్చ్- | (46.2.; 66.4.) |

69.5. -రా is the masculine inferior address marker. (-అరా 50.5., is a variant of -రా) -అరా is used with imperative (affirmative only) singular form of the verb.

| | | |
|---|---|---|
| వెళ్ళు + అరా → వెళ్ళరా ! | 'Go!' | (50.5.) |
| తిను + అరా → తినరా ! | 'Eat!' | |

and -రా is used elsewhere.

| | |
|---|---|
| ఇది ఏమిటి-రా ? | 'What is this?' |
| నేను వెళ్ళాలి-రా ! | 'I have to go.' |

69.6. -ఏ/-అవే is the feminine inferior address marker. This is used to address closely related or intimate younger girls and women.

**69.6.1.** **-అవే occurs after an imperative (affirmative only) singular form of the verb.**

| | | |
|---|---|---|
| తిను + అవే — తినవే । | 'Eat!' | (41.6.) |
| వెళ్ళు + అవే — వెళ్ళవే । | 'Go!' | |

**69.6.2.** **-ఏ occurs elsewhere.**

| | |
|---|---|
| ఇవ్వాళ సోమవారమే । (సోమవారం + ఏ) | 'To-day is Monday!' (6.7.) |
| నేను చదువుతున్నానే । (చదువుతున్నాను + ఏ) | 'I am reading.' (41.6.) |

**69.7.** **Notice the function of the dative case suffix in sentences like :**

| | |
|---|---|
| ఆ కొట్టువాడికి పైకం బాకీ ఉన్నాం. | 'We owe some money to that shop-keeper.' |
| ఐదు రూపాయలకు చిల్లర లేదు. | 'There is no change available for five rupees.' |

# UNIT 17

## Lesson 70

| | |
|---|---|
| శర్మ : రవీ ! ఎక్కడికి పోతున్నావు ? | Ravi ! Where are you going ? |
| రవి : ముఖర్జీ గారింటికి పోతున్నాను. ఆయన వాళ్ళ కాలేజీకి ప్రిన్సిపాలు అయ్యాడు గదా ! | I am going to Mr. Mukherjee's house. He is appointed as the principal of that college, you know! |
| శర్మ : అలాగా ! | Oh ! |
| రవి : నీకు ఈ విషయం తెలియదా ? | Don't you know this information ? |
| శర్మ : నాకు ఏ విషయాలూ తెలియవు. నేను కిందటి వారం వాళ్ళ ఇంటికి పోయాను గూడా ! | I don't know anything. I had been to his house last week too. |
| రవి : నిన్న నాకు మోహన్ చెప్పాడు. | Mohan told me yesterday. |

| | |
|---|---|
| రవి : నీకు మోహన్ తెలియదా ? | Don't you know Mohan ? |
| శర్మ : ఓ ! తెలుసు. మర్చిపోయాను. ముఖర్జీగారి అబ్బాయి గదూ ! | Oh ! I know him. I forgot it. He is Mukherjee's son. Isn't he ? |
| రవి : అవును. నువ్వు గూడా వస్తావా ? | Yes. Will you also come ? |
| శర్మ : పద పోదాం. అయితే గోపాలరావు వైస్‌ప్రిన్సిపాల్ అవుతాడన్నమాట. | Let us go. Then Gopalarao will become the vice-principal. |
| రవి : అవును. గోపాలరావుకు గర్వం ఎక్కువ. తను అందరికంటే గొప్పవాణ్ణి అనుకుంటాడు. | Yes. Gopalarao is egoistic. He thinks that he is a great man. |
| శర్మ : అంతేకాదు. అందరూ తన మాటే వినాలి అనుకుంటాడు. | Not only that. He thinks that everybody should obey his words. |
| రవి : కాని ముఖర్జీగారికీ, గోపాలరావుకూ చాలా తేడా ఉంది. ఆయన ఇప్పుడు ప్రిన్సిపాల్ అయ్యాడు గదా ! వాళ్ళ కాలేజీ వాళ్ళు ఇంటికి వెళ్తే ప్రిన్సిపాల్‌గా మాట్లాడడు. ఒక స్నేహితుడిగా మాట్లాడాడు. | But there is a lot of difference between Mr. Mukherjee and Gopalarao. You see, he became Principal now. When his colleagues call on him at his residence, he does not speak as principal. He speaks like a friend. |
| శర్మ : అవును. గోపాలరావు సంగతి ఇప్పుడెందుకు ? మనకు బస్సు లేకపోతే పోవటం కష్టం. | All right. Let's not bother about him. Do we get a bus now ? If there is no bus, it would be difficult to go. |
| రవి : బస్సుకు టైం అయింది గూడా ! | It is the time for bus. |
| శర్మ : పది నిమిషాలక్రితం ఒక బస్సు పోయింది. | One bus left ten minutes ago. |
| రవి : మళ్ళీ ఇప్పుడు యింకొకటి వస్తుంది. | Now another bus will come. |
| శర్మ : ముఖర్జీగారి పిల్లలకు తెలుగు బాగా వచ్చు. ఆయనకేరాదు. | Mukherjee's children know Telugu very well. But he does not know it (Telugu). |

| | |
|---|---|
| రవి : అవును. మోహన్‌కు మంచి మంచి తెలుగు పాటలు కూడా వచ్చు. కాని బెంగాలీ పాటలు రావు. | Yes. Mohan knows very good Telugu songs too. But he doesn't know Bengali ones. |
| శర్మ : వాళ్ల చిన్నమ్మాయికి బెంగాలీ అసలు రాదు. | Their younger daughter does not know Bengali at all. |
| రవి : బస్సుకు టైం అవుతున్నది. నీకు ప్రమోషను వస్తుందని అన్నావు; వచ్చిందా ? | It's getting time for the bus. You said that you would get promotion. Did you get it? |
| శర్మ : ఈ సంవత్సరం డిపార్టుమెంటల్ పరీక్ష పాసు అయితే వస్తుంది. | If I pass the departmental test this year, I will get it. |
| రవి : ఆలస్యం చెయ్యకు. మళ్లీ కాంపిటీషను పెరుగుతుంది. తొందరగా ఆ పరీక్షలు పాసుకా ! | Don't delay. The competition will become more. Pass such tests soon. |
| శర్మ : ఏమిటి, ఇంకా బస్సు రాలేదు ? చెడిపోయిందేమో ! | What is this? The bus has not yet come. It might have gone out of order! |
| రవి : అదుగో ! ఒక్కసారే రెండు బస్సులు వస్తున్నాయి. | See there, two buses are arriving at the same time. |
| శర్మ : అవును. వస్తే రెండు బస్సులో మూడు బస్సులో ఒక్కసారి వస్తాయి. లేకపోతే అసలు రావు. | Yes. When the buses come, two or three of them come together. Otherwise no bus at all. |

## DRILLS

a. Substitution drill.

Model (i) :

రవి ప్రిన్సిపాల్ అయ్యాడు.
నువ్వు
నువ్వు ప్రిన్సిపాల్‌వి అయ్యావు.
ఆయన
శర్మగారు
నేను
మీరు
ఆమె

Model (ii) :

అతను ప్రిన్సిపాల్ అవుతాడు.
ఆయన
ఆయన ప్రిన్సిపాల్ అవుతాడు.
నేను
నువ్వు
ఆమె
సరళ

**Model (iii) :**

బస్సుకు టైం అయింది.

రైలు

రైలుకు టైం అయింది.

కాలేజీ

ఆఫీసు

సినిమా

నాటకం

**Model (iv) :**

బస్సు పది నిమిషాల క్రితం పోయింది.

ఆరు

బస్సు ఆరు నిమిషాల క్రితం పోయింది.

ఎనిమిది

ఇరవై

ఆరు

రెండు

**Model (v) :**

నాకు పాటలు వచ్చు.

తెలుగు

నాకు తెలుగు వచ్చు.

హిందీ

ఇంగ్లీషు

కన్నడ

మాటలు

**Model (vi) :**

నాకు నీ పేరు తెలియదు.

మీ ఊళ్లు

నాకు మీ ఊళ్లు తెలియవు.

శర్మ ఆఫీసు

సరళ ఇల్లు

మీ కాలేజీలు

ఆ విషయాలు

**Model (vii) :**

రవికి మా ఇల్లు తెలుసు.

ఈ విషయాలు

రవికి ఈ విషయాలు తెలుసు.

నా పేరు

శర్మ ఇల్లు

మీ పేర్లు

**Model (viii) :**

శర్మ కిందటి వారం ఇంటికి పోయాడు.

నేను

నేను కిందటి వారం ఇంటికి పోయాను.

ఆయన

వాళ్లు

మీరు

నువ్వు

అది

అవి

**b. Interlocked substitution drill.**

**Model :**

రవి తింటే చపాతిలో పూరిలో తింటాడు.
లేకపోతే అసలు తినడు.

ఇడ్లీలు ఉప్మా
రవి తింటే ఇడ్లీలో ఉప్మానో తింటాడు.
లేకపోతే అసలు తినడు.

చేస్తే
రవి చేస్తే ఇడ్లీలో ఉప్మానో చేస్తాడు.
లేకపోతే అసలు చెయ్యడు.

......తీసుకోస్తే... ... ... ... .... ..

......... పుస్తకాలు_కాయితాలు........

సరళ ... ... ... ... ... ... ... ..

.............. నవలలు_నాటకాలు..........

........చదివితే ..............................

నేను ....................................

c. Transformation drill.

**Model (i) :**

రవి పెద్దవాడు అయ్యాడు.

అ : రవి పెద్దవాడు అవుతున్నాడు.

ఆ : రవి పెద్దవాడు అవుతాడు.

1. శర్మ లెక్చరర్ అయ్యాడు.
2. సరళ లెక్చరర్ అయింది.
3. బస్సుకు టైం అయింది.

**Model (ii) :**

శర్మకు ఇవ్వాళ ఉత్తరం వచ్చింది.

శర్మ తనకు ఇవ్వాళ ఉత్తరం వచ్చింది అనుకున్నాడు.

1. శారదను కమల పిలిచింది.
2. రెడ్డిగారి దగ్గర డబ్బు ఉంది.
3. గోపికి మంచి మార్కులు వస్తాయి.

**Model (iii) :**

రవికి శర్మ తెలుసు.

రవికి శర్మ తెలియదు.

1. గోపికి మైసూరు తెలుసు.
2. సరళకు విమల తెలుసు.
3. నీకు ఈ విషయం తెలుసు.

**Model (iv) :**

సుబ్బారావు గొప్పవాడు.

సుబ్బారావు తను గొప్పవాణ్ణి అనుకుంటాడు.

1. రఘు అందరికంటె పెద్దది.
2. శ్రీధర్ నీ కంటె చిన్నవాడు.
3. సుగుణ బాగా చదువుతుంది.

**Model (v) :**

నాకు తెలుగు వచ్చు.

నాకు తెలుగు రాదు.

1. నాకు పాట వచ్చు.
2. రవికి పాటలు వచ్చు.
3. శర్మకు హిందీ వచ్చు.

d. **Response drill.**

**Model (i) :**

రవి సైకిలు మీద వెళ్తాడా ? స్కూటరు మీద వెళ్తాడా ?

సైకిలు మీదో స్కూటరు మీదో వెళ్తాడు.

1. ఇప్పుడు పన్నెండో నెంబరు బస్సు వస్తుందా ? పదమూడో నెంబరు బస్సు వస్తుందా ?
2. శర్మ మీ ఇంటికి వెళ్తాడా ? మా ఇంటికి వెళ్తాడా ?
3. సరళ కాఫీ తాగుతుందా ? టీ తాగుతుందా ?

**Model (ii) :**

అతను నీతో ఎలా మాట్లాడ్తాడు ? (స్నేహితుడు)

అతను నాతో ఒక స్నేహితుడిగా మాట్లాడ్తాడు.

1. ఆ సంగతి నీకు ఎలా కనిపిస్తుంది ? (నాటకం)
2. అయన ఎలా మాట్లాడుతున్నాడు ? (డైరెక్టరు)
3. ఆయన ఇంట్లో ఎలా మాట్లాడ్తాడు ? (ప్రిన్సిపాల్)

## EXERCISES

a. **Answer the following questions based upon the text of the lesson.**

1. శర్మ ముఖర్జీగారింటికి ఎప్పుడు పోయాడు ?
2. బస్సు ఎప్పుడు పోయింది ?
3. ముఖర్జీగారికి తెలుగు వచ్చా ?
4. వాళ్ల పిల్లలకు తెలుగు వచ్చా ?

b. **Fill up the blanks with suitable case suffixes.**

1. రవి ............ తెలుగు రాదు.
2. బస్సు ............ టైం అయింది.
3. మోహన్ ............ పాటలు వచ్చు.
4. ఆయన ................ ఈ విషయం తెలియదు.
5. శర్మ ................ ఆ విషయం తెలుసు.

c. **Fill up the blanks with** తెలుసు/వచ్చు.

1. నాకు మీ ఇల్లు .........
2. నాకు పాటలు ............
3. మాకు ఆ విషయాలు .........
4. సుబ్బారావుకు తెలుగు ............
5. రవికి శర్మ .........

d. **Fill up the blanks with** తెలియదు/తెలియవు/రాదు/రావు.

1. శర్మకు పాట ..........
2. సుబ్బారావుకు మా ఇల్లు .........
3. అతనికి సరళ ............
4. నీకు మాటలు ............

**e. Rewrite the following sentences as directed.**

1. రవికి తెలుగు రాదు. (affirmative)
2. శర్మకు గుంటూరు తెలుసు (negative)
3. అవి అక్కడికి పోయాయి. (singular)
4. నేను పెద్దవాణ్ణి అయ్యాను. (present tense)
5. నువ్వు మంచివాడివి అయ్యావు. (imperative)

**f. Rewrite the following sentences as shown in the model.**

**Model :**

రవికి జ్వరం వచ్చింది.

రవి తనకు జ్వరం వచ్చిందనుకున్నాడు.

1. శారద బాగా పాడుతుంది.
2. కమల మంచి డాక్టరు.
3. ఆమె పాసుఅయింది.
4. అతనికి డబ్బు కావాలి.
5. సుబ్బారావు కోసం ఎవరో వచ్చారు.

**g. Answer the following questions as shown in the model.**

**Model :**

ఇప్పుడు రెండు బస్సులు వస్తాయా ? మూడు బస్సులు వస్తాయా ?

ఇప్పుడు రెండు బస్సులో మూడు బస్సులో వస్తాయి.

1. ఈ పని చెయ్యటానికి రెండు రోజులు కావాలా ? మూడు రోజులు కావాలా ?
2. రవి ఇవ్వాళ వస్తాడా ? రేపు వస్తాడా ?
3. శారద కాఫీ ఇస్తుందా ? టీ ఇస్తుందా ?
4. నువ్వు రైల్లో వెళ్తావా ? బస్సులో వెళ్తావా ?

**VOCABULARY**

| | |
|---|---|
| కా | become; be completed |
| తెలియదు | is not known |
| తెలియవు | are not known |
| కిందటి | last; previous |
| తెలుసు | is/are known |
| మర్చిపో | forget |
| వైస్‌ప్రిన్సిపాల్ | vice-principal |
| గర్వం | proud (n.) |
| తను | himself |
| గొప్ప | great |
| తన | his (reflexive) |
| తేడా | difference |
| లేకపోతే | if not |
| క్రితం | ago |
| వచ్చు | is/are known |
| రాదు | is not known |
| బెంగాలీ | Bengali |
| రావు | are not known |
| ప్రమోషన్ | promotion |
| డిపార్టుమెంటల్ | departmental |
| పాసుకా | pass (v. intr.) |
| కాంపిటీషను | competition |
| పెరుగు | grow (v. intr.) |
| చెడిపో | break down; go out of order |

## GRAMMAR NOTES

**70.1.** In this lesson the past tense forms of the verb పో are introduced. పో will take -యా/-యిం as the past tense suffix.

**70.1.1.** -యిం occurs before the feminine inferior and neuter singular suffix -ది.

| | |
|---|---|
| ఆమె ఇంటికి పో-యిం-ది | 'She went home.' |
| అది నిద్రపో-యిం-ది* | 'She/It slept.' |
| బస్సు చెడిపో-యిం-ది | 'The bus went out of order.' |

**70.1.2.** -యా occurs before other personal suffixes.

| | |
|---|---|
| నేను ఇంటికి పోయాను | 'I went home.' |
| మేం/మనం గుంటూరు పోయాం | 'We went Guntur.' |
| నువ్వు బడికి పోయావు | 'You went to school.' |
| మీరు/వాళ్ళు బయటికి పోయారు | 'You (pl.)/They went out.' |
| అతను/వాడు లోపలికి పోయాడు | 'He went in.' |
| అవి ఎటో పోయాయి | 'They (neuter) went somewhere.' |

**70.2.** Another monosyllabic verb కా 'become; be completed; be over' is also introduced.**

**70.2.1.** కా becomes (i) అవు- before a suffix beginning with త and (ii) అయ్- before a suffix beginning with య or ఇ.

| | |
|---|---|
| నేను పెద్ద అవు†-తున్నాను | 'I am becoming old.' |
| నేను పెద్ద అవు†-తా-ను | 'I will become old.' |

**70.2.2.** కా takes -యా/-ఇం as past tense suffix, -ఇం occurs before the feminine inferior and neuter singular suffix -ది, and -యా occurs before other personal suffixes.

కా-ఇం-ది → అయ్-ఇం-ది

(70.2.1.) → అయింది 'She/It became.'

ఆమె ప్రిన్సిపాల్ అయింది 'She became principal.'

* All the rules that కా and పో undergo will be applicable to the compound verbs formed by adding కా and పో like పాసుకా 'pass', నిద్రపో 'sleep' etc.

** The other monosyllabic bases are రా, పో and తే.

† వు is written but pronounced as వ in such forms.

కా-యా-ను → అయ్-యా-ను (70.2.1.) → అయ్యాను 'I became.'

కా-యా-డు → అయ్-యా-డు (70.2.1.) → అయ్యాడు 'He became.'

కా-యా-వు → అయ్-యా-వు (70.2.1.) → అయ్యావు 'You became.'

కా-యా-రు → అయ్-యా-రు (70.2.1.) → అయ్యారు 'They became.'

నువ్వు పాసు అయ్యావు. (పాసుకా-యా-వు 70.2.1.) 'You passed.'

70.2.3. అయితే (lesson 21) 'if so; if it is like that; if it becomes like that' is the conditional form of the verb కా. This is an exception to 63.3.

70.3. In this lesson, defective verbs తెలుసు 'know' and వచ్చు 'know' are also introduced. These verbs like other defective verbs చాలు (38.4.), కావాలి (37.1.) etc., do not express any tense and take the subject in dative case (37.1.).

నాకు శర్మ తెలుసు. 'I know Sarma.'

నాకు తెలుగు వచ్చు. 'I know Telugu.'

70.3.1. తెలియదు (singular) and తెలియవు (neuter plural) are the negative forms of తెలుసు (which is used both for singular and plural). రాదు (singl.) and రావు (pl.) are the negative forms of వచ్చు (which is also used for both singular and plural).

నాకు శర్మ తెలుసు. 'I know Sarma.'

నీకు రవి తెలియదు. 'You don't know Ravi.'

అతనికి గుంటూరు తెలియదు. 'He doesn't know Guntur.'

మనకు ఈ విషయాలు తెలియవు. 'We don't know these matters.'

నాకు తెలుగు వచ్చు. 'I know Telugu.'

శర్మకు పాటలు వచ్చు. 'Sarma knows songs.'

కమలకు తెలుగు రాదు. 'Kamala doesn't know Telugu.'

అతనికి మన భాషలు రావు. 'He doesn't know our languages.'

70.3.2. వచ్చు and its negative forms are used to express the performative knowledge (capability of performing something) of the subject.

నాకు తెలుగు వచ్చు. 'I know Telugu.'
(I can perform the act of speaking the language.)

నాకు బొమ్మలు చెయ్యటం వచ్చు. 'I know how to make dolls.'

70.3.3. తెలుసు and its negative forms express the simple knowledge of the speaker whether it is informative or performative.

| | |
|---|---|
| నాకు గుంటూరు తెలుసు. | 'I know Guntur.' |
| అతనికి ఆ విషయం తెలుసు. | 'He knows that matter.' |
| నాకు శర్మ తెలుసు. | 'I know Sarma.' |

In these examples, there is nothing that one can perform. So వచ్చు cannot be used. But in the following examples both వచ్చు and తెలుసు can be used.

| | |
|---|---|
| నాకు తెలుగు తెలుసు/వచ్చు. | 'I know Telugu.' |
| అతనికి బొమ్మలు చెయ్యటం తెలుసు/వచ్చు. | 'He knows how to make dolls.' |

Where వచ్చు is used, తెలుసు can be substituted for it. But the reverse is not possible.

70.4. క్రితం 'ago' is a post-position and occurs after an oblique base. (16.6.)

| | |
|---|---|
| రెండు రోజుల క్రితం | 'two days ago' |

70.5. లేకపోతే 'if not' is originally formed by adding negative conditional suffix -అకపోతే to లే- (the negative base of ఉండు). Therefore it can mean 'if it is not there' also.

70.6. Notice the use of the reflexive pronoun తను (oblique base తన) in this lesson as used in sentences like:

| | |
|---|---|
| శర్మ తను మంచివాణ్ణి అంటాడు. | 'Sarma says that he is a good man.' |
| రవి తను పాసుఅవుతాను అనుకుంటున్నాడు. | 'Ravi is thinking that he would pass.' |

This reflexive pronoun తను stands for the noun which is the subject of the sentence. And the verb or the predicate in agreement with తను will take I person concord. (see the above examples.)

70.7. Notice the use of conditional and dubitative marker in the sentence pattern (32.2; 53.3.) of:

| | |
|---|---|
| వస్తే రెండు బస్సులో మూడు బస్సులో ఒక్క సారి వస్తాయి. లేకపోతే అసలు రావు. | 'If the buses come, two or three of them come together. Otherwise no bus at all. |

70.8. Notice the function of the dative case suffix in sentences like:

| | |
|---|---|
| బస్సుకు టైం అయింది. | 'The time is up for the bus.' |

**70.9.** Also notice another use of the dative case suffix in expressing difference between two objects.

ఆ గదికీ ఈ గదికీ చాలా తేడా ఉంది. — 'There is a lot of difference between that room and this room.'

**70.10.** Notice the use of –గా (37.6.), as an adverbializer, with the oblique bases in sentences like:

శర్మ నాతో ఒక స్నేహితుడిగా మాట్లాడాడు — 'Sarma talks to me as a friend.'

This adverbializer –గా means 'as' and the other adverbializer –లాగా 'like' (46.7.) is different from this.

The contrast may be seen in the following sentences:

అతను ప్రిన్సిపాల్‌గా మాట్లాడుతున్నాడు. — 'He is speaking as principal (in the capacity of principal i.e., he is the principal).

అతను ప్రిన్సిపాల్‌లాగా మాట్లాడుతున్నాడు. — 'He is speaking like principal (like the person who is principal —i.e., he is not the principal but he speakes like one who is principal)

లాగా brings in comparison between the subject and the noun to which లాగా is added and గా makes the subject to assume the status or the position of the other noun to which గా is added.

# UNIT 18

## Lesson 71

| | |
|---|---|
| రామారావు : శర్మా ! ఇప్పుడు టైం ఎంత అయింది ? | Sarma ! What is the time now ? |
| శర్మ : ఒంటిగంట. | One o' clock. |
| రామా : సుబ్బారావు ఎన్ని గంటలకు వస్తాడు ? | When will Subbarao come ? |
| శర్మ : పన్నెండింటికి సుబ్బారావు వస్తానన్నాడు. | Subbarao said that he would come at 12 o' clock. |
| రామా : వచ్చాడా ? | Did he come ? |
| శర్మ : సుబ్బారావు ఇంకా రాలేదు. గోపి వచ్చాడు. | Subbarao did not come so far. Gopi came. |
| రామా : సుబ్బారావు ఎందుకు రాలేదు ? | Why didn't Subbarao come ? |

| | |
|---|---|
| శర్మ : నాకు తెలియదు. | I don't know. |
| రామా : మరి ఈ సంగతి గోపాలరావుతో చెప్పావా ? | Then, did you tell this thing to Gopalarao? |
| శర్మ : నేను చెప్పలేదు. గోపి చెప్పాడు. | I didn't tell him. Gopi told him. |
| రామా : గోపీ ! సుబ్బారావు ఎందుకు రాలేదో కనుక్కున్నావా ? | Gopi! Did you find out why Subbarao didn't come? |
| గోపి : నేను కనుక్కోలేదు. | I didn't find out. |
| రామా : ఆనక్క కనుక్కో. | Find out later. |
| శర్మ : అడుగోనండీ, సుబ్బారావు వస్తున్నాడు. | See, sir! Subbarao is coming. |
| రామా : ఏం సుబ్బారావు ! ఎందుకింత ఆలస్యం అయింది ? | Subbarao! Why are you so late? |
| సుబ్బా : మా తమ్ముడు కుర్చీమీదినించి కింద పడ్డాడండీ. ముక్కుకు దెబ్బ తగిలింది. అందుకే ఆలస్యం అయింది. | My younger brother fell down from the chair and had an injury on the nose. That's why this delay, sir. |
| రామా : పెద్ద దెబ్బ తగిలిందా ? | Was he hurt seriously? |
| సుబ్బా : పెద్ద దెబ్బ తగలలేదు. కొంచెం నెత్తురు వచ్చింది. | Not seriously. There was a little bleeding. |
| రామా : నీ వేలికి కట్టు కట్టావెందుకు ? | Why did you bandage your finger? |
| సుబ్బా : వాడి బొమ్మ నా చేతిమీద పడ్డది. వేలు కొంచెం నెప్పిగా ఉంది. | His toy fell on my palm. My finger is paining a little. |
| రామా : సరే, మనం బైల్దేర్దామా ? | Okay! Shall we proceed now? |
| సుబ్బా : కొంచెం ఆగండి. శర్మా ! కట్టు ఊడుతున్నది. కొంచెం గట్టిగా కట్టు ! | Wait a while, sir. Sarma! The bandage is loosening. Please tie it tight. |

## DRILLS

**a. Repetition drill.**

పుస్తకం చేతిమీద పడలేదు.
కాలిమీద పడ్డది.
ఇతను అక్కడ పడలేదు.
ఇక్కడ పడ్డాడు. *(paḍḍaaḍu)*

నేను పుస్తకం మీద పడలేదు.
కుర్చీ మీద పడ్డాను. *(paḍḍaanu)*
మీరు కింద పడలేదు.
వాళ్లు కింద పడ్డారు. *(paḍḍaaru)*

**b. Substitution drill.**

Model (i) :

రవి ఇంకా అన్నం తినలేదు.
చపాతీలు చెయ్యి
రవి ఇంకా చపాతీలు చెయ్యలేదు.
పాఠం చదువు
శర్మను పిలు
కాఫీ తీసుకో
పాఠం మొదలుపెట్టు
ఇంటికి రా

Model (ii) :

శర్మ రెండింటికి వచ్చాడు.
మూడు
శర్మ మూడింటికి వచ్చాడు.
నాలుగు
ఎనిమిది
పన్నెండు

**c. Response drill.**

Model (i) :

రవీ : నీ వేలికి దెబ్బ తగిలిందా ? (కాలు)
వేలికి దెబ్బ తగలలేదు. కాలికి తగిలింది.

1. శర్మా : చేతికి కట్టుకట్టావా ? (వేలు)
2. సుశీల నిన్న వచ్చిందా ? (మొన్న)
3. రవీ : రెండో పాఠం మొదలుపెట్టావా ? (నాలుగు)
4. గోపీ : కాఫీ తీసుకున్నావా ? (టీ)
5. బాబు కుర్చీ మీద పడ్డాడా ? (బల్ల)

Model (ii) :

శర్మ ఎన్నింటికి వచ్చాడు ? (రెండు)
శర్మ రెండింటికి వచ్చాడు ?

1. బస్సు ఎన్నింటికి వస్తుంది ? (ఆరు)
2. సరళ ఎన్నింటిదాకా చదువుతుంది ? (మూడు)
3. మనం ఎన్నింటినించి ఆడుతున్నాం ? (ఎనిమిది)

Model (iii) :

ఇంటికి ఎప్పుడు వెళ్ళను ?
అనిక్కా వెళ్ళు; లేకపోతే ఒంటిగంటకు వెళ్ళు.

1. పాలు ఎప్పుడు తాగను ?
2. కమలను ఎప్పుడు పిలవను ?
3. పాపకు ఎప్పుడు కథ చెప్పను ?

Model (iv) :

రవి వచ్చాడా ?

ఇంకా రాలేదు.

1. శర్మ అన్నం తిన్నాడా ?
2. రైలు వచ్చిందా ?
3. సరళ పుస్తకం తీసుకున్నదా ?
4. రమ టీ ఇచ్చిందా ?
5. బస్సు పోయిందా ?
6. బస్సుకు టైం అయిందా ?

## EXERCISES

a. Answer the following questions based upon the text of the lesson.

1. సుబ్బారావు ఎన్నింటికి వస్తానన్నాడు ?
2. సుబ్బారావు టైముకు వచ్చాడా ?
3. సుబ్బారావు ఎందుకు ఆలస్యంగా వచ్చాడు ?
4. సుబ్బారావు వేలికి ఎందుకు కట్టు కట్టాడు ?

b. Answer the following questions as shown in the model.

Model (i) :

పాఠం మొదలుపెట్టారా ?

ఇంకా మొదలుపెట్టలేదు.

1. శర్మ ఇంటికి వచ్చాడా ?
2. సరళ అన్నం తిన్నదా ?
3. సుశీల పుస్తకం తీసుకున్నదా ?
4. రవి పూలు కోశాడా ?
5. బస్సుకు టైం అయిందా ?
6. రవి రేడియో బాగుచేశాడా ?
7. కమల ఇంటికి పోయిందా ?

Model (ii) :

శ్రీధర్ ఎన్నింటికి వచ్చాడు ? (రెండు)

రెండింటికి వచ్చాడు.

1. రమ ఎప్పుడు అన్నం తిన్నది ? (ఏడు)
2. శ్రీధర్ ఎప్పుడు పాఠం మొదలుపెట్టాడు ? (ఆరు)
3. వాళ్ళు ఎన్నింటికి నిద్రపోయారు ? (పది)

c. Fill up the blanks with past negative form of verbs given in the parentheses.

1. రవి ఇవ్వాళ ఇంటికి......... (రా)
2. నేను వానలో ......... (తడుస్)
3. సరళ నా పుస్తకం ............ (చదువు)
4. శర్మ ఈ కుర్చీలో ......... (కూర్చో)

## VOCABULARY

| | |
|---|---|
| ఒంటిగంట | one o' clock |
| ఆనిక్కి | afterwards |
| ముక్కు | nose |
| దెబ్బ | blow (n.) |
| తగులు | touch, hit (v. intr.) |
| నెత్తురు | blood |
| వేలు | finger |
| కట్టు | bandage (n.) |
| బైల్దేరు | see బయల్దేరు; start |
| కట్టు | tie (v.) |
| ఊడు | become loose |

## GRAMMAR NOTES

71.1. In this Lesson the past negative is introduced. -లేదు is added to the infinitive (52.3.2) to form past negative. As in the present negative (54.1), the verb does not show any concord with the person-gender-number of the subject.

Past negative → Infinitive + లేదు

వెళ్ళ-లేదు 'did not go'

| | |
|---|---|
| నేను వెళ్ళ-లేదు | 'I did not go.' |
| మేం/మనం చెయ్య-లేదు | 'We did not do.' |
| నువ్వు పో-లేదు | 'You did not go.' |
| మీరు పాసుకా-లేదు | 'You did not pass.' |
| అతను/వాడు/ఆయన తిన-లేదు | 'He did not eat.' |
| వారు/వాళ్ళు తే-లేదు | 'They did not bring.' |
| ఆవిడ/ఆమె చదవ-లేదు | 'She did not read.' |
| అది రా-లేదు | 'It/She did not come.' |
| అవి విరగ-లేదు | 'They (neuter) did not break.' |

71.2. -ఇంటి is added to numerals to form the respective oblique bases.

రెండు + కి → రెండింటికి (రెండు + ఇంటి- కి) 'for two' (41.6.)

These numerals with -ఇంటి are frequently used in time expression.

నాలుగింటికి 'at 4 o'clock'

In time expression -ఇంటి is not added to ఒకటి. To say 'one o' clock' ఒంటిగంట is used instead of ఒకటి. ఒకటి is, however, used in fractions like ఒకటీపది 'one hour and ten minutes', etc.

71.3. The past tense forms of పడు 'fall' are also introduced in this lesson. In taking past tense suffix, పడు behaves like అను group of bases (49.1 ; 50.1). That means, పడు geminates the final consonant and takes -అ/-ఆ (66.5) as past tense suffix. (-అ before the personal suffix -ది, and -ఆ before the other personal suffixes).

తిను + ఆ-డు → తిన్న్-ఆ-డు → తిన్నాడు 'He ate.' (66.5.)

పడు + ఆ-డు → పడ్డ్-ఆ-డు → పడ్డాడు 'He fell.'

| | |
|---|---|
| పడు + ఆ-రు → పడ్డారు | 'You (pl.)/They fell.' |
| పడు + ఆ-వు → పడ్డావు | 'You (sg.) fell.' |
| పడు + ఆ-ం → పడ్డాం | 'We fell.' |
| పడు + ఆ-ను → పడ్డాను | 'I fell.' |
| పడు + ఆ-యి → పడ్డాయి | 'They (neut.) fell.' |
| పడు + అ-ది → పడ్డది | 'She/It fell.' |

**71.4.** Recall the use of conjoining marker ఓ (41.9).

సుబ్బారావు ఎందుకు రాలేదు + ఓ కనుక్కున్నావా ?

సుబ్బారావు ఎందుకు రాలేదో కనుక్కున్నావా ?

'Did you enquire why Subbarao did not come ?'

# UNIT 18

## Lesson 72

విమల : కమలా ! నీ దగ్గర సైన్సు పుస్తకం ఉందా ?

Kamala ! Do you have science book ?

కమల : ఉంది. అది లైబ్రరీది. ఎందుకు ?

I have. That is from the library. Why ?

విమల : నా పుస్తకం ఎవరో తీసుకున్నారు. ఎపరికి ఇచ్చానో గుర్తురావటం లేదు. ఒకసారి ఆ పుస్తకం ఇస్తావా ?

Somebody took my book. I am not able to remember to whom I gave it. Can you give me that book once ?

కమల : ఇంకా నేను చదపటం పూర్తికాలేదు. సగం అయింది. ఇవ్వాళ కొంత అవుతుంది.

I didn't finish reading it yet. Only half of it is finished. I can finish a little more today.

విమల : రోజుకు ఎన్ని పేజీలు చదువుతున్నావు ?

How many pages do you read a day ?

కమల : పది. అంతకంటే ఎక్కువ కావటం లేదు.

Ten. It is not possible (to read) more.

విమల : ఎనిమిదో తారీకు పరీక్ష ఉంది. ఈ విషయం నీకు గుర్తుందా ?

There is an examination on the eighth. Do you remember it ?

కమల : ఎందుకు గుర్తులేదు ?

Why don't I remember it ?

విమల : మరి నేను గూడా చదవాలి గదా ! నువ్వు అంత మెల్లగా చదివితే పూర్తి కావటం కష్టం. నేను తొందరగా చదువుతాను ఇవ్వు. మళ్ళీ మూడు రోజుల్లో ఇస్తాను.

Then ! I should also read. shoudn't I ? If you read so slow it will be difficult to finish that book. I read fast. Give me. I will return it in three days.

కమల : నేను ఈ రాత్రికి పూర్తి చేస్తాను.

I will complete it this night.

విమల : పూర్తి కాకపోతే ?

If it isn't completed ?

కమల : అవుతుంది అంటున్నాను గదా !

I say, it will be completed.

విమల : తక్కిన పనులు మానెయ్యి !

Don't do anything else.

కమల : మానేస్తాను. ఇది చదవటం పూర్తి చేస్తాను. ఈ పుస్తకం అయితేనే ఇంకొక పనికి వెళ్తాను.

I won't. I will finish reading this. After I complete this book only, I take up some other work.

విమల : మీ తమ్ముడికి పరీక్షలు గదా! బాగా చదువుతున్నాడా ? ఈ సంవత్సరం పాసుఅవుతాడు అనుకుంటాను.

Your brother has exams. Hasn't he ? Is he studying well ? I hope he will pass this year.

కమల : అసలు చదవటంలేదు. వాడు ఈ సంవత్సరం గూడా పాసుకాడు.

He is not at all studying. He will not pass this year also.

## DRILLS

**a. Build-up drill.**

కాలేదు.
పూర్తి కాలేదు.
చదవటం పూర్తి కాలేదు.
పుస్తకం చదవటం పూర్తి కాలేదు.
నేను పుస్తకం చదవటం పూర్తి కాలేదు.
ఇంకా నేను పుస్తకం చదవటం పూర్తి కాలేదు.

కష్టం.
కావటం కష్టం.
పూర్తి కావటం కష్టం.
చదివితే పూర్తి కావటం కష్టం.
మెల్లగా చదివితే పూర్తి కావటం కష్టం.
అంత మెల్లగా చదివితే పూర్తి కావటం కష్టం.

వెళ్తాను.
పనికి వెళ్తాను.
ఇంకొక పనికి వెళ్తాను.
అయితేనే ఇంకొక పనికి వెళ్తాను.
పూర్తి అయితేనే యింకొక పనికి వెళ్తాను.
చదవటం పూర్తి అయితేనే యింకొక పనికి వెళ్తాను.
పుస్తకం చదవటం పూర్తి అయితేనే యింకొక పనికి వెళ్తాను.
ఈ పుస్తకం చదవటం పూర్తి అయితేనే యింకొక పనికి వెళ్తాను.

గుర్తురావటంలేదు.
ఎవరికి యిచ్చానో గుర్తురావటం లేదు.
పుస్తకం ఎవరికి యిచ్చానో గుర్తురావటంలేదు.
నా పుస్తకం ఎవరికి యిచ్చానో గుర్తురావటంలేదు.

**b. Substitution drill.**

Model (i) :

శర్మ అన్నం తినటంలేదు. (వండు)
శర్మ అన్నం వండటంలేదు.

1. పాఠం గుర్తురావటంలేదు. (పూర్తికా)
2. రెండు సంవత్సరాలనించి అతను చదవటం లేదు. (పాసుకా)
3. నాకు శర్మ అడ్రసు గుర్తురావటంలేదు. (గుర్తుండు)
4. అతను పనిని పూర్తిచెయ్యటంలేదు. (మానెయ్యి)

Model (ii) :

రవి లెక్చరర్ కాదు.
సరళ
సరళ లెక్చరర్ కాదు.
నేను
మనం
మేం
మీరు
వాళ్ళు
నువ్వు

**c. Response drill.**

**Model :**

శర్మా! నువ్వు పుస్తకం చదవటం అయిందా?
ఇంకా కాలేదు.

1. శారదా! మీ అన్నయ్య పాసుఅయ్యాడా?
2. శర్మ కాలేజీకి రావటం మానేశాడా?
3. సుగుణా! ఇప్పుడు టైం ఒంటిగంట అయిందా?
4. నీ పని పూర్తి అయిందా?
5. నా పేరు నీకు గుర్తొచ్చిందా?

**d. Conversation drill.**

**Model (i) :**

అరుణ : ఈ పని పూర్తికావటం కష్టం అనుకుంటాను.
సుగుణ : ఎందుకు పూర్తికాదు?

1. రఘు : నాకు ఆ విషయం గుర్తుండటం కష్టం అనుకుంటాను.
   శ్రీధర్ : ... ... ... ... ...
2. రవి : శర్మ ఈ ప్రయాణం మానెయ్యటం కష్టం అనుకుంటాను.
   సుజాత : ... ... ... ... ...
3. అరుణ : అతను పాసుకావటం కష్టం అనుకుంటాను.
   సుగుణ : ... ... ... ... ...

**Model (ii) :**

రవి : ఇవ్వాళ కమల ఈ పని పూర్తి చేస్తుంది.
శర్మ : చెయ్యకపోతే?
రవి : చేస్తుంది అంటున్నాను గదా!

1. విమల : మీ ఇంటి నెంబరు నాకు గుర్తుంటుంది.
   మోహన్ : ... ... ... ... ...
   విమల : ... ... ... ... ...
2. పాపారావు : సోమవారం శ్రీధర్ పని మానేస్తాడు.
   వెంకటేశ్వర్లు : ... ... ... ... ...
   పాపారావు : .... .... .... .... ....
3. గోపి : ఈ సంవత్సరం వాడు పాసు అవుతాడు.
   రఘు : .... .... .... .... ....
   గోపి : .... .... .... .... ....
4. సుగుణ : ఇవ్వాళ ఈ పని పూర్తి అవుతుంది.
   లక్ష్మి : .... .... .... .... ....
   సుగుణ : .... .... .... .... ....

## EXERCISES

a. Answer the following questions as shown in the model.

నేను మంత్రిని అయ్యానా?
నువ్వు మంత్రివి కాలేదు; కావు.

1. సరళ పని చెయ్యటం మానేసిందా?
2. ఇవ్వాళ గోపాలరావు పని పూర్తి అయిందా?
3. మీరు లెక్చరర్ అయ్యారా?
4. వాళ్ళు మంత్రులు అయ్యారా?
5. నేను ప్రిన్సిపాల్ని అయ్యానా?

b. Fill up the blanks with the negative conditional form of the verb given in the parentheses.

Model :

శర్మ ఇక్కడికి... ...(రా) కష్టం.

శర్మ ఇక్కడికి రాకపోతే కష్టం.

1. నీకు శర్మ అడ్రసు ... ... (గుర్తుండు) రవిని అడుగు.
2. నువ్వు అతనితో మాట్లాడటం ... ... ... (మానెయ్యి) నేను నీతో మాట్లాడను.
3. నువ్వు డాక్టర్వి... ... ...(కా) బాగుండదు.
4. ఈ పని ... ... (పూర్తికా) ఇంకొక పనికి పోకు.
5. ఇప్పుడు టైం ఆరు... ... ... (కా) రైలు రాదు.

c. Make your own sentences using the imperative, present negative and negative conditional forms of the following verbs.

1. మానెయ్యి    2. కా    3. పాసుకా

d. Answer the following questions based on the text of the lesson.

1. కమల పుస్తకం చదవటం పూర్తి అయిందా ?
2. విమల పుస్తకం ఎవరు తీసుకున్నారో గుర్తున్నదా ?
3. కమల పుస్తకం చదవటం పూర్తిచెయ్యటానికి ఏం చెయ్యాలనుకుంటున్నది ?
4. కమల పుస్తకం చదవటం పూర్తి అయిందా ?

## VOCABULARY

| | |
|---|---|
| సైన్సు | science |
| లైబ్రరీ | library |
| గుర్తురా | be recollected, be recalled |
| పూర్తికా | be completed |
| గుర్తుండు | remember |
| పూర్తిచెయ్యి | complete (v. tr.) |
| మానెయ్యి | give up |

## GRAMMAR NOTES

72.1. In this lesson some more grammatical forms of the verb కా are introduced. In lesson 70 imperative, present, past, future and conditional forms were introduced.

| | |
|---|---|
| పాసుకా-వటం → పాసుకావటం | 'passing' (gerund) (53.1.1.) |
| పూర్తికా-వటం-లేదు → పూర్తికావటంలేదు | 'It is not finishing.' (present negative) (54.1.; 53.1.1.) |
| పూర్తికా-అ-లేదు → పూర్తికాలేదు | 'It was not finished.' (past negative) (71.1.; 52.3.2.; 41.7.) |
| పూర్తికా-అకపోతే → పూర్తికాకపోతే | 'If not finished.' (negative conditional) (64.2.; 41.7.) |
| పాసుకా-అ-డు → పాసుకాడు | 'He will not pass.' (future negative) (62.1.; 41.7.) |

**72.2.** ఉండు which is the final element in the compound verbs like గుర్తుండు (గుర్తు + ఉండు) 'be remembered' behaves like the main verb ఉండు.

| | |
|---|---|
| నాకు గుర్తుంది. (గుర్తు+ఉంది) | 'I remember it.' |
| నాకు గుర్తులేదు. | 'I don't remember it.' |
| నాకు నువ్వు గుర్తుంటావు. | 'I will remember you.' |
| వాళ్ళు నాకు గుర్తుండరు. | 'I will not remember them.' |

**72.3.** Notice the use of emphatic marker ఏ (6.4; 15.4.) in the sentence :

ఈ పని పూర్తి అయితేనే ఇంకొక పనికి వెళ్తాను.
'I will go to another work only if I complete this work.'

నువ్వు వస్తేనే నేను మాట్లాడ్తాను.
'I will speak only if you come.'

# UNIT 18

## Lesson 73

| | |
|---|---|
| కమల : అన్నయ్యా! అలారం మోగుతున్నది. వినిపించటంలేదా, యింకా లేవలేదు, తొందరగా లే! రైలుకు టైం అవుతున్నది. | Brother! The alarm is ringing. Don't you hear it? You didn't get up yet! Get up early. It is getting time for the train. |
| రవి : టైం అయితే శర్మ పిలుస్తానన్నాడు. ఇంకా పిలవలేదు. | If time is up, Sarma told me that he would call me up. He didn't call me up so far. |
| కమల : అతను మర్చిపోయాడేమో! నువ్వు లే! పళ్ళు తోముకో! ఇదుగో బ్రష్షు నాలికబద్ద! | He might have forgotten. You get up. Brush your teeth. Take this brush and the tongue cleaner. |
| రవి : ఒక పన్ను నెప్పిగా ఉంది. బ్రష్షు వద్దు. పళ్ళపొడి ఇవ్వు. | One of my tooth is aching. So no brush. Give me tooth-powder. |

కమల : ఇదుగో, టవలు ఆ దండెం మీద ఉంది. తీసుకో.

Take it. The towel is there on that stand. Pick it up.

రవి : ఈ టవలు తడిగా ఉంది. పొడి టవలు తీసుకురా।

This towel is wet. Get me a dry towel.

కమల : తడిసిందా ? లేదు. ఎక్కువ తడవ లేదు. తీసుకో।

Is it wet? No. It is not wet much. You take it.

రవి : ఈ పళ్ళపొడి ఎక్కడిది ?

Where is this tooth-powder from ?

కమల : నిన్న ఇంటి ముందుకు వస్తే అమ్మ కొన్నది. పంటి నొప్పికి మంచిది అన్నాడు.

Mother bought it yesterday when it was sold in front of our house (by the street vendor). He said that it is a good one for tooth-ache.

రవి : శర్మ యింకా రాలేదు. నేను ఇప్పుడు వెళ్ళటం ఎట్లా ?

Sarma did not come yet. How can I go now ?

కమల : అతను వస్తేగాని నువ్వు వెళ్ళవా ?

Won't you go if he doesn't come ?

రవి : వాడు వస్తేనే వెళ్తాను. రాకపోతే వెళ్ళటం అనవసరం. వాడు వస్తేగాని నా పని జరగదు.

If he comes only, I will go. If he doesn't come, my going is a waste. Unless he comes, my work cannot be done.

కమల : అదుగో శర్మ వచ్చాడు. శర్మా నీకు వెయ్యేళ్ళ ఆయుషు.

Hey, there! Sarma has come. Sarma! You will live a long time (for thousand years).

## DRILLS

**a. Repetition drill.**

రవి పిలవలేదు; శర్మ పిలిచాడు.
రావు తడపలేదు; మోహన్ తడిపాడు.
సుగుణ లేవలేదు; సరళ లేచింది.

సుగుణ అడిగితే సరళ కలం ఇచ్చింది.
నేను వానలో తడిస్తే జలుబు చేసింది.

నువ్వు అడిగితేగాని నేను చెప్పను.
నువ్వు అడిగితేనే నేను చెప్తాను.
బాగా చదివితేగాని పాసుకావు.
బాగా చదివితేనే పాసవుతావు.

**b. Build-up drill.**

అన్నాడు.
వస్తానన్నాడు.
శ్రీధర్ వస్తానన్నాడు.
అయితే శ్రీధర్ వస్తానన్నాడు.
టైం అయితే శ్రీధర్ వస్తానన్నాడు.

అనవసరం.
వెళ్ళటం అనవసరం.
నేను వెళ్ళటం అనవసరం.
రాకపోతే నేను వెళ్ళటం అనవసరం.
వాడు రాకపోతే నేను వెళ్ళటం అనవసరం.

వెళ్ళాను.
అక్కడికి వెళ్ళాను.
నేనక్కడికి వెళ్ళాను.
రమ్మంటే నేనక్కడికి వెళ్ళాను.
నువ్వు రమ్మంటే నేనక్కడికి వెళ్ళాను.

మాట్లాడడు.
రవి మాట్లాడడు.
ఇస్తేగాని రవి మాట్లాడడు.
డబ్బు ఇస్తేగాని రవి మాట్లాడడు.
నువ్వు డబ్బు ఇస్తేగాని రవి మాట్లాడడు.

**c. Substitution drill.**

**Model (i) :**

హరికి టైం అయింది.
సుగుణ
సుగుణకు టైం అయింది.
రైలు
సుబ్బారావు
కాలేజీ

**Model (ii) :**

శర్మ నన్ను అడగలేదు. (పిలుచ్)
శర్మ నన్ను పిలవలేదు.

1. అతను వానలో పరిగెత్తలేదు. (నడుచ్)
2. సుగుణ వానలో నిల్చోలేదు. (తడుస్)
3. పద్మ ఊదపలేదు. (ఏడుచ్)
4. మురళి నన్ను పిలపలేదు. (కలుస్)

**d. Response drill.**

**Model (i) :**

రవీ ! ఎందుకు నిన్న సినిమాకు వెళ్ళావు ?
(శర్మ పిలిచాడు)
శర్మ పిలిస్తే నేను సినిమాకు వెళ్ళాను.

1. రమా ! ఎందుకు ఏడుస్తున్నావు ?
(అమ్మ కొట్టింది)
2. సోమూ ! నీ కలం కమలకు ఎందుకిచ్చావు ?
(రమ యివ్వమన్నది)
3. ఈ పనిని శర్మ ఎందుకు చేస్తున్నాడు ?
(రవి చెయ్యలేదు)
4. నీ చొక్కా ఎందుకు తడిసింది ?
(వానలో వచ్చాను)

**Model (ii) :**

సుబ్బారావ్ ! అన్నం తింటావా ?
(శర్మ-తిను)
శర్మ తింటేగాని నేను తినను.

1. రేపు అతని బాకీ తీరుస్తావా ? (డబ్బు-రా)
2. రైలు ఎప్పుడు వస్తుంది ? (టైం-కా)
3. ఇప్పుడు నీ పని అవుతుందా ? (కమల-సహాయం చెయ్యి)
4. రమా ! శర్మకు నీ పుస్తకం ఇస్తావా ? (శర్మ-అడుగు)

e. Conversation drill.

**Model :**

ఇప్పుడు రైలుకు టైం అయింది (రవి-రా)
రైలుకు టైం అయితే రవి వస్తాడు.

1. రవి : కమల పాసుఅవుతుంది. (గోపి-పాసుకా)
   కుమార్ : ... ... ... ....
2. పద్మ : గీత చదవటం పూర్తి అయింది. (సుగుణ-రా)
   విమల : ... ... ... ...
3. రవి : సుబ్బారావుగారు ప్రిన్సిపాల్ అయ్యారు. (మనం-పాసుకా)
   శర్మ : ... ... ... ...

f. Transformation drill.

**Model :**

మనం డబ్బులు యిస్తేనే డాక్టర్ మందు యిస్తాడు.
మనం డబ్బులు ఇస్తేగాని డాక్టరు మందు యివ్వడు.

1. పరీక్షలో బాగా రాస్తేనే పాసు అవుతావు.
2. అతనికి గుర్తు ఉంటేనే అతని బాకీ తీరుస్తాను.
3. బాగా వెతికితేనే ఆ పుస్తకం దొరుకుతుంది.

## EXERCISES

a. Fill up the blanks with past tense form of verbs given in the parentheses.

1. మురళి వానలో .... .... (తడుస్)
2. రమ పరీక్షలో ... ... (పాసుకా)
3. రవి తొందరగా .... .... (నడుచ్)
4. నిన్ను అతను .... .... (పిలుచ్)

b. Answer the following questions as shown in the model.

**Model (i) :**

ఇవ్వాళ శారద యిక్కడికి వస్తుందా ?
(నువ్వు-పిలుచ్)
నువ్వు పిలిస్తేనే ఇవ్వాళ శారద యిక్కడికి వస్తుంది. పిలవకపోతే రాదు.

1. ఈ సంవత్సరం రమ పాసవుతుందా ? (బాగా-చదువు)
2. నువ్వు టీ తాగుతావా ? (నిద్ర-రా)
3. సెలవులలో నువ్వు మీ ఊరికి వెళ్తావా ? (పాసుకా)

Model (ii) :

నువ్వు ఎందుకు శర్మతో మాట్లాడావు?
నేను మాట్లాడలేదు. వాడే నాతో మాట్లాడాడు.

1. నువ్వు రవిని ఎందుకు పిలిచావు?
2. నువ్వు సుబ్బారావు కంటె ముందు ఎందుకు లేచావు?
3. నువ్వు శర్మను ఎందుకు కలిశావు?

c. Combine the following pairs of sentences as shown in the model.

Model:

శ్రీధర్ పిలిచాడు. నేను వెళ్లాను.
శ్రీధర్ పిలిస్తే నేను వెళ్ళాను.

1. కమల అడిగింది. నేను డబ్బిచ్చాను.
2. అతను తిట్టాడు. నేను మాట్లాడలేదు.
3. నాకు రోడ్డు మీద కలం దొరికింది. దాన్ని కిషులకు యిచ్చాను.

d. Change the following sentences as shown in the model.

Model:

శర్మ అడిగితేనే నేనా పని చేస్తాను.
శర్మ అడగితే గాని నేనా పని చెయ్యను.

1. నువ్వు పాటపాడితేనే నేను నిద్రపోతాను.
2. నువ్వు చెప్మంటేనే నేను చేస్తాను.
3. నువ్వు మందిస్తేనే అతను డబ్బులిస్తాడు.
4. ఆమె లేస్తేనే వాళ్ళు ఊడుస్తారు.

e. Answer the following questions based upon the text of the lesson.

1. కమల వాళ్ళ అన్నయ్యను ఎందుకు లేవమంటున్నది?
2. రవి యింకొక టవలు ఎందుకు తీసుకు రమ్మంటున్నాడు?
3. రవి బ్రష్షు ఎందుకు వద్దంటున్నాడు?
4. ఆ పళ్లపొడి ఎక్కడిది?
5. శర్మ రాకపోతే రవి వెళ్లటం ఎందుకు అనవసరం?
6. టవలు ఎక్కడున్నది?

## VOCABULARY

| | |
|---|---|
| అలారం | alarm |
| మోగు | ring (v. intr.) |
| పన్ను | tooth |
| తోముకో | brush (v.) |
| బ్రష్షు | brush (n.) |
| నాలికబద్ద | tongue cleaner |
| పళ్లపొడి | tooth powder |
| టవలు | towel |
| దండెం | hanger |
| తడి | wet (adj.) |
| పొడి | dry (adj.) |
| ఆయుష్షు | life span |

**GRAMMAR NOTES**

73.1. In this lesson the past negative forms of స/చ ending bases are introduced. Remember that the past negative is formed by adding లేదు to the infinitive (71.1.) and that the infinitive is formed by adding -అ to the base (52.3.2.). The final స/చ of the base becomes వ when followed by a suffix beginning with అ or ఉ (67.5; 68.3.).

లేచ్-అ + లేదు → లేవ్-అ + లేదు → లేవలేదు 'did not get up' (68.3.)

పిలుచ్-అ + లేదు → పిలచ్-అ-లేదు → పిలవ్-అ-లేదు → పిలవలేదు 'did not call' (67.3.; 68.3.)

కలుస్-అ-లేదు → కలస్-అ-లేదు → కలవ్-అ-లేదు → కలవలేదు 'did not meet' (67.3.; 67.5.)

73.2. Notice the use of the conditional form in the sentence:

నిన్న ఇంటి ముందుకు వస్తే అమ్మ తీసుకున్నది. 'Mother took it when it came at the house.'

In this sentence, the main verb of the sentence is in past tense. But in the sentences where the conditional is introduced (lesson 63) the main verb is in future tense.

నువ్వు వస్తే చెప్తాను. 'I will tell you if you come.'

The conditional form expresses a real condition when the main verb is in future tense.

నువ్వు వెళ్తే నేను మాట్లాడ్తాను. 'I will speak if you go.'

And when the main verb is in past tense, the conditional form denotes a temporal meaning 'when'.

నేను పిలిస్తే శర్మ పలికాడు. 'Sarma responded when I called.'

73.3. The 'unless' constructions are also introduced in this lesson. These constructions are formed in the following pattern.

Unless construction → Unless clause (a subordinate clause) + Main clause (in future negative)

The 'unless clause' is formed by adding గాని to the conditional form.

Unless clause → Conditional form of the verb + గాని

వస్తే + గాని → వస్తేగాని 'unless someone comes'

నువ్వు వస్తేగాని నేను వెళ్ళను. 'Unless you come I won't go.'

వాడు వస్తేగాని నా పని జరగదు. 'Unless he comes my work will not go on.'

73.4. పళ్ళు 'teeth' is the plural form of పన్ను 'tooth.' The oblique base of పన్ను is పంటి.

73.5. Notice the use of dative case suffix in sentences like :

అది పంటినెప్పికి మంచిది. 'It is good for toothache.'

ఈ మందు జ్వరానికి మంచిది. 'This medicine is good for fever.'


దేశంలో జేబుదొంగలు
ఎక్కువయ్యారయ్యా!
మురళి
రమణ


ఈ కబుర్లు ఇంక
పూర్తికావేరా
అమ్మా!
రాగతి
పండరి


సినిమా పేరు చూస్తే గుర్తొచ్చింది;
పెరుగు తోడుబెట్టటం మర్చిపోయా
నండీ!


తోడు-నీడ
శశిధర్


చెప్పులు తెమ్మన్నావు గదా! షాపు దగ్గర
నీ సైజు అమ్మాయి కనిపించింది.
షాపులోకి పిలిచాను.....


సీనూ! ఇక్కడ నీ కార్టూన్లు పడ్డాయి, చూడు!
ఇల్లు ఊడుస్తుంటే కనిపించాయి. తీసుకో!


దసరా మామూలు చేతిలో పడితేగాని సంతకం పెట్టను!
పాడు అలవాటు! ఇది అబ్బాయి ప్రోగ్రెస్ కార్డండీ!
పండరి నాథ్
PROGRE REPO


ఆఫీసులో నిద్రపోతున్నావు. ఇది నీ ఇల్లనుకున్నావా? ఆఫీసనుకున్నావా?
సారీ సర్! నేనివ్వాళ సెలవు మీద ఉన్నాను. ఇంట్లో నిద్రపట్టక పోతే ఇక్కడికి వచ్చాను.


ఛీ! ఈ జన్మలో నీకు కాఫీ చెయ్యటం రాదు. కషాయం లాగా ఉంది.
అది కషాయమే! ఇవ్వాళ గూడా కాఫీపొడి తీసుకు రావటం మర్చిపోకండి!
బాబీ


ఎంత పెద్ద కలం తెచ్చానో చూడు.
ఇది నీ పుట్టినరోజు కానుక. ఒకసారి
సిరా పోస్తే ఒక నవల పూర్తిచెయ్యవచ్చు!




## EXERCISES

**a.** Answer the following questions as shown in the model.

Model (i) :

రమా : సాయంత్రం పాఠం చదువుతావా ? (నిన్న)

నిన్ననే చదివాను.

1. పద్మా : ఈ సినిమా చూస్తావా ? (మొన్న)
2. మీరిద్దరూ శర్మను డబ్బడుగుతారా ? (నిన్న)
3. మురళీ : రమ కమలకు ఉత్తరం రాస్తుందా ? (నిన్న)
4. వాసూ : వాళ్లు ఇప్పుడు అన్నం తింటారా ? (ఇందాక)
5. అతను కాఫీ తీసుకుంటాడా ? (ఇప్పుడు)

Model (ii) :

ఈ బల్ల పక్కకు జరిగింది. (నేను)

నేను ఈ బల్లను పక్కకు జరిపాను.

1. బ్రెడ్డు కాలింది. (సుగుణ)
2. ఆ పెసరట్టు మాడింది. (నువ్వు)
3. మన బాకీ తీరిందా ? (నువ్వు)

**b. Tick the correct one which completes the sentence.**

1. తలుపు

   అ. తెరిసాను    ఆ. తెరిశాను    ఇ. తెరిచాను

2. సుగుణ వానలో .........

   అ. తడిచింది    ఆ. తడిసింది    ఇ. తడిశింది

3. పాప సరళను .........

   అ. పిలిచింది    ఆ. పిలిశింది    ఇ. పిలిసింది

4. శ్రీధర్ ఒక మైలు .........

   అ. నడిశాడు    ఆ. నడిచాడు    ఇ. నడిసాడు

5. నిన్న నేను వాణ్ణి .........

   అ. కలిశాను    ఆ. కలిచాను    ఇ. కలిసాను

6. అతను బల్లలు ............

   అ. తుడిచాడు    ఆ. తుడిశాడు    ఇ. తుడిసాడు

7. సుగుణ యివ్వాళ ఒక సినిమా .........

   అ. చూడింది    ఆ. చూసింది    ఇ. చూశింది

8. మురళి కుర్చీమీదినించి కింద ............

   అ. పడాడు    ఆ. పడ్డాడు    ఇ. పడ్యాడు

**c. Fill up the blanks with the conditional forms of the verbs given in the parentheses.**

1. శర్మను ...... (పిలు) రాడు.
2. నువ్వు బ్రెడ్డు........ (కాల్చు) నేను తింటాను.
3. వానలు........(కురు) పంటలు పండుతాయి.
4. పాప ........ (ఏడు) బిస్కెట్టు ఇవ్వు।
5. వాళ్ళు పూలు......(తే) నేను తీసుకుంటాను.
6. నువ్వు డబ్బులు... (ఇవ్వు) నేను తీసుకోను.

**d. (a) Pick out the words which can function as both verb and noun.**

| | | | |
|---|---|---|---|
| కాలు | తిను | చెయ్యి | పెరుగు |
| జరుగు | తాగు | చదువు | |

**(b) Pick out the pairs of words which give opposite meanings.**

| | | |
|---|---|---|
| పెరుగు | పొడి | మంచి |
| పాడు | తగ్గు | తడి |

**e. Make your own sentences using the following verbs in present tense past tense and future negative.**

రా      కా      తే      పో

**f. Respond to the following sentences as shown in the model.**

**Model (i) :**

రమా : తొందరగా చదువు.

చదివాను.

1. మురళీ : ఇక్కడికి రా :
2. పాపా : ఈ కలం తీసుకో :
3. శారదా : నా పుస్తక ఇలా తే :
4. బాబూ : ఒక మామిడిపండు కొను :
5. కమలా : ఈ బొమ్మను చూడు :
6. ఏమండీ : మీరు తలుపు ముయ్యండి :
7. శర్మా : అక్కడికి పో :
8. పద్మా : నువ్వు ఈ పరీక్షలో పాసుకా :
9. శ్రీధర్ : నువ్వీ కిటికీలు తెరు :
10. రమా : ఇప్పుడు నువ్వు సరళను కలు :

**Model (ii) :**

ఇప్పుడు శర్మ మాట్లాడుతున్నాడు. (నేను)

నేనింకా మాట్లాడలేదు.

1. ఇప్పుడు రవి అన్నం తింటున్నాడు. (సీత)
2. ఇప్పుడు సుగుణ పూలు కోస్తున్నది. (శర్మ)
3. ఇప్పుడు పిల్లలు పస్తున్నారు. (పాప)
4. శ్రీధర్ కాఫీ తీసుకోస్తున్నాడు. (నువ్వు)
5. అతను టోపీ పెట్టుకుంటున్నాడు. (వీళ్ళు)
6. లక్ష్మి గది ఊడుస్తున్నది. (నేను)
7. ఆమె బ్రెడ్డు కాలుస్తున్నది. (ఈమె)
8. కడుపులో నెప్పి తగ్గుతున్నది. (చెవిలో నెప్పి)
9. నా పని పూర్తి అవుతున్నది. (శర్మ పని)
10. కడపలో వానలు కురుస్తున్నాయి. (మైసూర్లో)
11. కమల పుస్తకాలు వెతుకుతున్నది. (మీరు)
12. వాళ్ళు యిప్పుడు సినిమా చూస్తున్నారు. (నేను)
13. సరళ యివ్వాళ పాట పాడదాం అనుకున్నది. (నేను)
14. శర్మ వాళ్ళకు డబ్బులిస్తున్నాడు. (మురళి)

Model (iii) :

నాకు రెండు తెలుగు పుస్తకాలు కావాలి.

నీకు కావాల్సిన పుస్తకాలు యిక్కడ లేవు.

1. పాపకు తుపాకీ కావాలి.

2. శ్రీధర్ ఒక సినిమా చూడాలి.

3. రమ పూలు పెట్టుకోవాలి.

4. శారద బ్రెడ్డు కాల్చాలి.

Model (iv) :

ఇప్పుడు రవి పాఠం చదువుతూ ఉంటాడా ? (కాఫీ–తాగు)

పాఠం చదువుతూవుండడు. కాఫీ తాగుతూ ఉంటాడు.

1. వాళ్ళు నిద్రపోతూ ఉంటారా? (సినిమా–చూడు)

2. రమ యిప్పుడు అన్నం తింటూ వుంటుందా ? (చపాతీలు–చెయ్యి)

3. కమల యిప్పుడు పాడుతూ వుంటుందా ? (రేడియో–విను)

Model (v) :

కమల కాఫీ తాగింది. టీ తాగింది. (ఏమీ)

కమల తాగితే కాఫీ, టీ రెండూ తాగుతుంది. లేకపోతే ఏమీ తాగదు.

1. రవి వచ్చాడు. శర్మ వచ్చాడు. (ఎవరూ)

2. శారద పూలూ కోసింది పళ్లూ కోసింది. (ఏవీ)

3. మోహన్ రాత్రీ పగలూ చదువుతాడు. (అసలు)

g. Fill up the blanks with తెలుసు/వచ్చు.

1. కమలకు రవి .........

2. రవికి పాటలు .........

3. రమకు మా యిల్లు .........

4. సుగుణకు విషయం .........

h. Build up the conversations as shown in the model.

Model :

రవి : ఇప్పుడు రమ పాడుతుంది.

శర్మ : విమల యింకా పాడదేం ?

రవి : కమల పాడితేనే విమల పాడుతుంది.

శర్మ : కమల పాడితేగాని విమల పాడదా ?

1. రవి : ఇప్పుడు గోపి సంతకం పెడ్తాడు.

శర్మ : విమల ... ... ... ... ?

రవి : కమల .... .... .... ....

శర్మ : కమల.... .... .... .... ?

2. రవి : ఇప్పుడు సుగుణ మాట్లాడుతుంది.
కర్మ : విమల ... ... ... ... ?
రవి : కమల ... ... ... ...
కర్మ : కమల .... .... .... .... ?

3. రవి : ఇప్పుడు నేను కూర్చుంటాను.
కర్మ : విమల ... ... ... ... ?
రవి : కమల .... .... .... ....
కర్మ : కమల ... ... ... ... ?

4. రవి : ఇప్పుడు మేం కాఫీ తాగుతాం.
కర్మ : విమల .... .... .... .... ?
రవి : కమల .... .... .... ....
కర్మ : కమల ... ... ... ... ?

5. రవి : ఇప్పుడు సరోజ కథ చెప్తుంది.
కర్మ : విమల .... .... .... .... .
రవి : కమల .... .... .... ....
కర్మ : కమల .... .... .... .... ?

## VOCABULARY

| | |
|---|---|
| జేబుదొంగ | Pickpocket (n.) |
| కబుర్లు | chat (n.) |
| పెరుగు | curd |
| తోడుపెట్టు | curdle (v. tr.) |
| తోడు | support, help (n.) |
| నీడ | shadow (n.) |
| చెప్పు | shoe |
| షాపు | shop (n.) |
| సైజు | size (n.) |
| కార్టూను | cartoon |
| పడు | appear in a magazine (as a story, cartoon and the like) |
| మామూలు | bhaksheesh; tips paid as per custom |
| సంతకం | signature |
| పాడు | bad (adj.) |
| నిద్రపట్టు | get sleep |
| ఛీ ! | nonsense (interjection) |
| జన్మ | birth |
| కాఫీపొడి | coffee powder |
| కానుక | gift (n.) |
| సిరా | ink (n.) |
| అబ్బ ! | oh ! (interjection) |
| కారణం | reason |

# UNIT 19

## Lesson 75

రవి : శర్మా ! అక్కడ నిల్చున్న మనిషి ఎవరు ?

Sarma ! Who is that standing there ?

శర్మ : ఎవరో ! సుబ్బారావుకోసం వచ్చాడు. మనం ఎప్పుడూ చూసిన మనిషిలాగా లేడు.

Someone ! He came for Subbarao. He doesn't look like the man known to us at all.

రవి : చాలా ముసలివాడి లాగా ఉన్నాడు. బాగా లావుగా గూడా ఉన్నాడు. ఆయన పక్కన ఉన్నది మన సుబ్బారావేనా ?

He looks very old. He is also very stout. Who is that by his side ? Is he Subbarao ?

శర్మ : అవును. ఏమిటి అప్పుడే వెళ్తున్నాడాయన ? మన సుబ్బారావు ఎంత సన్నంగా ఉన్నాడో ఆయన అంత లావుగా ఉన్నాడు. వయస్సు సుమారు అరవయ్యో డెబ్భయ్యో ఉంటుంది.

Yes. What is that ? He is going away already ! Our Subbarao is as thin as the other fellow is stout. His age must be around sixty or seventy.

"ఆకాశవాణి. వార్తలు, చదువుతున్నది రాళ్ళపల్లి రంగనాథరావు"

"All India Radio. The News, read by Rallapalli Ranganatharao......"

రవి : సుబ్బారావు! నీ దగ్గర ఉన్న ట్రాన్సిస్టరు అందరూ చూశారుగాని, దాన్ని ముందు కట్టెయ్యి! నీకోసం వచ్చింది ఎవరు?

Subbarao! Everybody has seen the radio you have. So put it off first. Who came for you?

సుబ్బా : మా మామగారు. నిన్న నువ్వు తెచ్చిన ఉత్తరం ఆయన దగ్గర్నించే వచ్చింది.

My father-in-law. The letter you brought yesterday was from him only.

శర్మ : అలాగా! కనీసం కూర్చోమనలేదేం?

Oh! You did not even ask him to sit down.

సుబ్బా : ఆయన కూర్చునే మనిషి కాదు. ఎప్పుడూ హడావుడిగా ఉంటాడు. అందుకే ఇప్పుడు సరాసరి క్లబ్బుకు వచ్చాడు.

He is not the type of man to sit. He is always busy. That's why he came straight to the club.

రవి : ఏమిటి విశేషం? ఏదో నీకు చూపిస్తున్నాడే?

What's the matter? He was showing you something?

సుబ్బా : వచ్చే వారం మా మరదలు పెళ్ళి. మమ్మల్ని పిలవటానికి వచ్చాడు. పెళ్ళికి కొన్న ఉంగరం చూపించాడు.

My sister-in-law's marriage is fixed for next week. He came to invite us. He showed the ring purchased for the marriage.

రవి : అయితే పెళ్ళికి అల్లుడుగార్ని ఆహ్వానించటానికి వచ్చాడన్నమాట. ఎప్పుడు బయలుదేరుతున్నావు?

So, he came to invite his son-in-law. When are you leaving (for your place)?

సుబ్బా : ఎల్లుండి సాయంత్రం ఎనిమిదింటికి పోదాం అనుకుంటున్నాను.

I think of going day after tomorrow evening at 8 o'clock.

శర్మ : సాయంత్రం హైదరాబాదు పోయే బస్సులు లేవుగదా!

There are no buses to go to Hyderabad in the evenings!

సుబ్బా : మన ఊరినించి బయల్దేరే బస్సులు లేవు. విజయవాడనించి వచ్చే బస్సు ఒకటి హైదరాబాదు పోతుంది.

There are no buses from our town. One bus arriving from Vijayawada goes to Hyderabad.

శర్మ : అయితే త్వరలో అత్తగారింటికి వెళ్ళబోతున్నావన్నమాట। మరి నువ్వు చేస్తావు అనుకున్న పని అయ్యే అవకాశం లేదు.

So, you are going shortly to your mother-in-law's house. Therefore, there is no chance of completing the work we thought that you could do (for us).

సుబ్బా : నాలుగు రోజుల్లో వస్తాను గదా। దిగులు పడకండి. ఇంతలో మీరు చెప్పిన వాళ్ళందరితో మాట్లాడండి. గోపి యిచ్చిన అడ్రసులకు ఉత్తరాలు రాయండి.

I will be back in four days, you see. Don't worry. In the meantime you speak to all those people whom you referred to. Write letters to the addresses given by Gopi.

రవి : అలాగే। నువ్వు వెళ్ళేది హైదరాబాదుగదా। ఆ ఆఫీసర్ని అక్కడే కలిస్తే బాగుంటుంది అనుకుంటాను. అతను తీసుకునే నిర్ణయం మనకు అనుకూలంగా ఉంటే మన పని జరుగుతుంది. పోయిన సంవత్సరం అతను హైదరాబాదులో లేడు.

Okay! You are going only to Hyderabad. Aren't you? I think it is better if you meet that officer there only. If the decision he takes is favourable to us, our task will be accomplished. He was not there in Hyderabad last year.

సుబ్బా : అలాగే కలుస్తాను అతను పని చేసే ఆఫీసులోనే మా బావమరిది కూడా పని చేసేది. అతను ఉండే యిల్లు గూడా మా మామగారింటికి ఎదురు గానే।

Okay! I will meet him. The office he is working in is the one in which my brother-in-law is also employed. The house he lives in is across the street from my father-in-law's.

శర్మ : అలా అయితే మనకు దిగులు లేదు. ఈ సంవత్సరం మన పని జరిగే అవకాశం ఉందన్నమాట।

If so, we need not get distressed at all. We have chances of getting our work done this year.

రవి : ఈ పని అయితే మనం పడ్డ కష్టాలన్నీ తీర్తాయి.

If this work is done, we will be out of troubles. (Our troubles will be solved.)

## DRILLS

**a. Repetition drill.**

రవి పెట్టుకున్న కళ్లజోడు నాది.
శర్మ పెట్టుకుంటున్న కళ్ళజోడు నీది.
మీరు పెట్టుకునే కళ్ళజోడు అతనిది.

నిన్న పోయిన బస్సు కొత్తది.
రేపు పోయే బస్సు ఎవరిది ?

ఇది అయ్యే పని కాదు.
నిన్న అయిన పని యివ్వాళ చెయ్యకు.

నువ్వు ఉండే ఇల్లు ఎక్కడ ?
నీ దగ్గర ఉన్న కలం నాకివ్వు.

నిన్న తెచ్చిన పుస్తకం నాది.
రేపు నువ్వు తెచ్చే పుస్తకాలు నాకివ్వు.
నువ్వు ఇచ్చిన పుస్తకాలు నా దగ్గర లేవు.
నేను నీకు ఇచ్చే డబ్బు శర్మకు ఇవ్వు.

నిన్న ఇక్కడికి వచ్చింది శర్మ.
మొన్న ఈ పాఠం చదివింది నేను.
రేపు మాట్లాడేది ఉమ.
నేను ఉండేది సరస్వతీపురంలో.
అక్కడ పాట పాడుతున్నది ఎవరు ?

ఇప్పుడు నేను మాట్లాడబోతున్నాను.
అతను పూలు కొయ్యబోతున్నాడు.




నువ్వెంత పెద్దవాడివో నేనంత చిన్నవాణ్ణి.
మీ ఊరికి మా ఊరెంత దూరమో మా ఊరికి మీ ఊరంత దూరం.

ఈ పని నేను చేస్తానుగాని నువ్వు దిగులు పడకు.

శర్మను నేనడుగుతానుగాని నువ్వు మాట్లాడకు.

**b. Substitution drill.**

**Model (i) :**

రవి అడిగిన పుస్తకం ఏది ?
ఇవ్వు
రవి యిచ్చిన పుస్తకం ఏది ?
కొను
చెప్పు
తీసుకో
తీసుకురా
చదువు

**Model (ii) :**

నువ్వు రాసే ఉత్తరం ఎవరిది ?
చదువు
చూడు
పంపించు
తీసుకో
ఇవ్వు
తే

**c. Response drill.**

**Model (i) :**

శర్మ లావుగా ఉంటాడా ? (రవి)
రవి ఎంత లావుగా ఉంటాడో శర్మ అంత లావుగా ఉంటాడు.

1. శ్రీధర్ మంచివాడా ? (సరళ)
2. లక్ష్మి మంచిదా ? (రామారావు)
3. శారద సన్నంగా ఉంటుందా ? (సరోజ)

**Model (ii) :**

గోపి చెడ్డవాడా ? (రవి–మంచి)
రవి ఎంత మంచివాడో గోపి అంత చెడ్డవాడు.

1. ఆ పువ్వు ఎర్రదా ? (ఈ పువ్వు–తెల్ల)
2. శ్యామల సన్నంగా ఉంటుందా? (శర్మ–లావు)
3. నీ పుస్తకం పెద్దదా ? (రవి పుస్తకం–చిన్న)

**Model (iii) :**

గోపీ : నువ్వు తొందరగా ఇంటికి వెళ్ళు.
ఇప్పుడే నేను ఇంటికి వెళ్ళబోతున్నాను.

1. మీరు తొందరగా అన్నం తినండి.
2. లక్ష్మి : పూలు కొయ్యి.
3. మీరు కమలతో మాట్లాడండి.
4. లక్ష్మికి ఒక ఉంగరం ఇవ్వు.

**Model (iv) :**

శర్మా : ఇదుగో నా ఉంగరం.
నీ ఉంగరాన్ని అందరూ చూశారుగాని లోపల పెట్టు.

1. శ్రీధర్ : ఇదుగో నా కొత్త చొక్కా.
2. సరళా : చూడు, ఇది నా కొత్త గడియారం.
3. ఇది రవి సైకిలు.

**d. Combination drill.**

**Model (i) :**

రవి పుస్తకం చదువుతున్నాడు.
అది తెలుగు పుస్తకం.
రవి చదువుతున్న పుస్తకం తెలుగు పుస్తకం.

1. శర్మ సినిమా చూస్తున్నాడు.
   అది కొత్తది కాదు.
2. నేను బల్లలు తుడుస్తున్నాను.
   వాటిమీద దుమ్మున్నది.
3. రవి కాయలు కోస్తున్నాడు.
   అవి మామిడి కాయలు.

**Model (ii) :**

నేను ఒక సినిమా చూశాను.
అది తెలుగు సినిమా.
నేను చూసిన సినిమా తెలుగు సినిమా.

1. సీత ఒక ఆట ఆడింది.
   అది ఏమిటో నాకు తెలియదు.
2. నేను ఒక కలం కొన్నాను.
   అది చాలా బాగా రాస్తున్నది.
3. మొన్న నువ్వు ఒక మనిషిని కొట్టావు.
   అతను ఎవరు ?
4. అతనికి నేనొక ఉంగరం ఇచ్చాను.
   అది కొత్తది.

**Model (iii) :**

రేపు ఇక్కడికి ఒక అబ్బాయి వస్తాడు.
అతను శర్మ స్నేహితుడు.
రేపు ఇక్కడికి వచ్చే అబ్బాయి శర్మ స్నేహితుడు.

1. నేను ఒక పుస్తకం చదువుతాను.
   దాని పేరు నీకు చెప్పను.
2. రమ ఒక బస్సు ఎక్కుతుంది.
   ఆ బస్సులోనే నువ్వు గూడా ఎక్కు.
3. కమల విమలకు ఉత్తరం రాస్తుంది.
   అది నువ్వు చదవకు.
4. లక్ష్మి గది ఊడుస్తుంది.
   ఆ గదిలో మీరు కూర్చోండి.
5. నేను రోజూ ఒక కుర్చీలో కూర్చుంటాను.
   ఆ కుర్చీ తీసుకురా !

**e. Transformation drill.**

**Model (i) :**

ఇక్కడికి వచ్చిన మనిషి ఎవరు ?
ఇక్కడికి వచ్చింది ఎవరు ?

1. నిన్న సీతతో మాట్లాడుతున్న మనిషి శర్మేనా ?
2. రేపు మన ఇంటికి వచ్చే మనిషి ఎవరు ?
3. సీతతో ఈ విషయం చెప్పిన మనిషి ఎవరు ?

**Model (ii) :**

వార్తలు చక్రధరరావు చదువుతున్నారు.
వార్తలు చదువుతున్నది చక్రధరరావు.

1. రమతో రవి మాట్లాడారు.
2. రేపు ఇక్కడికి శ్రీధర్ వస్తాడు.
3. ఇప్పుడు నేను మాట్లాడుతున్నాను.

**Model (iii) :**

రేపు ఇక్కడికి లక్ష్మి వస్తుంది.
రేపు ఇక్కడికి వచ్చేది లక్ష్మి.

1. నిన్న నాతో సరళ మాట్లాడింది.
2. ఇప్పుడు శ్యామల పాఠం చెప్తున్నది.
3. రేపు రమ పాట పాడుతుంది.

**Model (iv) :**

రవి చదువుతున్న పుస్తకం మంచిది కాదు.

a. రవి చదివిన పుస్తకం మంచిది కాదు.

b. రవి చదివే పుస్తకం మంచిది కాదు.

1. నేను తాగబోతున్న కాఫీ వేడిగా ఉంది.
   a. ......................
   b. ..................

2. రవి పిలుస్తున్న అబ్బాయి మీ తమ్ముడా ?
   a. ..................
   b. ......................

3. నువ్వు ఉంటున్న ఇల్లు అద్దె ఇల్లా ?
   a. ..................
   b. ......................

4. శర్మ కొంటున్న గడియారం కొత్తది కాదు.
   a. ..................
   b. ......................

5. నువ్వు తెస్తున్న ఉంగరం ఎవరికి ?
   a.
   b.

## EXERCISES

a. Fill up the blanks with past adjectival participles of the verbs given in the parentheses.

రవి........(చెప్పు) పాఠం.
రవి చెప్పిన పాఠం.

1. శర్మ ...... (తీసుకో) పుస్తకం ఎవరిది ?
2. నువ్వు ........ (ఉండు) ఇల్లు ఎక్కడ ?
3. గౌరి ........ (చదువు) పుస్తకం ఎవరి దగ్గరుంది ?
4. కమల ........ (తుడుచ్) బల్ల ఎవరిది ?
5. ఇక్కడికి ........ (రా) బస్సు ఏ ఊరు వెళ్తుంది ?
6. ఈ పరీక్షలో ........ (పాసుకా) వాళ్ళు ఎంతమంది ?

**b. Rewrite the six sentences given in exercise a. using the future adjectival participles of the verbs given in the parentheses.**

**Model :**

రవి ........ (చెప్పు) పాఠం.
రవి చెప్పే పాఠం.

**c. Rewrite the following sentences as shown in the model.**

**Model (i) :**

మీ తమ్ముడి పెళ్ళికి ఎంతమంది వచ్చారో వాళ్ళందరూ నాకు తెలుసు.
మీ తమ్ముడి పెళ్ళికి వచ్చిన వాళ్ళందరూ నాకు తెలుసు.

1. శర్మ దగ్గర ఎన్ని కలాలున్నాయో అవి అన్నీ కొత్తవి.
2. రేపు ఎంతమంది వస్తారో వాళ్ళందరూ మన స్నేహితులే।
3. ఇప్పుడు నువ్వు ఎన్ని పుస్తకాలు తీసుకున్నావో అవి అన్నీ తెలుగు పుస్తకాలేనా?
4. రవి ఎంత మందితో మాట్లాడాడో వాళ్ళందరూ అతని స్నేహితులు కారు.
5. శారద ఎన్ని చపాతీలు చేస్తుందో అవి అన్నీ నేనే తింటాను.

**Model (ii) :**

(a) శర్మ ఇవ్వాళ ఊరికి వెళ్తున్న విషయం ఎవరికీ తెలియదు.
శర్మ ఇవ్వాళ ఊరికి వెళ్తున్నది ఎవరికీ తెలియదు.

(b) రేపు లక్ష్మి మాట్లాడ్తుంది.
రేపు మాట్లాడేది లక్ష్మి.

1. రేపు గుంటూరునించి వచ్చే మనిషి శ్రీధర్.
2. ఇప్పుడు నాతో మాట్లాడుతున్న మనిషి రమ.
3. వార్తలు శర్మ చదువుతున్నాడు.
4. ఉంగరం కమల కొంటుంది.
5. ఈ కలాన్ని శర్మ ఇస్తాడు.

**Model (iii) :**

శర్మ లావు. కమల సన్నం.
అవును. శర్మ ఎంత లావో కమల అంత సన్నం.

1. ఈ పుస్తకం కొత్తది. ఆ పుస్తకం పాతది.
2. లక్ష్మి మంచిది. సుబ్బారావు చెడ్డవాడు.
3. నివేదిత పెద్దది. లత చిన్నది.
4. విజయవాడలో వేడిగా ఉంటుంది. మైసూరులో చల్లగా ఉంటుంది.

d. Answer the following questions as shown in the model.

Model:

కమల వచ్చిందా?

కమల రాలేదుగాని నువ్వు రా.

1. శ్యామల అన్నం తిన్నదా?
2. రమ పూలు కోస్తుందా?
3. సరోజ పూలు కొంటుందా?
4. గోపి ఉంగరం పెట్టుకుంటున్నాడా?
5. పాప పాఠం చదువుతున్నదా?

## VOCABULARY

| | |
|---|---|
| ముసలి | aged, old (adj.) |
| లావు | stout |
| సన్నం | thin; lean (n.) |
| వయస్సు | age |
| వార్త | news |
| ట్రాన్సిస్టరు | transistor radio |
| కట్టెయ్యి | put off; tune down |
| మామగారు | father-in-law |
| సరాసరి | straight |
| క్లబ్బు | club (n.) |
| విశేషం | speciality |
| మరదలు | wife's younger sister |
| పెళ్ళి | marriage |
| ఉంగరం | ring (n.) |
| అల్లుడు | son-in-law |
| ఆహ్వానించు | invite |
| త్వరలో | soon; in near future |
| అత్తగారు | mother-in-law |
| దిగులుపడు | worry (v. intr.) |
| ఇంతలో | in the meantime |
| ఆఫీసరు | officer |
| నిర్ణయం | decision |
| అనుకూలం | favourable |
| బావమరిది | wife's younger brother |
| ఎదురు | opposite |
| దిగులు | worry (n.) |
| టెలిఫోన్ | telephone |

## GRAMMAR NOTES

75.1. In this lesson the past adjectival participles are introduced.

–ఇన/–అ/–యిన is added to the base to form past adjectival participle.

75.1.1. –అ occurs after అను group of verbs (49.1; 50.1) and పడు (i.e., the verbs which take –అ/–అ as past tense suffix 66.5.; 71.3.).

These bases behave in the same way as they do before the past tense suffix (66.5.; 71.3.) when the past adjectival participle suffix –అ follows. (For easy recognition, you may recall the past neuter singular forms of these bases, which are ఉన్నది, తీసుకున్నది, నిల్చున్నది, పడ్డది etc., and delete final ది. Then you will get the past adjectival participle forms అన్న, తీసుకున్న, నిల్చున్న, పడ్డ etc.)

| | | |
|---|---|---|
| అను + అ → అన్న్ + అ → అన్న | (66.5.) | 'that who told' |
| విను + అ → విన్న్ + అ → విన్న | (66.5.) | 'that who heard' |
| తీసుకో + అ → తీసుకున్న్ + అ → తీసుకున్న | (66.5.) | 'that who took' |
| నిల్చో + అ → నిల్చున్న్ + అ → నిల్చున్న | (66.5.) | 'that who stood' |
| కూర్చో + అ → కూర్చున్న్ + అ → కూర్చున్న | (66.5.) | 'that who sat' |
| ఉండు + అ → ఉన్న్ + అ → ఉన్న | 66.5.) | 'that who stayed, that which somebody stayed in '* |
| పడు + అ → పడ్డ్ + అ → పడ్డ | (71.3.) | 'that who fell' |

75.1.2. –యిన occurs after the verb పో 'go'.

పో–యిన → పోయిన  'that who has gone'

75.1.3. –ఇన occurs with other bases.

| | |
|---|---|
| పిలుచ్ + ఇన → పిలిచిన | 'that who called/who was called' (67.3.) |
| తడుస్ + ఇన → తడిసిన | 'that who got drenched' (67.3.) |
| కా + ఇన → అయ్–ఇన → అయిన | 'that which/who became' (70.2.1.) |
| తే + ఇన → తెచ్చ్–ఇన → తెచ్చిన | 'that which was brought/who brought' (69.4.1.) |
| చూడు + ఇన → చూస్–ఇన → చూసిన | 'that which was seen/who saw' (66.4.) |
| రాయు + ఇన → రాస్–ఇన → రాసిన | 'that which was written/who wrote' (66.3.) |

75.2. Future/habitual/non-past adjectival participles are also introduced in this lesson. –ఏ/–యే is added to the verbal bases to form future/habitual adjectival participles.

75.2.1. –యే occurs with the verbs పో and కా (కా becomes అయ్ before యే 70.2.1.).

| | |
|---|---|
| పో + యే → పోయే | 'that who will go' |
| కా + యే → అయ్ + యే → అయ్యే | 'that which/who will become' (70.2.1.) |

75.2.2. –ఏ occurs after the other verbal bases. When ఏ follows, the verbal bases except ఓ ending bases (other than పో) undergo all the changes that they do before a suffix beginning with ఇ or ఎ.

* Remember that the adjectival participles express many case relationships. (55.3.1.)

| | |
|---|---|
| పిలుచ్ + ఏ → పిలిచే | 'that who will call' (67.3.) |
| కలుస్ + ఏ → కలిసే | 'that who will meet' (67.3.) |
| చూడు + ఏ → చూస్ + ఏ → చూసే | 'that who will see/which will be seen' (66.4.) |
| రాయు + ఏ → రాస్ + ఏ → రాసే | 'that who will write/which will be written' (66.3.) |
| తే + ఏ → తెచ్చ్ + ఏ → తెచ్చే | 'that who will bring/which will be brought' (69.4.1) |
| రా + ఏ → వచ్చ్ + ఏ → వచ్చే | 'that who/which will come' (66.4.) |
| తిను + ఏ → తినే | 'that who/which will eat/that which will be eaten' |
| ఉండు + ఏ → ఉండే | 'that who will stay/the place where some-one stays in' |

75.2.3. ఓ ending bases (except పో*) change the final ఓ to ఉన్ before -ఏ the adjectival participle marker.

| | |
|---|---|
| నిల్చో + ఏ → నిల్చున్ + ఏ → నిల్చునే | 'that who will stand' |
| కూర్చో + ఏ → కూర్చున్ + ఏ → కూర్చునే | 'that who will sit' |
| తీసుకో* + ఏ → తీసుకున్ + ఏ → తీసుకునే | 'that who will take/that which will be taken' |

75.3. Adjectival participle predicates are also used in this lesson.

The Adjectival participle predicate → The Adjectival participle + ది (for all person-gender-number nouns)

| | |
|---|---|
| *వచ్చిన-ది → వచ్చింది | 'that who came' |
| మాట్లాడుతున్నది | 'that who is speaking' |
| వెళ్ళేది | 'that who will go' |
| నిన్న ఇక్కడికి వచ్చింది ఎవరు? | 'Who is that who came here yesterday?' |
| ఇప్పుడు మాట్లాడుతున్నది నేను. | 'I am (the one) who is speaking now.' |
| రేపు వెళ్ళేది నువ్వు. | 'You are (the one) who will go tommorrow.' |

* In these adjectival participle predicate forms the sequence of న-ది is normally written and pronunced as -ంది. వచ్చినది → వచ్చింది ; అడిగినది → అడిగింది ; పాడినది → పాడింది etc.

75.4. గాని 'so, therefore' is a conjunction which conjoins two sentences when the first sentence is a cause or an incentive for the action indicated in the second sentence. In such constructions the second sentence will always contain an imperative-like request.

నీకు డబ్బులిస్తాను గాని నువ్వు తొందరగా వెళ్ళు.

'I will pay you money; you go quickly.'

శ్రీధర్ ఇప్పుడు వస్తాడుగాని నువ్విక్కడే ఉండు.

'Sreedhar will come now; you be here.'

75.5. Notice the use of the interrogative word ఎంత in constructions like:

అది ఎంత పెద్దదో ఇది అంత చిన్నది. 'That is so big as this is so small.'

(That is so big in contradiction to the smallness of the size of this.)

In this type of sentences ఓ is a conjuction as you have seen in 41.9.

75.6. Remember that కాదు is used to negate verbless sentences (7.1.). It is also shown that కాదు is used with all person-gender-number nouns without any concord. But it is also possible to use this form with concord in agreement with the person-gender-number of the subject. Then we get forms as below.

| | |
|---|---|
| నేను సుబ్బారావును కాను. | 'I am not Subbarao.' |
| మేం/మనం విద్యార్థులం కాం. | 'We are not students.' |
| నువ్వు విద్యార్థివి కావు. | 'You are not a student.' |
| మీరు/వాళ్ళు విద్యార్థులు కారు. | 'You/They are not students.' |
| అతను విద్యార్థి కాడు.<br>అతను/వాడు విద్యార్థి కాదు. | 'He is not a student.' |
| ఆమె విద్యార్థిని కాదు. | 'She is not a student.' |
| అవి కుక్కలు కావు. | 'They are not dogs.' |

కాదు, instead of కాను, కాం, కారు etc., can also be used in the above sentences.

75.7. Notice the use of the dative case suffix in the following sentence.

అతను తీసుకునే నిర్ణయం <u>మనకు</u> అనుకూలంగా ఉంటే మన పని జరుగుతుంది.

'If the decision which he will take is favourable to us, our work will be successful'

This sentence is a combination of two sentences which may be expressed as follows.

(i) అతను తీసుకునే నిర్ణయం మనకు అనుకూలంగా ఉంటుంది.

'The decision which he will take will be favourable to us.'

(ii) అలా అయితే మన పని జరుగుతుంది.

'If it is so our work will be successful.'

Remember that the verb ఉండు (existential verb) will take a locative or dative noun (30.8.), which can be seen in the sentence (i).

75.8. Notice the use of the compound base formed by the combination of infinitive (52.3.2.) + బో*

This construction functions as a verbal base and can be conjugated for all tenses and modes.

This base expresses the meaning 'going to or about to perform' the action of the verb used as infinitive.

| | |
|---|---|
| తిన_బోయాడు | 'He was about to eat.' |
| మాట్లాడ_బోతున్నాడు | 'He is going to speak.' |
| అడగ_బోతే | 'if someone is about to ask.' |

* బో the modified form of the verb పో, is used here as an auxiliary verb. The rules which are applicable to పో are also applicable to బో.

# UNIT 19

## Lesson 76

| | |
|---|---|
| గీత: సుగుణా! మన పని రేపు అయ్యేటట్లు చూడాలి. ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. మా నాన్నగారికి కోపం వస్తున్నది. | Suguna! We should see that our work is finished by tomorrow. It is already getting very late. My father is angry. |
| సుగుణ: అవును. చూడు వాన వచ్చేటట్లున్నది. ఆకాశం అంతా మబ్బులు పట్టాయి. మనం ఇంకా బస్సుస్టాండుకు చాలా దూరంలో ఉన్నాం. | Yes. Look! It looks as though it would rain now. There are dark clouds all over the sky. We are still very far from the bus stand. |
| గీత: లేదు సుగుణా! దగ్గరికే వచ్చాం. | No, Suguna! It is very near. |
| సుగుణ: ఏమిటి ఇక్కడ యింతమంది జనం ఉన్నారు? | Why is it that there are so many people here? |

| | |
|---|---|
| గీత : ఇక్కడ గూడా బస్సు ఆగుతుంది. మనం గూడా యిక్కడే ఉందాం. మీ స్నేహితురాళ్ళల్లో ఇవ్వాళ మీ ఇంటికి వస్తున్న వాళ్ళెవరు? రాని వాళ్ళెవరు? | The bus stops here also. We will also stay here. Who among your friends (fem.) are coming to your house to-day? and who are not coming? |
| సుగుణ : అందరూ వస్తున్నారు. చూడు, ఇక్కడ సుమారు వందమంది ఉన్నారు. అందరూ బస్సు కోసమే ఎదురు చూస్తున్నట్లున్నారు. | All are coming. Look here, there are about a hundred people. I am afraid all of them are waiting for the bus only. |
| గీత : అవును. | Yes. |
| సుగుణ : అంతమందికి బస్సులో చోటు ఉంటుందా? | Will there be room in the bus for so many? |
| గీత : ఆ! సిటీ బస్సు అంటే ఏమనుకుంటున్నావు? పుష్పకవిమానం! | Yes! What do you think of a city bus? Its capacity is unlimited; *Pushpaka Vimanam!* |
| సుగుణ : ఇక్కడ నిల్చుంటే మన పేటకు వెళ్ళే బస్సులేవో వెళ్ళని బస్సులేవో ఎట్లా కనుక్కోటం? | If we just stand here, how can we identify the buses going to our area from the other buses? |
| గీత : ఒకటే గుర్తు. ఆ చెట్టు దగ్గర ఆగిన బస్సు మనది; ఆగని బస్సు మనది కాదు. | There is only one indication. The bus stopping at that tree is for us and the bus not stopping there is not for us. |
| సుగుణ : అయితే మనం అక్కడ నిల్చోవాలన్న మాట. | Then, we have to stand there! |
| గీత : అవును పద. మనం ఆలస్యం చేసిన కొద్దీ జనం ఎక్కువ అవుతారు. | Yes. Let's go. The more we delay the more the people will be. |
| సుగుణ : నిన్న వచ్చినట్లు బస్సు టైముకు వస్తే మనం అరగంటలో ఇంటికి వెళ్తాం. | If the bus arrives on time as it did yesterday, we will reach home in half an hour. |
| గీత : అన్నీ మనం అనుకున్నట్లే జరుగుతాయా? | Do you think all the things will go as we plan? |

సుగుణ : టైం అయినకొద్దీ జనం ఎక్కువ అవుతున్నారు. — As the time passes, the number of people is getting larger.

గీత : పరవాలేదు. కొంతమంది ఆటోలలో వెళ్తున్నారు. — It doesn't matter. Some of them are going away in autorickshaws.

సుగుణ : వాళ్ళు వెళ్తున్నట్లు మనం గూడా ఆటోలో వెళ్దామా ? — Shall we also go in an autorickshaw like those people ?

గీత : అవసరం లేదు. మనకు బస్సులో చోటు దొరుకుతుంది. బస్సుకు టైం అయినట్లుంది. — Not necessary. We will have room in the bus. It is getting time for the bus to arrive.






## DRILLS

**a.** Repetition drill.

నిన్న వచ్చినవాళ్ళెవరు? రానివాళ్ళెవరు?

ఇప్పుడు చదువుతున్నవాళ్ళెవరు? చదవని వాళ్ళెవరు?

రేపు పూలు కోసేవాళ్ళెవరు? కొయ్యని వాళ్ళెవరు?

ఈ కలాలు ఇక్కడికి తెచ్చినవాళ్ళెవరు? తేనివాళ్ళెవరు?

ఇప్పుడు నాకు డబ్బులు ఇస్తున్నవాళ్ళెవరు? ఇవ్వనివాళ్ళెవరు?

ఇప్పుడు ఇక్కడ ఉన్నవాళ్ళెవరు? లేని వాళ్ళెవరు?

ఈ పరీక్షలో పాసుఅయ్యేవాళ్ళెవరు? కాని వాళ్ళెవరు?

శర్మ మాట్లాడినట్లు నువ్వు మాట్లాడు.
నేను రాస్తున్నట్లు నువ్వు రాస్తావా?

మన పని అయ్యేటట్లు చూడండి.
ఇవ్వాళ మురళి కాలేజీకి వచ్చేటట్లు చూడండి.

నిన్న శ్రీధర్ కలం కొన్నట్లున్నాడు.
ఇప్పుడు వాన వస్తున్నట్లుంది.
మాష్టరుగారు రేపు మనల్ని పాఠం అడిగేటట్లున్నారు.

పాడినకొద్దీ సంగీతం బాగా వస్తుంది.
టైం అయినకొద్దీ జనం ఎక్కువ అవుతారు.

**b. Substitution drill.**

**Model (i) :**

నిన్న ఉప్మా తిననివాళ్ళు ఇవ్వాళ తినండి.
చెయ్యి
నిన్న ఉప్మా చెయ్యనివాళ్ళు ఇవ్వాళ చెయ్యండి.

చూడు
తీసుకో
అడుగు

**Model (ii) :**

శర్మ చదివినట్లు చదువు!
మాట్లాడు
శర్మ మాట్లాడినట్లు మాట్లాడు!
చూడు

రాయి
ఇవ్వు
రా
చెయ్యి
నడుచ్

**c. Response drill.**

**Model (i) :**

తొందరగా మాట్లాడు.
ఎవరు మాట్లాడుతున్నట్లు మాట్లాడను?

1. కమలా! పాఠం చదువు.
2. పార్వతీ! పూలు కొయ్యి.
3. తొందరగా నడు.
4. అన్నం వడ్డించు.

**Model (ii) :**

ఆ గదిలో తెలుగువాళ్ళున్నారు; కన్నడం వాళ్ళున్నారు.
తెలుగు వాళ్ళెవరో కన్నడం వాళ్ళెవరో ఎట్లా కనుక్కోటం?

1. మన బస్సు, వాళ్ళ బస్సు అక్కడికే వస్తాయి.
2. ఈ బల్లమీద పంచదార వేసిన కాఫీ ఉంది; పంచదార వెయ్యని కాఫీ ఉంది.
3. అక్కడ రెండు రోడ్లున్నాయి. ఒక రోడ్డు గుంటూరు పోతుంది; ఇంకొక రోడ్డు అమరావతి పోతుంది.

**d. Transformation drill.**

**Model (i) :**

శర్మ రావాలి.
శర్మను వచ్చేటట్లు చెయ్యి!

1. లక్ష్మి చదవాలి.
2. శారద పాసుకావాలి.
3. ఈ బస్సు నడవాలి.

**Model (ii) :**

ఇక్కడ కూర్చున్నవాళ్లు ఎవరు?
ఇక్కడ కూర్చోనివాళ్ళు ఎవరు?

1. నా పుస్తకం తీసుకున్నవాళ్ళెవరు?
2. శారదతో మాట్లాడినవాళ్ళెవరు?
3. ఉత్తరం రాసినవాళ్ళెవరు?

**Model (iii) :**

తెలుగు చదువుతున్నవాళ్లు వీళ్లు.

తెలుగు చదవనివాళ్లు వీళ్లు.

1. వానలో తడుస్తున్నవాళ్లు ఆరుగురు.
2. బ్రెడ్డు కాలుస్తున్నవాళ్లు అక్కడున్నారు.
3. నా ఉంగరం తీసుకోస్తున్నవాళ్లు ఎవరు?

**Model (iv) :**

ఎల్లుండి గుంటూరు వెళ్లేవాళ్లు లేరు.

ఎల్లుండి గుంటూరు వెళ్లనివాళ్లు లేరు.

1. పాసుఅయ్యేవాళ్లెంతమంది?
2. రేపు వచ్చేవాళ్లు లేరు.
3. ఎల్లుండి ఉంగరం తెచ్చేవాళ్లు లేరు.
4. నీకు మంచినీళ్లు ఇచ్చేవాళ్లు లేరు.
5. మీ ఇంటికి పోయేవాళ్లు ఎవరు?

**Model (v) :**

ఈ కాఫీ ఎంత తాగితే అంత బాగుంటుంది.

ఈ కాఫీ తాగినకొద్దీ బాగుంటుంది.

1. శ్రీధర్ ఎంత మాట్లాడితే అంత బాగుంటుంది.
2. ఎంత నడిస్తే అంత దూరం ఎక్కువ అయినట్లు కనిపిస్తుంది.
3. ఎంత బాగా పని చేస్తే అంత పైకి వచ్చే అవకాశం ఎక్కువగా ఉంటుంది.

## EXERCISES

a. Fill up the blanks with the verbs suggested in the parentheses as shown in the model.

**Model (i) :**

నేను...... (చదువు) పుస్తకం లేదు.

నేను చదవని పుస్తకం లేదు.

1. నిన్న...........(రా) విద్యార్థులు ఇవ్వాళ వస్తున్నారు.
2. ఈ సంవత్సరం ...... (పాసుకా) వాళ్లు తక్కువ.
3. నువ్వు ......... (పిలుచ్) వాళ్లను నేను పిలుస్తాను.
4. శర్మ ...... (తీర్చు) బాకీలు రవి తీర్చాడు.

**Model (ii) :**

నువ్వు.......(ఆడు) నేను ఆడుతున్నాను.

నువ్వు ఆడినట్లు నేను ఆడుతున్నాను.

1. సరళ......(రాయు) ఎవరు రాస్తారు?
2. రవి.......(నడుచ్) నేను గూడా నడుస్తాను.
3. శర్మ.......(పాసుకా) నాకు తెలుసు.

b. Give your responses to the following sentences as shown in the model.

Model:

నేను బాగా నడుస్తాను.

ఎవరు నడుస్తున్నట్లు ?

1. శర్మ బాగా పాడ్తాడు.
2. వాణి బాగా కాఫీ చేస్తుంది.
3. నువ్వు పరిగెత్తుతావా ?

c. Answer the following questions as shown in the model.

Model (i):

ఈ కాడను ఏం చెయ్యమంటారు ? (బాగా-పనిచెయ్యి)

బాగా పనిచేసేటట్లు చెయ్యండి.

1. శర్మ ఎలా నిల్చోవాలి? (అందరికీ-కనిపించు)
2. నన్ను ఎట్లా మాట్లాడమంటారు ? (అందరికీ-వినిపించు)
3. కాఫీని ఎలా చెయ్యమంటారు ? (అందరూ-తాగు)

Model (ii):

ఏమిటి, ఏదో పాట వినిపిస్తున్నది ? (శర్మ-పాడు)

అవును. శర్మ పాడుతున్నట్లున్నాడు.

1. ఏమిటి, అక్కడ జనం గుమిగూడుతున్నారు ? (ఏదో వింత-జరుగు)
2. ఏమిటి, జనం పరిగెత్తుతున్నారు? (రైలు-రా)
3. ఏమిటి, రైలు ఆగింది ? (జనం-దిగు)

Model (iii):

నిన్న శ్రీధర్ వచ్చాడా ?

నాకు తెలియదు. వచ్చినట్లున్నాడు.

1. మీ ఊళ్లో నిన్న వాన కురిసిందా ?
2. కమల నిన్న మినపట్టు చేసిందా ?
3. భారతి పాసుఅయిందా ?

Model (iv):

శర్మ ఇప్పుడు నలుగుర్ని పంపిస్తాడా ? (ఇద్దరు)

పంపించడు. ఇద్దర్నే పంపించేటట్లున్నాడు.

1. లక్ష్మి ప్రిన్సిపాల్ అవుతుందా ? (వైస్-ప్రిన్సిపాల్)
2. కమల రెండు రూపాయలు ఇస్తుందా ? (ఒక రూపాయి)
3. శ్రీధర్ పది పుస్తకాలు తెస్తాడా ? (మూడు పుస్తకాలు)

**Model (v) :**

నిన్న నువ్వు మాట్లాడావా ?
ఆ : నేను మాట్లాడినకొద్దీ అతనికి కోపం ఎక్కువ అయింది.

1. నిన్న నువ్వు డబ్బులు అడిగావా ?
2. నిన్న నువ్వు పాటలు పాడావా ?
3. నువ్వు ఉత్తరాలు రాశావా ?

## VOCABULARY

| | |
|---|---|
| కోపం | anger |
| ఆకాశం | sky |
| మబ్బు | cloud (n.) |
| పట్టు | ovarcast |
| ఇంతమంది | these many people |
| ఎదురుచూడు | await |
| అంతమంది | those many people |
| చోటు | space (n.) |
| సిటీబస్సు | city bus |
| పుష్పక విమానం | mysterious aircraft of Ravana, in Ramayana, which can carry any number of people. |
| కనుక్కో- | identify |
| గుర్తు | symbol; identification |
| కొంతమంది | some people |
| అవసరం | need; necessity |
| బిల్డింగు | building |
| పోర్షను | porton of a house to let out ; a tenement |
| బోర్డు | board (n.) |
| ఫుట్‌బాల్ | foot-ball |
| కల | dream (n.) |

## GRAMMAR NOTES

76.1. In this lesson the manner adverbs derived from verb are introduced. These adverbs can express tense also. They are formed by adding -అట్లు to the adjectival participle (55.3.; 75.1.; 75.2.). The tense of these adverbs is decided by the tense of the adjectival participle form to which అట్లు is added.

| | |
|---|---|
| అడిగిన + అట్లు—అడిగినట్లు | 'as someone asked' (41.6) |
| అడుగుతున్న + అట్లు—అడుగుతున్నట్లు | 'as someone is asking' (41.6) |
| అడిగే + అట్లు—అడిగేటట్లు | 'as someone will ask' (76.2) |

76.2. An augment ట్ comes in between the adjectival participle ending in ఏ (non-past/future/habitual adjectival participle 75.2.) and a suffix/particle beginning with అ.

అడిగే + అట్లు—అడిగే-ట్-అట్లు—అడిగేటట్లు 'as someone will ask'

**76.3.** **The usage of the manner adverbs mentioned in 76.1. is as follows.**

**76.3.1.** **The manner adverbs can be used as modifiers of the main verb.**

నువ్వు మాట్లాడినట్లు నేను మాట్లాడ్తాను. 'I will speak like you.'

నువ్వు మాట్లాడుతున్నట్లు నేను మాట్లాడ్తాను. 'I will speak like you.'

**76.3.2.** **The manner adverbs can be used to express supposition, when an ఉండు verb form is added to them.**

కమల నిన్న వచ్చినట్లున్నది.
(వచ్చినట్లు + ఉన్నది) 'It seems Kamala came yesterday.'

ఆ గదిలో శర్మ ఎవరితోనో మాట్లాడుతున్నట్లున్నాడు. 'It seems Sarma is speaking to somebody in that room.'

*ఇవ్వాళ వాన వచ్చేటట్లున్నది. 'It seems that it will rain today.'

**76.3.3.** Notice the use of the manner adverbs of future tense in the following type of sentences.

శర్మను అన్నం తినేటట్లు చెయ్యి. 'Make Sarma take food.'

మన పని జరిగేటట్లు చూడండి. 'Please see that our work is attended to.'

**76.4.** The human demonstrative count pronouns ఇంతమంది 'these many people' అంతమంది 'so many people, those many people' are also introduced in this lesson. The corresponding human indefinite count pronoun, కొంతమంది 'some people' is also used in this lesson. The corresponding human interrogative count pronoun is ఎంతమంది (12.3). These forms can be used as pronouns as well as adjectives.

అక్కడ అంతమంది విద్యార్థులున్నారా ?
అక్కడ విద్యార్థులు అంతమంది ఉన్నారా ? } 'Are there somany students ?'

All the count and mass pronouns (also they function like adjectives as mentioned above) are given hereunder.

* The future tense forms in such expressions do not seem to express habitual notion. For habitual notion in such expressions present tense forms are used.

అతను రోజూ కాఫీ తాగుతున్నట్లున్నది.

These expressions will not denote future notion, as the habitual forms normally do.

| | | Count | | Mass |
|---|---|---|---|---|
| | | Human | Neuter | |
| Interrogative | | ఎంతమంది | ఎన్ని | ఎంత |
| Demonstrative | Remote | అంతమంది | అన్ని | అంత |
| | Proximate | ఇంతమంది | ఇన్ని | ఇంత |
| Indefinite | | కొంతమంది | కొన్ని | కొంత |

76.5. In this lesson the negative adjectival participles are also introduced. Notice that there is no tense distinction in the negative adjectival participle.

నిన్న వచ్చినవాళ్ళు × నిన్న రానివాళ్ళు

ఇప్పుడు వస్తున్నవాళ్ళు × ఇప్పుడు రానివాళ్ళు

రేపు వచ్చేవాళ్ళు × రేపు రానివాళ్ళు

76.5.1. -అని is added to the verbal base to form negative adjectival participle

| | |
|---|---|
| వెళ్ళు + అని → వెళ్ళని | 'that who does/did/will not go' (41.6.) |
| తిను + అని → తినని | 'that who does/did/will not eat' (41.6.) |
| రా + అని → రాని | 'that who does/did/will not come' (41.7.) |
| చెయ్యి + అని → చెయ్యని | 'that who does/did/will not do' (41.6.) |
| తీసుకో + అని → తీసుకోని | 'that who does/did/will not take' (41.7.) |

76.5.2. The adjectival participles in Telugu are presented here in a tabular way.




76.6. Notice the use of the past adjectival participle together with కొద్దీ in sentences like

| | |
|---|---|
| నువ్వు తిట్టినకొద్దీ శర్మకు కోపం వస్తుంది. | 'As you go on scolding, Sarma gets angry.' |

76.7. Notice the use of the verbal noun (gerund) with ఎట్లా in sentences like

| | |
|---|---|
| ఇప్పుడు మనం ఎట్లా వెళ్ళటం ? | 'How can we go now ?/How to go now ?' |
| రేపు సుబ్బారావును ఎట్లా పిలవటం ? | 'How to call subbarao tomorrow ?' |

# UNIT 19

## Lesson 77

### తుది పలుకు

"దయచేసి త్వరగా రండి. ఏదో బాగా లేదు."

ఇవి పాత కాంగ్రెసు నాయకుడు శ్రీకామరాజ్ చివరి సారిగా అన్న మాటలు. గుండెపోటు రావటంతో శ్రీ కామరాజ్ తన ఆంతరంగిక వైద్యుడు డాక్టర్ జయరామ్‌తో ఈ మాటలు అన్నారు. చివరికి తన కారును కూడా డాక్టరు కోసం పంపారు. కాని లాభం లేకపోయింది. డాక్టర్ జయరామ్, డాక్టర్ శౌరిరాజన్ వచ్చేసరికి ఆయన కన్ను మూశారు.

(ఆంధ్రప్రభ, 3-10-1975)

### THE LAST WORD

"Please come soon. Something is wrong."

These are the last words uttered by the Old Congress leader Sri Kamaraj. As he had a heart attack, Sri Kamaraj spoke these few words to his personal physician Dr. Jayaram. His car was also sent for the doctor as the last attempt. But, there was no use. By the time Dr. Jayaram and Dr. Shourirajan arrived, he left this world.




## DRILLS

**a. Repetition drill.**

నువ్వు అలా మాట్లాడటంతో శర్మకు కోపం వచ్చింది.

పోయిన సంవత్సరం పరీక్షలో మంచి మార్కులు రావటంతో రవి ఈ సంవత్సరం బాగా చదవలేదు.

నువ్వు అన్నం తినేసరికి నేను ఈ పని పూర్తి చేస్తాను.

పోలీసులు వచ్చేసరికి దొంగలు పారిపోయారు.

నేను ఎన్నో సార్లు అడిగాను. కాని లాభం లేకపోయింది.

రావు ఎన్నో సార్లు పరీక్ష రాశాడు. కాని లాభం లేకపోయింది.

**b. Substitution drill.**

**Model (i) :**

రమ మాట్లాడటంతో కమలకు కోపం వచ్చింది.

రా

రమ రావటంతో కమలకు కోపం వచ్చింది.

కూర్చో

వెళ్ళు

అడుగు

**Model (ii) :**

నేను ఈ పుస్తకం చదివేసరికి నువ్వు ఆ పుస్తకం చదువు.

మినపట్టు తిను

నేను ఈ మినపట్టు తినేసరికి నువ్వు ఆ మినపట్టు తిను.

పాఠం రాయి

పాట పాడు

కంచం కడుగు

c. Conversation drill.

రమ : లక్ష్మికి ఎందుకు కోపం వచ్చింది?
ఉమ : నేను తిట్టాను.
రమ : అయితే నువ్వు తిట్టటంతో కమలకు కోపం వచ్చిందన్నమాట.

1. రమ : ఇక్కడ్నించి నివేదిత ఎందుకు వెళ్ళింది?
   ఉమ : నేను వెళ్ళమన్నాను.
   రమ : ....................

2. రమ : డాక్టర్ని ఎందుకు పిలిచారు?
   ఉమ : ఇతనికి గుండెపోటు వచ్చింది.
   రమ : ...............

3. రమ : అందరూ అప్పుడే ఎందుకు లేచారు?
   ఉమ : అయిదుగంటలయింది.
   రమ : ...............

## EXERCISES

a. Answer the following questions as shown in the model.

Model (i) :

వాళ్ళు ఎప్పుడు నిద్రపోతారు? (నువ్వు–రా)
నువ్వు వచ్చేసరికి వాళ్ళు నిద్రపోతారు.

1. గోపి ఎప్పుడు అన్నం తింటాడు? (నీ పని–కా)
2. సుగుణ ఎప్పుడు పూలు కోస్తుంది? (సుశీల–వెళ్ళ)
3. కమల ఎప్పుడు ఇక్కడికి వస్తుంది? (పది గంటలు–కొట్టు)

Model (ii) :

సుగుణకు ఎందుకు కోపం వచ్చింది? (రవి–తిట్టు)
రవి తిట్టటంతో సుగుణకు కోపం వచ్చింది.

1. రైలు ఎందుకు అందలేదు? (ఆలస్యం–కా)
2. అందరూ ఎందుకు నిల్చున్నారు? (ప్రిన్సిపాల్–రా)
3. పద్మ ఎందుకు అన్నం తినలేదు? (సుగుణ–పోట్లాడు)

## VOCABULARY

| | |
|---|---|
| తుది | final |
| పలుకు | word, utterance |
| దయచేసి | please (adv.) |
| త్వరగా | quickly |
| నాయకుడు | leader (masc.) |
| గుండెపోటు | heart attack |
| అంతరంగిక | personal |
| వైద్యుడు | doctor (masc.) |
| కారు | car |

| | | | |
|---|---|---|---|
| లాభం | profit ; use (n.) | అందుచేత | because |
| నమస్తే | namaste! (salutation) | పర్మిషన్ | permission |
| ఎదురుకా | come in opposite direction; confront (v. intr.) | కోరు | request (v.) |
| | | ఫోనుచెయ్యి | phone (v.) |

**GRAMMAR NOTES**

77.1. In this lesson the use of instrumental case suffix_తో with gerund form of the verb (53.1.) is shown.

gerund + తో

రావటం_తో 'as someone/something came'

శర్మ నన్ను రమ్మనటంతో నేను వెళ్ళాను. 'As Sarma asked me to come, I went.'

పద్మ అట్లా మాట్లాడటంతో నాకు కోపం వచ్చింది. 'I became angry as Padma talked like that.'

This form of [gerund + తో] expresses some sort of cause. It is also indicated by this that the time gap between the cause and effect is almost nil.

77.2. A type of temporal destination is introduced in this lesson and it is formed by the combination of [future adjectival participle (75.2) + సరికి]

వచ్చేసరికి 'by the time someone comes'

తినేసరికి 'by the time someone eats'

77.3. Remember that లేదు (the negative of ఉన్నది) stands for non-future and it denotes present and past tenses (30.2.). When the past tense is to be specified లేకపోయింది is used.

అప్పుడు నాదగ్గర డబ్బు లేకపోయింది. 'Then there was no money with me.'

టైముకు వెళ్ళాను. కాని లాభం లేకపోయింది. 'I went on time. But there was no use.'

77.4. కన్ను మూశారు 'closed the eyes' is used to express the death of a great person. This is a stylistic expression and not used in normal speech context.

# UNIT 19

## Lesson 78

| | |
|---|---|
| సరోజ : సుగుణా ! నాకు ఒక బుట్ట అల్లుతావా ? | Suguna ! Can you make (knit) a basket for me ? |
| సుగుణ : ఎటువంటి బుట్ట ? | What type of basket ? |
| సరోజ : నీ దగ్గర ఉంది గదా ఒకటి ? పూసల బుట్ట. అటువంటిది. | You have one basket made of beads. That type. |
| సుగుణ : ఇదేనా ? | Is this the one ? |
| సరోజ : అవును. ఇదే. ఇటువంటి బుట్టే నాకు కూడా అల్లు ! పూసలు, వైరు కొంటాను. | Yes. This one only. You please make one basket of this type only. I will buy the wire and the beads. |

సుగుణ : అల్లటం నువ్వు గూడా నేర్చుకో! నాలుగు అల్లితే అదే వస్తుంది. నేను అల్లినన్ని బుట్టలు మన వాళ్ళల్లో ఎవరూ అల్లలేదనుకుంటాను.

You also learn how to knit. It is very easy. If you knit about four you would learn it (knitting) automatically. I think that no one among us knitted as many baskets as I did.

సరోజ : అవును. నువ్వు నేర్పు. నేర్చుకుంటాను.

Yes. You teach me. I will learn it.

సుగుణ : నేర్పటానికి ఏముంది? నేను అల్లుతున్నప్పుడు జాగ్రత్తగా చూడు.

What is it there to teach? You observe me carefully as I knit.

సరోజ : అలాగే! వైరు ఎంత కావాలి?

Okay! How much wire is required?

సుగుణ : ఆరు ఉండలు చాలు. వైరు కొనేటప్పుడు జాగ్రత్తగా చూడు. కిందటి సారి నేను సరళకు అల్లినప్పుడు అది మంచి వైరు తేలేదు. పైగా తక్కువ తెచ్చింది. కొట్టువాడు అడిగినంత ఇచ్చినట్లులేదు. దాన్ని బాగా మోసం చేశాడు.

Six balls are enough. Be careful while buying the wire. When I knitted last for Sarala she did not bring good quality wire. Added to that, she brought (the wire) less than the requirement. The shop-keeper might not have given her what was required. He deceived her completely.

సరోజ : అయితే, నువ్వు గూడా రా! కొందాం.

Then you also come with me. Let us buy it.

సుగుణ : ఇప్పుడు నీకు ఏ రంగు కావాలి?

What colour do you want?

సరోజ : పసుపుపచ్చ గాని నీలం గాని బాగుంటుంది.

It will be nice if it is yellow or blue.

సుగుణ : ఇప్పుడు ఆ రంగు వైర్లు దొరుకుతున్నట్లు లేదు. తెలుపు గాని నలుపు గాని బాగుంటుంది. నల్లవైరు చౌక గూడా. ఎరుపు గూడా బాగానే ఉంటుంది.

I am afraid the wire of that colour is not available now. It will be fine if it is white or black. The black wire is cheap also. The red will also be fine.

సరోజ : అలాగే, ఏదో ఒకటి తీసుకుందాం. రా!

All right! We will buy something or the other. Come on!

సుగుణ: ఇదుగో నా దగ్గర ఉన్న వైరు ఇది. దీన్ని కొలు. నువ్వు కొలిచేలోగా వస్తాను. వెళ్దాం.

See, the wire I have is this one. Measure this wire. By the time you measure, I will come back. We will go then.




## DRILLS

a. Repetition drill.

నేను చదివినన్ని పుస్తకాలు ఎవరూ చదవలేదు.
నేను చూసినన్ని సినిమాలు ఎవరూ చూడలేదు.
నేను చేసినంత పని ఎవరూ చెయ్యలేదు.
రవి నడిచినంత దూరం ఎవరూ నడవలేదు.
సుశీల ఈ బుట్ట అల్లినప్పుడు నేను ఊరికి వెళ్లాను.
సుశీల బుట్ట అల్లుతున్నప్పుడు నేను అక్కడే ఉన్నాను.
రవి పాట పాడేటప్పుడు నన్ను గూడా పిలవండి.
శర్మ నిన్న వచ్చినట్లు లేదు.
లక్ష్మి యిప్పుడు సరళతో మాట్లాడుతున్నట్లులేదు.
సాయంత్రం మన క్లాసు జరిగేటట్లులేదు.
కమల వచ్చేలోగా విమలను పాఠం రాయమనండి.
నువ్వు పాఠం చదివేలోగా నేను అన్నం తింటాను.

b. Build-up drill.

అనుకుంటాను.
అల్లలేదనుకుంటాను.
ఎవరూ అల్లలేదనుకుంటాను.
మనవాళ్లల్లో ఎవరూ అల్లలేదనుకుంటాను.
బుట్టలు మనవాళ్లల్లో ఎవరూ అల్లలేదనుకుంటాను.
అల్లినన్ని బుట్టలు మనవాళ్లల్లో ఎవరూ అల్లలేదనుకుంటాను.
నేనల్లినన్ని బుట్టలు మనవాళ్లల్లో ఎవరూ అల్లలేదనుకుంటాను.

విను.
జాగ్రత్తగా విను.
చెప్తున్నప్పుడు జాగ్రత్తగా విను.
పాఠం చెప్తున్నప్పుడు జాగ్రత్తగా విను.
మాష్టరుగారు పాఠం చెప్తున్నప్పుడు జాగ్రత్తగా విను.
క్లాసులో మాష్టరుగారు పాఠం చెప్తున్నప్పుడు జాగ్రత్తగా విను.

c. Substitution drill.

Model (i) :

కమల మాట్లాడినప్పుడు నాకు కోపం వచ్చింది.

అడుగు

కమల అడిగినప్పుడు నాకు కోపం వచ్చింది.

చూడు

రా

రాయి

Model (ii) :

నేను మాట్లాడుతున్నప్పుడు మీరు మాట్లాడకండి.

నిద్రపో

నేను నిద్రపోతున్నప్పుడు మీరు నిద్రపోకండి.

నడుచ్

రాయి

తిను

Model (iii) :

సినిమాకు వెళ్ళేటప్పుడు కళ్ళజోడు పెట్టుకోటం మంచిది. (పో)

సినిమాకు పోయేటప్పుడు కళ్ళజోడు పెట్టుకోటం మంచిది.

1. పాఠం చదివేటప్పుడు అటూ ఇటూ చూడటం మంచిది కాదు. (రాయి)
2. స్కూలుకు పోయేటప్పుడు పుస్తకాలు తీసుకోండి. (రా)
3. పుస్తకాలు చదివేటప్పుడు జాగ్రత్తగా చూడండి. (తీసుకో)

d. Expansion drill.

నేను వస్తాను. (నువ్వు-కొలుచ్)

నేను నువ్వు కొలిచేలోగా వస్తాను.

1. సుగుణ పాఠం చదువుతుంది. (రమ-రా)
2. కమల పాటలు పాడుతుంది. (వంట-కో).
3. నారాయణ బ్రెడ్డు కాలుస్తాడు. (కాఫీ-చెయ్యి)

**e. Response drill.**

Model (i) :

నేను ఎన్ని బుట్టలు తీసుకురాను? (రవి_అల్లు)
రవి అల్లినన్ని బుట్టలు తీసుకురా!

1. నేను ఎన్ని పుస్తకాలు కొనను? (మాష్టరుగారు_కొనమను)
2. రమ ఎన్ని పూలు కొయ్యాలి? (అరుణ_అడుగు)
3. అతను ఎన్ని ఉంగరాలు పెట్టుకుంటాడు? (నువ్వు_ఇవ్వు)

Model (ii) :

నేను ఎంత పంచదార యివ్వను? (అక్కడ_ఉండు)
నువ్వు అక్కడ ఉన్నంత పంచదార యివ్వు.

1. అతను ఎంతసేపు నిల్చోవాలి? (రవి_నిల్చోమను)
2. నువ్వు ఎంత ఉప్మా తింటావు? (ఆమె_తే)
3. కొట్టువాడికి ఎంత డబ్బివ్వాలి? (వాడు_అడుగు)

Model (iii) :

శర్మ వచ్చాడా?
శర్మ వచ్చినట్లు లేదు.

1. సరోజ అన్నం తిన్నదా?
2. పాప నిద్రపోయిందా?
3. శ్రీధర్ పాసయ్యాడా?

Model (iv) :

శర్మ వస్తున్నట్లున్నాడు గదూ!
ఇంకా శర్మ వస్తున్నట్లులేదు.

1. రమ పాట పాడుతున్నట్లుంది గదూ!
2. మోహన్ బయల్దేరుతున్నట్లున్నాడు గదూ!
3. సినిమాకు టిక్కెట్లిస్తున్నట్లున్నారు గదూ!

Model (v) :

ఇవ్వాళ వాన వస్తుందా?
ఇవ్వాళ వాన వచ్చేటట్లులేదు.

1. ఈ సంవత్సరం గోపి పాసవుతాడా?
2. ఆయన మనం ఇచ్చే పుస్తకం తీసుకుంటాడా?
3. రేపు శర్మ బల్లలు తుడుస్తాడా?
4. నేను చెప్పినట్లు రవి గోపిని కలుస్తాడా?
5. అతను మోసం చేస్తాడా?

**EXERCISES**

**a. Fill up the blanks with the verbs given in the parentheses in three ways as shown in the model.**

Model :

ఆ ఊరికి...(వెళ్ళు) నాకు శర్మ కనిపించాడు.

(a) ఆ ఊరికి వెళ్ళినప్పుడు నాకు శర్మ కనిపించాడు.
(b) ఆ ఊరికి వెళ్తున్నప్పుడు నాకు శర్మ కనిపించాడు.
(c) ఆ ఊరికి వెళ్ళేటప్పుడు నాకు శర్మ కనిపించాడు.

1. అటువంటి పాటలు...... (విను) నాకు చాలా బాగుంటుంది.
2. ఇటువంటి పనులు...... (చెయ్యి) శర్మకు కోపం వస్తుంది.
3. ఎటువంటి మనుషులను ........ (చూడు) నీకు కోపం వస్తుంది?
4. ఎటువంట కథలు........ (చదువు) రవికి నిద్ర వస్తుంది?

**b. Change the following sentences as shown in the model.**

**Model (i) :**

శర్మ వస్తున్నట్లున్నాడు.

శర్మ వస్తున్నట్లు లేడు.

1. ఇప్పుడు మన బస్సు వెళ్తున్నట్లున్నది.
2. ఇప్పుడు పసుపుపచ్చ రంగు దారం దొరుకుతున్నట్లున్నది.
3. కమల వానతో తడుస్తున్నట్లున్నది.

**Model (ii) :**

గోపాల్ వచ్చినట్లున్నాడు.

గోపాల్ వచ్చినట్లు లేడు.

1. ఈ ఊళ్ళో నిన్న వాన కురిసినట్లున్నది.
2. నా గదిలోనించి నా పుస్తకాలు రవి తీసుకుపోయినట్లున్నాడు.
3. మనందరికీ అన్నం వడ్డించినట్లున్నాడు.

Model (iii) :

సాయంత్రం వాన వచ్చేటట్లుంది.

సాయంత్రం వాన వచ్చేటట్లు లేదు.

1. ఈ ట్రాక్టరు నడిచేటట్లున్నదా ?
2. ఈ సంవత్సరం పదిమంది పాసయ్యేటట్లున్నారు.
3. సోమవారం అతను మన గడియారం తెచ్చేటట్లున్నాడు.

c. Fill up the blanks using the correct forms.

1. నేను......సినిమాలు నువ్వు చూశావా ? (చూసినంత/చూసినన్ని)
2. నేను........పని ఎవరూ చెయ్యలేదు. (చేసినంత/చేసినన్ని)
3. రవి...అన్నం పెట్టు (తిన్నంత/తిన్నన్ని)
4. శ్రీధర్......మామిడిపళ్ళు నువ్వు కూడా కొయ్యి. (కోసినంత/కోసినన్ని)
5. నువ్వు........పంచదార వెయ్యి. (అడిగినంత/అడిగినన్ని)
6. కమల ........ పుస్తకాలు నేను ఇస్తాను. (చదివినంత/చదివినన్ని)

**d. Answer the following questions as shown in the model.**

**Model :**

నువ్వు ఎప్పుడు వస్తావు ?

రవి వచ్చేలోగా వస్తాను.

1. శర్మ ఎప్పుడు చేస్తాడు ? (నువ్వు)
2. మన కాలేజీ ఎప్పుడు తెరుస్తారు ? (వాళ్ళ కాలేజీ)
3. ఆ పని ఎప్పుడు పూర్తిచేస్తారు ? (కమల)

e. **Identify the words which belong to similar semantic group.**

(Eg : గోడ, కిటికీ belong to similar semantic groue of *housing*)

| | | | |
|---|---|---|---|
| తెలుపు | పుస్తకం | బుట్ట | పసుపుపచ్చ |
| నలుపు | కాయితం | సంచీ | |

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| బుట్ట | basket | ఉండ | ball, coil |
| అల్లు | knit (v) | పైగా | moreover |
| ఎటువంటి | what kint of | మోసం | cheating |
| పూస | bead | నీలం | blue |
| అటువంటి | that kind of | చౌక | cheap |
| ఇటువంటి | this kind of | కొలుచ్ | measure (v.tr.) |
| వైరు | wire (n) | కరెంటు | electricity |
| నేర్చుకో | learn (v) | లడ్డు | laddu (a kind of sweet meat) |
| తేలిక | easy | కాజెయ్యి | snatch away ; steel (v) |
| నేర్పు | teach | అరటి | banana (adj.) |

## GRAMMAR NOTES

78.1. In this lesson the temporal forms are introduced. అప్పుడు is added to the adjectival participles to form the temporal. The tense of the adjectival participle will also be carried to the temporal forms.

Temporal → Adjectival participle + అప్పుడు

78.1.1. Past temporal → Past adjectival participle (75.1) + అప్పుడు

వచ్చిన + అప్పుడు → వచ్చినప్పుడు ‘when someone came.’ (41.6.)

78.1.2. Present/Pr ogressive temporal →

Present/Progressive adjectival participle (55.3) + అప్పుడు

వస్తున్న + అప్పుడు → వస్తున్నప్పుడు ‘while coming’ (41.6.)

78.1.3. Future temporal → Future adjectival participle (75.2) + అప్పుడు

వచ్చే + అప్పుడు → వచ్చేటప్పుడు (76.2) 'when someone will come/while coming'

The Future temporal also gives the Progressive temporal meaning.

78.2. The quantitative modifiers derived from verb are also introduced in this lesson.

అంత or అన్ని is added to a past adjectival participle (75.1.) to form quantitative modifier— అంత for mass quantity and అన్ని for count quantity.

| | |
|---|---|
| అడిగిన + అంత → అడిగినంత | 'as much as somebody asked/asks.' (41.6.) |
| అడిగిన + అన్ని → అడిగినన్ని | 'as many as somebody asked/asks.' (41.6.) |
| నా దగ్గర నువ్వు అడిగినంత పంచదార లేదు. | 'I don't have that much sugar which you asked for'. |
| నేను చూసినన్ని సినిమాలు ఎవరూ చూడలేదు. | 'Nobody saw so many movies that I saw.' |

78.3. Notice the use of the following forms in this lesson.

| | |
|---|---|
| ఇచ్చినట్లులేదు | 'It seems he did not give.' |
| దొరుకుతున్నట్లులేదు | 'It seems it is not available.' |

These forms are negatives of forms like

| | |
|---|---|
| ఇచ్చినట్లున్నాడు | 'It seems he gave.' |
| దొరుకుతున్నట్లున్నది | 'It seems it is available.' |

as introduced in lesson 76. (76.3.2.)

78.4. -లోగా is added to the future adjectival participle (75.2) to express the notion of 'in the meantime' and 'before'.

నువ్వు అన్నం తినేలోగా నేను వస్తాను. 'I will come before you finish eating.'

78.5. అటువంటి 'that sort of' (remote) ఇటువంటి 'this sort of' (proximate) and ఎటువంటి 'what sort of' (interrogative) are the adjectives of *kind*.

| | |
|---|---|
| ఇటువంటి మనిషిని నేను చూడలేదు. | 'I didn't see this type/sort of person.' |
| అటువంటి పుస్తకం ఎక్కడ దొరుకుతుంది ? | 'Where is that type of book available?' |
| నీకు ఎటువంటి ఉద్యోగం కావాలి ? | 'What kind/sort/type of job do you want?' |

# UNIT 20

## Lesson 79

| | |
|---|---|
| మాష్టరు : శర్మా! నిన్న అందరూ క్లాసుకు వచ్చారా? | Sarma! Did everyone (of you) attend the class yesterday? |
| శర్మ : రవి తప్ప అందరం వచ్చామండీ! | All of us came except Ravi, sir. |
| మాష్టరు : రవి ఎందుకు రాలేదు? | Why didn't Ravi come? |
| శర్మ : ఇన్‌స్టిట్యూటుకు వచ్చాడండీ. క్లాసుకు రాలేదు. లీవులేటర్ ఇచ్చి వెళ్లాడు. | He came to the Institute, sir. He did not come to the class. He submitted the leave letter and left. |
| మాష్టరు : ఇన్‌స్టిట్యూటుకు వచ్చి క్లాసుకు రాలేదా? | Having come to the Institute, did he not come to the class? |
| శర్మ : అవునండీ! అతనికి ఒంట్లో బాగా లేదండీ. ఆస్పత్రికి వెళ్ళి మందు తీసుకుని వెళ్తానన్నాడు. ఈ వాతావరణం అతని ఒంటికి పడలేదు. | Yes sir. He was not well. He wanted to go to the hospital and collect the medicine. This climate did not suit him. |

| | |
|---|---|
| మాష్టరు: అలాగా! | I see! |
| శర్మ: అతని ఒళ్ళు మంచిది కాదండీ! వాతావరణంలో కొంచెం మార్పు వస్తే అతనికి జ్వరం వస్తుంది. నిన్న మీతో చెప్పి వెళ్ళమన్నాను. చెప్పకుండా వెళ్ళాడేమో! | His health is not good sir. If a slight change is there in the climate, he will have fever. I asked him to go after informing you. Perhaps he left without informing you. |
| మాష్టరు: పరవాలేదు. మా వీధిలో ఒక మంచి డాక్టరు ఉన్నాడు. అతను నా స్నేహితుడు గూడా. గోపీ! నీకు మా యిల్లు తెలుసు గదా! రవిని సాయంత్రం మా యింటికి తీసుకురా, అతనికి చూపిదాం! | It doesn't matter. There is a good doctor in our street. He is my friend too. Gopi, you know my house. Don't you? Bring Ravi to my house in the evening. Let us take him to the doctor. |
| శర్మ: ఈ మధ్య రవికీ గోపికీ పడటం లేదండీ. | Now-a-days Ravi and Gopi are not in good terms. |
| గోపి: అదేం లేదండీ! తీస్కొస్తాను. | Nothing like that sir! I will bring him. |
| మాష్టరు: ఇవ్వాళ గూడా జ్వరం ఉందా? | Does he have fever today also? |
| గోపి: ఉందండీ! రాత్రి ఎక్కువగా ఉంది. నేను భోజనం చేసి వాణ్ణి చూడటానికి వెళ్ళాను. మూలుగుతూ పడుకున్నాడు. | Yes, sir. He had a high temperature last night. After having taken my meal, I called on him. He was lying and groaning. |
| శర్మ: మూలగటం మాత్రమే కాదండీ! జ్వరం వస్తే ఏడుస్తూ పడుకుంటాడు. ఏడవకుండా పడుకోమంటే వినడు. | Not only groaning, sir. If he has fever, he will be lying down weeping. |
| మాష్టరు: మధ్యాహ్నం మనం పోయి రవిని చూసి వదాం. | We shall see Ravi in the afternoon. |




## DRILLS

a. Repetition drill.

నా దగ్గర ఇంగ్లీషు పుస్తకాలు తప్ప అన్ని పుస్తకాలు ఉన్నాయి.

మన క్లాసులో తెలుగువాళ్ళు తప్ప అన్ని భాషలవాళ్ళు ఉన్నారు.

శర్మ యింటికి వచ్చి అన్నం తింటాడు.

రవి నా దగ్గరికి రాకుండా వెళ్ళాడు.

గోపి ఇంటికి వెళ్ళి పడుకున్నాడు.

సుగుణ కమలవాళ్ళ యింటికి వెళ్ళకుండా వచ్చింది.

మీరు మూలుగుతూ పడుకున్నారు.

మీరు మూలగకుండా పడుకోండి.

రఘు చదువుతూ వింటున్నది.

పద్మ చదవకుండా వింటున్నది.

పాలు ఒంటికి మంచివి.

పాలు తాగటం ఒంటికి మంచిది.

అతని ఒళ్ళు మంచిది కాదు.

రవికి ఒంట్లో బాగా లేదు.

ఈ వాతావరణం నా ఒంటికి పడదు.

శర్మకూ రవికీ పడదు.

b. Substitution drill.

Model (i) :

శర్మ తప్ప అందరూ వచ్చారు.

సరళ

సరళ తప్ప అందరూ వచ్చారు.

విమల

రవి

శ్రీధర్

**Model (ii) :**

రవి పుస్తకం చదివి వెళ్ళాడు.
కొను
రవి పుస్తకం కొని వెళ్ళాడు.
చూడు
తీసుకో
ఇవ్వు
అడుగు
రాయి

**Model (iii) :**

కమల కలం ఇవ్వకుండా వెళ్ళింది.
అడుగు
కమల కలం అడగకుండా వెళ్ళింది.
ఇవ్వు
తీసుకో
చూడు
కొను

**Model (iv) :**

శర్మ చదవమంటే చదవడు.
రాయి
శర్మ రాయమంటే రాయడు.
వెళ్ళు
తిను
తీసుకో

c. **Response drill.**

**Model (i) :**

నాటకానికి రవి వచ్చాడా ?
నాటకానికి రవి తప్ప అందరూ వచ్చారు.

1. క్లాసుకు పద్మ వచ్చిందా ?
2. ఇంటికి రవి వచ్చాడా ?
3. శర్మ అన్నం తిన్నాడా ?
4. నిన్న మురళి సినిమాకు వెళ్ళాడా ?

**Model (ii) :**

గోపి అన్నం తిని వచ్చాడా ?
గోపి అన్నం తినకుండా వచ్చాడు.

1. శర్మ కాఫీ తాగి వచ్చాడా ?
2. పాప ఏడ్చి పడుకున్నదా ?
3. బంట్రోతు బల్లలు తుడిచి వెళ్ళాడా ?
4. మీ పేరు రాసి లోపలికి వచ్చారా ?
5. రాజు బాకీలు తీర్చి వచ్చాడా ?

**d. Transformation drill.**

**Model (i) :**

రవి వచ్చాడు.
రవి తప్ప ఎవరూ రాలేదు.

1. మురళి అన్నం తిన్నాడు.
2. రమ పాఠం రాసింది.
3. కమల తెలుగు పుస్తకం చదివింది.

**e. Combination drill.**

**Model (i) :**

రవి కాఫీ తాగలేదు ; టీ తాగాడు.
రవి కాఫీ తాగకుండా టీ తాగాడు.

1. రమ రాత్రి నిద్రపోలేదు ; పాఠం చదివింది.
2. నేను మీ యింటికి పోలేదు ; మార్కెట్టుకు పోయాను.
3. కమల బొమ్మలు గియ్యలేదు ; పాఠం చదివింది.

**Model (ii) :**

మురళి యిక్కడికి వచ్చాడు ; మిమ్మల్ని కలవ లేదు.
మురళి యిక్కడికి వచ్చి మిమ్మల్ని కలవలేదు.

1. గోపి గుంటూరు వెళ్ళాడు ; రవిని చూడలేదు.
2. రమ కాఫీ చేసింది ; పంచదార వెయ్యటం మరిచిపోయింది.
3. మూర్తి వానలో తడిశాడు ; ఇంటికి వచ్చాడు.
4. కమల రవి దగ్గర్నించి కొత్త పుస్తకం తీసుకున్నది ; నాకిచ్చింది.

## EXERCISES

a. Combine the following pairs of sentences as shown in the model.

**Model (i) :**

రవి యింటికి వెళ్ళాడు ; అన్నం తిన్నాడు.
రవి యింటికి వెళ్ళి అన్నం తిన్నాడు.

1. శర్మ నాదగ్గరికి వచ్చాడు ; పాఠం చదివాడు.
2. రాజు మామిడికాయలు కోశాడు ; నాకు ఇచ్చాడు.
3. రమ మీదగ్గర్నించి కలం తీసుకున్నది ; నాకు ఇచ్చింది.
4. సుబ్బారావు హోటలుకు పోయాడు ; కాఫీ తాగాడు.

**Model (ii) :**

నేను రవిని అన్నం తినమన్నాను ; అతను తినలేదు.
నేను రవిని అన్నం తినమంటే తినలేదు.

1. నేను శర్మను తొందరగా రమ్మన్నాను; అతను రాలేదు.
2. సరళ కమలను పాఠం రాయమన్నది ; ఆమె రాయలేదు.
3. కమలను ఇటువంటి బుట్ట అల్లమన్నాను ; ఆమె అల్లలేదు.

**b. Rewrite the following sentences as shown in the model.**

**Model :**

శర్మ బడికి వచ్చి ఇంటికి వెళ్ళాడు.
శర్మ బడికి రాకుండా ఇంటికి వెళ్ళాడు.

1. పోలీసులు దొంగలను కొట్టి తీసుకుపోయారు.
2. కమల పాఠం రాసి పాటలు పాడుతున్నది.
3. సరోజ పూలు కోసి కాయలు ఏరుతున్నది.
4. నువ్వు ఉత్తరం తీసుకుని మాట్లాడుతున్నావా?

**c. Fill up the blanks with the suitable case forms of the nouns given in the parentheses.**

1. శర్మకు......(ఒళ్ళు) బాగా లేదు.
2. మా......(ఇల్లు) రవి వచ్చాడు.
3. నీ........(కన్ను) దుమ్ము పడ్డదా?
4. ఈ వాతావరణం నీ...(ఒళ్ళు) పడుతుందా.

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| తప్ప | except | పడు | be in good terms |
| ఇన్స్టిట్యూట్ | Institute | మూలుగు | groan(v.) |
| ఒళ్ళు | body | పడుకో | lie down |
| పడు | be suitable | హెడ్‌గుమాస్తా | head clerk |
| మార్పు | change(n.) | నిద్ర | sleep(n.) |

## GRAMMAR NOTES

79.1. In this lesson the past adverbial participle is introduced. -ఇ/-యి is added to the verbal base to form past adverbial participle.

79.1.1. -యి occurs after the verb పో.

పో-యి → పోయి 'having gone'

79.1.2. -ఇ occurs with the other verbs.

అడుగు-ఇ → అడిగి 'having asked' (66.6.)

తిను-ఇ → తిని 'having eaten' (41.6.)

| | |
|---|---|
| పడు–ఇ→ పడి | 'having fallen' (41.6.) |
| రా + ఇ→ వచ్చ్ + ఇ→ వచ్చి | 'having come' (66.4.) |
| తే + ఇ→ తెచ్చ్ + ఇ→ తెచ్చి | 'having brought' (69.4.) |
| చూడు + ఇ→ చూస్ + ఇ→ చూసి | 'having seen' (66.4.) |
| కొయ్యి + ఇ→ కోస్ + ఇ→ కోసి | 'having cut' (66.3.) |
| కా + ఇ→ అయ్ + ఇ→ అయి | 'having become' (70.2.1.) |
| ఇవ్వు + ఇ→ ఇచ్చ్ + ఇ→ ఇచ్చి | 'having given' (67.6.) |

79.2. ఓ ending bases (except పో) change the final ఓ to ఉన్ before the past adverbial participle marker –ఇ (75.2.3.).

| | |
|---|---|
| తీసుకో + ఇ→ తీసుకున్ + ఇ→ తీసుకుని | 'having taken' |
| నిల్చో + ఇ→ నిల్చున్ + ఇ→ నిల్చుని | 'having stood' |
| కూర్చో + ఇ→ కూర్చున్ + ఇ→ కూర్చుని | 'having sat' |

79.3. The negative adverbial participle is also introduced in this lesson. This will be formed by adding –అకుండా to the verbal base.

| | |
|---|---|
| వెళ్లు + అకుండా→ వెళ్ళకుండా | 'without going' (41.6.) |
| తీసుకో + అకుండా→ తీసుకోకుండా | 'without taking' (41.7.) |
| పో + అకుండా→ పోకుండా | 'without going' (41.7.) |
| అడుగు + అకుండా→ అడగకుండా | 'without asking' (43.2.; 41.6.) |
| పిలుచ్ + అకుండా→ పిలవకుండా | 'without calling' (67.3.; 68.3.) |

79.3.1. The nagative adverbial participle does not show any tense distinction as its affirmative adverbial participle does.

| | | | |
|---|---|---|---|
| వెళ్తూ | (Present/Progressive) | × | వెళ్ళకుండా |
| వెళ్లి | (Past) | × | వెళ్ళకుండా |

The affirmative adverbial participle also does not show a three-way tense distinction as the adjectival participle does (76.5.2.). It shows a two-way tense distinction as shown in the following diagram.




79.4. తప్ప means 'except'.

శర్మ తప్ప అందరూ విద్యార్థులే. 'All are students except Sarma.'

79.5. The oblique base of ఒళ్ళు 'body' is ఒంటి and its locative case form is ఒంట్లో.

79.6. Notice the use of the dative case suffix in the following sentences.

శర్మకూ రవికీ పడదు. 'Sarma and Ravi are not in good terms.'

ఈ మందు నా ఒంటికి పడదు. 'This medicine is not suitable for my body (health).'

# UNIT 20

## Lesson 80

కమల : లక్ష్మీ ! నువ్వు వచ్చి చాలా సేపైందా ?

Lakshmi! Had it been long since you came ?

లక్ష్మి : ఔను అరగంటైంది.

Yes. It was half an hour.

కమల : అరె ! నేను చూడలేదు. సరే ! ఇవ్వాళ సినిమాకు పోదాం, రా ! నేను సినిమా చూసి రెండు నెలలైంది. మా యింట్లో దొంగతనం జరిగిన తర్వాత నేను బైటికి వెళ్ళలేదు.

Oh ! Sorry ! I did not notice. All right. We will go to a movie today. Come on. It is more than two months since I went to a movie. After the theft in my house, I didn't go outside anywhere.

లక్ష్మి : ఇవ్వాళ నా మనస్సు బాగలేదు.

I am not happy to-day.

కమల : ఏం ! ఇవ్వాళ గూడా ప్రభాకర్ కనిపించలేదా ?

Why ? Didn't you see Prabhakar today also.

లక్ష్మి : లేదు. ఏం చెయ్యమంటావు నన్ను ?

No. What do you advise me to do?

కమల : నువ్వు పట్టి పిరికిదానివి. నీ మంచితనం పిరికితనం చూసి అతను ఇట్లా చేస్తున్నాడు. నువ్వు ధైర్యంగా ఉండు. నేను వెళ్ళి మాట్లాడ్తాను.

You are really a coward. He is behaving like that because of your gentle behaviour and cowardice (nature). Be bold enough. I will go and speak to him.

లక్ష్మి : ఇప్పుడు నేనొక పని చెయ్యదలచుకున్నాను.

I want to do something now.

కమల : ఏమిటది ?

What is it ?

లక్ష్మి : వాళ్ళ ఇంటికి వెళ్దాం అనుకుంటున్నాను.

I am thinking of going to his house.

కమల : బిచ్చంకోసం పోతావా ? అటువంటి పిచ్చి పని చెయ్యకు. ఏం చెయ్యాలో నేను చెప్తాను. వాళ్ళింటికి బిచ్చగత్తెలా వెళ్ళక్కర్లేదు. కోడలు గానే వెళ్తావు. అతనింత మోసగాడు అనుకోలేదు నేను.

Do you want to go in for arms? Don't do such a silly thing. I will tell you what you should do. You need not go to his house like a beggar. You will only go as a daughter-in-law. I never thought that he was such a cheat.

లక్ష్మి : నిన్న బస్సులో వస్తూ ఉండగా కనిపించాడు; మాట్లాడలేదు.

While coming in the bus yesterday, I saw him. He did not speak.

కమల : అయితే ఊళ్లోనే ఉన్నాడన్నమాట. సరే ! ఈ సాయంత్రమే అతనితో మాట్లాడ్తాను.

So, he is in the town itself. Okay! I will speak to him this evening only.

## DRILLS

a. Repetition drill

సుబ్బారావుకు పుస్తకం ఇచ్చి నెల అయింది.
శర్మ యింటికి వెళ్ళి గంటైంది.

నేనిప్పుడు శర్మను చూడదలచుకున్నాను.

రవి ఆ పని చెయ్యదలచుకోలేదు.
నువ్వు ఇక్కడికి రాక్కర్లేదు.
చిన్న పిల్లలకు టిక్కెట్టు తీసుకోక్కర్లేదు.

నేను నిన్న వస్తూ ఉండగా సుబ్బారావు వచ్చాడు.
నేను మాట్లాడ్తూ ఉండగా నువ్వు మాట్లాడకు.

**b. Build-up drill.**

ఐంది.
రెండు నెలలైంది.
వచ్చి రెండు నెలలైంది.
ఇక్కడికి వచ్చి రెండు నెలలైంది.
అతనిక్కడికి వచ్చి రెండు నెలలైంది.

వెళ్ళలేదు.
బైటికి వెళ్ళలేదు.
నేను బైటికి వెళ్ళలేదు.
జరిగిన తర్వాత ను బైటికి వెళ్ళలేదు.
దొంగతనం జరిగిన తర్వాత ను బైటికి వెళ్ళలేదు.
ఇంట్లో దొంగతనం జరిగిన తర్వాత నేను బైటికి వెళ్ళలేదు.
మా ఇంట్లో దొంగతనం జరిగిన తర్వాత నేను బైటికి వెళ్ళలేదు.

చేస్తున్నాడు.
ఇట్లా చేస్తున్నాడు.
అతనిట్లా చేస్తున్నాడు.
చూసి అతనిట్లా చేస్తున్నాడు.
పిరికితనం చూసి అతనిట్లా చేస్తున్నాడు.
నీ పిరికితనం చూసి అతనిట్లా చేస్తున్నాడు.

**c. Substitution drill.**

**Model (i) :**

ఇప్పుడు నేను మినపట్టు
తినదలచుకున్నాను.
చెయ్యి
ఇప్పుడు నేను మినపట్టు
చెయ్యదలచుకున్నాను.

తీసుకో
ఇవ్వు
చూడు
అడుగు

**Model (ii) :**

అతను శర్మలా ఉన్నాడు.
మోసగాడు
అతను మోసగాడులా ఉన్నాడు.

దొంగ
ఆఫీసరు
రవి

**Model (iii) :**

నువ్వు ఈ పుస్తకం చదివి ఎన్ని రోజులైంది ? (కొను)
నువ్వు ఈ పుస్తకం కొని ఎన్ని రోజులైంది ?

1. శర్మ రవితో వెళ్ళి ఎంత సేపైంది ? (మాట్లాడు)
2. నువ్వు కమలను పిలిచి ఎంత సేపైంది ? (చూడు)
3. శారద ఈ పుస్తకం రాసి ఎన్ని రోజులైంది ? (చే)
4. గోపి ఉంగరం కొని ఎన్ని రోజులైంది ? (తీసుకో)

**d. Response drill.**

**Model (i) :**

నేను సాయంత్రం మీ ఇంటికి రావాలా ?

నువ్వు సాయంత్రం మా ఇంటికి రాక్కర్లేదు.

1. రమ పూలు కొయ్యాలా ?
2. శారద పాట పాడాలా ?
3. సుగుణ ఊరికి వెళ్ళాలా ?
4. శర్మ డబ్బు తీసుకోవాలా ?

**Model (ii) :**

నువ్వు ఎప్పుడు పడుకుంటావు ? (అన్నం తిను)

అన్నం తిన్న తర్వాత పడుకుంటాను.

1. శర్మ ఎప్పుడు బైటికి వెళ్తాడు ? (క్లాసు–కా)
2. రమ ఎప్పుడు పాఠం చదువుతుంది ? (ఉత్తరం–రాయి)
3. నువ్వు ఎప్పుడు అన్నం తింటావు ? (శర్మ–రా)

e. Transformation drill.

Model :

నిన్న నేను వస్తున్నప్పుడు వాన కురిసింది.

నిన్న నేను వస్తూ ఉండగా వాన కురిసింది.

1. శర్మ మాట్లాడుతున్నప్పుడు నేను నిద్ర పోయాను.
2. రమ పూలు కోస్తున్నప్పుడు కమల వచ్చింది.
3. కమల పాఠం చదువుతున్నప్పుడు మాష్టరు గారు బైటికి వెళ్ళారు.

**EXERCISES**

**a. Fill up the blanks with the verbs given in the parentheses as shown in the model.**

**Model (i) :**

శర్మ......(చదువు) లక్ష్మి వచ్చింది.

శర్మ చదువుతూ ఉండగా వచ్చింది.

1. రమ......(నిద్రపో) వాన వచ్చింది.
2. నువ్వు........(రా) ఎవరు కనిపించారు ?
3. క్లాసు......(జరుగు) బైటికి పోకండి.
4. పాఠం........(చెప్పు) నిద్ర పోవటం మంచిది కాదు.
5. ఈ పని....... (పూర్తికా) రవి వచ్చాడు.
6. శారద పుస్తకాలు......(కొను) ఒక వింత జరిగింది.

**b. Answer the following questions as shown in the model.**

**Model :**

నువ్వు ఎప్పుడు వచ్చావు ? (రెండు రోజులు)

నేను వచ్చి రెండు రోజులైంది.

1. రమ ఎప్పుడు పాసయింది ? (రెండేళ్ళు)
2. కాలేజీ ఎప్పుడు తెరిచారు ? (నెల)
3. లక్ష్మి ఎప్పుడు ఉంగరం పెట్టుకుంది ? (ఐదు నిమిషాలు)
4. ఈ కప్పులో కాఫీ ఎప్పుడు పోశావు ? (గంట)

**b. Change the following sentences as shown in the model.**

**Model :**

నేను ఇంటికి వెళ్దాం అనుకున్నాను.
నేను ఇంటికి వెళ్ళదలచుకున్నాను.

1. నేను ఎమ్.ఏ. చదువుదాం అనుకున్నాను.
2. రమ మా ఇంటికి వద్దాం అనుకున్నది.
3. నువ్వు పూలు కోద్దాం అనుకున్నావా ?
4. శర్మ మంచివాడు అవుదాం అనుకున్నాడు.

**c. Change the following sentences into negatives as shown in the model.**

**Model :**

శర్మ చదవాలి.
శర్మ చదవక్కర్లేదు.

1. రమ పాఠం రాయాలి.
2. శ్యామల బుట్ట అల్లాలి.
3. కమల ఉంగరం పెట్టుకోవాలి.
4. కుమారి పుస్తకం తేవాలి.

**d. Combine the following pairs of sentences as shown in the model.**

**Model :**

శర్మ వచ్చాడు.
తర్వాత అన్నం తిన్నాడు.
శర్మ వచ్చిన తర్వాత అన్నం తిన్నాడు.

1. రమ బి.ఏ. పాసయింది.
   తర్వాత బి.ఇడి. చదివింది.
2. నువ్వు పూలు కొయ్యి.
   తర్వాత ఇంటికి వెళ్ళు.
3. శర్మగారూ ! మీరు సినిమా చూడండి.
   తర్వాత ఇంటికి రండి.

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| దొంగతనం | theft | బిచ్చం | **begging, alms** |
| వట్టి | only (an emphasiser) | పిచ్చి | **mad** |
| పిరికి | coward (adj.) | బిచ్చగత్తె | **beggar (fem.)** |
| **మంచితనం** | **goodness** | **కోడలు** | **daughter-in-law** |
| **పిరికితనం** | **cowardice** | మోసగాడు | **cheat (masc.)** |
| ధైర్యం | **courage** | | |

## GRAMMAR NOTES

**80.1. In this lesson the use of past participle form for temporal expression is introduced :**

నేను శర్మను <u>చూసి</u> రెండేళ్లు అయింది. — **'It is two years since I saw Sarma.'** **( I saw Sarma two years ago. )**

నేను అన్నం తిని గంట అయింది. 'It is one hour since I took my meals.' (I took food one hour ago.)

80.2. Notice the use of singular verb అయింది in agreement with plural noun గంటలు 'hours' or ఏళ్లు 'years'.

| | |
|---|---|
| నేను అన్నం తిని రెండు గంటలైంది.* (రెండు గంటలు + ఐంది*) | 'Two hours passed after I took my meal.' |
| నేను శర్మను చూసి రెండేళ్లు అయింది. | 'Two years passed after I saw Sarma.' |

In such sentences, though అయింది appears to be in agreement with రెండు గంటలు or రెండేళ్లు, టైం or కాలం which is a singular noun, is implied in the mind of the native speaker. Therefore అయింది is actually in agreement with the implied singular noun, namely, టైం or కాలం. The above sentences are expandable in the following maner.

| | |
|---|---|
| నేను అన్నం తిని రెండు గంటల టైం అయింది. | 'Two hours of time passsd after I took my meal.' |
| నేను శర్మను చూసి రెండేళ్ల కాలం అయింది. | 'Two years of time passed after I saw Sarma.' |

80.3. తర్వాత 'after' is added to the past adjectival participle (75.1.) to express a type of temporal.

| | |
|---|---|
| నేను వెళ్లిన తర్వాత శర్మ వచ్చాడు. | 'Sarma came after I went.' |
| నేను అన్నం తిన్న తర్వాత రవి వస్తాడు. | 'Ravi will come after I take food.' |
| నేను చదివిన తర్వాత కమల చదువుతున్నది. | 'Kamala is reading after I read.' |

80.4. Another type of temporal expression can be made by adding ఉండగా to the progressive adverbial participle (55.2.).

| | |
|---|---|
| వస్తూ ఉండగా | 'when somebody is/was coming' |
| నేను ఇంటికి వెళ్తూ ఉండగా కమల కనిపించింది. | 'When I was going home I saw Kamala. |

80.5. An auxiliary verb దలచుకో* is used in this lesson. This auxiliary expresses 'wi or desire' and it is added to the infinitive form of the verb (52.3.2.). Infinitive and దలచు! form the compound base. Tense and other suffixes can be added to this compound ba:

---

* అయింది can also be written as ఐంది. The sequence of అయి can be written as and అవు as ఔ.

అయింది = ఐంది  అవును = ఔను

చెయ్య-దలచుకో 'intend to do: desire to do'

రా-దలచుకో 'intend to come; desire to come'

ఇవ్వాళ నేను పదింటికి కాఫీ తాగదలచుకున్నాను. 'I wanted to drink coffee today at 10 o'clock.'

సుశీల ఇవ్వాళ సినిమాకు వెళ్ళదలచుకోలేదు. 'Susila did not want to go for a movie today.'

80.6. అక్కర్లేదు is added to a verbal base to express the notion 'need not'.

తిను + అక్కర్లేదు → తినక్కర్లేదు 'One need not eat.'

రా + అక్కర్లేదు → రాక్కర్లేదు 'One need not come.'

80.7. -లా is a shortened form of -లాగా (46.7.).

అతను శర్మలాగా ఉన్నాడు.<br>అతను శర్మలా ఉన్నాడు. } 'He looks like Sarma.'

# UNIT 20

## Lesson 81

### కంప్యూటర్ సంగీతం

బెంగుళూరు, అక్టోబరు 18.

బొంబాయిలోని తాతా ప్రాథమిక పరిశోధనా సంస్థ కంప్యూటర్ విభాగం కంప్యూటర్ సంగీతంలో ఒక ప్రయోగాన్ని విజయవంతంగా నిర్వహించింది.

సంగీత నాటక అకాడమీ సహాయ కార్యదర్శి నేడు ఇక్కడ పై విషయాన్ని విలేఖరులకు వెల్లడిస్తూ అకోబరు 20 నుంచి ఇక్కడ సంగీతశాస్త్రంపై జరిగే 10 రోజుల సదస్సులో ఈ ప్రయోగం ఒక విశేషాంశంగావుంటుందని చెప్పారు.

తాతా సంస్థకు చెందిన శ్రీమతి పద్మా రంగా చారి అక్టోబరు 21వ తేది సదస్సులో ఈ ప్రయోగంపై

### COMPUTER MUSIC

Bangalore, October 18.

The Computer department of Tata Institute of Fundamental Research, Bombay has successfully executed an experiment on Computer music.

Informing the above to the journalists (correspondents) here today, the Assistant Secretary, Music and Dance Academy said that this experiment would be a special feature in the 10-day Conference which would begin here from October, 20.

He said that Mrs. Padma Rangachari of Tata Institute will present a paper on this

ఒక వ్యాసాన్ని సమర్పిస్తారు అని ఆయన తెలియజేశారు. వీణ సంగీతం ఇతర కర్ణాటక సంగీతం కంప్యూటర్ ద్వారా వినిపించటం జరిగిందని ఆయన చెప్పారు.

—ఆంధ్రప్రభ, 19-10-1975.

experiment in this conference on October 21. He further added that *Veena* music and other *Carnatic* music was produced on the computer.

– *Andhra Prabha, 19-10-1975.*




## DRILLS

### a. Repetition drill

రవి కమల క్లాసుకు రాలేదని మాష్టరుగారితో చెప్పాడు.

పోలీసులు దొంగలను పట్టుకున్నారు అని నేను శర్మతో చెప్పాను.

ఆయన కంప్యూటర్ సంగీతం గురించి పరిశోధన జరిగింది అని విలేఖరులకు వెల్లడించారు.

శర్మ ఇంటికి వెళ్లాడు అని రవి చెప్పాడు.

**b. Build-up drill.**

నిర్వహించింది.

విజయవంతంగా నిర్వహించింది.

ప్రయోగాన్ని విజయవంతంగా నిర్వహించింది.

ఒక ప్రయోగాన్ని విజయవంతంగా నిర్వహించింది.

కంప్యూటర్ సంగీతంలో ఒక ప్రయోగాన్ని విజయవంతంగా నిర్వహించింది.

తాతా ప్రాథమిక పరిశోధనా సంస్థ కంప్యూటర్ సంగీతంలో ఒక ప్రయోగాన్ని విజయవంతంగా నిర్వహించింది.

బొంబాయిలోని తాతా ప్రాథమిక పరిశోధనా సంస్థ కంప్యూటర్ సంగీతంలో ఒక ప్రయోగాన్ని విజయవంతంగా నిర్వహించింది.

తెలియజేశారు.

ఆయన తెలియజేశారు.

సమర్పిస్తారు అని ఆయన తెలియజేశారు.

ఒక వ్యాసాన్ని సమర్పిస్తారు అని ఆయన తెలియజేశారు.

ఈ ప్రయోగంపై ఒక వ్యాసాన్ని సమర్పిస్తారు అని ఆయన తెలియజేశారు.

సదస్సులో ఈ ప్రయోగంపై ఒక వ్యాసాన్ని సమర్పిస్తారు అని ఆయన తెలియజేశారు.

శ్రీమతి పద్మ ఈ సదస్సులో ఈ ప్రయోగంపై ఒక వ్యాసాన్ని సమర్పిస్తారు అని ఆయన తెలియజేశారు.

చెప్పారు.

ఉంటుంది అని చెప్పారు.

విశేషాంశంగా ఉంటుంది అని చెప్పారు.

ఈ ప్రయోగం ఒక విశేషాంశంగా ఉంటుంది అని చెప్పారు.

సదస్సులో ఈ ప్రయోగం ఒక విశేషాంశంగా ఉంటుంది అని చెప్పారు.

సంగీత శాసంపై జరిగే సదస్సులో ఈ ప్రయోగం ఒక విశేషాంశంగా ఉంటుంది అని చెప్పారు.

**c. Substitution drill.**

**Model (i):**

సంగీత శాస్త్రంపై సదస్సు జరుగుతుంది అని కార్యదర్శి విలేఖరులకు తెలియజేశారు.

కంప్యూటర్ సంగీతం.

కంప్యూటర్ సంగీతంపై సదస్సు జరుగుతుంది అని కార్యదర్శి విలేఖరులకు తెలియజేశారు.

కంప్యూటర్ పరిశోధన.

కంప్యూటర్ ప్రయోగం.

ప్రయోగాన్ని నిర్వహించటం.

**d. Response drill.**

**Model :**

రవి ఏం చెప్పాడు ?
(శర్మ పుస్తకం చదివాడు.)
శర్మ పుస్తకం చదివాడని రవి చెప్పాడు.

1. సహాయకార్యదర్శి ఏం వెల్లడించారు ?
(సంగీత శాస్త్రంపై సదస్సు జరుగుతుంది.)
2. కార్యదర్శి ఏం తెలియజేశారు ?
(రవి కంప్యూటర్ సంగీతంపై ఒక వ్యాసాన్ని సమర్పిస్తాడు.)
3. కమల సుశీలతో ఏం చెప్పింది ?
(మాష్టరుగారు రేపు పరీక్షపెడ్తారు.)

**e. Transformation drill.**

**Model (i) :**

శర్మ ఇంటికి వెళ్లాడని రవి నాతో చెప్పాడు.
రవి, శర్మ ఇంటికి వెళ్లాడని నాతో చెప్పాడు.

1. కమల పాఠం చదివిందని గోపి మాష్టరు గారితో చెప్పాడు.
2. ప్రయోగం విజయవంతంగా జరిగిందని కార్యదర్శి విలేఖరులకు తెలియజేశాడు.
3. 20వ తారీకునుంచి సదస్సు జరుగుతుందని కార్యదర్శి మనతో చెప్పాడు.

**Model (ii) :**

శర్మ ఆమె యింట్లో లేదన్నాడు.
శర్మ ఆమె యింట్లో లేదు అని చెప్పాడు.

1. కమల రైలు వెళ్ళింది అన్నది.
2. మాష్టరుగారు రేపు క్లాసు ఉండదు అన్నారు.
3. రవి మనం రేపు సినిమాకు వెళ్తున్నాం అన్నాడు.
4. నేను నిన్న గుంటూరు వెళ్ళాను అన్నాను.

**EXERCISES**

**a.** Rewrite the following pairs of sentences as shown in the model.

Model :

శర్మ ఇంటికి వెళ్ళాడు.
ఈ విషయాన్ని రవి నాకు చెప్పాడు.
శర్మ ఇంటికి వెళ్ళాడు అని రవి నాకు చెప్పాడు.

1. గోపి ఒక ప్రయోగాన్ని విజయవంతంగా నిర్వహించాడు.
ఈ విషయం రేడియోలో చెప్పారు.
2. మన ముఖ్యమంత్రి బొంబాయి వెళ్ళారు.
ఈ విషయం ఆయన కార్యదర్శి విలేఖరులకు వెల్లడించారు.
3. కర్ణాటక సంగీతం కంప్యూటర్ ద్వారా వినిపించటం జరిగింది.
పై విషయం సంగీత నాటక అకాడమీ కార్యదర్శి విలేఖరులకు చెప్పాడు.
4. రేపు కాలేజీలో నాటకం జరుగుతుంది.
ఈ విషయాన్ని పద్మ చెప్పింది.

**d. Answer the following questions as shown in the model.**

**Model :**

రవి మనతో ఏం చెప్పాడు?
(కమల వీణ బాగా వాయిస్తుంది.)
రవి, కమల వీణ బాగా వాయిస్తుందని చెప్పాడు.

1. సుగుణ రవితో ఏం చెప్పింది?
(శారద కాలేజీకి వెళ్ళింది.)
2. కార్యదర్శి విలేఖరులకు ఏం తెలియజేశారు?
(సంగీత శాస్త్రంలో పరిశోధన జరిగింది.)
3. మాష్టరుగారేం చెప్పారు?
(ప్రిన్సిపాలుగారు అమెరికా వెళ్ళారు.)

**e. Respond to the following sentences as shown in the model.**

Model (i) :

ఆరో తేదీ మన ఆఫీసుకు సెలవు.
6వ తేదీ మన ఆఫీసుకు సెలవు.

1. ఎనిమిదో తారీకు రవి బెంగుళూరు వెళ్ళాడు.
2. సుబ్బారావు ఆరో తేదీ వస్తాడు.
3. ఇరవయ్యో తేదీ సంగీత శాస్త్రంపై సదస్సు జరుగుతుంది

Model (ii) :

సెక్రటరీ మంత్రిగారు బెంగుళూరు వెళ్ళారన్నాడు.
సెక్రటరీ మంత్రిగారు బెంగుళూరు వెళ్ళారు అని చెప్పాడు.

1. శర్మ రవికి పెళ్ళి కాలేదన్నాడు.
2. నేను రవి వాళ్ళ యింటికి వెళ్తున్నానన్నాడు.
3. ఆయన అన్నం తినలేదన్నాడు.
4. సుబ్బారావు రైలు రాలేదన్నాడు.

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| ప్రాథమిక | primary, fundamental | నిర్వహించు | organize, execute |
| పరిశోధనాసంస్థ | research institute | సహాయ | assistant (adj.) |
| కంప్యూటర్ | computer | కార్యదర్శి | secretary |
| విభాగం | section; division | నేడు | today |
| సంగీతం | music | పై | on; upon; above |
| ప్రయోగం | experiment (n) | విలేఖరి | correspondent |
| విజయవంతం | successful | వెల్లడించు | make known; inform |

| | | | |
|---|---|---|---|
| సంగీతశాస్త్రం | the science of music | తెలియజెయ్యి | inform |
| సదస్సు | seminar; gathering | వీణ | *veena* |
| విశేషాంశం | special feature | ఇతర | other |
| సంస్థ | institution | కర్ణాటక సంగీతం | *Carnatic* music |
| చెందిన | belonging to | ద్వారా | through |
| శ్రీమతి | Mrs. | వినిపించు | make to listen by some demontsration |
| తేదీ | date | | |
| వ్యాసం | essay | కుటుంబ నియంత్రణ | family planning |
| సమర్పించు | submit; present (v.tr.) | జ్యోతిష్కుడు | astrologer |

## GRAMMAR NOTES

81.1. The variety of the language used in this lesson is more formal. The corresponding colloquial forms are given hereunder :

| | | |
|---|---|---|
| -లోని | లో ఉన్న | 'situated in' |
| విజయవంతంగా | బాగా | 'successfully: very well' |
| నిర్వహించింది | చేసింది | 'did' |
| నేడు | ఇవ్వాళ | 'today' |
| వెల్లడిస్తూ | చెప్తూ | 'while saying/announcing' |
| తెలియజేశారు | చెప్పారు | 'informed' |

81.2. In this lesson the use of అని 'that', as quotative particle is shown.
When అని is used in the sentence as a quotative particle, the main verb will always be an informative verb, i.e., చెప్పు 'say' తెలియజెయ్యి 'make known' వెల్లడించు 'express' or రాయు 'write' or a question verb అడుగు 'ask' etc.

శర్మ ఇంటికి వెళ్ళాడు అని రవి చెప్పాడు. Ravi said, "Sarma went home."

రవి ఎక్కడున్నాడు అని సుబ్బారావు అడిగాడు. Subbarao asked, "Where is Ravi?"

These sentences are comprised of two sentences viz. reporting sentence (main sentence) and reported sentence (subordinate sentence). These two constituent sentences are conjoined by అని.

శర్మ ఇంటికి వెళ్ళాడు అని రవి చెప్పాడు.

రవి ఎక్కడున్నాడు అని సుబ్బారావు అడిగాడు.

81.3. The sentences given in 81.2. can also be said as :

రవి, శర్మ ఇంటికి వెళ్లాడని చెప్పాడు.

సుబ్బారావు, రవి ఎక్కడున్నాడని అడిగాడు.

That is, the subject of the main sentence (reporting sentence) can be placed either before the main verb (reporting verb) or before the subordinate sentence (reported sentence).

81.4. Remember that ఓ is added to numerals to make them ordinals (18.2.). వ can be written in the place of ఓ when the numerals are written in figures.

ఆరో = 6వ          అరవై రెండో = 62వ

But in speech -ఓ form only exists. It also exists in reading, whatever the why it is written.

# REVIEW 10

## Lesson 82

రాము : మోహన్! తొందరగా రా! నిన్న చేసినట్లు ఇవ్వాళ గూడా ఆలస్యం చెయ్యకు. ఆలస్యం అయిన కొద్దీ నాకు బస్సులు దొరకవు.

Mohan! Come quickly. Don't delay today as you did yesterday. I will not get the buses if it is delayed further.

మోహన్ : వెళ్ళిన పని పూర్తి కాకుండా ఎలా వస్తాను? నేను వచ్చేసరికి ఎనిమిది గంటలు కావచ్చు.

How can I come without finishing my work? It may be eight o' clock by the time I return.

రాము : ఆలస్యం అయితే మా నాన్నగారు అరుస్తారు. నిన్న గూడా అరిచారు.

My father will scold me if I go late. He did the same yesterday too.

మోహన్ : అరిచారు అని ఈ ఊళ్లో అంటే పరవా లేదు. విశాఖపట్నంలో అంటే కొడ్తారు.

You can say ***arichæru*** in this town. But if you use it in Visakhapatnam, they will beat you.

| | |
|---|---|
| రాము : ఎందుకు ? | **Why ?** |
| మోహన్ : అరుస్తున్నాడు అంటే కుక్క లాగా మొరుగుతున్నాడని అర్థం. | ***arustunnaaḍu*** **means barking like a dog.** |
| రాము : 'అరవటం' అని ఇక్కడ అందరూ అంటారు గదా! నిన్న వచ్చిన మీ స్నేహితుడు నీతో మాట్లాడుతూ ఉండగా విన్నాను. అతను 'సుబ్బారావు అరిచాడు' అన్నాడు. | **Everybody uses the word *aravaṭam* here. I heard when your friend, who came yesterday, was saying it. He said '*Subbarao arichæḍu*'** |
| మోహన్ : అవును. గోదావరి, విశాఖపట్నం జిల్లాలలో ఈ మాటకు మొరగటం అని అర్థం. తక్కిన జిల్లాలలో తిట్టటం అని పెద్దగా మాట్లాడటం అని అర్థం. | **Yes, this word, in Godavari and Vishakhapatnam districts means, barking. In the other districts it means 'scolding' or 'talking loudly' or 'shouting'.** |
| రాము : గమ్మత్తుగా ఉందే! | It looks funny ! |
| మోహన్ : అవును. అలాగే 'కంగారు' అనే మాట ఉంది. | Yes. Similarly the word ***kangaaru.*** |
| రాము : దానికి కూడా రెండర్థాలున్నాయా ? | **Does it also have two meanings ?** |
| మోహన్ : అదే చెప్పబోతున్నాను. గోదావరి, విశాఖపట్నం జిల్లాలలో కంగారు అంటే తొందర అని అర్థం. గుంటూరు, కృష్ణా జిల్లాలలో ఈ మాటకు *confusion* అని అర్థం. | **That's what I am going to tell you. *Kangaaru* in Godavari and Vishakapatnam districts means 'hasty' *(tondara)*. It means 'confusion' in Krishna and Guntur districts.** |
| రాము : ఇటువంటి మాటలు ఇంకా ఉన్నాయా ? | **Are there any more such words ?** |
| మోహన్ : చాలా వున్నాయి. | **There are many.** |

రాము : నిన్న పరీక్ష రాస్తున్నప్పుడు కంగారు పడ్డాను అని అతనే అన్నాడు. అతను సరిగ్గా పరీక్ష రాసినట్లులేదు.

He himself said yesterday that he was confused during the examination time. It seems he did not answer properly.

మోహన్ : అవును. అదుగో గోపి వస్తున్నట్లున్నాడు. ఇక నేను వెళ్ళాల్సిన పని లేదు.

Yes! Look there! It seems Gopi is coming. Now I don't have to go. (There is no need for me to go.)

గోపి : మోహన్! నువ్వెంత ఎక్కువ మాట్లాడ్తావో! అంత తక్కువ పనిచేస్తావురా!

Mohan! You work so little and talk so much.

మోహన్ : నేను బయల్దేరి చాలా సేపు అయిందిరా! ఇంతలో వీడితో ఏదో మాట్లాడ్తూ ఆగాను.

I started long ago. But I stopped as I was talking to him.

గోపి : చేస్తాను అని చెప్పిన పని ఒకటి గూడా చెయ్యవు గదా! నువ్వు వచ్చేటట్లు లేవు అనుకొని నేనే వచ్చాను.

You don't do a single thing which you promise to do. I came because I thought you would not come any more.

మోహన్ : వేణుని పిలిచి వచ్చావా?

Did you call Venu while coming?

గోపి : నేను వెళ్ళేలోగా వాడు ఎక్కడికో పోయాడు.

He went away some where by the time I reached there.

మోహన్ : వాణ్ణి తీసుకురాకుండా నువ్వు ఒక్కడివే వస్తే ఎట్లా

What is the use if you come alone without him?

గోపి : పరవాలేదు. నిన్న వాడికి చెప్పని లెక్కలు నాకు చెప్పు. నేను నేర్చుకున్న లెక్కలు వాడికి చెప్పి నేను నేర్చుకోని లెక్కలు వాడి దగ్గర నేర్చుకుంటాను.

Doesn't matter! Teach me the sums you didn't teach him yesterday. I will teach him the sums I learnt and I will learn the sums from him which he learnt.

మోహన్ : అలాగే.

Okay.

గోపి : రేపటినించీ నేనూ వేణూ యిక్కడికే రాదలచుకున్నాం.

Venu and I decided to come here from tomorrow onwards.

## EXERCISES

**a. Fill up the blanks with the adjectival participles (in suitable tenses) of the verbs given in the parentheses.**

1. రేపు ఇక్కడికి.......(రా) మనిషి నా స్నేహితుడు.
2. రమ నిన్న......(తిను) పండు పేరేమిటి ?
3. పిల్లలు ఇప్పుడు......(రాయి) పరీక్ష ఎప్పుడు పూర్తి అవుతుంది ?
4. రేపు.......(చెయ్యి) పని ఇవ్వాళే చెయ్యండి.
5. ఎల్లుండి రమ......(తే) ఉంగరం నీకిస్తాను.
6. శారద మొన్న......(చూడు) సినిమా నేనివ్వాళ చూశాను.
7. నిన్నటి పరీక్షలో.......(పాసుకా) వాళ్ళు ఎంతమంది ?
8. ఇప్పుడు వినోద్...(కొను) కారు ఎవరికోసం?
9. ఇందాక రమ....(కూర్చో) కుర్చీ ఎక్కడుంది?
10. ఇప్పుడు నువ్వు రవి దగ్గర్నించి...(తీసుకో) డబ్బులో సగం నాకు కావాలి.
11. రేపు మన పని...(జరుగు) అవకాశం ఉందా?
12. నిన్న కుర్చీ మీదినించి కింద....... (పడు) అబ్బాయికి చెయ్యి నెప్పి తగ్గిందా ?

b. Tick the correct forms.

1. శర్మ.....పుస్తకాలు ఎవరూ చదవలేదు. (చదివినన్ని/చదివినంత)
2. కమల.....మంచినీళ్ళు నువ్వు తాగుతావా ? (తాగినన్ని/తాగినంత)
3. ఆమె.......పని నువ్వెప్పుడు చేస్తావు ? (చేసినన్ని/చేసినంత)
4. ఆ సీసాలో.......పంచదార తీసుకురా ! (ఉన్నన్ని/ఉన్నంత)

c. Combine the following pairs of sentences.

1. శర్మ పాఠం చదువుతున్నాడు. అప్పుడు వాన కురిసింది.
2. కమల నిద్రపోయింది. ఇప్పుడు రమ వచ్చింది.
3. రవి ఉంగరం తెచ్చాడు. అప్పుడు ఎవరూ లేరు.
4. శారద రేపు వస్తుంది. అప్పుడు నీ పుస్తకం తీసుకొస్తుంది.
5. రమ పాటపాడుతున్నది. అప్పుడు పిల్లలు గొడవ చేశారు.

d. Combine the following pairs of sentences using adverbial participles.

1. సాయంత్రం శర్మ అన్నం తింటాడు. నిద్రపోతాడు.
2. పద్మ పాట పాడింది. భోజనం చేసింది.
3. కమల స్కూలుకు రాలేదు. సినిమాకు వెళ్ళింది.
4. శారద బాగా చదవలేదు. పరీక్షకు వచ్చింది.
5. పిల్లలు గొడవ చెయ్యటంలేదు. కూర్చున్నారు.
6. రవి భోజనం చెయ్యలేదు. ఇక్కడికి వచ్చాడు.
7. శర్మ చదవటంలేదు. పడుకున్నాడు.
8. మోహన్ ఆలోచించాడు. రాస్తున్నాడు.
9. ఆయన ఇవ్వాళ మా ఇంటికి రావటంలేదు. మీ ఇంటికి వస్తున్నారు.

**e. Answer the following questions as shown in the model.**

**Model (i) :**

నువ్వు కమలతో ఎప్పుడు మాట్లాడ్తావు ?

ఇదుగో, ఇప్పుడే మాట్లాడబోతున్నాను.

1. శర్మా ! నువ్వెప్పుడు రవిని డబ్బడుగుతున్నావు ?
2. రమా ! నేను చెప్పిన పనీ ఎప్పుడు చేస్తావు ?
3. మీరందరూ మా ఇంటికి ఎప్పుడు వస్తారు ?

**Model (ii) :**

రమ యివ్వాళ మాట్లాడుతుందా ?

రమ యివ్వాళ మాట్లాడేటట్లులేదు.

1. రవి యివ్వాళ ఇక్కడికి వస్తున్నాడా ?
2. పద్మ రేపు పుస్తకం తెస్తుందా ?
3. ఆమె ప్రతి రోజూ రవికి డబ్బు ఇస్తున్నదా ?
4. వాళ్ళు రేపు మనకు కాఫీ యిస్తారా ?
5. ఈ సంవత్సరం గిరిజ పాసవుతుందా ?
6. రోజూ వాళ్ళకు క్లాసులు జరుగుతున్నాయా ?

**Model (iii) : Answer the questions given in model (ii), in affirmation :**

**Eg.** కమల యివ్వాళ మాట్లాడుతుందా ?

కమల యివ్వాళ మాట్లాడేటట్లుంది.

**f. Answer the following questions as shown in the model using cue words.**

Model (i) :

శర్మ ఎప్పుడు వస్తాడు ? (నువ్వు-అన్నం తిను)

శర్మ నువ్వు అన్నం తినేలోగా వస్తాడు.

1. సరళ ఎప్పుడా పని పూర్తిచేస్తుంది ? (నువ్వు-రా)
2. నువ్వు అన్నం ఎప్పుడు తింటావు ? (రవి-డబ్బు తే)
3. రైలెప్పుడు వస్తుంది ? (టిక్కెట్లు-యివ్వు)

Model (ii) :

సుబ్బారావు ఇప్పుడు పాడాలా ? (నువ్వు-పాఠం చదువు)

సుబ్బారావు ఇప్పుడు పాడక్కర్లేదు ; నువ్వు చదివింతర్వాత పాడాలి.

1. ప్రసాద్ ఇప్పుడు మాట్లాడాలా ? (నువ్వు-లే)
2. రవి ఇప్పుడు చదవాలా ? (నేను-పాఠం రాయి)
3. శర్మ యిప్పుడు వెళ్ళాలా ? (వాళ్ళు-పిలు)

**g. Respond to the following sentences as shown in the model.**

**Model :**

రమ ఆ పూలు కొయ్యదు. (కమల)

రమ కొయ్యని పూలను కమల కోస్తుంది.

1. రవి చిన్న కొన్ని విషయాలు ఆలోచించలేదు. (మేం)
2. శారద ఆ పుస్తకాలు చదవదు. (నేను)
3. గోపి పెసరట్లు అన్ని తినలేదు. (సరోజ)
4. రమ ఈ కుర్చీలో కూర్చోదు. (రవి)
5. నేను ఆ బ్రెడ్డు కాల్చను. (విమల)

**h. Change the following sentences as shown in the model.**

**Model :**

శర్మా రవీ మంచివాళ్ళు.
శర్మ ఎంత మంచివాడో రవి అంత మంచివాడు.

1. నీ పుస్తకం నా పుస్తకం పెద్దవి.
2. సుగుణా విమలా బాగా పాడ్తారు.
3. మైసూరూ బెంగుళూరూ చల్లగా వుంటాయి.
4. పార్వతీ మాధవీ చాలా లావుగా వున్నారు.

**i. Rewrite the following words in FIVE related pairs.**

Eg. తల్లి—తండ్రి ; పో—వెళ్ళు

| | | | | |
|---|---|---|---|---|
| ఇవ్వాళ | తెలియజెయ్యి | మబ్బు | మరదలు | వెల్లడించు |
| వదిన | సంచీ | నేడు | వాన | బుట్ట |

**j Match the following.**

| | A | B | |
|---|---|---|---|
| 1. | నేను మాట్లాడినకొద్దీ ఆయనకు కోపం వచ్చింది. | నేను మాట్లాడాను. అందుకే ఆయనకు కోపం వచ్చింది. | (         ) |
| 2. | నేను మాట్లాడటంతో ఆయనకు కోపం వచ్చింది. | నేను మాట్లాడుతున్నప్పుడు ఆయనకు కోపం వచ్చింది. | (         ) |
| 3. | నేను మాట్లాడుతూ ఉండగా ఆయనకు కోపం వచ్చింది. | నేను ఎంత మాట్లాడానో ఆయనకు అంత కోపం వచ్చింది. | (         ) |

**k. Build up the conversations as shown in the model.**

**Model :**

శర్మ : ప్రసాద్ ఎప్పుడు బెంగుళూరు వెళ్ళాడు ? (నెల)
రవి : వెళ్ళి నెల రోజులైంది.
శర్మ : మళ్ళీ యిప్పుడు వెళ్ళదలచుకున్నాడా ?
రవి : ఆ ! రేపు వెళ్ళబోతున్నాను అనీ చెప్పాడు.

1. పద్మ : కమల రేడియోలో ఎప్పుడు పాడింది ? (వారం)
   రమ :
   పద్మ :
   రమ :

2. రవి : ప్రసాద్ ఇక్కడికి ఎప్పుడు వచ్చాడు ? (సంవత్సరం)

వేణు : ... ... ... ...

రవి : ... ... ... ...

వేణు : .... .... .... ....

3. ప్రసాద్ : మాష్టరుగారు ఎప్పుడు పరీక్ష పెట్టారు ? (రెండు వారాలు)

సుగుణ : .... .... .... ....

ప్రసాద్ : ... ... ... ...

సుగుణ : ... ... ... ...

## VOCABULARY

| | |
|---|---|
| అరుచ్ | shout (v.) |
| మొరుగు | bark (v.) |
| అర్థం | meaning |
| గమ్మత్తు | funny |
| కంగారు | confusion |
| కంగారుపడు | confuse (v. intr.) |
| లెక్క | mathematical problem; a sum |

# UNIT 21

## Lesson 83

| | | |
|---|---|---|
| లత : | కమలా! ఇప్పుడు విమల నిద్రపోతూ ఉంటుందా? | Kamala! Will Vimala be sleeping now? |
| కమల : | నిద్రపోతూ ఉండదు. రేపటినించీ వాళ్ళకు పరీక్షలు. చదువుతూ ఉంటుంది. | She won't be sleeping. She has examinations from tomorrow. She will be studying. |
| లత : | నేను విమలతో మాట్లాడాలి. వాళ్ళ చెల్లెలు గుంటూరునించి ఇవ్వాళ వస్తానన్నది. వచ్చి ఉంటుందా? | I have to talk to Vimala. Her sister told that she would come today from Guntur. Would she have come? |
| కమల : | వచ్చిఉండదు. ఇవ్వాళ గుంటూరులో పాటకచేరి ఉన్నది. వాళ్ళ చెల్లెలికి సంగీతం అంటే ఇష్టం. | She would not have come. There is a music concert at Guntur. Her sister likes music. |

లత : శాస్త్రీయ సంగీతం యిష్టమా? లలిత సంగీతం యిష్టమా?

Does she like classical music or light music?

కమల : రెండూ యిష్టమే! శాస్త్రీయ సంగీతం బాగా యిష్టం.

She likes both. She likes classical music better.

లత : ఆమె బాగా పాడుతుందా?

Does she sing well?

కమల : వీణ బాగా వాయిస్తుంది. విమల కూడా వీణ వాయిస్తుంది. వాళ్ళ నాన్నగారు రెండు రోజుల క్రితమే వాళ్ళిద్దరికీ చెరి ఒక వీణ కొని యిచ్చారు.

She plays on Veena well. Vimala also plays *Veena* well. Her father bought *Veena* for both of them two days ago.

లత : అలాగా! మరి నేను వెళ్ళి వస్తాను.

I see! I shall go then.

కమల : సరే!

Okay.

## DRILLS

a. Build-up drill.

ఇచ్చారు
కొనిచ్చారు
వీణ కొనిచ్చారు
ఒక వీణ కొనిచ్చారు
చెరి ఒక వీణ కొనిచ్చారు
ఇద్దరికీ చెరి ఒక వీణ కొనిచ్చారు.
వాళ్ళిద్దరికీ చెరి ఒక వీణ కొనిచ్చారు.
రెండు రోజుల క్రితం వాళ్ళిద్దరికీ చెరి ఒక వీణ కొనిచ్చారు
నాన్నగారు రెండు రోజుల క్రితం వాళ్ళిద్దరికీ చెరి ఒక వీణ కొనిచ్చారు.
వాళ్ళ నాన్నగారు రెండు రోజుల క్రితం వాళ్ళిద్దరికీ చెరి ఒక వీణ కొనిచ్చారు

b. Substitution drill.

Model (i):

పద్మ యిప్పుడు అన్నం తింటూఉండదు.
పాఠం_చదువు
పద్మ యిప్పుడు పాఠం చదువుతూఉండదు.

పూలు_కొయ్యి
తలుపు_తెరుచ్
పాట_పాడు
పుస్తకం_కొను

**Model (ii) :**

సరోజ వచ్చిఉంటుందా? వచ్చిఉండదా?

వెళ్ళు

సరోజ వెళ్ళిఉంటుందా? వెళ్ళిఉండదా?

అడుగు

పాడు

రాయి

చదువు

**Model (iii) :**

నాకు చపాతీలు అంటే యిష్టం.

హరి

హరికి చపాతీలు అంటే యిష్టం.

నువ్వు

మనం

మీరు

అతను

మీ చెలెలు

c. Response drill.

Model (i) :

శర్మ అన్నం తింటూఉంటాడా? (కాఫీ-తాగు)

శర్మ అన్నం తింటూఉండడు. కాఫీ తాగుతూ ఉంటాడు.

1. గోపి రవితో మాట్లాడుతూఉంటాడు. (శర్మతో-ఆమె)
2. సరళ పాఠం రాస్తూఉంటుందా? (ఉత్తరం-చదువు)
3. మనం రేపు పది గంటలకు ప్రయాణం చేస్తూ ఉంటామా? (స్టేషనుకు-వెళ్ళు)

Model (ii) :

కమల నిన్న వచ్చివుంటుందా? (మొన్న)

కమల నిన్న వచ్చివుండదు. మొన్న వచ్చివుంటుంది.

1. సరళా రమ యిప్పుడు బయల్దేరివుంటారా? (నిన్న)
2. సుబ్బారావు పాఠం చదివివుంటాడా? (ఉత్తరం)
3. రవి పాసు అయివుంటాడా? (శర్మ)

d. Transformation drill.

Model (i) :

శర్మ వస్తూవుంటాడు.

శర్మ వస్తూవుండడు.

1. రమ పూలు కోస్తూవుంటుంది.
2. మీరు పళ్ళు తింటూవుంటారు.
3. వాళ్ళు ఆలోచిస్తూవుంటారు.
4. మనం బయల్దేరుతూవుంటాం.

Model (ii) :

కమల పాటలు పాడివుంటుంది.

కమల పాటలు పాడివుండదు.

1. సరళ వీణ వాయించివుంటుంది.
2. పాప ఏడ్చివుంటుంది.
3. సుబ్బారావు మూలుగుతూ పడుకొనివుంటాడు.
4. సుభద్ర అన్నం వడ్డించివుంటుంది.

## EXERCISES

**a. Answer the following questions based upon the text of the lesson.**

1. కమల ఏం చేస్తూవుంటుంది ?
2. కమల చెల్లెలు గుంటూరునించి ఎందుకు వచ్చి ఉండదు ?
3. కమల చెల్లెలికి శాస్త్రీయ సంగీతం యిష్టమా ? లలిత సంగీతం యిష్టమా ?
4. రమవాళ్ళ నాన్నగారు ఎన్ని వీణలు కొన్నారు ?

**b. Answer the following questions in two ways as shown in the model.**

Model (i):

శర్మకు పాలు యిష్టమా ? కాఫీ యిష్టమా ? (పాలు)

(i) శర్మకు పాలు యిష్టం.

(ii) శర్మకు పాలు అంటే యిష్టం.

1. సరళకు సినిమాలు యిష్టమా ? నాటకాలు యిష్టమా ? (సినిమాలు)
2. పద్మకు శాస్త్రీయ సంగీతం యిష్టమా ? లలిత సంగీతం యిష్టమా ? (శాస్త్రీయ సంగీతం)
3. నీకు బస్సు ప్రయాణం యిష్టమా ? రైలు ప్రయాణం యిష్టమా ? (బస్సు ప్రయాణం)
4. మీకు ఆటలు యిష్టమా ? పాటలు యిష్టమా ? (ఆటలు)

Model (ii):

శర్మ అన్నం తిని ఉంటాడా ? (కాఫీ-తాగు)

శర్మ అన్నం తినీ వుండడు. కాఫీ తాగి వుంటాడు.

1. పద్మ వీణ వాయించివుంటుందా ? (పాటలు-పాడు)
2. రవి కలం కొనివుంటాడా ? (పుస్తకం-తీసుకో)
3. వాళ్ళు పాఠం చదివివుంటారా ? (ఉత్తరం-రాయి)

**c. Change the following sentences into negative.**

1. శర్మ నిద్రపోతూవుంటాడు.
2. రమ వీణ వాయిస్తూవుంటుంది.
3. సరళ పూలు కోసివుంటుంది.
4. మేం అన్నం తింటూవుంటాం.
5. నువ్వు పాఠం చదివివుంటావు.

## VOCABULARY

| | |
|---|---|
| పాటకచేరి | music concert |
| ఇష్టం | willingness |
| శాస్త్రీయ సంగీతం | classical music |
| లలిత సంగీతం | light music |
| వాయించు | play on a musical instrument |
| చెరి | each |

## GRAMMAR NOTES

**83.1. In this lesson the use of adverbal participles with the forms of the verb ఉండు is introduced.**

(i) Past adverbial participle (79.1) + ఉండు form.

| | |
|---|---|
| చదివి వుంటాడు | 'He will/would have read.' |
| చదివి వుండడు | 'He will/would not have read.' |

(ii) Present/Progressive/non-past adverbial participle (55.2.) + ఉండు form.

| | |
|---|---|
| చదువుతూవుంటాడు | 'He will/would be reading.' |
| చదువుతూవుండడు | 'He will/would not be reading.' |

In addition to express future continuous (చదువుతూ ఉంటాడు, 67.8.) and future perfect (చదివివుంటాడు) these forms also denote some uncertainty.

83.2. Notice the optional use of అంటే in sentences like:

| | |
|---|---|
| నాకు సంగీతం అంటే యిష్టం. | 'I like music.' |
| నాకు సంగీతం యిష్టం. | 'I like music.' |

In these sentences the subject takes dative case suffix. (Recall the function of the dative case suffix in expressing possession of feelings, desires and habits—38.6; 61.2.).

83.3. చెరి denotes distribution among two people.

ఆయన వాళ్ళిద్దరికీ <u>చెరి</u> నాలుగు పుస్తకాలు ఇచ్చారు. 'He gave both of them four books each.'

# UNIT 21

## Lesson 84

### చాముండికొండ మీద

ఇటీవల మా క్లాసువాళ్ళం అందరం కలిసి చాముండీ కొండకు వెళ్ళాం. కొంతమంది నడిచి వెళ్దాం అన్నారు. కొంతమంది నడవలేం, బస్సులో వెళ్దాం అన్నారు. అందరం కలిసి సరదాగా వెళ్తే మెట్లు ఎక్కటం కష్టం కాదు, సులభంగానే ఎక్కగలం అనుకున్నాం. తలా నాలుగు అరటిపళ్ళు తిని బయల్దేరాం. మెట్లకు అటూ ఇటూ చెట్లూ, పొదలూ, పెద్దపెద్ద రాళ్లూ ఉన్నాయి. నాలుగైదు మెట్లు ఎక్కామో లేదో రవికీ కుమార్‌కూ ఒక పోటీ వచ్చింది. అక్కడ ఒక పెద్ద రాయి ఉంది. ఆ రాతిని నేను ఎత్తగలను అన్నాడు రవి.

### ON THE CHAMUNDI HILL

All of us from our class went to Chamundi hill recently. Some proposed to go on foot. Some said that they could not walk and wanted to go by bus. If all of us go together, we thought climbing the steps would not be a difficult task, and we could do it easily. We ate four bananas each and started. There were trees, bushes and large stones on both the sides of the steps. We did not even climb up four steps, but Ravi and Kumar had a bet between them. There was a big stone. Ravi said "I can lift this stone up". "You cannot lift it up" said Kumar. Then Ravi wanted to

నువ్వు ఎత్తలేవు అన్నాడు కుమార్. పందెం కట్టుకున్నాడు రవి. కొండ మీద నువ్వు ఎన్ని అరటిపళ్ళు తినగలవో అన్ని కొని ఇస్తాను అన్నాడు కుమార్. రవి ఆ రాతిని ఎత్తటానికి ప్రయత్నం చేశాడు. అది లేవలేదు. మళ్ళీ ప్రయత్నించాడు. చివరికి ఆ రాయి కొంచెం లేచింది. ఇంతలో ఆ రాతి కింద ఉన్న తేలు ఒకటి రవిని కుట్టింది. వెంటనే అతను ఆ రాతిని వదిలాడు అది కింద పడ్డది. అక్కడ నేల ఏటవాలుగా ఉండటం వల్ల ఆ రాయి పక్కన ఉన్న కుమార్ పాదం మీదికి దొర్లింది. ఇద్దరూ అక్కడ మెట్టు మీద కూలబడ్డారు. ఇంక వాళ్ళిద్దరూ కొండ ఎక్కలేరు అని నిర్ణయించి కొండమీదికి వెళ్ళే ప్రయత్నం మానుకున్నాం. ఆ రోజు రవీ కుమార్ల పోటీ వల్ల మా ప్రయాణం ఆ విధంగా ముగించాల్సొచ్చింది. మైసూరులో నా అనుభవాలను గురించి యింకా కొన్ని విషయాలను ఇంకొక సారి చెప్తాను.

have a bet. Kumar said that he would buy and give atop the hill as many bananas as he (Ravi) would be able to eat. Ravi tried to lift the stone up. It could not be lifted. He tried again. At last he could lift the stone a little. In the meantime a scorpion under that stone stung Ravi. He at once dropped the stone. It fell down. Since the ground was slope, that stone slipped on to Kumar's foot. Both of them fell and sat down on a step there. Then we decided that they two could not climb up the hill any more and gave up the attempt. Because of their bet, we were thus to conclude our journey. I will tell you more about my experiences in Mysore sometime later.






## DRILLS

### a. Repetition drill

నేను కొండ ఎక్కగలను.
మేం సులభంగా ఎక్కగలం.
మనం ఆ రాయి ఎత్తగలం.
నువ్వు పందెం కట్టగలవా?
మీరు ఎన్ని అరటిపళ్లు తినగలరు?
వాడు మనకు తలా ఒక కలం ఇవ్వగలడా?
ఆమె కొండ ఎక్కగలదు.
వాళ్ళు ఈ పని చెయ్యగలరు.
అది పరిగెత్తగలదు.
అవి చెట్లు ఎక్కగలవు.

నేను కొండ ఎక్కలేను.
మేం ఈ రాళ్ళు ఎత్తలేం.
మనం అన్ని అరటిపళ్లు తినలేం.
నువ్వు ఆ రాతిని ఎత్తటానికి ప్రయత్నం చెయ్యలేవు.
మీరు పందెం కట్టలేరు.
రవి నడవలేదు.
రమ పాడలేదు.
వాళ్ళు ప్రయత్నం చెయ్యలేరు.
కుక్క చెట్టు ఎక్కలేదు.
కుక్కలు మాట్లాడలేవు.

**b. Build-up drill.**

వచ్చింది.
పోటీ వచ్చింది.
రవికీ కుమార్‌కూ పోటీ వచ్చింది.
ఎక్కామో లేదో రవికీ కుమార్‌కూ పోటీ వచ్చింది.
మెట్లు ఎక్కామో లేదో రవికీ కుమార్‌కూ పోటీ వచ్చింది.
ఐదు మెట్లు ఎక్కామో లేదో రవికీ కుమార్‌కూ పోటీ వచ్చింది.
నాలుగైదు మెట్లు ఎక్కామో లేదో రవికీ కుమార్‌కూ పోటీ వచ్చింది.

అన్నాడు.
ఇస్తానన్నాడు.
కొనిస్తానన్నాడు.
అరిటిపళ్ళు కొనిస్తానన్నాడు.
అన్ని అరిటిపళ్ళు కొనిస్తానన్నాడు.
ఎన్ని అరిటిపళ్ళు తినగలవో అన్ని అరిటిపళ్ళు కొనిస్తానన్నాడు.
కొండ మీద ఎన్ని అరిటిపళ్ళు తినగలవో అన్ని అరిటిపళ్ళు కొనిస్తానన్నాడు.

అందలేదు.
టికెట్లు అందలేదు.
సినిమా టికెట్లు అందలేదు.
మాకు సినిమా టికెట్లు అందలేదు.
వెళ్ళటం వల్ల మాకు సినిమా టికెట్లు అందలేదు.
ఆలస్యంగా వెళ్ళటం వల్ల మాకు సినిమా టికెట్లు అందలేదు.
మేం ఆలస్యంగా వెళ్ళటం వల్ల మాకు సినిమా టికెట్లు అందలేదు.

ముగించాల్సొచ్చింది.
ఆ విధంగా ముగించాల్సొచ్చింది.
ప్రయాణం ఆ విధంగా ముగించాల్సొచ్చింది.
మా ప్రయాణం ఆ విధంగా ముగించాల్సొచ్చింది.
పోటీ వల్ల మా ప్రయాణం ఆ విధంగా ముగించాల్సొచ్చింది.
రవీ కుమార్‌ల పోటీ వల్ల మా ప్రయాణం ఆ విధంగా ముగించాల్సొచ్చింది.
ఆ రోజు రవీ కుమార్‌ల పోటీ వల్ల మా ప్రయాణం ఆ విధంగా ముగించాల్సొచ్చింది.

**c. Substitution drill.**

**Model (i) :**

నేను ఆ పని చెయ్యగలను.
నువ్వు
నువ్వు ఆ పని చెయ్యగలవు.
మనం
మీరు

రవి
శారద
ఆయన
వాళ్ళు
అది
అవి

Model (ii) :

నువ్వు ఇడ్లీ తినలేవు.
మీరు
మీరు ఇడ్లీ తినలేరు.
నేను
మేం
మనం
సరళ
రవి
అది
ఆయన
అవి
వాళ్ళు

Model (iii) :

మనం ఆ పుస్తకం చదవగలమా ?
రాయి
మనం ఆ పుస్తకం రాయగలమా ?
తీసుకో
ఇవ్వు
తీసుకురా
చూపించు
అడుగు

Model (iv) :

నువ్వు హరిని అడగలేవా ?
చూడు
నువ్వు హరిని చూడలేవా ?
పిలుచ్
కొట్టు
తిట్టు
పంపించు
వెతుకు

**d. Interlocked substitution drill.**

నేను ప్రయాణం చెయ్యగలను.
రవి......................
రవి ప్రయాణం చెయ్యగలడు.
.................. లే
రవి ప్రయాణం చెయ్యలేడు.
.... చపాతీ ................
రవి చపాతీ చెయ్యలేడు.
............ తిను ........
రవి చపాతీ తినలేడు.
నువ్వు ..................
.... అన్నం ............
.............. గల
......... అడుగు ........
... పూరీ ...................
.......... చెయ్యి ......
... ప్రయత్నం ..........
.................. లే
మీరు .......................
............ మాసుకో...
మేం .......................
.......................... గల
సరళ ...........................
... ప్రయాణం ................
వాళ్ళు ..........................

**e. Response drill.**

Model (i) :

రవి ఎందుకు మన ఇంటికి రాలేదు ?

(వాన వచ్చింది)

వాన రావటం వల్ల రవి మన ఇంటికి రాలేదు.

1. శర్మ ఎందుకు మెట్టు మీద కూలబడ్డాడు ?
(కాలి మీద రాయి పడ్డది)
2. మాష్టరుగారు ఎందుకు రవిని తిట్టారు ?
(క్లాసుకు ఆలస్యంగా వచ్చారు)
3. శారదకు బస్సు ఎందుకు అందలేదు ?
(ఆలస్యంగా వెళ్ళింది)
4. సుబ్బారావు ఎందుకు సినిమాకు వెళ్ళలేదు ?
(దోవలో అతని స్నేహితుడు కలిశాడు)
5. శర్మ ఎందుకు క్లాసుకు రాలేదు ?
(తేలు కుట్టింది)

Model (ii) :

నువ్వు నాకు ఎన్ని అరిటిపళ్ళు ఇస్తావు ?

(తిను)

నువ్వు ఎన్ని అరిటిపళ్ళు తినగలవో అన్ని యిస్తాను.

1. రవికి ఎన్ని పుస్తకాలు ఇస్తావు ? (చదువు)
2. శారదకు సరళ ఎన్ని పూరీలు పెడుతుంది ?
(తిను)
3. మనకు వాళ్లు ఎన్ని కాయితాలు ఇస్తారు ?
(రాయి)

Model (iii) :

రవి చెట్టెక్కగలడా ? (శర్మ)

రవి చెట్టెక్కలేడు ; శర్మ ఎక్కగలడు.

1. నువ్వు ఆ పని చెయ్యగలవా ? (అతను)
2. కుక్కలు చెట్టెక్కగలవా ? (పిల్లలు)
3. మీరు సాయంత్రం రాగలరా ? (వాళ్ళు)
4. సరోజ వీణ వాయించగలదా ? (విమల)

Model (iv) :

కాఫీలో ఎంత పంచదార వెయ్యాలి ?

(ఎంత కావాలో....)

కాఫీలో ఎంత కావాలో అంత పంచదార వెయ్యాలి.

1. పోలీసులు ఎవరిని పట్టుకుంటారు ?
(ఎవరు దొంగలో....)
2. రమ ఎక్కడికి వెళ్తుంది ?
(ఎక్కడ సరళ ఉంటుందో....)
3. రవి ఎప్పుడు వస్తాడు ?
(ఎప్పుడు శర్మ వస్తాడో....)

Model (v) :

a. అక్కడ నలుగురు పిల్లలున్నారు.
వాళ్ళకు ఎన్ని చాక్లెట్లు ఇవ్వాలి ? (నాలుగు)

Responce : తలా నాలుగు చాక్లెట్లు ఇవ్వాలి.

b. అక్కడ యిద్దరు పిల్లలున్నారు. వాళ్ళకు ఎన్ని చాక్లెట్లు ఇవ్వాలి ? (మూడు)

Responce : చెరి మూడు చాక్లెట్లు ఇవ్వాలి.

1. రవికి ఇద్దరు చెల్లెళ్ళు. వాళ్ళకు అతను ఎన్ని వీణలు కొన్నాడు ? (ఒక)
2. కమలకు ముగ్గురు తమ్ముళ్ళు. వాళ్ళకు ఆమె ఎన్ని పుస్తకాలు కొన్నది ? (ఒక)
4. మేం పదిమందిమి. మేం ఎన్ని అరిటిపళ్ళు తినాలి ? (ఆరు)
4. మనం యిద్దరం ఎన్ని మామిడిపళ్ళు తిందాం ? (రెండు)

f. Transformation drill.

Model :

నాలుగైదు మెట్లు ఎక్కాం. ఇంతలోనే రవికీ కుమార్‌కూ పోటీ వచ్చింది.
నాలుగైదు మెట్లు ఎక్కామో లేదో రవికీ కుమార్‌కూ పోటీ వచ్చింది.

1. నేను బైటికి వెళ్లాను. ఇంతలోనే రవి నన్ను పిలిచాడు.
2. పది గంటలయింది. ఇంతలోనే మాష్టరు గారు వచ్చారు.
3. నేను శర్మను నా పుస్తకం ఎక్కడున్నది అని అడిగాను. ఇంతలోనే రవి నాకు పుస్తకం ఇచ్చాడు.

EXERCISES

a. Answer the following questions in two ways as shown in the model.

Model (i) :

శర్మ పది మైళ్లు నడవగలడా ? (సురేష్)
శర్మ పది మైళ్లు నడవలేడు; సురేష్ నడవగలడు.

1. మనం చపాతీలు తినగలమా ? (హర్యానా వాళ్ళు)
2. హర్యానావాళ్ళు అన్నం తినగలరా ? (తెలుగు వాళ్ళు)
3. నువ్వు దొంగలను పట్టుకోగలవా ? (మీరు)
4. నేను కొండ ఎక్కగలనా ? (ఆయన)
5. శారద పాట పాడగలదా ? (కమల)

Model (ii) :

శర్మ ఎందుకు వెళ్ళాడు? (వాళ్ళ నాన్నగారు రమ్మన్నారు)

వాళ్ళ నాన్నగారు రమ్మనటం వల్ల రవి వెళ్ళాల్సొచ్చింది.

1. మీ ప్రయాణం ఎందుకు మానుకున్నారు? (రవికి తేలు కుట్టింది)
2. ప్రసాద్ ఎందుకు మందు అడిగాడు? (జలుబు చేసింది)
3. కమల ఎందుకు గుంటూరు వెళ్ళింది? (వాళ్ళ అమ్మగారికి ఒంట్లో బాగా లేదు అని ఉత్తరం వచ్చింది.)

b. Combine the following pairs of sentences.

Model :

కమల మంచిది కాదు అన్నాను.

ఇంతలోనే ఆమెకు కోపం వచ్చింది.

కమల మంచిది కాదు అన్నానో లేదో ఆమెకు కోపం వచ్చింది.

1. రవి అన్నం తిన్నాడు. ఇంతలోనే శర్మ వచ్చాడు.
2. తలుపు తీశాను. ఇంతలోనే దొంగ పారిపోయాడు.
3. పుస్తకం కొన్నాను. ఇంతలోనే రవి తీసుకుపోయాడు.

c. Fill up the blanks with చెరి or తలా

1. వాళ్ళిద్దరికీ ... ... రెండు చాక్లెట్లు ఇవ్వండి.
2. రవికీ శర్మకూ ... ... నాలుగు పుస్తకాలు యివ్వండి.
3. గిరిజకూ, సరళకూ, పద్మకూ, లక్ష్మికీ...... రెండు పూలు ఇవ్వండి.
4. విద్యార్థులకు ... ... ఒక కాయితం యివ్వు.

d. Answer the following questions based upon the text of the lesson.

1. మెట్లకు అటూ యిటూ ఏం వున్నాయి?
2. రవికీ కుమార్‌కూ వచ్చిన పోటీ ఏమిటి?
3. రవి రాతిని ఎందుకు వదిలాడు?
4. రాయి ఎందుకు దొర్లింది? ఎక్కడికి దొర్లింది?
5. కొండమీదికి వెళ్ళే ప్రయత్నం ఎందుకు మానుకోవాల్సొచ్చింది?

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| ఇటీవల | recently | సరదా | happy; fun |
| కొండ | hill | మెట్టు | step (n.) |

| | | | |
|---|---|---|---|
| సులభం | easy | పాదం | foot |
| తలా | each | దొర్లు | roll (v. intr.) |
| అరటి | banana (adj.) | కూలబడు | collapse, fall down abruptly on loosing one's grip. |
| పొద | bush | ఇంక | hereafter |
| రాయి | stone | నిర్ణయించు | decide |
| పోటీ | competition | మానుకో* | give up |
| ఎత్తు | lift up | విధం | manner |
| పందెం | bet (n.) | ముగించు | conclude |
| ప్రయత్నం | effort | అనుభవం | experience (n.) |
| ప్రయత్నించు | try | పర్సు | purse (n.) |
| తేలు | scorpion | స్పీడు | speed |
| కుట్టు | sting (v.) | పచ్చ | green |
| వదులు | leave (v.) | హఠాత్తుగా | suddenly |
| నేల | ground, floor | మాత్రం | even, only |
| ఏటవాలు | slope | చూసుకో* | take care of |
| ,ల | due to, because of | | |

## GRAMMAR NOTES

84.1. In this lesson the abilitative forms are introduced. These forms do not denote any tense and they express the ability of the subject in performing the action denoted by the verb.

చెయ్యగలను. 'I can do.'

84.1.1. The formation of the abilitative is in the following pattern.

Abilitative→ Infinitive (52.3.2.) + Auxiliary -గల + Personal suffix.

చెయ్య-గల-ను 'I can do.'

చెయ్య-గల-డు 'He can do.'

84.1.2. The negative abilitative formation is in the following pattern.

Negative abilitative→ Infinitive + Auxiliary లే* + Personal suffix.

చెయ్య-లే-ను 'I cannot do'

చెయ్య-లే-డు 'He cannot do'

లే is a negative verb. (36.2.)

**84.2.** The personal suffixes used both in abilitative and negative abilitative are those which are added to the negative verb లే (36.2.)

| | |
|---|---|
| నేను తినగలను. | నేను తినలేను. |
| 'I can eat.' | 'I can't eat.' |
| మేం/మనం తినగలం. | మేం/మనం తినలేం. |
| 'We can eat.' | 'We can't eat.' |
| నువ్వు తినగలవు. | నువ్వు తినలేవు. |
| 'You can eat.' | 'You can't eat.' |
| మీరు తినగలరు. | మీరు తినలేరు. |
| 'You can eat.' | 'You can't eat.' |
| వాడు/అతను తినగలడు. | వాడు అతను తినలేడు. |
| 'He can eat.' | 'He can't eat.' |
| ఆయన/వారు/ఆమె/ఆవిడ/వాళ్ళు తినగలరు. | ఆయన/వారు/ఆమె/ఆవిడ/వాళ్ళు తినలేరు. |
| 'He/she/they can eat.' | 'He/she/they can't eat.' |
| ఆమె/అది తినగలదు. | ఆమె/అది తినలేదు. |
| 'She/it can eat.' | 'She/it can't eat.' |
| అవి తినగలవు. | అవి తినలేవు. |
| 'They (neut.) can eat.' | 'They (neut.) can't eat.' |

**84.3.** Notice the use of dubitative marker ఓ (53.3) in sentences like :

| | |
|---|---|
| నాలుగైదు మెట్లు ఎక్కామో లేదో రవికీ కుమార్‌కూ ఒక పోటీ వచ్చింది. | 'We did not climb up even four or five steps, but Ravi and Kumar had a bet between them.' |

In such expressions it is denoted that the time gap between the action mentioned in the sentence containing dubitative marker and the action mentioned in the main sentence is almost nil. And these sentences will be in past tense.

| | |
|---|---|
| వాడు లోపలికి వచ్చాడో లేదో నేను బైటికి వెళ్ళాను. | 'No sooner did he come inside, I went out.' |
| రెండు గంటలైందో లేదో రమ కాఫీ ఇచ్చింది. | 'No sooner did it strike two, Rama gave coffee.' |

84.4. -వల్ల 'due to', 'because of' is a postposition and added to the oblique bases.(16.6.)

| | |
|---|---|
| నీ వల్ల నాకు ఉద్యోగం వచ్చింది. | 'I got job because of you.' |

Also notice the use of -వల్ల with the gerund forms of the verb.

| | |
|---|---|
| నువ్వు మాట్లాడటం వల్ల రవికి కోపం వచ్చింది. | 'Because you spoke, Ravi got angry.' |

84.5. Past obligatory forms are formed by adding -సొచ్చింది to the obligatory forms. (44.1.)

| | |
|---|---|
| రావాలి + సొచ్చింది→రావాల్సొచ్చింది. | 'Someone had to come/Someone was forced to come.' (67.7.1.) |
| చెయ్యాలి + సొచ్చింది→చెయ్యాల్సొచ్చింది. | 'Someone had to do/Someone was forced to do.' (67.7.1.) |

84.6. 'తలా' denotes distribution among people more than two. ('చెరి' among two people 83.3.)

| | |
|---|---|
| ఆ ముగ్గురికీ తలా రెండు పళ్ళు ఇవ్వు. | 'Give two fruits each to those three.' |
| ఆ నలుగురికీ తలా ఒక పుస్తకం ఇవ్వు. | 'Give a book each to those four.' |
| ఆ ఇద్దరికీ చెరి ఒక పుస్తకం ఇవ్వు. | 'Give a book each to those two.' |

84.7. The plural form of -రాయి 'stone' is రాళ్ళు and the oblique base is రాతి-.

| | |
|---|---|
| అక్కడ ఒక రాయి ఉంది. | 'There is a stone.' |
| అక్కడ రెండు రాళ్ళున్నాయి. | 'There are two stones' |
| ఆ రాతిమీద కూర్చో। | 'Sit on that stone.' |

# UNIT 22

## Lesson 85

సుబ్బారావు : శర్మగారూ ! ఈ వీధిలో మా అమ్మాయివాళ్ళ ఇల్లుంది. మా అల్లుడు రేపు ఢిల్లీ వెళ్తున్నాడు. అతనితో మా అబ్బాయి గూడా వెళ్తున్నాడు. ఇంటి దగ్గర ఎన్ని గంటలకు బయల్దేర్తాడో కనుక్కుని వద్దాం. రాండి.

Mr. Sarma ! My daughter's house is in this street. My son-in-law is leaving for Delhi tomorrow. My son is also going with him. Let's go and find out at what time he is leaving home.

శర్మ : మీరు వెళ్ళి రాండి. నేను మెల్లగా వెళ్తూ వుంటాను. ఇటువైపు వెళ్ళవచ్చా ?

You go. I will be going slowly. May I go this way ?

సుబ్బా : అటు వెళ్ళకూడదు. అది . వన్‌వే ట్రాఫిక్.

You should not go that side. That is one-way traffic.

శర్మ : అలాగా !

I see !

సుబ్బా : అందుకే చెప్తున్నాను. ఇద్దరం కలిసి వెళ్దాం రాండి. — That is why I suggest that both of us can go together. Come on !

శర్మ : నా చెప్పులు తెగాయి. ఇంతలో వాటిని కుట్టటానికి యిక్కడ యిస్తాను. మీరు చూసి రండి. ఎక్కువ ఆలస్యం చెయ్యవద్దు. — My chappals are torn. In the meantime I shall give them here for mending. You call on him and come. Don't delay much.

సుబ్బా : పదండి. ముందు మీ పని అయిన తర్వాత ఇద్దరం కలిసే వెళ్దాం. — Come on ! Let's go after attending to your work.

శర్మ : ఢిల్లీకి ఇద్దరూ ఒకే పని మీద వెళ్తున్నారా ? — Are they going to Delhi on the same work ?

సుబ్బా : లేదు. అల్లుడి పని వేరు. మా అబ్బాయి పని వేరు. — No. They are going on different purposes.

## DRILLS

**a. Substitution drill.**

**Model :**

ఎక్కువగా కాఫీ తాగకూడదు.
సినిమాలు-చూడు
ఎక్కువగా సినిమాలు చూడకూడదు.

అన్నం-తిను
ఆటలు-ఆడు
ప్రయాణం-చెయ్యి
రవితో-మాట్లాడు

**b. Response drill.**

**Model (i) :**

ఏమండీ ఈ రోడ్డుమీద నడవవచ్చా ?
ఆ రోడ్డుమీద నడవకూడదు.

1. ఏమండీ ఈ నీళ్ళు తాగవచ్చా ?
2. నేను శర్మతో మాట్లాడవచ్చా ?
3. లోపలికి రావచ్చా ?
4. రవి ఈ కలం తీసుకోవచ్చా ?

Model (ii) :

శర్మను అన్నం తినవద్దు అని చెప్పు.

పాలు_తాగు

శర్మను పాలు తాగవద్దు అని చెప్పు.

తలుపు_వెయ్యి

సినిమా_చూడు

ఇంటికి_వెళ్ళు

చదరంగం_ఆడు

## EXERCISES

a. Answer the following questions as shown in the model.

Model (i) :

కమల అన్నం తినవచ్చా ?

కమల అన్నం తినకూడదు.

1. రవి సాయంత్రం సినిమాకు వెళ్ళవచ్చా ?
2. మనం ఈ వైపు వెళ్ళవచ్చా ?
3. నేను ఈ పుస్తకం కుట్టవచ్చా ?
4. నేను లోపలికి రావచ్చా ?

Model (ii) :

నేను లోపలికి రానా ?

నువ్వు లోపలికి రావచ్చు.

1. బయటికి వెళ్ళనా ?
2. మేం ఈ కాఫీ తాగమా ?
3. మనం శర్మ దగ్గరికి వెళ్దామా ?
4. మనం ఆ కొండ ఎక్కుదామా ?

b. Answer the following questions based on the text of the lesson.

1. సుబ్బారావు ఎక్కడికి వెళ్దాం అంటున్నాడు ?
2. ఇంతలో శర్మ ఏం చేస్తాడు ?

## VOCABULARY

తెగు cut (v-intr)

కుట్టు stitch (v)

వేరు different

## GRAMMAR NOTES

85.1. In this lesson prohibitive forms are introduced : -కూడదు is added to the infinitive (52.3.2.) to form prohibitive.

Probihitive→ Infinitive + కూడదు.

మాట్లాడ_కూడదు 'One should not speak.'

రా_కూడదు 'One should not come.'

**85.2.** Imperative negative$_2$ is also introduced in this lesson. -వద్దు is added to the infinitive to form imperative negative$_2$.

Imperative negative$_2$ → Infinitive + వద్దు.

| | |
|---|---|
| మాట్లాడ-వద్దు | 'Don't speak.' |
| రా-వద్దు | 'Don't come.' |

Imperative negative$_1$ forms (-అకు forms) as introduced in lesson 42 (42.2.) denote command, order, request, suggestion etc. But Imperative negative$_2$ forms (-వద్దు forms) do not denote command.

| | |
|---|---|
| తినకు | 'Don't eat.' |
| తినవద్దు | 'I suggest/request you not to eat.' |

# UNIT 22

## Lesson 86

రమ : విమలా ! ఈ సంవత్సరం కూడా మనం హైదరాబాదు పోవాలనుకుంటాను.

Vimala ! I think that we have to go to Hyderabad this year also.

విమల : అవును. నిన్న ఈ మాటే సరోజ చెప్పింది. 'రవీంద్రభారతి'లో మన ప్రోగ్రాం ఏర్పాటు చేశారని గూడా చెప్పింది. ప్రతి సంవత్సరం జనవరి ఆరో తారీకు మొదలవుతాయి గదూ అక్కడ కార్యక్రమాలు ?

Yes. Saroja told me the same thing yesterday. She added that our programme was arranged at "Ravindra Bharati". The programmes there strat on the sixth day of January every year. Don't they ?

రమ : అవును. కాని నిరుడే ఆలస్యంగా మొదలు పెట్టారు. పోయిన సంవత్సరం లాగా ఈ సంవత్సరం గూడా మనం హైదరాబాదులో సరళతో హాయిగా కాలక్షేపం చెయ్యవచ్చు.

Yes. But they started them late last year. We can spend our time with Sarala this year also as we did last year.

విమల : ఈ సంవత్సరం సరళ అక్కడ ఉండక పోవచ్చు.

Sarala might not be there this year.

రమ : ఏం ?

Why?

విమల : వాళ్ళ ఆయనకు ఈ నెలలో ట్రాన్స్‌ఫర్ కావచ్చు అని రాసింది.

She wrote to me that her husband might get a transfer this month.

రమ : కావచ్చు అని రాసిందా ? అవుతుంది అని రాసిందా ?

Did she write that he *might* get a transfer or *would* get?

విమల : గట్టిగా చెప్పలేం, ట్రాన్స్‌ఫర్ కావచ్చు అని రాసింది.

She wrote that she could not be sure of it and that he might be tranferred.

రమ : కావచ్చు అంటే కాకపోవచ్చు అని గూడా మనం అనుకోవచ్చు గదా ?

'May be' also means 'May not be' Can we not take it like that?

విమల : అలాగే అనుకుందాం. మనం హైదరాబాదుకు పోయే రోజుకు ఒక వారం ముందు ఉత్తరం రాద్దాం. కమల గుంటూరు వెళ్ళింది గదా ; వచ్చి ఉంటుందా ?

Okay. Let's take it that way. We will write a letter one week before we leave for Hyderabad. Kamala went to Guntur. Would she have come back ?

రమ : ఇవ్వాళ వచ్చిఉండకపోవచ్చు.

She might have not come today.

విమల : కాదు. ఉదయం పది గంటలకే వచ్చింది. ఇప్పుడు ఇక్కడికి వస్తానని గూడా చెప్పింది. వస్తూఉండవచ్చు.

No. She came at 10 a.m. today. She told me that she would come here now. She might be coming.

## DRILLS

**a. Repetition drill**

ఇవ్వాళ వాన కురవవచ్చు; కురవక పచ్చు.

రవి నిన్న వచ్చిఉండవచ్చు; వచ్చిఉండకపోవచ్చు.

వాళ్ళ కార్యక్రమం ఇవ్వాళ మొదలయిఉండవచ్చు; మొదలయిఉండకపోవచ్చు.

సరళ పాసుకావచ్చు; పాసు కాకపోవచ్చు.

ఇప్పుడు అతను అన్నం తింటూఉండవచ్చు; తింటూ ఉండకపోవచ్చు.

**b. Build-up drill.**

వెళ్ళవచ్చు.
సినిమాకు వెళ్ళవచ్చు.
హాయిగా సినిమాకు వెళ్ళవచ్చు.
మనం హాయిగా సినిమాకు వెళ్ళవచ్చు.
శర్మతో మనం హాయిగా సినిమాకు వెళ్ళవచ్చు.
రేపు గూడా శర్మతో మనం హాయిగా సినిమాకు వెళ్ళవచ్చు.
నిన్నటిలాగా రేపు గూడా శర్మతో మనం హాయిగా సినిమాకు వెళ్ళవచ్చు.

రాద్దాం.
ఉత్తరం రాద్దాం.
ముందు ఉత్తరం రాద్దాం.
వారం ముందు ఉత్తరం రాద్దాం.
ఒక వారం ముందు ఉత్తరం రాద్దాం.
జరిగే రోజుకు ఒక వారం ముందు ఉత్తరం రాద్దాం.
నాటకం జరిగే రోజుకు ఒక వారం ముందు ఉత్తరం రాద్దాం.
మన నాటకం జరిగే రోజుకు ఒక వారం ముందు ఉత్తరం రాద్దాం.

Model (i):

సరళ మైసూరు వెళ్ళిఉండవచ్చు.
పుస్తకం–చదువు
సరళ పుస్తకం చదివిఉండవచ్చు.
డబ్బు–తే
వీణ–వాయించు
చొక్కా–కుట్టు
సుగుణను–పిలుచ్
పరీక్షలో–పాసుకా

Model (ii):

సుబ్బారావు రేపు రాక పోవచ్చు.
వెళ్ళు
సుబ్బారావు రేపు వెళ్ళకపోవచ్చు.
నిద్రపో
చదువు
పాసుకా
మొదలు పెట్టు
మాట్లాడు

**c. Response drill.**

Model (i):

మీకు ఈ వారంలో ట్రాన్స్‌ఫర్ అవుతుందా?
ఈ వారంలో నాకు ట్రాన్స్‌ఫర్ కావచ్చు కాకపోవచ్చు.

1. ఇవ్వాళ మీకు శర్మదగ్గర్నించి ఉత్తరం వస్తుందా?
2. శర్మ ఈ సంవత్సరం పాసుఅవుతాడా?
3. రేపు మీరు సినిమాకు వెళ్తారా?
4. సాయంత్రం వాన కురుస్తుందా?
5. అతన్ని చూసి 'సుబ్బారావు' అనుకుంటారా?
6. ఇవ్వాళ నాటకం జరుగుతుందా?

**Model (ii) :**

నిన్న శారద పాట పాడిందా ?

ఏమో ! పాడిఉండవచ్చు. పాడిఉండక పోవచ్చు.

1. మొన్న నాటకం జరిగిందా ?
2. నా ఉంగరం కమల తీసుకున్నదా ?
3. నిన్న విమల వీణ వాయించిందా ?
4. శర్మ పాసుఅయ్యాడా ?
5. అతను డబ్బు తెచ్చాడా ?

**Model (iii) :**

ఇప్పుడు రవి నిద్రపోతూఉంటాడా ?

నిద్రపోతూఉండవచ్చు, నిద్రపోతూఉండక పోవచ్చు.

1. సుశీల వీణ వాయిస్తూఉంటుందా ?
2. పిల్లలు ఇప్పుడు పాఠాలు చదువుతూఉంటారా ?
3. ఇప్పుడు నాటకం జరుగుతూఉంటుందా ?

## EXERCISES

a. Change the following questions as shown in the model.

**Model (i) :**

శర్మ ఇవ్వాళ రావచ్చు.

శర్మ ఇవ్వాళ రాకపోవచ్చు.

1. శారద ఇప్పుడు వీణ వాయించవచ్చు.
2. సుశీల ఈ సంవత్సరం పాసు కావచ్చు.
3. రేపు శ్రీధర్ నీకు ఉత్తరం రాయవచ్చు.
4. ఇప్పుడు మనల్ని శర్మ పిలవటానికి రావచ్చు.
5. రవి ఇప్పుడు నిద్రపోతూఉండవచ్చు.
6. శారద వంట చేస్తూఉండవచ్చు.
7. కమల ఇంటికి వెళ్ళిఉండవచ్చు.
8. సుగుణ పాఠం చదివిఉండవచ్చు.

**Model (ii) :**

ఈ సంవత్సరం రవి పాసుకావచ్చు అన్నారు మాష్టరుగారు.

కావచ్చు అంటే కాకపోవచ్చు అని కూడా మనం అనుకోవచ్చు గదా ?

1. సుశీల రేపు రావచ్చు అన్నది గిరిజ.
2. రవికి రేపు జ్వరం తగ్గవచ్చు అన్నారు డాకరుగారు.
3. శర్మ ఈ పుస్తకం తీసుకోవచ్చు అన్నాడు గిరి.
4. నిన్ను ఇవ్వాళ గోపి పిలవవచ్చు అన్నాడు శర్మ.
5. ఇప్పుడు వాళ్ళ ప్రోగ్రాం మొదలయి ఉండవచ్చు అన్నది సుగుణ.

b. **Answer the following questions in negative statements using -అకపోవచ్చు.**

Model :

1. శర్మ ఇవ్వాళ నిద్రపోతాడా ?
2. సుశీల ఇప్పుడు అన్నం వడ్డిస్తుందా ?
3. శర్మ ఉంగరం పెట్టుకుంటాడా ?
4. ఈ పుస్తకాన్ని రవి తీసుకుంటాడా ?
5. గిరి నాకు ఉత్తరం రాస్తాడా ?
6. కమల పాసుఅవుతుందా ?
7. శ్రీధర్ పుస్తకాలు తెస్తాడా ?

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| ప్రోగ్రాం | programme(n.) | నిరుడు | last year |
| మొదలుపెట్టు | begin(v.tr.) | మొదలుకా | begin(v.intr.) |
| కార్యక్రమం | programme(n.) | ట్రాన్స్‌ఫర్ | transfer(n.) |

## GRAMMAR NOTES

86.1. In this lesson another function of -వచ్చు forms (52.3.) is introduced. In 52.3. it is said that these forms are used to sanction permission or to request for permission. In this lesson these forms are used to express doubt.

| | |
|---|---|
| ఇవ్వాళ వాన కురవవచ్చు. | 'It may rain today.' |
| ఆయనకు ట్రాన్స్‌ఫర్ కావచ్చు. | 'He may be transferred.' |

86.2. -అకపోవచ్చు is the corresponding negative of వచ్చు shown in 86.1. -అకపోవచ్చు is added to the verbal base.

కురుస్ + అకపోవచ్చు → కురస్-అకపోవచ్చు (67.3.) → కురవ్-అకపోవచ్చు (67.5.) → కురవకపోవచ్చు.

| | |
|---|---|
| ఇవ్వాళ వాన కురవకపోవచ్చు. | 'It may not rain today.' |
| ఆయనకు ట్రాన్స్‌ఫర్ కాకపోవచ్చు. | 'He may not be transferred.' |

(కా + అకపోవచ్చు 41.7.).

86.2.1. -అకపోవచ్చు gives negative meaning of -వచ్చు in the expression of doubt only as shown in 86.1. It is not used as negative of -వచ్చు in the other usages, i.e., request for permission and sanction of permission.

86.3. -ఆయన, when used with a *plural* pronominal adjective, means 'husband'. (15.5; 61.6.).

| | |
|---|---|
| మీ ఆయన | 'your husband' |
| వాళ్ల ఆయన | 'her husband' |

# UNIT 22

## Lesson 87

| | |
|---|---|
| బసవయ్య : నరసింహారావుగారూ ! నేను ఈ ఇల్లు కొందాం అనుకుంటున్నాను. ఎట్లా ఉందో చూడండి. | Mr. Narasimharao! I am planning to buy this house. Please see how it is. |
| నరసింహారావు : ఇది ఎవరి ఇల్లు ? | Whose house is this? |
| బసవయ్య : ఎవరిదో మనకు తెలియదు. | It is not known whom does it belong to. |
| నర : ఎంతకు అమ్ముతారట ? | How much will they sell it for? |
| బస : అరవై అయిదు వేలు. మొన్న మీరొక ఇల్లు కొన్నారట గదా ! | Sixtyfive thousand rupees. I understand that you bought a house recently. |
| నర : అవును. | Yes. |

| | |
|---|---|
| బసవయ్య : అది ఎంత ? | How much did it cost ? |
| నరసింహారావు : ఎనభై వేలు. దాని మీద ఇంకొక వెయ్యి రూపాయలు రిపేరుకు ఖర్చు అయింది. | Eighty thousand rupees. Another thousand was incurred on repairs. |
| బసవయ్య : ఇది అరవైఅయిదువేలు చేస్తుందంటారా ? | Does this cost sixtyfive thousand rupees. |
| నర : అదే ఆలోచిస్తున్నాను. రిపేర్లకు మీకు చాలా ఖర్చు పెట్టాల్సొస్తుందనుకుంటాను. | That's what I am wondering. I think, you will have to spend a lot on repairs. |
| బస : అలాగే కనిపిస్తున్నది. | It looks like that. |
| నర : యాభై వేలకు అడగండి. | Ask for fifty thousand. |
| బస : యాభై వేలకు యివ్వడట. అరవైఐదు వేలకు ఒక్క పైస కూడా తగ్గడట ! | It seems he doesn't want to sell it for fifty thousand ; he would not come down even by a single paisa. |
| నర : అయితే దీన్ని కొనకండి. అరవైఐదు వేలకు యింతకంటె మంచి యిళ్ళు దొరుకు: | If so, don't buy this one. Better houses will be available for sixtyfive thousand. |

## DRILLS

a. Build-up drill.

| | |
|---|---|
| అంటారా ? | చెయ్యాల్సొస్తుంది. |
| చేస్తుందంటారా ? | సహాయం చెయ్యాల్సొస్తుంది. |
| నాలుగు రూపాయలు చేస్తుందంటారా ? | ఒక సహాయం చెయ్యాల్సొస్తుంది. |
| కలం నాలుగు రూపాయలు చేస్తుందంటారా ? | నాకొక సహాయం చెయ్యాల్సొస్తుంది. |
| ఈ కలం నాలుగు రూపాయలు చేస్తుందంటారా ? | మీరు నాకొక సహాయం చెయ్యాల్సొస్తుంది. |

పిన్నిగారూ!
వెళ్ళాలట పిన్నిగారూ!
డ్యూటీకెళ్ళాలట పిన్నిగారూ!
నాలుగింటికే డ్యూటీకెళ్ళాలట పిన్నిగారూ!
ఆయన నాలుగింటికే డ్యూటీ కెళ్ళాలట పిన్నిగారూ!
మాఆయన నాలుగింటికే డ్యూటీ కెళ్ళాలట పిన్నిగారూ
ఈ రోజు మాఆయన నాలుగింటికే డ్యూటీకెళ్ళాలట పిన్నిగారూ!




**b. Conversation drill.**

**Model :**

కమల : నా దగ్గర కలం లేదు. రమను ఇవ్వమను.

విమల : రమా! నీ కలం కమలకు ఇవ్వు.

కమల : ఎందుకు?

విమల : కమల దగ్గర కలం లేదట!

1. సుబ్బారావు : రవీ! శర్మతో నాకు పని ఉంది. వాణ్ణి నాదగ్గరికి రమ్మను.

రవి : శర్మా! సుబ్బారావు దగ్గరికి వెళ్ళు.

శర్మ : ఎందుకు?

రవి : ....................

2. శారద : మా నాన్నగారు కమలను పిలుస్తున్నారు. దాన్ని మా యింటికి రమ్మను.

సుగుణ : కమలా! నువ్వు శారదవాళ్ళ యింటికి వెళ్ళు.

కమల : ఎందుకు?

సుగుణ : ...............

3. గోపి : సినిమా మొదలుపెట్టే టైం అయింది. తొందరగా నడవండి.

రాము : శర్మా! నువ్వు గూడా తొందరగా నడు!

శర్మ : ఎందుకు?

రాము : ...............

4. మాష్టరు : రేపు మంత్రిగారు వస్తున్నారు. మీరందరూ తొమ్మిదింటికే రండి.

సరళ : రేపు మనం తొమ్మిదింటికే వెళ్ళాలి.

శ్యామల : ఎందుకు?

సరళ : ...............

**c. Response drill.**

**Model :**

కమల : రమా। సరళ యిప్పుడు పాట పాడాలి.

రమ : సరళా। నువ్విప్పుడు పాట పాడాలట.

1. రవి : సుగుణా। శర్మ పాసయ్యాడు.
   సుగుణ : ....................
2. పద్మ : శారదా। రామారావుకు నేనొక కథ చెప్తాను.
   శారద : ....................
3. వాసు : మోహన్। కమలకొక ఉత్తరం వచ్చింది.
   మోహన్ : ....................
4. రేఖా। గీత పెద్దగా మాట్లాడకూడదు.
   రేఖ : ....................

**d. Transformation drill.**

**Model :**

ఇక్కడ ఒక స్కూలు ఉంది.

ఇక్కడ రెండు స్కూళ్లు ఉన్నాయి.

1. నాకు ఒక పన్ను నెప్పిగా వుంది.
2. శర్మకు ఒక వెయ్యి రూపాయలు కావాలి.
3. అక్కడ ఒక మనిషి నిల్చున్నాడు.

## EXERCISES

a. Respond to the following sentences as shown in the model.

Model :

శారద : విజయా। సరళను మాట్లాడమను.

విజయ : సరళా। నువ్వు మాట్లాడాలట। శారద చెప్పింది.

1. మాష్టరు : మోహన్। రవిని రేపు రమ్మను.
2. సుశీల : సుగుణా। సోమును మార్కెట్టుకు వెళ్ళమను.
3. రమ : శ్రీధర్। సుశీలను ఉప్మా చెయ్యమను.
4. పద్మ : గిరిజా। పాపను పాలు తీసుకోమను.

b. Change the following questions as shown in the model.

**Model :**

శర్మ రేపు వీణ వాయించాలి.

శర్మ రేపు వీణ వాయించాల్సొస్తుంది.

1. సుగుణ రేపు ఇక్కడికి వస్తే ఒక పాట పాడాలి.
2. ఈ ఇల్లు కొంటే చాలా డబ్బు ఖర్చు పెట్టాలి.
3. శర్మను పిలిస్తే వాడు రాసిన కథలు వినాలి.
4. బస్సులో వెళ్తే అక్కడ ఒక మైలు నడవాలి.

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| అమ్ము | sell | ఖర్చుపెట్టు | spend |
| రిపేరు | repair(n.) | డ్యూటీ | duty |
| ఖర్చుకా | be spent | | |

## GRAMMAR NOTES

87.1. In this lesson the reportive particle -అట is introduced. -అట is added to a sentence as a whole when a statement is retold, as narrated by some body.

శర్మ ఇవ్వాళ అన్నం తినలేదట. 'It is learnt, Sarma did not take food today.'
(తినలేదు + అట)

The speaker of this sentence by using -అట conveys that this information is learnt by him from some other source and that he is not an eye-witness to the fact expressed in the statement.

87.2. Future obligatory forms are formed by adding -సొస్తుంది to the obligatory forms. (44.1.; 84.5.).

రావాలి + సొస్తుంది → రావాల్సొస్తుంది. 'will have to come' (67.7.1.)

చెయ్యాలి + సొస్తుంది → చెయ్యాల్సొస్తుంది. 'will have to do' (67.7.1.)

87.3. The plural form of వెయ్యి 'thousand' is వేలు.

రెండు వేలు 'two thousand'

87.4. Notice the use of dative case suffix in the following sentences.

ఎంతకు అమ్ముతాడు? 'How much will he sell it for?'

ఇరవై వేలకు ఇవ్వడు. 'He will not give it (sell it) for Rs. 20,000.'

ఇరవై వేలకు అడగండి. 'Bargain it for Rs. 20,000.'

ఇరవై ఐదు వేలకు ఒక పైస కూడా తగ్గడు. 'He will not come down from Rs. 25,000 by even one paisa.

In the first three sentences the dative case suffix expresses 'location' of price as we have seen location of time in 36.8. (నాటకం ఆరు గంటలకు). In the fourth sentence it is ablative case relationship (39.1.) expressed by the dative case suffix.

# REVIEW 11

## Lesson 88

| | |
|---|---|
| వినోద్ : నాన్నగారూ! 'తెల్లవారటం' అంటే ఏమిటి? 'పొద్దుగూకటం' అంటే ఏమిటి? మా క్లాసు పిల్లలు తలా ఒక అర్థం చెప్తున్నారు. | Father! What does '*tellavaaraṭam* mean? What does *podduguukaṭam* mean? The children of our class are giving different meanings. |
| శర్మ : సూర్యుడు ఉదయిస్తున్నప్పుడు తెల్లవారుతున్నది అంటాం. ఉదయించిన తర్వాత తెల్లవారింది అంటాం. | While the sun rises, we call it the day-break. After the sunrise we call it morning . |
| వినోద్ : అయితే తెల్లవారటం అంటే చీకటి పోయి వెలుతురు రావటం అన్నమాట! అంటే పగలు కావటం. | Then, 'daybreak 'means emergence of light after darkness vanishes. |
| శర్మ : 'పగలు అయింది' అనకూడదు. అలా ఎవరూ అనరు. 'తెల్లవారింది' అంటారు. | You should not say *pagalu ayindi*. Nobody says so. People say *tellavaarindi*. |

వినోద్ : మరి పొద్దుగూకటం అంటే ఏమిటి ?

Then what does '*poddaguukatam*' mean?

శర్మ : పొద్దు అంటే సూర్యుడు అని అర్థం.

*Poddu* means the Sun.

వినోద్ : సూర్యుణ్ణి 'పొద్దు' అని అనటం నేను వినలేదే !

I never heard anyone calling the Sun as *poddu.'*

శర్మ : సూర్యుణ్ణి పొద్దు అని ఎవరూ అనరు కాని పొద్దుగూకింది అనే మాటలో వున్న 'పొద్దు'కు సూర్యుడు అని అర్థం. పొద్దుపొడిచింది అంటే సూర్యోదయం అయింది అని అర్థం. పొద్దెక్కింది అంటే సూర్యుడు ఉదయించి కొంచెం పైకి వచ్చాడు అని అర్థం. పొద్దువాలింది అంటే సాయంత్రం అయింది అని అర్థం. పొద్దుగూకింది అంటే సూర్యాస్తమయం అయింది అని అర్థం. పొద్దు పోయింది అంటే సూర్యుడు అస్తమించి చాలా సేపు అయింది అని అర్థం.

No one calls the Sun as *poddu.* But in *poddu guukindi,* the word *poddu* means the Sun.

*Poddu podichindi* means dawn.

*Poddekkindi* meas the Sun rose and is up in the sky.

*Podduvaalindi* means evening.

*Podduguukindi* means the Sun has set.

*Poddu pooyindi* means it is long after the sunset.

వినోద్ : ఇప్పుడు అర్థమయింది నాన్నగారూ ! రేపు మా మాష్టరుగారడిగితే సరిగ్గా చెప్పగలను. తక్కిన వాళ్లు చెప్పలేరు.

Now, i understand. If my teacher asks me tomorrow, I can answer correctly. Others cannot answer.

శర్మ : ఎందుకు చెప్పలేరు ?

Why can't they answer?

వినోద్ : ఇవన్నీ మీరు వాళ్ళకు చెప్పలేదు గదా !

Because you dind't explain all these things to them.

శర్మ : సరే ! పద అన్నం తిందాం.

Okay! Let us go and have our meal.

వినోద్ : నాన్నగారూ ! ఇప్పుడు ఇక్కడ మధ్యాహ్నం అయింది గదా ! అమెరికాలో తెల్లవారుజాము అయివుంటుందట ! మా మాష్టరుగారు చెప్పారు.

Now it is afternoon here. It seems that it will be early morning in America. Our teacher said this.

శర్మ : అవును.

Yes.

వినోద్ : ఈ ప్రశ్న రేపు పరీక్షలో రావచ్చుట ! అలా ఎందుకు అవుతుంది నాన్నగారూ ?

This question may appear in the examination tomorrow. Why does it happen like that, father ?

శర్మ : ఇంత కష్టమైన ప్రశ్నలు మీ క్లాసువాళ్ళను అడగకపోవచ్చు. కాని తెలుసుకోటం వల్ల జ్ఞానం పెరుగుతుంది.

Your class children may not be asked such difficult questions. But you can improve your knowledge by knowing it.

వినోద్ : మీరు చెప్పండి నాన్నగారూ ! చెప్తే నాకు బాగా అర్థమవుతుంది. తర్వాత చదవక్కర్లేదు.

Then, father, tell me. If you tell me, I can understand better. I need not study later.

శర్మ : అలాగే చెప్తాను. పద, అన్నం తిందాం. అన్నం తిన్న తర్వాత చెప్తాను.

All right, I will tell you. Let us go and have our meal. After the meal, I will tell you.

## EXERCISES

a. Fill up the blanks with either చెరి or తలా

1. శర్మ, సుబ్బారావు.........ఒక పుస్తకం కొంటున్నారు.
2. గోపాలరావు సరోజ, సుశీల ...... నాలుగు రూపాయలు ఇచ్చారు.
3. శ్యామల, కమల, ప్రభ, సరోజ ... ... పది పాటలు పాడారు.
4. రాధ, ఉమా ...... రెండు సార్లు సుబ్బారావు ఇంటికి వెళ్లారు.

b. Fill up the blanks with the గల forms of the verbs given in the parentheses :

1. శర్మ ఇంగ్లీషు.........(మాట్లాడు)
2. పద్మ సోమవారం...........(రా)
3. మనం ఇక్కడ్నించి అక్కడికి.......(నడు)
4. వాళ్లు మీ బాకీ ...........(తీర్చు)
5. నువ్వు ఈ పాఠం ...........(చదువు)
6. అవి చెట్లు......... (ఎక్కు)

c. Change the following sentences into negatives by using -అకపోవచ్చు.

1. శర్మ సాయంత్రం రావచ్చు.
2. శారద ఈ రాత్రి పాట పాడవచ్చు.
3. ఇప్పుడు ఆయన మనల్ని పిలవవచ్చు.
4. ఇవ్వాళ రైలు టైముకు బయల్దేరవచ్చు.
5. కమల ఈ సంవత్సరం పరీక్ష పాసుకావచ్చు.

d. Change the following sentences into prohibitives by using -కూడదు.

1. సుశీల ఇవ్వాళ రావచ్చు.
2. శారద సుశీలతో మాట్లాడాలి.
3. కమల ఈ తలుపులు తెరవాలి.
4. ప్రభ కమల దగ్గర డబ్బులు తీసుకోవాలి.

e. Answer the following sentences as shown in the model.

Model :

నువ్వు శర్మను ఎప్పుడు పిలిచావు? (రైలు వచ్చింది).
రైలు వచ్చిందో లేదో నేను శర్మను పిలిచాను.

1. నువ్వు ఆఫీసునించి ఎప్పుడు వెళ్ళావు? (క్లాసు అయింది).
2. జనం ఎప్పుడు గుమిగూడారు? (ఆఫీసు తెరిచారు).
3. వాన ఎప్పుడు వచ్చింది? (నేను బయటికి వచ్చాను).

f. Pick out the pairs of words from the following list. The pairs should be comprised of opposite words like పెద్ద, చిన్న.

| | |
|---|---|
| తెల్లవారటం | సుఖం |
| వదులు | కొను |
| కష్టం | పట్టుకో |
| అమ్ము | పొద్దుగూకటం |

g. Pick out the words which have more than one meaning and give their meanings.

| | |
|---|---|
| కొట్టు | ఇటీవల |
| రాయి | నడవలేదు |
| మెట్టు | చెప్పు |
| పళ్ళు | అమ్మ |

**h. Combine the following pairs of sentences as shown in the model.**

Model (i) :

రమకు పాట పాడటం యిష్టం లేదు. కాని పాడింది.

రమ పాట పాడాల్సొచ్చింది.

1. శ్యామలకు నిన్న ఊరికి వెళ్ళటం యిష్టం లేదు. కాని వెళ్ళింది.
2. పద్మకు రమను పిలవటం యిష్టం లేదు. కాని పిలిచింది.
3. విశ్వనాథంగారికి నాదగ్గర డబ్బు తీసుకోటం యిష్టం లేదు. కాని తీసుకున్నారు.
4. సరోజినికి నిన్న అక్కడ వీణవాయించటం యిష్టం లేదు. కాని వాయించింది.

Model (ii) :

శర్మ యిక్కడికి వచ్చాడు. అందువల్ల రవి మాట్లాడలేదు.

శర్మ యిక్కడికి రావటం వల్ల రవి మాట్లాడలేదు.

1. పాప ఏడ్చింది. అందువల్ల ఆమె ఆఫీసుకు ఆలస్యంగా వచ్చింది.
2. శారద వద్దన్నది. అందువల్ల రమ రాలేదు.
3. రైలు లేటయింది. అందువల్ల శర్మ యింకా రాలేదు.

i. Rewrite the following sentences using అట.

1. శర్మ యివ్వాళ యింటికి రాలేదు.
2. కమల యిప్పుడు పాట పాడాలి.
3. శారద మొక్కలకు నీళ్ళు పొయ్యాలి.

j. Build up the conversations as shown in the model.

Model :

రవి : సుశీల వచ్చిందా ?

శర్మ : వచ్చివుండవచ్చు.

రాము : అప్పుడే వచ్చివుండదు. ఇప్పుడు వస్తూవుంటుంది.

1. కమల : శారద చేస్తున్న పని పూర్తి అయిందా ?

సుశీల : ...............

మాధవి : ...................

2. మోహన్ : మధు అరటిపళ్ళు తెచ్చాడా ?

వినోద్ : ...................

కుమార్ : ...................

3. ప్రసన్న : సురేంద్ర రవికి పుస్తకాలు యిచ్చాడా ?

పరమేశ్వరం : ...............

వినాయకరావు : ..................

4. గణపతి : విమల ఉత్తరం రాయడం పూర్తి చేసిందా ?

ప్రభాకర్ : ...................

భారతి : ...............

**k. Match the following.**

| A | B | |
|---|---|---|
| 1. తెల్లవారింది | 4.00 A.M. | (   ) |
| 2. పొద్దుఎక్కింది | సూర్యాస్తమయం అయింది | (   ) |
| 3. పొద్దుగూకింది | రాత్రి 10 గంటలు | (   ) |
| 4. పొద్దుపోయింది | ఉదయం 10 గంటలు | (   ) |
| 5. తెల్లవారుజాము | సూర్యోదయం అయింది | (   ) |

**l. Tick the most correct statements.**

1. రవి కమలను కొట్టలేదు. అంటే—

 అ. రవి కమలను కొట్టటం అనే పని జరగలేదు.

 ఆ. రవికి కమలను కొట్టే శక్తి లేదు.

 ఇ. రవిని కమల కొట్టలేదు.

2. పోలీసులు వచ్చారో లేదో దొంగలు పారిపోయారు. అంటే—

 అ. దొంగలు పారిపోయారో లేదో పోలీసులు వచ్చారు.

 ఆ. పోలీసులు రావటానికి ముందు దొంగలు పారిపోయారు.

 ఇ. పోలీసులు రావటం దొంగలు పారిపోవటం అనే వాటిలో ఏది ముందు జరిగిందో చెప్పలేము.

3. రవి ఈ సంవత్సరం పాసుకాకపోవచ్చు. అంటే—

 అ. రవి ఈ సంవత్సరం పాసుకాడు అని గట్టిగా చెప్పవచ్చు.

 ఆ. రవి ఈ సంవత్సరం పాసుకాలేడు.

 ఇ. రవి ఈ సంవత్సరం పాసుకాడు అని గట్టిగా చెప్పలేం.

4. 'కమల నీ పుస్తకం తీసుకున్నదట' అని నేను నీకు చెప్పినప్పుడు—

 అ. కమల నీ పుస్తకం తీసుకోటం నేను చూశాను అని నువ్వు అనుకోవచ్చు.

 ఆ. కమల నీ పుస్తకం తీసుకోటం నేను చూశానో చూడలేదో నీకు తెలియదు.

 ఇ. కమల నీ పుస్తకం తీసుకున్నది అని నాకు ఎవరో చెప్పారు అని నువ్వు అనుకోవచ్చు.

**VOCABULARY**

| | |
|---|---|
| తెల్లవారు | dawn (v.) |
| పొద్దుగూకు | become dark (as in the evening) |
| సూర్యుడు | (the) sun |
| ఉదయించు | rise (v. intr.) |
| పొద్దు | (the) sun |
| పొద్దుపొడుచ్ | dawn (v.) |

| | | | |
|---|---|---|---|
| సూర్యోదయం | **sunrise** | అస్తమించు | **sink below the horizon (v. intr.)** |
| పొద్దెక్కు | **become bright (as the day)** | అర్థంకా | **be understood** |
| పొద్దువాలు | **become evening** | తెల్లవారుజాము | **early morning** |
| సూర్యాస్తమయం | **sunset** | ప్రశ్న | **question (n.)** |
| పొద్దుపో | **become dark** (as in the evening) | జ్ఞానం | **knowledge** |

# UNIT 23

## Lesson 89

రాము : నాన్నగారూ! ఇవ్వాళ సాయంత్రం అన్నయ్యా, వదినా విజయవాడనించి వస్తున్నారు కదూ! నేను స్టేషనుకు వెళ్తాను.

Father! Brother and sister-in-law are arriving from Vijayawada. Aren't they? I will go to the station.

శర్మ : వెళ్లు. ప్లాట్‌ఫారం మీదికి వెళ్ళాలంటే ఏం చెయ్యాలో తెలుసా?

All right! Do you know what you should do to go to the platform?

రాము : తెలుసు నాన్నగారూ! ప్లాట్‌ఫారం మీదికివెళ్లాలంటే ప్లాట్‌ఫారం టిక్కెట్టు కొనాలి. అది చూపించకపోతే లోపలికి రానిస్తారా?

I know it, father. To go to the platform, platform ticket has to be purchased. Without that will they allow inside?

| | |
|---|---|
| శర్మ : వాళ్ళు రానివ్వటం రానివ్వకపోవటం మనకు అక్కర్లేదు. ప్లాట్‌ఫారం టిక్కెట్టు కొని లోపలికి వెళ్ళటం మన పని. | Their allowing to enter or not allowing is not important for us. Buying the platform ticket before going in is our duty. |
| రాము : కాని కిందటి సారి నేను అక్కయ్యతో వెళ్ళినప్పుడు వాళ్ళు టిక్కెట్టు లేకుండానే పోనిచ్చారు. ఎవరూ అడగలేదు. | But they allowed us in without buying the ticket when I went with elder sister. Nobody demanded it. |
| శర్మ : మీరు టిక్కెట్టు కొన్నారనుకుని వాళ్ళు అడిగివుండరు. | They might not have asked you thinking that you bought the ticket. |
| రాము : తమ్ముడు కూడా వస్తాడట నాన్నగారూ! | Younger brother also wants to come with me, father. |
| శర్మ : రానీ! రోడ్లు దాటేటప్పుడు జాగ్రత్తగా దాటండి. వాణ్ణి నువ్వు విడిచి ఎక్కడికీ పోనివ్వకు. | Let him come. Be careful when you cross the roads. Don't allow him to go alone anywhere. |
| రాము : అలాగేనండి! | Okay! |
| రవి : నాన్నగారూ! అన్నయ్య స్టేషనుకు వెళ్తున్నాడు. నేను కూడా వెళ్తాను. | Father! Brother is going to the station. I will also go with him. |
| శర్మ : వెళ్ళుదువుగాని. | Okay! You can also go. |
| విమల : రవీ! ఇలా రా! అన్నయ్యను కూడా పిలు. అన్నం తిందురుగాని. | Ravi! come here. Call brother also. You can have your food. |
| రవి : అన్నయ్యా! నేను కూడా సాయంత్రం నీతో స్టేషనుకు వస్తాను. రైలును చూస్తాను. | Brother! I will also come to the station with you this evening. I will see the train. |
| రాము : అలాగే చూద్దువుగాని. పద అన్నం తిందాం. అమ్మ పిలుస్తున్నది. | Okay! You can see it. Let us go and have our food. Mother is calling us. |

## DRILLS

**a. Repetition drill.**

పాసుకావాలంటే బాగా చదవాలి.

గాలి కావాలంటే కిటికీలు తెరవాలి.

శర్మను యిక్కడికి రానీ!

సుశీలను లోపలికి రానివ్వకు.

సరళను యిక్కడికి రానివ్వండి.

సుబ్బారావును తలుపు తియ్యనిస్తున్నాను.

శర్మను సుశీలకు నా కలం యివ్వనిచ్చాను.

నన్ను రానిచ్చినప్పుడు నిన్ను గూడా రానిస్తాను.

నిన్ను మాట్లాడనిస్తున్నప్పుడు నన్నెందుకు మాట్లాడనివ్వవు?

శర్మా! ఇలారా; అన్నం తిందువుగాని.

మీరు యిలా రండి; పుస్తకాలు తీసుకుందురుగాని.

నువ్వు బొమ్మ వేద్దువుగాని; యిలారా!

మీరు ఈ తుపాకీ పేలుద్దురుగాని; యిలా రండి.

**b. Substitution drill.**

Model (i) :

శర్మను మాట్లాడనీ!

పాడు

శర్మను పాడనీ!

పో

చదువు

నడుచ్

పాసుకా

Model (ii) :

నిన్ను ఎవరు లోపలికి రానిచ్చారు? (పో)

నిన్ను ఎవరు లోపలికి పోనిచ్చారు?

1. రమను ఎవరు ఈ విషయం చెప్పనిచ్చారు? (అడుగు)
2. కమలను ఎన్నిసార్లు కాఫీ తాగనిచ్చావు? (చెయ్యి)
3. ఈ తోటలో మామిడికాయలు ఏరనివ్వరు. (కొయ్యి)
4. గుళ్లోకి చెప్పులతో పోనివ్వరు. (వెళ్ళు)
5 మనల్ని యిప్పుడు మాట్లాడనిస్తారు. (పిలుచ్)

**c. Response drill.**

Model (i) :

మనల్ని అతను లోపలికి వెళ్ళనిస్తాడా?

వెళ్ళనివ్వటం వెళ్ళనివ్వకపోవటం అతని పని కాదు.

1. శర్మను కుమార్ చదవనిస్తాడా?
2. రవిని వాళ్లు కుర్చీలోనించి లేవనిస్తారా?
3. సుగుణను విమల పరీక్ష రాయనిస్తుందా?

**Model (ii) :**

అ. నేను పాలు తాగుతాను.

సరే! తాగుదువుగాని.

ఆ. మేం పాలు తాగుతాం.

సరే! తాగుదురుగాని.

1. నేను పాఠం చదువుతాను.
2. మేం పూలు కోస్తాం.
3. మేం ఇంటికి వెళ్తాం.
4. నేను యిక్కడే వుంటాను.
5. మేం ఈ బల్లను నెడ్తాం.
6. నేను యిక్కడ నిల్చుంటాను.

Model (iii) :

నేను బయటికి వెళ్ళాలి. (తలుపు–తియ్యి)

బయటికి వెళ్లాలంటే తలుపు తియ్యాలి.

1. రవి ఈ ఇల్లు కొనాలి. (డబ్బు–ఉండు)
2. వాడు పాసుకావాలి. (బాగా–చదువు)
3. నాకు మామిడికాయలు కావాలి. (చెట్టు–ఎక్కు)
4. రేపు మీకు సెలవు కావాలి. (ప్రిన్సిపాల్–అడుగు)

## EXERCISES

a. Change the following sentences as shown in the model.

Model :

శర్మ అన్నం తింటాడు. (నేను)

నేను శర్మను అన్నం తిననిస్తాను.

1. పద్మ పూలు కోస్తుంది. (కమల)
2. పాప నీ పుస్తకం తీసుకుంటుంది. (అతను)
3. సాయంత్రం నేనింటికి ఆలస్యంగా వస్తాను. (మా ఆవిడ)
4. నేనిక్కడ రోడ్డు దాటుతాను. (వాళ్ళు)

b. Give your responses for the following sentences as shown in the model.

Model :

నువ్వు అటు చూడు.

నువ్వు నన్ను అటు చూడనీ!

1. నువ్వు ఈ పుస్తకం తీసుకో!
2. మీరు ఇంటికి వెళ్ళకండి.
3. నువ్వు కాఫీ తాగకు!
4. మీరు సాయంత్రం మా ఇంటికి రండి!
5. మీరు లోపలికి రావాలి.
6. నువ్వు మాట్లాడితే బాగుంటుంది.

**c. Answer the following questions as shown in the model.**

**Model (i):**

ప్లాట్‌ఫారంమీదికి వెళ్లాలంటే ఏం చెయ్యాలి? (టిక్కెట్టు-కొను)
ప్లాట్‌ఫారంమీదికి వెళ్లాలంటే టిక్కెట్టు కొనాలి.

1. మార్కెట్టుకు వెళ్లాలంటే ఏం చెయ్యాలి? (బస్సు-ఎక్కు)
2. ఆకలి తీరాలంటే ఏం చెయ్యాలి? (అన్నం-తిను)
3. జ్వరం తగ్గాలంటే ఏం చెయ్యాలి? (మందు-తీసుకో)
4. మంచి మార్కులు రావాలంటే ఏం చెయ్యాలి? (బాగా-చదువు)

**Model (ii):**

నేను ఇంటికి వెళ్తాను.
రేపు వెళ్దువుగాని.

1. మేం కాఫీ తాగుతాం.
2. నేను సినిమా చూస్తాను.
3. మేం మామిడికాయలు తింటాం.
4. నేను కవులను పిలుస్తాను.

## VOCABULARY

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్లాట్‌ఫారం | platform | దాటు | cross (v. tr.) | విడుచ్ | leave (v.) |

## GRAMMAR NOTES

**89.1.** In this lesson permissive base of the verb is introduced. The permissive base is formed by adding the auxiliary *ఇవ్వు to the infinitive form of the verb (52.3.2.).

permissive base→ Infinitive + ఇవ్వు.

చెయ్య + ఇవ్వు→చెయ్యనివ్వు (see 89.1.1.) 'allow to do'

The permissive base can take the tense and mode suffixes like any other verbal base.

**89.1.1.** A glide న్ comes between the infinitive and the auxiliary ఇవ్వు.

వెళ్ళ-న్-ఇవ్వు→వెళ్ళనివ్వు 'allow to go'

చెయ్య-న్-ఇవ్వు→చెయ్యనివ్వు 'allow to do'

*ఇవ్వు is the verb which means 'give'. Here this functions as an auxiliary. The rules given for the base ఇవ్వు (67.6.) are applicable to the permissive base also.

వెళ్ళ –న్– ఇవ్వ + అకు → వెళ్ళనివ్వకు 'Don't allow to go.'

వెళ్ళనివ్వ + తా–డు → వెళ్ళనిస్–తా–డు
→ వెళ్ళనిస్తాడు (67.6.) 'He will allow someone to go.'

వెళ్ళనివ్వ + ఆ –డు
→ వెళ్ళనిచ్చ + ఆ –డు →
వెళ్ళనిచ్చాడు (67.6.) 'He allowed someone to go.'

89.1.2. In imperative inferior singular, the auxiliary –ఇవ్వు becomes ఈ in speech. (Both ఇవ్వు and ఈ forms are used in writing).

వెళ్ళ–న్–ఈ → వెళ్ళనీ । 'Let someone go!'

అడగ–న్–ఈ → అడగనీ । 'Let someone ask!'

89.1.3. The permissive verb takes direct object (43.6.) like the informatory verb (56.1; 56.3.) and the direct object will be in accusative case.

నేను శర్మను లోపలికి రానిచ్చాను. 'I allowed Sarma to come inside.'

నువ్వు సుబ్బారావును మాట్లాడనీ. 'Allow Subbarao to speak.'

89.2. –అకపోవటం is added to the base to form the negative form of gerund (–అటం forms 53.1.).

| | | | | |
|---|---|---|---|---|
| వెళ్ళటం | 'going' | × | వెళ్ళకపోవటం (వెళ్ళు + అకపోవటం) | 'not going' (41.6.) |
| తినటం | 'eating' | × | తినకపోవటం (తిను + అకపోవటం) | 'not eating' (41.6.) |
| పోవటం | 'going' | × | పోకపోవటం (పో + అకపోవటం) | 'not going' (41.7.) |
| రానివ్వటం | 'allowing to come' | × | రానివ్వకపోవటం (రానివ్వు + అకపోవటం) | 'not allowing to come' (41.6). |

89.3 అంటే is added to the obligatory forms (44.1.) to form obligatory conditionals.

వెళ్ళాలి + అంటే → వెళ్ళాలంటే (41.6.) 'if somebody has to go'

**89.4.** -దువుగాని in singular and -దురుగాని in honorific singular and plural are added to a verbal base in order to express an assurance to the listener. The -దువుగాని/దురుగాని forms of the verb take subject in second person only.

| | |
|---|---|
| నువ్వు అడుగు-దువుగాని | 'All right, you (sg.) may/can ask.' |
| మీరు అడుగు-దురుగాని | 'All right, you (hon. sg. & pl.) may/can ask.' |
| తిను-దువుగాని → తిందువుగాని (60.2.) | 'All right, you may/can eat' |
| రాయి-దువుగాని → రాస్-దువుగాని | |
| → రాద్-దువుగాని | |
| → రాద్దువుగాని (60.3.) | 'All right, you may/can write.' |

# UNIT 23

## Lesson 90

| | |
|---|---|
| సుగుణ : సరళా! ఈ పుస్తకం నీ దగ్గర దాచు! తర్వాత తీసుకుంటాను. నీకు జ్వరం వచ్చిందటగా? | Sarala! Keep this book with you. I will take it later. You had fever (I learn), hadn't you? |
| సరళ : అవును. నీకు ఎలా తెలిసింది? ఇదుగో కాఫీ తీసుకో. | Yes. How did you come to know? Take this coffee. |
| సుగుణ : మీ తమ్ముడు చెప్పాడు. అబ్బ! ఇంత వేడిగా ఉందేం కాఫీ! నోరు కాలింది. మరి జ్వరం వచ్చినా క్లాసుకు వచ్చావేం? | Your brother told me. Oh! The coffee is so hot! My tongue got burnt. Why did you come to the class with fever? |
| సరళ : నాకు యింటిదగ్గర తోచదు. మీ తమ్ముడి పరీక్ష రిజల్టు తెలిసిందా? | I can't spend my time at home. Is the result of your brother's examinations known? |

సుగుణ : ఇంకా తెలియలేదు. రేపు తెలుస్తుంది.

It is not yet known. It will be known tomorrow.

సరళ : తెలిసిన తర్వాత నాకు చెప్పు. బాగా రాశాడా ?

Inform me after it is known. Did he write the examinations well?

సుగుణ : ఏం రాశాడో ! ఈ సంవత్సరం అయినా పాసవుతాడని నమ్మకం లేదు. వాడికి పరీక్షలలో చదవటానికి టైం చాలలేదు.

Nobody knows what did he write. I am not certain that he would pass his examination even this year also. He did not have enough time to prepare for the examination.

సరళ : ఎందుకు ?

Why?

సుగుణ : వాడికెన్నో పనులు. వాడికి తిరగటానికే టైం చాలటంలేదు. ఇక చదవటానికి ఎట్లా చాల్తుంది ? ఇప్పుడు మా నాన్న గారు వాణ్ణి బయటికి కదలనివ్వటంలేదు. వాడికి యింట్లో తోచటంలేదు. నన్ను కూడా చదవనివ్వడు. నా పుస్తకాలు కొన్ని తీసుకుని ఎక్కడో దాచాడు. ఇవ్వరా అంటే యివ్వడు.

He is a busy person. The time available fcr him is not sufficient for wandering around. How can he find time for his studies? My father is not allowing him to go out now-a-days. He gets bored at home. He doesn't let me also study. He took out some of my books and hid them somewhere. I asked him for those books. But he didn't give.

సరళ : ఏమిటి వేలికి కట్టు కట్టావు ?

Why have you bandaged your finger?

సుగుణ : నిన్న వంకాయలు తరుగుతున్నప్పుడు కత్తికి పదును ఎక్కువగా వుండటంవల్ల వేలు కొంచెం తెగింది.

While I was cutting brinjals the knife being very sharp cut my finger.

సరళ : మీ అమ్మగారు ఊళ్లో లేరా ?

Is your mother not in town?

సుగుణ : మా అమ్మ ఉన్నా లేకపోయినా కూరలు నేనే తరుగుతాను. వండే పని మాత్రం మా అమ్మది.

It is my job to cut vegetables whether my mother is home or not. My mother will look after the cooking part of the work.

సరళ : నిన్న కొత్త పాఠం చెప్పారు మాష్టరుగారు. అది నేను ఎన్నిసార్లు చదివినా అర్థం కాలేదు.

The teacher taught us a new lesson yesterday. I could not follow the lesson even after I read it several times.

సుగుణ : మనం ఇద్దరం కలిసి చదువుదాం.

We will study (read) together.

సరళ : నీకు పాఠం వింటే చాలు అర్థంఅవుతుంది. చదవకపోయినా పరవాలేదు. పద్యాలు నోటికి వచ్చాయా?

You can understand the lesson on listening itself. You don't have to read it later. Did you get the poems by heart?

సుగుణ : ఒక పద్యం నాకు ముందే వచ్చు. తక్కినవి యింకా బాగా రాలేదు.

I know one poem already. I couldn't get the other poems thoroughly.

సరళ : నీకు రాలేదా? ఎందుకు దాస్తావు?

Didn't you get them? Why do you hide the fact?

సుగుణ : దాచటం దేనికి? నీకు గూడా రాలేదా?

Why should I hide? Didn't you also get them?

సరళ : బాగానే చదివాను. అయినా రాలేదు. ఇంకా చదవాలి.

I read them a number of times. But I couldn't get them by heart. I have to read them some more times.

## DRILLS

a. Repetition drill.

శర్మకు ఉత్తరం వచ్చినట్లు నాకు నిన్న తెలిసింది.
సుశీలకు యింకా తెలియలేదు.
శర్మకు ఉత్తరం వస్తుందని రవికి తెలుసు.
శర్మకు ఉత్తరం వచ్చిందని తెలియదు.
మనం చెప్తే తెలుస్తుంది; లేకపోతే తెలియదు.
నీకు తెలిసిన విషయాలు ఏవి? తెలియనివి ఏవి?
నువ్వు చెప్తున్న మాటలు నాకు తెలియటం లేదు.
రవి మంచివాడని నాకిప్పుడిప్పుడే తెలుస్తున్నది.
అది నువ్వు తెలిసి చేసిన తప్పు.

ఈ పుస్తకం నీదగ్గర దాచు.
మీరు జాగ్రత్తగా దాచండి.
నేను బాంకిలో డబ్బు దాచాను.
శర్మకు డబ్బు దాచటం తెలియదు.
వాడు అన్ని విషయాలు దాస్తాడు.
నాకు ఏమీ తోచటంలేదు.
ఇంట్లో ఒక్కణ్ణి కూర్చుంటే నాకు తోచదు.
ఒక్కడివి ఉంటే నీకు ఎలా తోస్తుంది?

ఈ పని చెయ్యటానికి టైం చాలటంలేదు.
రెండు గంటలయితే చాల్తుందా ?
నాలుగు గంటలైనా చాలదు.
నిన్న నువ్వు యిచ్చిన డబ్బు చాలింది.
ఈ కాఫీలో పంచదార చాలలేదు.

కిటికీ తలుపులు తెరిచినా గాలి రావటంలేదు.
మందు తీసుకున్నా తలనెప్పి తగ్గలేదు.
ఐదు గంటలు అయినా క్లాసు కాలేదు.
టైముకు పోయినా బస్సు అందలేదు.
పంచదార వేసినా ఈ కాఫీ తియ్యగాలేదు.

సుశీలకు మందు యివ్వకపోయినా జ్వరం తగ్గింది.
తలుపు తియ్యకపోయినా గాలి వస్తున్నది.

నేను ఆలస్యంగా రాకపోయినా నన్ను 'ఆలస్యంగా వచ్చావు' అంటున్నారు.

**b. Substitution drill.**

**Model (i) :**

సుబ్బారావు మాట్లాడకపోయినా రవికి కోపం వచ్చింది.
తిట్టు
సుబ్బారావు తిట్టకపోయినా రవికి కోపం వచ్చింది.
కొట్టు
రా
చదువు

**Model (ii) :**

సుశీలకు జ్వరం వచ్చిందటగా ?
కోపం
సుశీలకు కోపం వచ్చిందటగా ?
ఉద్యోగం
ఉత్తరం
టెలిగ్రాం

**c. Response drill.**

**Model (i) :**

నువ్వు శర్మను డబ్బు అడుగుతావా ?
అడగను.

1. నువ్వు నా పుస్తకం నీ దగ్గర దాస్తావా ?
2. నీకు యింటిదగ్గర తోస్తుందా ?
3. నువ్వు యిప్పుడు సినిమాకు వస్తావా ?
4. రేపు మీ యింటినించి నాకు కాఫీ తెస్తావా ?
5. నన్ను ఉదయం ఆరు గంటలకు పిలుస్తావా ?

**Model (ii) :**

నాకు ఈ పద్యం వచ్చు. (రవి)
రవికి వచ్చిందా ?

1. సుశీలకు ఆ సంగతి తెలుసు. (నువ్వు)
2. ఈ డబ్బు శర్మకు చాలు. (రవి)
3. పాపకు ఈ పాట వచ్చు. (సరళ)

**d. Combination drill.**

**Model (i) :**

నేను ఇంటికి రమ్మన్నాను. అయినా శర్మ రాలేదు.

నేను ఇంటికి రమ్మన్నా శర్మ రాలేదు.

1. నేను పాఠం బాగా చదివాను. అయినా అర్థం కాలేదు.
2. సుశీల కిటికీలు తెరిచింది. అయినా గాలి రావటంలేదు.
3. టైముకు వచ్చాను. అయినా మాష్టరుగారు తిట్టారు.

**Model (ii) :**

నేను ఇంటికి రమ్మనలేదు. అయినా శర్మ వచ్చారు.

నేను ఇంటికి రమ్మనకపోయినా శర్మ వచ్చారు.

1. నేను పాఠం బాగా చదవలేదు. అయినా అర్థం అయింది.
2. సుశీల కిటికీలు తెరవలేదు. అయినా గాలి వస్తున్నది.
3. ఆలస్యంగా రాలేదు. అయినా మాష్టరుగారు తిట్టారు.

**e. Conversation drill.**

**Model (i) :**

రవి : సుశీల పాసయిందట!
శర్మ : సుశీల పాసయినట్లు నీకెప్పుడు తెలిసింది?
రవి : ఇప్పుడే తెలిసింది.

1. రవి : రావు డాక్టరుగారిదగ్గరికి వెళ్ళాడట!
   శర్మ : .... .... .... ....
   రవి : .... .... .... ....
2. రవి : కమలకు నిన్న జ్వరం వచ్చిందట.
   శర్మ : ... ... ... ...
   రవి : ... ... ... ...
3. రవి : రేపు కాలేజీలో నాటకం ఉందట.
   శర్మ : ... ... ... ...
   రవి : ... ... ...

**Model (ii) :**

రావు : శర్మ పరీక్ష బాగా రాయలేదు.
గోపి : ఎందుకు?
రావు : టైం చాలలేదట.
గోపి : నీకెలా తెలిసింది?
రావు : వాడే చెప్పాడు.

1. రావు : సుగుణ పూర్తిగా చదవలేదు.
   గోపి : .... .... .... ....
   రావు : .... .... .... ....
   గోపి : .... .... .... ....
   రావు : .... .... .... ....

2. రావు : నారాయణ కాఫీ చెయ్యలేదు.
   శర్మ : .... .... .... ....
   రావు : .... .... .... ....
   శర్మ : ... ... ... ...
   రావు : ... ... ... ...

3. రవి : రఘు పుస్తకాలన్నీ కొనలేదు.
   శర్మ : ... ... ... ...
   రవి : .... .... .... ....
   శర్మ : .... .... .... ....
   రవి : .... .... .... ....

f. Transformation drill.

Model (i) :

శర్మ పాసయ్యాడట గదా ?
శర్మ పాసయ్యాడటగా ?

1. ఇవ్వాళ కాలేజీలో నాటకం ఉందట గదా ?
2. రావు నిన్న బెంగుళూరు వెళ్ళాడట గదా ?
3. రేపు మనకు పరీక్ష ఉందట గదా ?

Model (ii) :

అక్కడ ఎవరున్నారు ?
అక్కడ ఎవరయినా ఉన్నారా ?

1. వాడు ఈ సంవత్సరం పాసవుతాడా ?
2. నీదగ్గర ఒక రూపాయి ఉన్నదా ?
3. నాకు మంచినీళ్ళు చాలు.

## EXERCISES

a. Fill up the blanks with the concessive forms of the verbs given in the parentheses.

1. నేను అన్నం ...... (తిను) మళ్ళీ ఆకలి అవుతున్నది.
2. వాడికి ఆ విషయం ...... (తెలుసు) నాకు చెప్పలేదు.
3. నేను పాఠం ...... (చదువు) శర్మ చదవ లేదన్నాడు.
4. పాలు ...... (యివ్వు) పాప ఏడుస్తున్నది.

b. Combine the following pairs of sentences using the concessive forms of the verbs.

1. శర్మకు ఈ విషయం తెలియదు. అయినా అతను నన్ను అడగలేదు.
2. సుశీలకు పరీక్షలో టైం చాలలేదు. అయినా బాగా రాసింది.
3. సెలవలు యిచ్చారు. అయినా పిల్లలు స్కూలుకు వస్తున్నారు.
4. మాష్టరుగారు క్లాసులో వున్నారు. అయినా పిల్లలు గొడవ చేస్తున్నారు.
5. నాదగ్గర డబ్బులేదు. అయినా నేను అతన్ని అడగలేదు.

c. Answer the following questions in negative.

Model :

శ్రీధర్ వచ్చాడా ?

రాలేదు.

1. నీకు డబ్బు చాలుతున్నదా ?
2. నువ్వు నా పుస్తకాన్ని దాచావా ?
3. నీకు యింటిదగ్గర తోస్తున్నదా ?
4. పరీక్ష గురించి నీకు ఏమయినా తెలిసిందా ?
5. నా కోసం ఎవరయినా వచ్చారా ?
6. రవి కుర్చీలోనించి లేచాడా ?
7. కమల యివ్వాళ రెండు మైళ్ళు నడుస్తుందా ?

d. Rewrite the following sentences as shown in the model.

Model :

ఇవ్వాళ ఆదివారం.

ఇవ్వాళ ఆదివారంగా !

1. శ్రీధర్‌కు ఈ సంగతి తెలిసింది.
2. శర్మ పాసయ్యాడట.
3. వెంకటేశ్వర్లుకు డబ్బు చాలటంలేదట.
4. నీ పుస్తకం నేను దాచాను.

e. Give the negative forms of

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | వచ్చినా | × | ............... | 5. | చూసినా | × | .. |
| 2. | ఉన్నా | × | .......... ..... | 6. | తెచ్చినా | × | .. |
| 3. | నడిచినా | × | .............. . | 7. | అయినా | × | .. |
| 4. | వేసినా | × | ................ | 8. | దాచినా | × | .. |

## VOCABULARY

| | |
|---|---|
| దాచు | keep in a secret place ; hide (v.tr.) |
| నోరు | mouth |
| తోచు | be able to while away the time feel that the time is passing |
| రిజల్టు | result (n.) |
| అయినా | though ; although |
| నమ్మకం | belief |
| కదులు | move (v.intr.) |
| వంకాయ | brinjal |
| తరుగు | cut (v.) |
| వండు | cook (v.) |
| పద్యం | poem |

## GRAMMAR NOTES

**90.1.** In this lesson the concessive forms are introduced. -ఇనా/-ఆ/-యినా is added to the base to form concessive form.

**90.1.1.** -యినా occurs after the base పో 'go'.

| | |
|---|---|
| పోయినా | 'though someone goes' |
| నిద్రపోయినా | 'though someone sleeps' |

**90.1.2.** -ఆ occurs after అను group of verbs (49.1.; 50.1.) and పడు 'fall'. These bases undergo similar changes as they do before past adjectival participle marker -అ (75.1.1.).

| | |
|---|---|
| అను + ఆ → అన్న్ + ఆ → అన్నా | 'though someone says' |
| నిల్చో + ఆ → నిల్చున్న్ + ఆ → నిల్చున్నా | 'though someone stands' |
| తీసుకో + ఆ → తీసుకున్న్ + ఆ → తీసుకున్నా | 'though someone takes' |
| ఉండు + ఆ → ఉన్న్ + ఆ → ఉన్నా | 'though someone stays' |
| పడు + ఆ → పడ్డ్ + ఆ → పడ్డా | 'though someone falls' |

**90.1.3.** -ఇనా occurs with other verbs.

| | |
|---|---|
| అడుగు + ఇనా → అడిగినా | 'though someone asks' (63.2.) |
| పాడు + ఇనా → పాడినా | 'though someone sings' (41.6.) |
| రా + ఇనా → వచ్చ్ + ఇనా → వచ్చినా | 'though someone comes' (66.4.) |

**90.1.4.** Remember the past adjectival participles are formed by adding -ఇన/ -అ/ -యిన to the verbal base (75.1.).

Note that the concessive suffixes and the past adjectival participle suffixes look similar except the length of the final vowel.

| *Past. Adj. Participle* | *Concessive* |
|---|---|
| – ఇన | – ఇనా |
| – అ | – ఆ |
| – యిన | – యినా |

**Therefore, in the formation of the concessive forms the bases undergo similar changes as they do in the formation of the past adjectival participle forms.**

| | | | |
|---|---|---|---|
| పోయిన | 'that who/which went' | పోయినా | 'though someone goes' |
| తిన్న | 'that who/which ate' | తిన్నా | 'though someone eats' |
| ఉన్న | 'that who/which was' | ఉన్నా | 'though someone is' |
| పడ్డ | 'that who/which fell' | పడ్డా | 'though someone falls' |
| తీసుకున్న | 'that who/which took' | తీసుకున్నా | 'though someone takes' |
| వచ్చిన | 'that who/which came' | వచ్చినా | 'though someone comes' |
| ఇచ్చిన | 'that who/which gave' | ఇచ్చినా | 'though someone gives' |
| రాసిన | 'that who/which wrote' | రాసినా | 'though someone writes' |
| అడిగిన | 'that who/which asked' | అడిగినా | 'though someone asks' |

90.2. Negative concessive forms are formed by adding -అకపోయినా to the bases.

పాడు + అకపోయినా → పాడకపోయినా — 'though someone does/did not sing' (41.6.)

90.3. చాలు 'enough' (38.4.) and తెలుసు 'be known' (70.3.) introduced as defective verbs will also be used in various tense and other formations.

| | |
|---|---|
| తెలుసు-తున్న-ది → తెలుస్తున్నది (90.3.1.) | 'it is being known' (present tense) |
| తెలుసు-ఇం-ది → తెలిసింది (41.6; 63.2.) | 'it is was known' (past tense) |
| తెలుసు-తుం-ది → తెలుస్తుంది (90.3.1.) | 'it will be known' (future tense) |
| తెలుసు-ఇతే → తెలిస్తే (41.6; 63.2.) | 'if known' (conditional) |
| తెలుసు-ఇన → తెలిసిన (41.6; 63.2.) | 'that which was known/who knew' (adj. participle). |
| చాలు-తుం-ది → చాలుతుంది (63.4.) | 'it will be sufficient' (future tense) |
| చాలు-ఇం-ది → చాలింది (41.6.) | 'it was enough' (past tense) |
| చాలు-ఇనా → చాలినా (41.6.) | 'though it was/is enough' (concessive) |

**90.3.1. ఇ or ఉ is dropped between స and త (63.4.).**

**See the examples under 90.3. above.**

**90.3.2. తెలుసు becomes తెలియ్ when followed by a suffix beginning with అ or ఆ.**

| | |
|---|---|
| తెలుసు + అటం→ తెలియటం | 'being known' (gerund) |
| తెలియటంలేదు | 'It is not being known.' (present tense)<br>'It is not being understood.' |
| తెలుసు + ఆలి→ తెలియాలి | 'It should be known.' (obligatory) |

90.4. Two చు ending verbs దాచు 'hide something' and తోచు 'feel that the time is passing' are introduced in this lesson. These verbs change the final చు to స when followed by a suffix beginning with త.

The final చు will not become స when followed by a suffix beginning with అ or ఆ. But the final చ of the చ ending bases (68.1.) becomes స. (68.3.).

| | |
|---|---|
| తోచు–తున్నది→ తోస్తున్నది | 'Time is passing.' |
| తోచలేదు | 'Time did not pass.' |
| తోచటంలేదు | 'Time is not passing.' |
| దాచు–తాను→ దాస్తాను | 'I will hide it.' |
| దాచు–అ–ను→ దాచను | 'I will not hide it.' (46.6.) |

90.5. వచ్చు 'know' (70.3.) is a form of the verb రా. In various tenses and other formations the forms of the verb రా are used.

| | |
|---|---|
| నీకు వచ్చిన పద్యాలు | 'poems which you know' |
| నాకు పద్యాలు రాలేదు; అతనికి వచ్చాయి. | 'I did not get the poems by heart. He got them.' |

90.6. Oblique base of నోరు 'month' is నోటి.

90.7. 'గా' is the shortened form of గదా. (58.3.).

| | |
|---|---|
| రైలు వచ్చింది గదా ।<br>రైలువచ్చిందిగా । | 'Train arrived, didn't it?' |

# UNIT 23

## Lesson 91

### మేకను పట్టుకున్న కొండచిలువ

గ్వాలియర్, సెప్టెంబర్ 26

మొన్న గ్వాలియర్ కోట ఆవరణలో ఒక పెద్ద కొండచిలువ ఒక మేకను పట్టుకుని మింగుతూ ఉండగా దాన్ని పట్టుకున్నారు. అప్పటికి మేక శరీరంలో సగానికి పైగా కొండచిలువ నోటిలోనికి వెళ్ళిపోయింది. మేక వెనకకాళ్ళు మాత్రం బైటికి కనిపిస్తున్నాయి. ఆ కాళ్ళు పట్టుకుని మేకను బైటికి లాగారు. అప్పటికి మేక యింకా బతికి వుంది. కాని ఆ తర్వాత కొద్ది సేపటికి అది చచ్చిపోయింది. కొండచిలువను స్థానిక జంతు ప్రదర్శనశాలకు అప్పగించారు. కొండచిలువ సుమారు 40

### THE PYTHON THAT SWALLOWED A GOAT

Gwalior, September 26

One python, while swallowing a goat inside the Gwalior fort on the other day was caught. By that time more than half of the goat's body was inside the python's mouth. But the hind legs of the goat were seen outside. People pulled it out with those hind legs. The goat was still alive by then. But after a short while, it died. The python was handed over to a local zoo. The python weighed about 40

కిలోగ్రాముల బరువు వుంది. దాని వయస్సు పది సంవత్సరాలు. అది పట్టుకున్న మేక బరువు 15 కిలోగ్రాములు.

(ఆంధ్ర ప్రభ—27.9.1975)

kilograms. It was ten years old. The goat captured by the python was 15 kilograms.

*(Andhra Prabha—27.9.1975)*

రవి బడికి వెళ్తూ దోవలో ఒక జామ చెట్టును చూశాడు. చెట్టుకు జామకాయలున్నాయి. అతనికి నోరూరింది. ఒక రాయి తీసుకుని కాయలను కొట్టాడు. అక్కడ ఉన్న కాకికి ఆ రాయి తగిలింది. అది కింద పడ్డది. దెబ్బ బాగా తగలటంవల్ల అది చచ్చింది. రాయి విసిరేటప్పుడు అది ఆ కాకికి తగులుతుందని, ఆ కాకి చస్తుందని రవి అనుకోలేదు. అది చావటంవల్ల ఎవరైనా చూసి తిడ్తారేమోనని భయపడ్డాడు. రాళ్ళు వెయ్యకుండా చెట్టు ఎక్కి జామకాయలు కోద్దాం అనుకున్నాడు. చెట్టు ఎక్కుతూండగా కాలుజారి కింద పడిపోయాడు. అతను పట్టుకున్న కొమ్మకూడా విరిగిపోయింది. కింద వాన నీళ్ళున్నాయి. నీళ్ళల్లో పడటంవల్ల అతని బట్టలు తడిసిపోయాయి. వాళ్ళ నాన్నగారికి చెప్పకుండా పెట్టుకుని వచ్చిన గడియారం కూడా తడిసిపోయింది. నీళ్ళు తగలగానే అది ఆగిపోయింది. వాళ్ళ నాన్నగారు కోప్పడతారేమోనని అతను భయపడిపోయాడు. అప్పటికి స్కూలు టైం అయిపోయింది. వాళ్ళ నాన్నగారు అప్పటికి ఆఫీసుకు వెళ్ళిపోయి ఉంటారు అనుకుని మెల్లగా యింటికి బయల్దేరాడు. కాని, యింటికి వెళ్ళేసరికి వాళ్ళ నాన్నగారు వరండాలో కూర్చునివున్నారు.

Ravi, on his way to school, saw a guava tree. There were fruits on the tree. He wanted to eat them. He threw a stone at the fruits. The stone hit a crow which was there on the tree. It fell down. Since it was hurt severely, it died. While throwing the stone Ravi never thought that it would hit the crow and that the crow would die. He was afraid that somebody might scold him. He wanted to pluck some guavas by climbing the tree without throwing stones any more. But while climbing up the tree he slipped and fell down. The branch he was holding was also broken. There was rain water below. Since he fell into the water, his clothes got wet. The watch, he wore without his father's knowledge also got wet. The moment it fell in water, it stoped working. He was afraid that his father might take him to task. It was already time for school by then. Thinking that his father would have left for the office, he started slowly for his home. But, his father was in the verandah by the time he reached home.

## DRILLS

### a. Repetition drill.

శర్మ యింటికి వెళ్ళిపోయాడు.
నేను తొందరగా యింటికి వెళ్ళిపోవాలి.

కొమ్మ విరిగింది.
కొమ్మ విరిగిపోయింది.

కింద పడ్డాడు.
కింద పడిపోయాడు.

చొక్కా తడిసింది
చొక్కా తడిసిపోయింది.

నాటకం అయింది.
నాటకం అయిపోయింది.

బస్సు ఆగింది.
బస్సు ఆగిపోయింది.

రైలు వెళ్ళింది.
రైలు వెళ్ళిపోయింది.

పందిరి కూలింది.
పందిరి కూలిపోయింది.

ఆ మేక బతికి ఉంది.
సుబ్బారావు కూర్చుని వున్నాడు.
అతను నిల్చుని వున్నాడు.

ఆ కుక్క కారుకింద పడిచచ్చింది.
ఆ కాకికి బాగా దెబ్బ తగిలింది; అది ఇంకొక గంటలో చస్తుంది.
ఆ మేక బతికి ఉంది. ఇంకా చావలేదు.

### b. Build-up drill.

కొట్టారు.
దాన్ని కొట్టారు.
మింగుతూ వుండగా దాన్ని కొట్టారు.
పట్టుకుని మింగుతూ వుండగా దాన్ని కొట్టారు.
మేకను పట్టుకుని మింగుతూ వుండగా దాన్ని కొట్టారు.
కొండచిలువ మేకను పట్టుకుని మింగుతూ వుండగా దాన్ని కొట్టారు.
ఒక కొండచిలువ మేకను పట్టుకుని మింగుతూ వుండగా దాన్ని కొట్టారు.
ఆవరణలో ఒక కొండచిలువ మేకను పట్టుకుని మింగుతూ వుండగా దాన్ని కొట్టారు.
కోట ఆవరణలో ఒక కొండచిలువ మేకను పట్టుకుని మింగుతూ వుండగా దాన్ని కొట్టారు.
గ్వాలియర్ కోట ఆవరణలో ఒక కొండచిలువ మేకను పట్టుకుని మింగుతూ వుండగా దాన్ని కొట్టారు.

**c. Completion drill.**

**Model :**

అతను 11 గంటలకు కుర్చీలో కూర్చున్నాడు.
ఇప్పుడు యింకా కుర్చీలో ...................
ఇప్పుడు యింకా కుర్చీలో కూర్చుని ఉన్నాడు.

1. కుక్క కారు కింద పడ్డది. దానికి కొన్ని దెబ్బలు తగిలాయి. కాని బతికింది.
   అది యిప్పుడు ...............

2. జనం టిక్కెట్లకోసం నిల్చున్నారు.
   టికెట్లు అయిపోయాయి.
   వాళ్ళు యింకా...............

3. అందరూ సినిమాహాలులో కూర్చున్నారు.
   సినిమా అయిపోయింది.
   వాళ్ళు యింకా ...............

**d. Combination drill.**

**Model :**

శర్మ దాన్ని బయటికి లాగాడు.
వెంటనే అది చచ్చిపోయింది.
శర్మ దాన్ని బయటికి లాగగానే అది చచ్చిపోయింది.

1. రఘు నాకు ఒక నంచీ యిచ్చింది.
   వెంటనే నేను బయటికి వచ్చాను.
2. అమ్మ అన్నం వండింది.
   వెంటనే నాకు పెట్టింది.
3. మా తమ్ముడు యిక్కడికి వస్తాడు.
   వెంటనే నిన్ను కలుస్తాడు.

**e. Transformation drill.**

**Model :**

అతను బజారుకు వెళ్ళాడు.
అతను బజారుకు వెళ్ళిపోయాడు.

1. నా పుస్తకాలు తడిశాయి.
2. మనం యింటికి వెళ్దాం.
3. గడియారం ఆగలేదు.
4. రైలుకు టైం అయింది.
5. ఆ కర్ర విరుగుతుంది.

## EXERCISES

a. **Break the following complex sentences into small and simple sentences, as shown in the model.**

**Model :**

మొన్న గ్వాలియర్ కోట ఆవరణలో ఒక కొండచిలువ ఒక మేకను పట్టుకుని మింగుతూ వుండగా దాన్ని పట్టుకున్నారు.

a. మొన్న గ్వాలియర్ కోట ఆవరణలో ఒక వింత జరిగింది.
b. ఒక పెద్ద కొండచిలువ ఒక మేకను పట్టుకున్నది.
c. అది ఆ మేకను మింగుతున్నది.
d. అప్పుడు జనం ఆ కొండచిలువను పట్టుకున్నారు.

1. మొన్న మా కాలేజీ ఆవరణలో జరిగిన నాటకం చూడటానికి ఊళ్ళో వాళ్ళందరూ వచ్చినప్పుడు మధ్యలో ఎందుకో నాటకం ఆగిపోయిందని జనం గొడవచేశారు.

2. సుబ్బారావు సినిమాకు రమ్మని పిలిచినప్పుడు రవికి పని ఉండటంవల్ల రానంటే సుబ్బారావుకు కోపం వచ్చి రవితో మాట్లాడటం మానేశాడు.

3. దొంగతనం చేసి పారిపోతున్న ఒక కుర్రాణ్ణి పట్టుకోటానికి పోలీసులు పరిగెత్తుతూండగా బజార్లో లైట్లుపోవటంవల్ల ఆ కుర్రాడు పోలీసులకు దొరకలేదు.

b. Answer the following questions as shown in the model.

Model (i):

నా చొక్కా కొంచెం తడిసింది; నీ చొక్కా గూడా తడిసిందా?

నా చొక్కా మొత్తం తడిసిపోయింది.

1. ఈ పందిరి కొద్దిగా కూలింది; ఆ పందిరి గూడా కూలిందా?
2. మా పని కొద్దిగా ఆగింది; మీ పని గూడా ఆగిందా?
3. నా పని అయింది; నీ పనిగూడా అయిందా?
4. ఈ గోడ కొద్దిగా పడ్డది; ఆ గోడకూడా పడ్డదా?
5. ఈ కర్ర కొద్దిగా విరిగింది; ఆ కర్రగూడా విరిగిందా?

Model (ii):

ఆ కుక్క ప్రాణం పోయిందా? (బతుకు)

లేదు. ఇంకా బతికి వుంది.

1. ఆ మనిషి నిల్చున్నాడా? (కూర్చో)
2. శర్మ కూర్చున్నాడా? (నిల్చో)
3. ఆ మేక చచ్చిపోయిందా? (బతుకు)

c. Combine the following pairs of sentences as shown in the model.

Model:

శర్మ కిందికి దిగాడు. వెంటనే జనం చుట్టూ గుమిగూడారు.

శర్మ కిందికి దిగగానే జనం చుట్టూ గుమిగూడారు.

1. ఐదుగంటలు అయింది. వెంటనే రైలు బయల్దేరింది.
2. రమ వచ్చింది. వెంటనే పద్మ ఇంటికి వెళ్ళింది.
3. అతనికి ఒక మేకను యిచ్చారు. వెంటనే అది చచ్చిపోయింది.

## VOCABULARY

| | |
|---|---|
| మేక | goat |
| కొండచిలువ | python |
| కోట | fort |
| ఆవరణ | campus |
| మింగు | swallow (v) |
| శరీరం | body |
| లాగు | pull (v) |
| బతుకు | be alive ; survive |
| కొద్ది | little |
| చావు | die |
| స్థానిక | local |
| జంతుప్రదర్శన శాల | zoo |
| అప్పగించు | hand over |
| కిలోగ్రాము | kilogram |
| జామ | guava (adj.) |
| నోరూరు | secrete or run with water (as in the mouth) (v.intr.) |
| విసురు | throw (v.) |
| కాకి | crow |
| జారు | slip (v.intr.) |
| కోప్పడు | scold (v.) |
| భయపడు | be afraid of |

## GRAMMAR NOTES

**91.1.** In this lesson the verb చావు 'die' is introduced. It behaves like the verbs తే, రా, తీసుకురా and ఇవ్వు before a suffix beginning with త, ఇ and అ. (46.2; 66.4; 67.6; 69.4.1.)*

**91.1.1.** చావు becomes చస్– before a suffix beginning with త, and చచ్చ్– before a suffix beginning with ఇ or అ.

| | |
|---|---|
| చావు + తుం–ది → చస్–తుంది → చస్తుంది | 'It will die.' |
| చావు + దాం → చస్–దాం (80.2.) → చద్–దాం → చద్దాం | 'Let us die.' |
| చావు + ఇం–ది → చచ్చ్–ఇంది → చచ్చింది | 'It died.' |
| చావు + అ–యి → చచ్చ్–అ యి → చచ్చాయి | 'They (neuter) died.' |

* రా changes to వస్ and వచ్చ్
తీసుకురా changes to తీసుకోస్ and తీసుకోచ్చ్ (46.2; 66.4)
ఇవ్వు changes to ఇస్ and ఇచ్చ్ (67.6.)
తే changes to తెస్ and తెచ్చ్ (69.4.1.)
చావు changes to చస్ and చచ్చ్ (91.1.1.)

91.2. The auxiliary verb పో (which also behaves like the main verb పో 70.1; 75.2.1.) is added to the past adverbial participle form (79.1.) of a verb to give an emphasis or a sense of completeness to the meaning of the verb. The compound verb thus formed — we may call this the completive base — can take all tense/mode suffixes as any other verbal base.

| | |
|---|---|
| విరిగింది | 'It broke.' |
| విరిగిపోయింది | 'It broke off.' |
| వెళ్ళాడు | 'He went.' |
| వెళ్ళిపోయాడు | 'He went away.' |
| ఆగింది | 'It stopped.' |
| ఆగిపోయింది | 'It stopped and it is not going to start again.' |

91.2.1. The auxiliary -పో will not go with all the verbs. Only some verbs will take this, which may be learnt from the usage.

91.3. Notice the expressions:

| | |
|---|---|
| బతికి-ఉంది | 'It is alive.' |
| కూర్చుని-ఉన్నాడు | 'He is (there) sitting.' |
| నిల్చుని-ఉన్నాడు | 'He is (there) standing.' |

These verbs are stative verbs which express the state or condition of the subject.

91.4. -గానే is added to the infinitive form of the verb (52.3.2.) to form a type of temporal which means 'immediately after'

| | |
|---|---|
| విన-గానే | 'immediately after hearing' |
| రా-గానే | 'immediately after coming' |

# UNIT 24

## Lesson 92

పాప : నాన్నగారూ ! ఉయ్యాల ఆగటంలేదు. ఆపండి.

Father! This swing is not coming to a stop. Please stop it.

విశ్వనాథం : పాపా ! ఉయ్యాల ఊగుతున్నావా ? లెక్కలు చేశావా ?

Papa ! Are you swinging now ? Did you complete doing the sums ?

పాప : చేసేశాను నాన్నగారూ ! పాఠం గూడా చదివేశాను. చూడండి నేను ఎలా ఊగుతున్నానో.

I have completed it, father ! I have completed studying the lesson too. Look, how I am swinging !

విశ్వ : మెల్లగా ఊగు.

Swing slowly.

పాప : మీరు గూడా కొంచెం ఊపండి.

Please help me swing.

విశ్వ : ఇంక చాలమ్మా. దిగు. చెల్లెలు గూడా ఊగుతుంది.

This is enough, my dear! Get down. Your younger sister will also swing.

పాప : నాకు దిగటం చేతకావటంలేదు. మీరు దింపండి. చెల్లెలు మంచిది కాదండీ! దాన్ని ఊపవద్దు. అది నా పుస్తకాలు చింపుతుంది. చూడండి ఎలా చినిగాయో! చినుగుతాయి వద్దు అంటే వినదు. నా పుస్తకాలే కావాలి దానికి.

I am not able to get down. Please help me get down. Younger sister is not a good girl. Don't make her swing. She tears all my books away. Look, how they are all torn! She wouldn't listen to when told that they will be torn. She needs only my books.

విశ్వ : దానికి తెలియదుగా! నువ్వు నీ పుస్తకాలు దానికి చూపించకు. దాన్నిగూడా ఊగనివ్వు.

She doesn't know that, does she ? Don't show your books to her. Let her also swing.

పాప : చూడండి నా గాలిపటం దారం గూడా తెంపింది. తెగుతుంది అంటే వినకుండా లాగేసింది.

Look, she broke the thread of my kite. She pulled it without listening to me that it would break.

విశ్వ : ఇంకో దారం తీసుకో. రవీ! చీకటి పడ్డది. ఆ లైటు వెయ్యి.

Have another thread. Ravi! It is already dark. Put that light on.

రవి : స్విచ్చి వేసినా ఈ లైటు వెలగటంలేదు నాన్నగారూ! వెలిగించండి.

This is not lighting up even after putting the switch on. Father, please put it on.

విశ్వ : ఆ స్విచ్చిని కొంచెం కదిలించు.

Move that switch a little bit.

రవి : అది కదలటంలేదు. చూడండి నాన్నగారూ, నా పుస్తకం ఎలా తడిసిందో!

It's not moving. Look father, how my book got wet!

విశ్వ : ఎందుకు తడిసింది?

Why did it get wet ?

రవి : అదే తడిపింది. నీళ్ళల్లో ముంచి తడిపింది.

She made it wet herself. She dipped it into the water and made it wet.

పాప : నేను ముంచలేదు నాన్నగారూ! నీళ్ళల్లో పడి అదే మునిగింది.

Father, I did not dip it (in the water). It fell into the water by itself and got wet.

రవి : దాన్ని ఉయ్యాలమీదినించి లేపండి, నాన్న గారూ! అది నా బలపం తుంచింది. పెన్సిలు గూడా విరిచింది.

Take her away from the swing. She broke my slate-pencil and pencil too.

పాప : బలపం కిందపడి తునిగింది, నాన్నగారూ! పెన్సిలు పట్టుకుంటేనే విరిగింది. నేను విరవలేదు.

The slate-pencil fell on the ground and broke. Pencil broke just while holding it. I did not break it.

విశ్వ : రవీ! అమ్మ ఎవరితోనో పోట్లాడుతున్నది?

Ravi! Your mother is quarrelling with somebody?

రవి : పాలవాడితో.

With the milkman.

విశ్వ : పాలవాడు అప్పుడే వచ్చేశాడా!

Oh! Has the milkman turned up so early?

రవి : ఆ! ఇవ్వాళ పాలు చిక్కగా లేవట. నీళ్ళు ఎక్కువ కలిపాడట.

It seems that the milk is not thick. He mixed more water in the milk.

విశ్వ : అలాగా! సరే, పాపా నువ్వు ఉయ్యాల మీదినించి దిగెయ్యమ్మా! చెల్లెలు ఏడుస్తున్నది.

I see! All right, Papa! you get down from the swing. Your younger sister is weeping.

పాప : అబ్బ! ఉయ్యాల ఎక్కితేచాలు దిగమని చంపుతుంది.

Oh, no! If I just get on to the swing, she nags me to get down.

## DRILLS

a. Repetition drill.

ఉయ్యాల ఊగుతున్నది.
ఉయ్యాలను ఎవరు ఊపుతున్నారు?

బస్సు ఆగుతుంది.
బస్సును ఎవరు ఆపుతారు?

బల్ల పక్కకు జరిగింది.
బల్లను ఎవరు పక్కకు జరిపారు?

సుశీల కిందికి దిగుతున్నది.
సుశీలను ఎవరు దింపుతున్నారు?

నా గాలిపటం దారం తెగింది.
ఎవరు దాన్ని తెంపారు?

నా పుస్తకం చినిగింది.
సరళ నా పుస్తకాన్ని చింపింది.

పెన్సిలును నీళ్లల్లో వేస్తే మునగదు.
ఈ కప్పును నీళ్ళల్లో ముంచవద్దు.

నా బొద్దు తునిగింది.
రవి బొద్దును తుంచి శర్మ కిచ్చాడు.

ఆ కుక్క కాలు విరిగింది.
శర్మ ఆ చెట్టు కొమ్మను విరిచాడు.

ఈ చొక్కా తడిసింది.
ఈ చొక్కాను ఎవరు తడిపారు?

శర్మా రవీ సంవత్సరం తర్వాత కలిశారు.
వాళ్ళిద్దర్నీ నేనే కలిపాను.

సుబ్బారావు లేవలేదు.
అతన్ని లేపండి.

బస్సు నడుస్తున్నదా?
ఆ! రవి దాన్ని నడుపుతున్నాడు.

లైటు వెలుగుతున్నది.
వాళ్ళు రోజూ ఆరుగంటలకు లైట్లు వెలిగిస్తారు.

ఆ కొమ్మ కదులుతున్నది.
ఆ కొమ్మను ఎవరు కదిలించారు?

ఫాను తిరుగుతున్నది.
నువ్వు ఆ బల్లను యిటువైపు తిప్పు.

ఆ కాకి చచ్చింది.
ఆ కాకిని రవి చంపాడు.

నేను ఆటలు ఆడాను.
నేను ఆటలు ఆడేశాను.

అతను పుస్తకం చదివాడు.
అతను పుస్తకం చదివేశాడు.

ఆమె పరీక్ష రాసింది.
ఆమె పరీక్ష రాసేసింది.

మేం ఆ విషయాన్నిగురించి రమతో మాట్లాడాం.
మేం ఆ విషయాన్నిగురించి రమతో మాట్లాడేశాం.

నువ్వు లైట్లు వేశావు.
నువ్వు లైట్లు వేసేశావు.

వాళ్ళు బస్సు దిగారు.
వాళ్ళు బస్సు దిగేశారు.

నువ్వు ఈ పని చేశావా?
నువ్వు ఈ పని చేసేశావా?

తొందరగా తలుపు తియ్యి!
తొందరగా తలుపు తీసెయ్యి!

పూలు కొయ్యాలి.
పూలు కోసెయ్యాలి.

మనం ఇప్పుడు అన్నం తిందాం.
మనం ఇప్పుడు అన్నం తినేద్దాం.

**b. Substitution drill.**

**Model:**

ఇప్పుడు నేను పాఠం చదివేశాను. (రాయి)

ఇప్పుడు నేను పాఠం రాసేశాను.

1. శర్మ కాయలు ఏరేశాడు. (కొయ్యి)
2. సరళ కిటికీలు తెరిచేసింది. (ముయ్యి)
3. సుగుణ పాట పాడేసింది. (విను)

**c. Response drill.**

**Model (i) :**

ఈ కొమ్మను ఎవరు విరిచారు?

అదే విరిగింది.

1. ఈ పూలను ఎవరు తెంపారు?
2. ఈ చొక్కాను ఎవరు తడిపారు?
3. ఆ కొమ్మలను ఎవరు ఊపుతున్నారు?
4. నీ బలపాన్ని ఎవరు తుంచారు?
5. ఈ కుర్చీని ఎవరు జరిపారు?
6. ఆ లైటు ఎవరు కదిలించారు?
7. వాళ్ళిద్దర్నీ ఎవరు కలిపారు?
8. ఆ కుక్కను ఎవరు చంపారు?

**Model (ii) :**

ఈ కొమ్మ ఎలా విరిగింది? (రవి)

రవి విరిచాడు.

1. కమల ఎలా దిగింది? (సుశీల)
2. మోహన్ ఎందుకు లేచాడు? (వాళ్ళు)
3. ఈ బస్సు ఎందుకు ఆగింది? (నేను)
4. నీ చొక్కా ఎలా చినిగింది? (కుక్క)
5. ఈ దీపం ఎలా వెలిగింది? (మేం)
6. నీ పుస్తకం ఎందుకు తడిసింది? (సరళ)
7. ఈ కుర్చీ అటువైపు ఎలా తిరిగింది? (ఆయన)
8. ఆ ఏనుగు ఎలా చచ్చింది? (సింహం)

**Model (iii) :**

సుశీల పాఠం చదివిందా?

ఆ: ఇందాకే చదివేసింది.

1. శర్మ అన్నం తిన్నాడా?
2. కమల కాఫీ తాగిందా?
3. లక్ష్మి మొక్కలకు నీళ్ళు పోసిందా?
4. సుబ్బారావు వచ్చాడా?

**Model (iv) :**

శర్మ ఎక్కడికి వెళ్తున్నాడు?

ఎక్కడికో వెళ్తున్నట్లున్నాడు.

1. అతను ఎవరితో మాట్లాడుతున్నాడు?
2. సుశీల ఏ గదిలో ఉన్నది?
3. రవి ఎవరితో పోట్లాడుతున్నాడు?

**d. Conversation drill.**

**Model :**

సుగుణ : కమలను ఉయ్యాలమీదినించి దింపండి.
విమల : ఎందుకు ? కమలనే దిగమను.
సుగుణ : కమలకు దిగటం చేతకాదు.

1. సుగుణ : సుశీలను కొంచెం లేపండి.
   విమల : ........................
   సుగుణ : ........................
2. సుగుణ : పాపను ఊపండి.
   విమల : ........................
   సుగుణ : ..................
3. సుగుణ : అతన్ని కిందికి దింపు.
   విమల : ......................
   సుగుణ : ................

## EXERCISES

**a. Respond to the following sentences as shown in the model.**

**Model :**

ఆ చెట్టు కొమ్మలు ఊగుతున్నాయి.
వాటిని ఎవరు ఊపుతున్నారు ?

1. ఆ కుర్చీ జరుగుతున్నది.
2. ఈ పాలల్లో నీళ్ళు కలిశాయి.
3. ఆ గదిలో లైట్లు వెలిగాయి.
4. శర్మ కిందికి దిగాడు.
5. నా చెప్పులు తడిశాయి.
6. ఈ వైరు తెగింది.
7. పాప ఉయ్యాల ఊగుతుంది.
8. ఈ కుర్చీ కాలు విరిగింది.
9. ఈ బొమ్మ తిరుగుతున్నది.
10. ఈ పులి చచ్చింది.

**b. Answer the following questions as shown in the model.**

**Model :**

శర్మ ఎవరితో మాట్లాడుతున్నాడు ? (రవి–గోపి)
శర్మ రవితోనో గోపితోనో మాట్లాడుతున్నాడు.

1. శారద ఎవరితో పోట్లాడుతున్నది ? (సీత–గీత)
2. సుశీల ఏ ఊళ్లో చదువుతున్నది ? (గుంటూరు–విజయవాడ)
3. శారద ఎవరితో మాట్లాడుతున్నది ? (కమల–విమల)

**c. Change the following sentences as shown in the model.**

**Model :**

సరళ పాఠం చదివింది.
సరళ పాఠం చదివేసింది.

1. శారద పాలు తాగింది.
2. పాఠం పూర్తి చేశాను.
3. పాపకు కథ చెప్పండి.
4. సుశీలా ! అన్నం తిను !
5. సుగుణ వెంటనే రావాలి.
6. గోపి ఉత్తరం రాస్తున్నాడు.
7. రవి దగ్గర్నించి నీ పుస్తకం తెస్తే మంచిది.

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| ఉయ్యాల | swing (n.) | ముంచు | dip (v.tr.) |
| ఊగు | swing (v.intr.) | మునుగు | dip; sink (v.intr.) |
| చేతకా | be able to do something | లేపు | raise; lift (v.tr.) |
| దింపు | make to get down | బలపం | slate-pencil |
| చించు | tear (v.tr.) | తుంచు | break (v.tr.) |
| గాలిపటం | kite | పెన్సిలు | pencil |
| తెంపు | cut (v.tr.) | విరుచ్ | break (v.tr.) |
| చీకటిపడు | become dark (as in the night) | తునుగు | break (v.intr.) |
| స్విచ్చి | switch (n.) | పోట్లాడు | quarrel (v.) |
| వెలుగు | glow; burn (v.intr.) | చిక్కగా | thick (adv.) |
| వెలిగించు | light (v.tr.) | కలుపు | mix (v.tr.) |
| కదిలించు | move (v.tr.) | చంపు | kill (v.) |
| తడుపు | make wet | | |

## GRAMMAR NOTES

**92.1.** In this lesson some sets of intransitive and trarsitive verbs are introduced. Different groups of verbs will behave in different ways in the transitive formation. This has to be learned only from usage. (Also refer 69.1. and 69.2.).

**92.1.1.** –పు replaces the final consonant/syllable in the ఊగు group.

| *Intransitive* | | *Transitive* | |
|---|---|---|---|
| ఊగు | swing | ఊపు | swing |
| ఆగు | stop | ఆపు | stop |
| జరుగు | move | జరుపు | move |
| తడుస్ | become wet | తడుపు | make something wet |
| కలుస్ | meet | కలుపు | mix |
| లేచ్ | get up | లేపు | make someone/something to get up; lift |
| నడుచ్ | walk | నడుపు | drive |

92.1.2. –ంపు replaces the final syllable in the దిగు group.

| *Intransitive* | | *Transitive* | |
|---|---|---|---|
| దిగు | get down, descend | దింపు | make someone/something get down. |
| చావు | die | చంపు | kill (notice that the vowel is shortened). |
| తెగు | break | తెంపు | break |

92.1.3. –ంచు replaces the second and final syllables of చినుగు group.

| *Intransitive* | | *Transitive* | |
|---|---|---|---|
| చినుగు | be torn | చించు | tear |
| తునుగు | be cut | తుంచు | cut |
| మునుగు | sink/drown | ముంచు | drown |

92.1.4. –తిప్పు is the transitive form of తిరుగు and విరుచు is the transitive form of విరుగు.

92.1.5. –ఇంచు is added to కదులు group of verbs.

| *Intransitive* | | *Transitive* |
|---|---|---|
| కదులు | 'move' | కదులు + ఇంచు → కదిలించు 'move' (63.2.) |
| వెలుగు | 'burn' | వెలుగు + ఇంచు → వెలిగించు 'light' (63.2.) |

92.2. Like –పో (91.2.) the auxiliary verb వెయ్యి is also added to the past adverbial participle form (79.1.) of a verb to give an emphasis or a sense of completeness to the main verb. వెయ్యి also does not go with all the verbs and one should learn only from usage the bases which take వెయ్యి.

92.2.1. –వెయ్యి normally loses its initial వ when added to a base.

| | |
|---|---|
| తీసి + వెయ్యి → తీసి–ఎయ్యి → తీసెయ్యి | 'remove, take off' (41.6.) |
| తిని + వెయ్యి → తిని–ఎయ్యి → తినెయ్యి | 'eat away' (41.6.) |

92.3. In 89.1.2. it is stated that the auxiliary ఇవ్వు becomes ఈ in the imperative inferior singular forms of permissive verb. But this change is optional and both ఇవ్వు and ఈ can occur.

వెళ్ళనీ । — వెళ్ళనివ్వు । 'Let someone go.'

# UNIT 24

## Lesson 93

| | |
|---|---|
| సుగుణ : రాధా! నాకు మల్లెపూలు కావాలి, కోసిస్తావా? | Radha! I want jasmines. Can you pluck some and give me? |
| రాధ : ఇప్పుడు నాకు టైం లేదు. పనిమనిషి వచ్చింతర్వాత దానిచేత కోయించి ఇస్తాను. ఈ ఉంగరం ఎప్పుడు కొన్నావు? | I don't have time now. After the servant maid comes, I will make her pluck some and give you. When did you buy this ring? |
| సుగుణ : నిన్న మా అమ్మను బలవంతం చేసి కొనిపించాను. ఇది కొన్నప్పటినించీ మా తమ్ముడు దీనికోసం నాతో పోట్లాట! | I forced my mother to buy it yesterday. My brother is quarrelling over it ever since it was bought. |
| రాధ : అలాగా! పూలు కోయించి ఇస్తాను. నువ్వు మీ అమ్మ చేత మాల కట్టించి పంపిస్తావా? | I see! I will get the flowers but can you get a garland made by your mother and send it to me? |

| | |
|---|---|
| సుగుణ : మా అక్కయ్య మాల బాగా కడుతుంది. దాని చేత కట్టిస్తాను. నేను కోస్తానులే పూలు. | My sister can make a garland well. I will get it made by her. I will pluck the flowers; don't worry. |
| రాధ : అక్కడ ఒక రాయి అడ్డంగావుంది. అక్కడ నిల్చొని పూలు కొయ్యటం కష్టం. | There is a stone on the way. It is difficult to pluck the flowers standing on it. |
| సుగుణ : అవును ఈ రాయి జరగటం లేదు. | Yes, this stone is not moving. |
| రాధ : అందుకే పని మనిషి వచ్చింతర్వాత జరిపించి కోయిస్తాను. కొంచెం సేపు ఆగు. | That is why after the servant-maid comes, I get them plucked. Please wait for a while. |
| సుగుణ : ఎక్కడికి వెళ్ళింది? | Where did she go? |
| రాధ : పక్కింటికి వెళ్ళింది. | To the neighbour's house. |
| సుగుణ : అయితే మీ తమ్ముణ్ణి పంపించి పిలిపించు. | Send your brother and call her, then. |
| రాధ : నేనే పిలుస్తాను, ఉండు. | All right! I shall call her. |
| సుగుణ : సుశీల రేపు మనతో సినిమాకు రాను అన్నది గదా ! ఇందాక దాన్ని బలవంతం చేసి చివరికి దాని చేత ' వస్తాను ' అనిపించాను. | Susila told us that she would not go to movie with us tomorrow. Didn't she? I forced (persuaded) her to come with us and made her to accept. |
| రాధ : కాని అది వస్తుంది అని నాకు నమ్మకం లేదు. | But I am not sure If she would come. |
| సుగుణ : లేదు. వస్తుంది. నేను వాళ్ళ నాన్న గారితో గూడా చెప్పాను, మేం జాగ్రత్తగా తీసుకుపోయి తీసుకొస్తాం లేండి అని. | No. She would come. I told her father also that we would take her and bring her back safely. |
| రాధ : చూద్దాం. | Let's see. |




## DRILLS

**a.** Repetition drill.

నువ్వు పూలు కొయ్యి.
నేను రవి చేత కోయిస్తాను.

శర్మను తలుపు తియ్యమను.
నేను శర్మచేత తలుపు తీయిస్తాను.

శర్మ ఉత్తరం రాశాడు.
నేను శర్మచేత ఉత్తరం రాయించాను.

విమల పాఠం చదివింది.
సరళ విమలచేత పాఠం చదివించింది.

సుశీల పాటలు పాడుతుంది.
సుగుణ సుశీలచేత పాటలు పాడిస్తుంది.

మా అమ్మ మాల కడ్తుంది.
మా అమ్మచేత మాల కట్టిస్తాను.

రవి ఉంగరం కొన్నాడు.
నేను రవిచేత ఉంగరం కొనిపించాను.

సుబ్బారావు అన్నం తిన్నాడు.
వాడు సుబ్బారావుచేత అన్నం తినిపించాడు.

కమల సుశీల మంచిది అన్నది.
విమల కమలచేత 'సుశీల మంచిది' అనిపించింది.

బల్ల జరిగింది
సుగుణ బల్లను జరిపింది.
నేను సుగుణచేత బల్లను జరిపించాను.

బస్సు ఆగుతుంది.
అతను బస్సును ఆపుతాడు.
రవి అతనిచేత బస్సును ఆపిస్తాడు.

కమల రైల్లోనించి దిగింది.
రమ కమలను రైల్లోనించి దింపింది.
విమల రమచేత కమలను రెలోనించి దింపించింది.

బెల్లిడ్డు కాలుతున్నది.
సుగుణ బెల్లిడ్డు కాలుస్తున్నది.
రవి సుగుణచేత బెల్లిడ్డు కాల్పిస్తున్నాడు.
ఆ పని ఎవరు చేస్తారు ?
నేను చేస్తానులే !

సుబ్బారావు వచ్చాడా ?
వచ్చాడులే !

సుశీల పాసయిందండీ ?
పాసయిందిలేండి !

**b. Build-up drill.**

పంపిస్తావా ?
కోయించి పంపిస్తావా ?
పూలు కోయించి పంపిస్తావా ?
చెల్లెలిచేత పూలు కోయించి పంపిస్తావా ?
మీ చెల్లెలిచేత పూలు కోయించి పంపిస్తావా ?

**c. Expansion drill.**

Model:

సుబ్బారావు వచ్చాడు.
సుబ్బారావు వచ్చాడులే !

1. నేను మాట్లాడ్తాను.
2. కమల పూలు కోస్తుంది.
3. మా అమ్మ మాల కడ్తుంది.

**d. Substitution drill.**

Model:

నేను రవిచేత పూలు కోయిస్తాను.
కాయలు ఏరు
నేను రవిచేత కాయలు ఏరిస్తాను.

| | |
|---|---|
| పాఠం | చదువు |
| తలుపు | తెరుచ్ |
| బాకీ | తీర్చు |
| ఉంగరం | కొను |
| పని | చెయ్యి |

**e. Response drill.**

Model (i) :

ఈ పుస్తకం నువ్వెందుకు కొన్నావు ? (సుగుణ)
సుగుణ కొనిపించింది.

1. శర్మ 'రవి మంచివాడు' అని ఎలా అన్నాడు ? (నేను)
2. ఈ పండును నువ్వెందుకు కోశావు ? (సరళ)
3. శారద కమలను ఎందుకు పిలిచింది ? (రమ)
4. నువ్వెందుకు పుస్తకం మార్చావు ? (శర్మ)

Model (ii) :

నాతో ఎవరొస్తారు? (వాడు)

(a) వాడొస్తాడులే?

(b) వాడొస్తాడులేండి.

1. సుశీల ఎప్పుడొస్తుంది? (రేపు)
2. కడుపులో నెప్పి ఎప్పుడు తగ్గుతుంది? (గంటలో)
3. ఇప్పుడు నాకు డబ్బెవరిస్తారు? (అతను)

d. Conversation drill.

Model:

శర్మ : ఇప్పుడే తుపాకీ పేలాలి.

రవి : ఎవరు పేలుస్తారు?

శర్మ : సుబ్బారావు పేలుస్తాడు.

రవి : అయితే నేను సుబ్బారావుచేత ఈ తుపాకీని పేల్పిస్తాను.

1. శర్మ : ఆ బల్ల పక్కకు జరగాలి.
   రవి : ..................
   శర్మ : ......................
   రవి : ........ ...............

2. శర్మ : ఆ బస్సు ఆగాలి.
   రవి : ......................
   శర్మ : .... .....................
   రవి : ......................

3. శర్మ : ఈ కుర్చీ అటు తిరగాలి.
   రవి : ......................
   శర్మ : ............... ......
   రవి : ..................

4. శర్మ : ఈ బొగ్గు యింకా కాలాలి.
   రవి : ......................
   శర్మ : ......................
   రవి : ..................

## EXERCISES

a. Respond to the following sentences as shown in the model.

Model :

ఇప్పుడు నాకు పుస్తకం కావాలి.

నేనిస్తానులే!

1. ఇప్పుడు శర్మ తొందరగా రావాలండీ!
2. శారద మాల కట్టాలి.
3. మోహన్ శర్మను పిలవాలి.
4. కమల ఒక పాట పాడాలండీ!

b. Frame sentences making use of the gist as shown in the model.

Model :

ఆగేది పని. ఆపేది కమల. ఆపించేది నేను.
నేను కమల చేత పనిని ఆపిస్తాను.

1. జరిగేది కుర్చీ. జరిపేది శర్మ. జరిపించేది సుగుణ.
2. తడిసేది బల్ల. తడిపేది సుగుణ. తడిపించేది సరళ.
3. తిరిగేది సైకిలు. తిప్పేది రవి. తిప్పించేది నువ్వు.
4. రాలేవి ఆకులు. రాల్చేది గోపి. రాల్పించేది వేణు.

c. **Use the following bases in your own sentences after changing them into causative.**

(a) 1. కొను 2. కాల్చు 3. అడుగు 4. పిలుచ్ 5. తియ్య.

(b) 1. దిగు 2. తడుస్ 3. ఆగు 4. జరుగు

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| పనిమనిషి | maid servant | ఫెయిలకా | fail (v. intr.) |
| బలవంతం | compulsion | అవస్థ | difficulty |
| పోట్లాట | quarrel (n) | ఆచూకీ | information, whereabouts |
| మాల | garland (n) | తగిన | suitable |
| అడ్డం | obstruction | బహుమతి | prize; reward (n) |

## GRAMMAR NOTES

93.1. In this lesson the causative form of the verb is introduced.

93.1.1. –ఇంచు is added to transitive verb to form causative. Intransitive verb cannot take the causative marker –ఇంచు. It has to be first changed into transitive in order to take –ఇంచు.

| | |
|---|---|
| అడుగు + ఇంచు → అడిగించు (83.2.) | cause someone to ask; make someone to ask. |
| జరుగు → జరుపు (92.1.1.)<br>జరుపు + ఇంచు → జరిపించు (83.2.) | cause someone/something to move; make someone/something to move. |

93.1.2. When –ఇంచు is added, –య్య ending bases simplify the final syllable to యి and lengthen the penultimate vowel.

| | |
|---|---|
| వెయ్య + ఇంచు → వేయించు | 'make/cause someone to throw' |
| తీసెయ్య + ఇంచు → తీసేయించు | 'make/cause someone/something to remove' |

93.1.3. When –ఇంచు is added to the verbal bases of అను group—(C) V̆ ను type bases only— (49.1.) an augment ఇప్ comes in between the base and –ఇంచు.

అను + ఇంచు → అను – ఇప్ – ఇంచు → అనిపించు 'make/cause someone/something to say'

తిను + ఇంచు → తిను – ఇప్ – ఇంచు → తినిపించు 'make/cause someone/something to eat'

93.1.4. చ్/చు ending bases change the final చ్/చు to ప్ when the causative suffix –ఇంచు is added.

తెరుచ్ + ఇంచు → తెరుప్ + ఇంచు →
తెరిపించు (67.3.) 'cause/make someone/something to open'

కాల్చు + ఇంచు → కాల్ప్ + ఇంచు → కాల్పించు 'cause/make someone/something to burn'

93.2. The Agent-noun of the causative constructions will take the case suffix –చేత. (The noun will be in its oblique form when –చేత is added. See 26.2.)

| | | |
|---|---|---|
| నేను | నా–చేత | 'by me' |
| రవి | రవి చేత | 'by Ravi' |

నేను రవి చేత రాయించాను. 'I got Ravi to write.'

The Agent-noun in this sentence is రవి.

93.2.1. When the verb is in causative form, there will be a potentiality of three nouns used in the sentence in the following way: initiator (in nominative case), agent (inflected by –చేత) and object (in accusative case).

| Initiator (nominative case) | Agent (noun + చేత) | Object (accusative case) | Verb (in causative form) |
|---|---|---|---|
| నేను | శర్మ చేత | రవిని | కొట్టించాను. |
| (I | by Sarma | Ravi + accusative | got beaten) |
| 'I got (made) Sarma to beat Ravi.' | | | |
| శర్మ | నా చేత | ఉత్తరం | రాయించాడు. |
| (Sarma | by me | letter | got written) |
| 'Sarma made me write a letter.' | | | |

93.3. –లే in singular address and –లెండి in plural/honorific address are used with a sentence to express assurance to the listener.

ఇది నీ పుస్తకమే లే! 'Don't worry, this is your book.'

ఇవ్వాళ పరీక్ష పెట్టను లెండి! 'Don't worry, I will not give you a test today.'

# UNIT 24

## Lesson 94

| | |
|---|---|
| గోపి : శర్మా! చూడు నేను ఈ పళ్ళేలు, గిన్నెలు, చెంచాలు కొన్నాను. ఎలా వున్నాయి ? | Sarma! Look here, I purchased those plates, vessels and spoons. How are they ? |
| శర్మ : ఈ పళ్ళెం ఎంత ? | What is the cost of this plate ? |
| గోపి : పన్నెండు రూపాయల నలభై పైసలు. ఒక్కొక్క పళ్ళేనికి ఒక్కొక్క చెంచా ఊరికెనే యిచ్చాడు. | Twelve rupees and forty paise. He (the shopkeeper) gave one spoon free for each plate. |
| శర్మ : ఇన్ని పళ్ళేలు ఏం చేసుకుంటావు ? ఎవరి కోసం తెచ్చావు ? | What do you do with so many plates? Whom did you bring them for ? |
| గోపి : మా కోసమే తెచ్చుకున్నాను; వాడుకోటానికి. | I got them only for my own use. |
| శర్మ : ఇన్నింటిని ఒకసారే వాడ్తారా ? | Do you use all of them at a time ? |

గోపి : దానిదేముంది? అవసరం వచ్చినప్పుడు వాడ్తాం. అన్నింటికీ యింకా డబ్బు యివ్వలేదు. కొన్నిటికే యిచ్చాను.

What is there? We use them whenever we need them. I didn't pay for all of them yet. I paid only for a few.

శర్మ : ఎన్నింటికిచ్చావు?

How many did you pay for?

గోపి : నాలుగు పళ్ళేలకు, మూడు గిన్నెలకు యిచ్చాను. మిగిలిన వాటికి తర్వాత యిస్తానన్నాను. ఇంకా మా ఆవిడ వీటిని చూడలేదు. మిగిలినవి ఆవిడకు నచ్చితే ఉంచుతాను; నచ్చకపోతే తిరిగి యిచ్చేస్తాను.

I paid for four plates and three vessels. I said that I would pay for the rest later. My wife did not see them yet. If she likes, I will retain them. If she doesn't I will return the ones for which I have not paid.

శర్మ : మళ్ళీ ఇవ్వటం దేనికి? ఉంచుకో. మీ ఆవిడ లోపల ఏదో పాట పాడుతున్నట్లుంది. ఇంకా ఎవరున్నారు లోపల?

Why do you return them at all? Keep them. It seems your wife is singing inside (the house). Who else is there?

గోపి : ఎవరూ లేరు. ఒకతే కూర్చుని పాడుకుంటున్నది. ఆవిడ పాడటం మొదలుపెట్టింది అంటే యింక ఈ లోకంలో ఉండదు.

Nobody else is there. She is singing all by herself. If she starts singing she will be oblivious to the sorroundings.

శర్మ : చూడు ఎవరో తలుపు కొడ్తున్నారు.

Look there! Somebody is knocking at the door.

గోపి : ఎవరూ లేరు. తలుపులు గాలికి కొట్టుకుంటున్నాయి. ఏమిటి నీ వేలికి రక్తం వస్తున్నది?

None is there! The window panes are banging. What is it? Your finger is bleeding!

శర్మ : ఇందాక పెన్సిలు చెక్కుతుంటే వేలు కోసుకున్నది. సుబ్బారావూ రవీ మాట్లాడుకోటం లేదెందుకు?

Wehn I was mending the pencil my finger had a cut. Why are Subbarao and Ravi not talking to each other?

గోపి : వాళ్ళిద్దరూ పోట్లాడుకున్నారు. ఇద్దరికీ కోపం ఎక్కువ. ఒకర్నొకరు తిట్టుకుంటారు.

They quarrelled. Both are short-tempered. They scold each other.

## DRILLS

**a. Repetition drill.**

సరళ పాఠం సుశీలకోసం రాసిందా ? విమలకోసం రాసిందా ?

ఎవరికోసం రాయలేదు. తనకోసమే రాసుకున్నది.

రవి ఈ పని ఎవరికోసం చేశాడు ?
తనకోసమే చేసుకున్నాడు.

వేలు కోసుకున్నది.
శర్మ పెళ్ళి చేసుకోడు.

కిటికీ తలుపులు కొట్టుకుంటున్నాయి.
సుశీల తనలో తాను మాట్లాడుకుంటున్నది.

రవి శర్మతో మాట్లాడుతున్నాడు. శర్మ రవితో మాట్లాడుతున్నాడు.

అంటే వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్నారు.

సుశీల సరళను తిడుతున్నది. సరళ సుశీలను తిడుతున్నది.

అంటే వాళ్ళిద్దరూ తిట్టుకుంటున్నారు.

**b. Substitution drill.**

**Model (i) :**

అతను వాటికి డబ్బిచ్చాడు.
ఇవి
అతను వీటికి డబ్బిచ్చాడు.

అన్ని
ఇన్ని
కొన్ని
ఎన్ని

**Model (ii) :**

సుశీల ఉత్తరం రాసుకున్నది. (చదువు)
సుశీల ఉత్తరం చదువుకున్నది.

1. రమా సీతా మాట్లాడుకుంటున్నారు. (పోట్లాడు)
2. సరళ తనలో తాను మాట్లాడుకుంటున్నది. (పాడు)
3. రవి పుస్తకం రాసుకున్నాడు. (తే)
4. పిల్లలు కొట్టుకుంటున్నారు. (తిట్టు)

**c. Response drill.**

**Model :**

సుశీల ఎవరికోసం పాడుతున్నది ?
తనకోసమే పాడుకుంటున్నది.

1. శారద ఎవరికోసం రాసింది ?
2. అతను ఎవరికోసం చదువుతున్నాడు ?
3. విమల ఎవరికోసం పూలు తెస్తుంది ?
4. రవి ఎవరికోసం పూలు కొయ్యాలి ?

d. **Completion drill.**

**Model :**

కమల రవిని చూస్తున్నది. రవి కమలను చూస్తున్నాడు.
అంటే వాళ్ళిద్దరూ ......................
అంటే వాళ్ళిద్దరూ ఒకర్నొకరు చూసుకుంటున్నారు.

1. శ్యామల సుబ్బారావును తిడుతున్నది. సుబ్బారావు శ్యామలను తిడుతున్నాడు.
   అంటే వాళ్ళిద్దరూ ......................
2. ఆ అబ్బాయి ఈ అమ్మాయిని 'ఏమండీ' అని పిలుస్తాడు.
   ఈ అమ్మాయి ఆ అబ్బాయిని 'ఏమండీ' అని పిలుస్తుంది.
   అంటే వాళ్ళిద్దరూ ......................
3. సుగుణ కమలతో మాట్లాడుతున్నది. కమల సుగుణతో మాట్లాడుతున్నది.
   అంటే వాళ్ళిద్దరూ .... ......................

**EXERCISES**

a. **Fill up the blanks with the reflexive forms in present tense for the verbs given in the parentheses.**

1. శర్మ యిప్పుడు ఉత్తరం ...... (రాయి)
2. సరళ బుట్ట ...... (అల్లు)
3. రమ యింటినించి పుస్తకాలు ...... (తే)
4. సుబ్బారావు తన ముఖాన్ని అద్దంలో ........ (చూడు)
5. కమల పుస్తకం ........ (లాగెయ్యి)

b. **Answer the following questions using reflexive forms of the verb as shown in the model.**

**Model :**

కమల ఏం చేస్తున్నది? (ఉత్తరం–రాయి)
ఉత్తరం రాసుకుంటున్నది.

1. రామారావు ఏం చేస్తున్నాడు? (అద్దంలో–చూడు)
2. వాళ్ళు ఏం చేస్తున్నారు? (తిట్టు)
3. మురళి ఏం చేస్తున్నాడు? (పళ్ళు–తే)
4. పిల్లలు ఏం చేస్తున్నారు? (ఆడు)
5. రవి ఏం చేస్తున్నాడు? (రొట్టె–కాల్చు)

c. **Change the following sentences using the suggested pronoun for the object as shown in the model.**

**Model :**

<u>ఈ పుస్తకాలకు</u> డబ్బివ్వలేదు. (ఇవి)
<u>వీటికి</u> డబ్బివ్వలేదు.

1. <u>అన్ని పుస్తకాలకు</u> ఎవరు డబ్బిస్తారు? (అన్ని)
2. <u>కొన్ని ఉత్తరాలమీద</u> అడ్రసు రాయలేదు. (కొన్ని)
3. <u>ఇన్ని రొట్టెలను</u> నువ్వొకడివే తినగలవా? (ఇన్ని)
4. <u>ఎన్ని విషయాలను</u> గురించి మాట్లాడదలచుకున్నావు? (ఎన్ని)

d. **Combine the following.**

| | |
|---|---|
| పళ్ళెం + లు = | ఇన్ని + కి = |
| పళ్ళెం + ని = | కొన్ని + కి = |
| పళ్ళెం + కి = | |

e. **Answer the following questions based on the text of the lesson.**

1. గోపి భార్య లోపల ఏం చేస్తున్నది?
2. మిగిలిన పళ్ళేలను, గిన్నెలను గోపి ఉంచుకుంటాడా? తిరిగి ఇచ్చేస్తాడా?
3. గోపి పళ్ళేలు ఎవరికోసం తెచ్చాడు?
4. శర్మ వేలికి ఎందుకు రక్తం వస్తున్నది?

## VOCABULARY

| | | | |
|---|---|---|---|
| పళ్ళెం | plate | ఉంచు | keep ; place (v) |
| గిన్నె | vessel | తిరిగి ఇవ్వు | return (v) |
| చెంచా | spoon | లోకం | world |
| ఊరికెనే | free of cost | రక్తం | blood |
| వాడు | use (v) | చెక్కు | mend (v. tr.) |
| నచ్చు | be liked | | |

## GRAMMAR NOTES

**94.1.** In this lesson the reflexive base is introduced. Please note that all the verbs cannot be changed into reflexive bases. One should learn only from usage the bases which can be changed into reflexive bases. The reflexive base can, like any other base, take all tense and mode suffixes.

| | | |
|---|---|---|
| చదువుకో: | చదువుకుంటున్నాడు | 'He is reading it himself.' |
| | చదువుకోవాలి | 'One should read (it) oneself.' |
| | చదువుకోండి | 'Read (it) yourself!' |
| | చదువుకోమను | 'Ask someone to read (it) himself.' |

**94.1.1.** –కో is added to the past adverbial participle form of the verb to form the reflexive base. When –కో is added the past participle form, which is an ఇ ending one, becomes ఉ ending. (Accordingly, the trisyllabic bases retain the middle vowel ఉ without changing to ఇ (63.2.).

| | | | |
|---|---|---|---|
| వెయ్యి | : | వేసి + కో → వేసుకో | 'put it on yourself' |
| చదువు | : | చదివి + కో → చదువుకో | 'read it yourself' |
| చూడు | : | చూసి + కో → చూసుకో | 'see it yourself' |
| కలుస్ | : | కలిసి + కో → కలుసుకో | 'meet it yourself' |
| పిలుచ్ | : | పిలిచి + కో → పిలుచుకో | 'call it yourself' |

**94.1.2.** The కో ending bases mentioned as అను group of verbs (50.1.) are all reflexive bases.

**94.1.3.** The reflexive base is used to express

(i) action to be performed voluntarily or involuntarily by the *subject* aimed at the self.

| | |
|---|---|
| రవి రాసుకుంటున్నాడు. | 'Ravi is writing for himself.' |
| తలుపులు కొట్టుకుంటున్నాయి. | 'The doors are banging.' |

and (ii) reciprocal action :

| | |
|---|---|
| శర్మ, రవి తిట్టుకుంటున్నారు. | 'Sarma and Ravi are scolding each other.' |

**94.2.** The oblique forms of అన్ని, ఇన్ని, ఎన్ని and కొన్ని are అన్నింటి–, ఇన్నింటి–, ఎన్నింటి– and కొన్నింటి– respectively.

| | | | |
|---|---|---|---|
| అన్ని | : | అన్నింటికి | 'for so many' |
| ఇన్ని | : | ఇన్నింటికి | 'for these many' |
| ఎన్ని | : | ఎన్నింటికి | 'for how many' |
| కొన్ని | : | కొన్నింటికి | 'for some' |

**94.3.** Notice the change in ఎం ending nouns when plural suffix is added. Also refer to 10.1 regarding అం ending nouns. ఎం ending nouns change the final ఎం to ఎ when the plural suffix is added. The vowel ఎ in these words is pronounced as æ.

పళ్ళెం + లు    పళ్ళెలు *paḷḷælu* 'plates'

**94.4.** The ఎం ending nouns change the final ఎం to ఎని when followed by accusative or dative case suffix. But the pronunciation of this ఎని is æని. Also refer to 54.5. regarding అం ending nouns.

| | |
|---|---|
| పళ్ళెం + ని → పళ్ళెని + ని → పళ్ళెన్ని | *paḷḷænni* 'plate (accusative)'(54.6.) |
| పళ్ళెం + కి → పళ్ళెని + కి → పళ్ళెనికి | *paḷḷæniki* 'to the plate' |

# UNIT 24

## Lesson 95

### తెనాలి రామకృష్ణుడు (కథ)

పూర్వం విజయనగర సామ్రాజ్యాన్ని కృష్ణ దేవరాయలు అనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయన ఆస్థానంలో ఎనిమిది మంది కవులు ఉండే వాళ్ళు. వాళ్ళను అష్టదిగ్గజాలు అనేవాళ్ళు. వాళ్ళల్లో తెనాలిరామకృష్ణుడు ఒకడు. అతను తెలుగులో గొప్ప కవి. కృష్ణదేవరాయలు తరుచుగా కవులను చిక్కు ప్రశ్నలు అడుగుతూ ఉండేవాడు. వాటికి తెనాలిరామకృష్ణుడే సమాధానం చెప్తూ ఉండేవాడు.

ఒక రోజు కృష్ణదేవరాయలు సభలో "ఏ విషయాన్ని గురించి అయినా నా చేత 'అవును' అని పించగలిగిన వారికి మంచి బహుమానం ఇవ్వబడుతుంది" అన్నాడు.

### TENALI RAMAKRISANA (a story)

Once upon a time a king called Krishnadevaraya was ruling the Vijayanagara kingdom. There were eight poets in his court. They were called *Ashtadiggajams* (eight mighty elephants). Tenali Ramakrishna was one of them. He was a great poet in Telugu. Krishnadevaraya used to ask the poets some twisting questions. Tenali Ramakrishna only used to answer them.

One day Krishnadevaraya said, "Who so ever, on any issue, could make me say 'yes' will be suitably rewarded."

అప్పుడు తెనాలి రామకృష్ణుడు లేచి రాజా! నేను మీ చేత 'అవును' అనిపించగలుగుతాను. సెలవు యిప్పించండి అన్నాడు.

Then Tenali Ramakrishna rose and said "Oh King! I will be able to make you say *yes*. Please permit me.

"అనిపించగలగటం కాదు, అనిపించి తీరాలి. లేకపోతే శిక్ష విధించబడుతుంది, జాగ్రత్త!" అన్నాడు రాజు. అందుకు ఒప్పుకున్నాడు తెనాలి రామకృష్ణుడు. "నీ ఇష్టం వచ్చిన మూడు వాక్యాలు చెప్పి నాచేత అవును అనిపించు." అన్నాడు రాయలు.

"Not simply be able to, but you *should*. Otherwise, you will be punished. But be careful!", said the king. Tenali Ramakrishna agreed to it. "Well, you say any three sentences of your choice and make me say *yes* ", said the king.

అప్పుడు రామకృష్ణుడు 'మహారాజా! తమరు ఈ సామ్రాజ్యానికి సార్వభౌములు" అన్నాడు. రాయలు కాదు అనలేకపోయాడు. అవును అన వలసి వచ్చింది. "ఇంకొక వాక్యం చెప్పు" అన్నాడు. "రాజా! తమ తల్లి గొడ్రాలు కాదు" అన్నాడు రామకృష్ణుడు. రాజు ఈసారి గూడా అవును అనకుండా ఉండలేకపోయాడు. "మూడో వాక్యం గూడా చెప్పు!" అన్నాడు కృష్ణదేవ రాయలు. "తమ భార్య పతివ్రత" అన్నాడు రామకృష్ణుడు. ఈ సారి గూడా రాజు 'కాదు' అన లేకపోయాడు.

Then Ramakrishna said, "Oh Emperor! you are the lord of the empire." Krishna Devaraya could not say *no*. He had to say *yes*. "Tell another sentence", the king said. "Oh Emperor! your mother is not a barren lady", said Ramakrishna. The emperor could not remain without saying *yes* this time too. "Tell the third sentence also", the king said. "Oh emperor! your wife is loyal to you", said Ramakrishna. The emperor could not say *no* this time also.

తాను అన్నమాట ప్రకారం ఒక విలువైన హారం తెప్పించి రామకృష్ణుడికి బహూకరించాడు కృష్ణదేవరాయలు.

As per his promise Krishnadevaraya summoned for a costly necklace and presented it to Ramakrishna.



## DRILLS

**a. Repetition drill.**

పూర్వం ఒక ఊళ్లో ఒక రాజు ఉండేవాడు.

పది సంవత్సరాల క్రితం నేను రోజూ కాఫీ తాగే వాణ్ణి.

పూర్వం ఒక రాజు పరిపాలిస్తూ ఉండేవాడు.

శర్మ ఇప్పుడిప్పుడే మాట్లాడగలుగుతున్నాడు.

సుశీల నిన్న ఇక్కడికి రాగలిగింది.

సుబ్బారావు ఈ పని చెయ్యగలిగినా చెయ్యలేదు.

ఇప్పుడు నేను ఎక్కువ చదవలేకపోతున్నాను.

నిన్న మీ యింటికి రాలేకపోయాను.

నువ్వు అడగలేకపోతే నేను అడుగుతాను.

శర్మ కదలకుండా కూర్చోగలడు.

నేను మాట్లాడకుండా ఉండలేను.

అతను అన్నం తినకుండా ఉండగలిగాడు.

ఈ మాట ఎవరికీ చెప్పకుండా ఉండలేకపోయాను.

గురునాథం రేపు బెంగుళూరు వెళ్ళితీరాలి.

ఈ సంవత్సరం నేను పరీక్ష పాసయితీరాలి.

ఈ సంగతి వాళ్ళకు మంత్రిగారిచేత చెప్పబడ్డది.

సరళ పుస్తకాలు ఇక్కడికి తీసుకురాబడ్డాయి.

**b. Build-up drill.**

అన్నాడు

ఇవ్వబడుతుందన్నాడు.

బహుమానం ఇవ్వబడుతుందన్నాడు.

మంచి బహుమానం ఇవ్వబడుతుందన్నాడు.

వాళ్ళకు మంచి బహుమానం ఇవ్వబడుతుందన్నాడు.

చెయ్యగలిగిన వాళ్ళకు మంచి బహుమానం ఇవ్వబడుతుందన్నాడు.

పని చెయ్యగలిగిన వాళ్ళకు మంచి బహుమానం యివ్వబడుతుందన్నాడు.

ఈ పని చెయ్యగలిగిన వాళ్ళకు మంచి బహుమానం యివ్వబడుతుందన్నాడు.

పిలిపించు

శర్మను పిలిపించు.

పంపించి శర్మను పిలిపించు.

వాళ్ళను పంపించి శర్మను పిలిపించు.

ఇష్టం వచ్చినవాళ్ళను పంపించి శర్మను పిలిపించు.

నీ యిష్టం వచ్చినవాళ్ళను పంపించి శర్మను పిలిపించు.

అక్కడికి నీ ఇష్టం వచ్చిన వాళ్ళను పంపించి శర్మను పిలిపించు.

ఇప్పుడక్కడికి నీ ఇష్టంవచ్చిన వాళ్ళను పంపించి శర్మను పిలిపించు.

**c. Substitution drill.**

**Model :**

ఈ పని కమలచేత చెయ్యబడ్డది.

పుస్తకం     చదువు

ఈ పుస్తకం కమలచేత చదవబడ్డది.

| | |
|---|---|
| పూలు | కొయ్యి |
| వాకిలి | తెరుచ్ |
| కథ | చెప్పు |

**d. Interlocked substitution drill.**

**Model :**

నేనిప్పుడు బాగా మాట్లాడగలుగుతున్నాను.

రాయి.

నేనిప్పుడు బాగా రాయగలుగుతున్నాను.

నిన్న

నేను నిన్న బాగా రాయగలిగాను.

..................చదువు..................

... మొన్న........................

ఆమె...............................

...............కూర్చో...............

....రేపు..............................

వాళ్ళు............................

..............తిను...............

...ఇప్పుడు..........................

...............ఒప్పుకో...............

**e. Response drill.**

**Model (i) :**

నువ్వు సరళకు పాఠం చెప్పావా? (రమ)

నేను చెప్పలేదు; రమచేత చెప్పించాను.

1. ఈ పుస్తకం నువ్వు శారదకిచ్చావా? (రవి)
2. సరళ మల్లెపూలు తెచ్చిందా? (శారద)
3. నువ్వు 'కాదు' అన్నావా? (శర్మ)

**Model (ii) :**

శర్మకు నీ ఉంగరాన్ని ఎందుకు చూపించావు?

చూపించకుండా ఉండలేకపోయాను.

1. సుశీలకు ఆ మాట ఎందుకు చెప్పావు?
2. వాళ్ళందర్నీ మీ యింటికి ఎందుకు పిలిచావు?
3. ఆ సినిమాను అన్నిసార్లు ఎందుకు చూశావు?
4. నీ గొడుగును ఆ అమ్మాయికి ఎందుకు ఇచ్చావు?

**Model (iii) :**

నువ్వు నిరుడు ఏం చేసేవాడివి? (కథలు–రాయి)

నేను నిరుడు కథలు రాసేవాణ్ణి.

1. శర్మ నిరుడు ఏం చేసేవాడు? (స్కూల్లో–పని)
2. శారద నాలుగేళ్ళ క్రితం ఏం చేసేది? (రేడియోలో–పాడు)
3. మోహన్ మైసూరులో ఉన్నప్పుడు ఏం చేసేవాడు? (రోజూ–ఇడ్లీ తిను)

**Model (iv) :**

నువ్వు నిరుడు ఏం చేస్తూ వుండేవాడివి? (కథలు–రాయి)

నేను నిరుడు కథలు రాస్తూ వుండేవాణ్ణి.

1. శర్మ నిరుడు ఏం చేస్తూ వుండేవాడు? (కాలేజీలో–చదువు)
2. శారద రెండేళ్ళ క్రితం ఏం చేస్తూ వుండేది? (నాటకాలు–వెయ్యి)
3. మోహన్ ఢిల్లీలో వున్నప్పుడు ఏం చేస్తూ వుండేవాడు? (చపాతీలు–తిను)

**f. Conversation drill.**

Model (i) :

సరళ : ఈ పూలు ఎవరు కోస్తారు ?

విమల : నేను కొయ్యగలను.

సరళ : నువ్వు కొయ్యగలిగితే పరవాలేదు.

1. గోపాల్ : శర్మ యింటికి ఎవరు వెళ్తారు ?

కుమార్ : ....................................

గోపాల్ : ....................................

2. మోహన్ : పాపను ఇంటికి ఎవరు తీసుకొస్తారు ?

విజయ : ....................................

మోహన్ : ....................................

3. ప్రసాద్ : ....................................

విమల : ....................................

ప్రసాద్ : ....................................

Model (ii) :

కమల : సుశీలతో నువ్వు మాట్లాడ్తావా ?

విమల : మాట్లాడగలుగుతానేమో !

కమల : మాట్లాడలేకపోతే చెప్పు ;
నేనేమాట్లాడ్తాను.

1. విజయ : సుబ్బారావు దగ్గర్నుంచి నా పుస్తకం తెస్తావా ?

రవి : ....................................

విజయ : ....................................

2. పద్మ : శర్మ ఈ పని చేస్తాడా ?

సుశీల : ....................................

పద్మ : ....................................

3. శారద : సరోజ ఈ తలుపు తెరుస్తుందా ?

విమల : ....................................

శారద : ....................................

**g. Transformation drill.**

Model (i) :

చిన్న నా కోసం ఎవరొచ్చారు ?

చిన్న నాకోసం ఎవరైనా వచ్చారా ?

1. శర్మ మైసూరు ఎప్పుడు చూశాడు ?
2. రమ ఏ విషయాన్ని గురించి మాట్లాడగలదు ?
3. నీ పుస్తకాలు ఎవరికి ఇస్తావు ?
4. శర్మను ఏ ఊళ్లో చూశావు ?
5. రవి నా కలం ఎక్కడ పెట్టాడు ?

Model (ii) :

సుబ్బారావును లోపలికి పిలిచారు.

సుబ్బారావు లోపలికి పిలవబడ్డాడు.

1. శారదకు బహుమానం యిచ్చారు.
2. ఈ హారం ఆమెకు బహూకరించారు.
3. మొన్న సంగీత శాస్త్రంలో ఒక కొత్త ప్రయోగం చేశారు.

Model (iii) :

ఇప్పుడు నువ్వు రావాలి.

ఇప్పుడు నువ్వు వచ్చితీరాలి.

1. రేపు మీరందరూ తొమ్మిదింటికి రావాలి.
2. మనం కష్టపడి పనిచెయ్యాలి.
3. ఈ తలుపులు తెరవాలి.
4. ఈ సంవత్సరం నేను పాసుకావాలి.
5. అతనొక పుస్తకం తేవాలి.
6. మీరు డబ్బులు ఇవ్వాలి.

## EXERCISES

a. Answer the following questions as shown in the model.

Model (i) :

సరళ పాసవుతుందా ?

పాసయితీరుతుంది.

1. ఇప్పుడు వాడు డబ్బిస్తాడా ?
2. సుశీల రేపు వస్తుందా ?
3. నేనిప్పుడు మాట్లాడాలా ?
4. పోలీసులు దొంగలను పట్టుకుంటారా ?
5. శర్మ యిప్పుడు సైకిల్ తెస్తాడా ?

Model (ii) :

సుశీల మాట్లాడ్తుందా ?

సుశీల మాట్లాడగలుగుతుందో లేదో నాకు తెలియదు.

1. శర్మ సుబ్బారావును కొడ్తాడా ?
2. శారద ఏనుగు బొమ్మ గీస్తుందా ?
3. వాళ్ళు దొంగలను పట్టుకుంటారా ?
4. సరళ ఈ తలుపును తెరుస్తుందా ?
5. పిల్లలు ఈ బొమ్మను తెస్తారా ?

Model (iii) :

ఇప్పుడు శర్మ ఎందుకు వెళ్లాడు ?

వెళ్ళకుండా వుండలేకపోయాడు.

1. శారద ఎందుకు అన్నం తిన్నది ?
2. సుశీల ఎందుకు నిన్ను చూస్తున్నది ?
3. శర్మ ఎందుకు రవిని కొట్టాడు ?

b. Change the following sentences as shown in the model.

Model :

చెయ్యాల్సొచ్చింది.

చెయ్యవలసి వచ్చింది.

1. తినాల్సొచ్చింది.
2. ఆడాల్సొస్తుంది.
3. రావాల్సొస్తుంది.
4. బహూకరించాల్సొచ్చింది.
5. శిక్ష విధించాల్సొచ్చింది.

c. Give the negative replies to the following questions.

1. నిన్న శర్మ మాట్లాడగలిగాడా ?
2. రేపు సుశీల డబ్బు తేగలుగుతుందా ?
3. ఇప్పుడు సరళ చదవగలుగుతున్నదా ?

d. Change the following sentences in two ways as shown in the model.

Model :

పూర్వం ఒక రాజు మన దేశాన్ని పరిపాలించాడు.

(a) పూర్వం ఒక రాజు మన దేశాన్ని పరిపాలించేవాడు.

(b) పూర్వం ఒక రాజు మన దేశాన్ని పరిపాలిస్తూ వుండేవాడు.

1. నిరుడు శర్మ ఆలస్యంగా నిద్రపోయాడు.
2. రెండేళ్ల క్రితం రవి మీ ఊళ్లో పనిచేశాడు.
3. పది సంవత్సరాల క్రితం నేను రేడియోలో పాటలు పాడాను.

e. Give the negative forms of:

ఆడగలిగితే ×

మాట్లాడగలిగినా × తినగలుగుతున్నాడు ×

చెయ్యగలగటం × చెయ్యగలిగేవాళ్ళు ×

f. Change the following sentences into passive voice.

1. శర్మకు ఈ పుస్తకం ఇచ్చారు.
2. శారదను ఇంటికి పంపించారు.
3. మా ఊళ్లో రోడ్లన్నీ బాగుచేశారు.
4. ఇవ్వాళ బజార్లో కొట్లన్నీ మూసేశారు.

g. Rewrite the following sentences changing the verbs into causatives.

1. ఇప్పుడు నాకొక కాఫీ తేండి.
2. సుబ్బారావుకు బహుమానం ఇవ్వండి.
3. 'మంచివాడు' అనండి.
4. ఒక ఉంగరం కొనాలి.

h. Use the following verbs in your own sentences adding -గలుగు to them, in present tense, present negative, past tense, past negative, future tense, future negative, conditional and negative conditional :

1. ఆలోచించు 2. తిను

**VOCABULARY**

| | | | |
|---|---|---|---|
| పూర్వం | long ago | ఒప్పుకో* | accept |
| సామ్రాజ్యం | kingdom | వాక్యం | sentence (n) |
| రాజు | king | మహారాజు | great king |
| పరిపాలించు | rule (v) | తమరు | you (royal) |
| ఆస్థానం | royal court | సార్వభౌముడు | emperor |
| అష్టదిగ్గజాలు | eight mighty elephants | తమ | your (royal) |
| తరుచు | often | గొడ్రాలు | barren woman |
| చిక్కు | defficult (adj.) | పతివ్రత | chaste woman |
| సమాధానం | answer (n) | ప్రకారం | according to |
| సభ | royal court | విలువైన | costly |
| బహుమానం | reward, prize (n) | హారం | necklace |
| సెలవు | permission | బహూకరించు | present (v.tr.) |
| శిక్ష | punishment | పొరపాటు | mistake (n) |
| విధించు | impose | సినీతార | cine-actress |

## GRAMMAR NOTES

**95.1.** In this lesson the historical or remote past form of the verb is introduced.

వాడు (masc. sg.), వాళ్ళు (human pl.), ది (fem./neuter sg.) and వి (neuter pl.) are added to the habitual adjectival participle (75.2) to form historical past form.

Historical past → Habitual adjectival participle + { వాడు / వాళ్ళు / వి / ది }

| | |
|---|---|
| వాడు/ఆయన/అతను వెళ్ళేవాడు. | 'He used to go.' |
| ఆవిడ/ఆమె వెళ్ళేది. | 'She used to go.' |
| ఇక్కడ ఒక ఇల్లు ఉండేది. | 'There used to be a house here.' |
| వాళ్ళు వెళ్ళేవాళ్ళు. | 'They used to go.' |
| ఇక్కడ నాలుగు చెట్లు ఉండేవి. | 'There used to be four trees here.' |

**95.1.1.** If the subject is in I or II person, the above verb forms are used with suitable concord (3.3; 11.3; 12.4.1. and 12.5).

| | |
|---|---|
| నేను 1960లో గుంటూరులో ఉండేవాణ్ణి. | 'I used to stay in Guntur in 1960.' |
| నువ్వు 1940లో ఏంచేసే వాడివి?<br>మీరు 1940లో ఏంచేసే వాళ్ళు? | 'What did you (use to) do in 1940?' |
| మేం/మనం 1969లో రోజూ క్రికెట్ ఆడేవాళ్ళం. | 'We used to play cricket daily in 1969.' |

**95.2.** The historical or remote past continuous form of the verb is also introduced in this lesson. వాడు (masc. sg.), వాళ్ళు (human pl.), -ది (fem./neuter sg.) and -వి (neuter pl.) are added to the [non-past adverbial participle (55.2) + ఉండే] construction to form the historical past continuous form.

Historical past continuous → Non-past adverbial participle + ఉండే + { వాడు / వాళ్ళు / ది / వి }

| | |
|---|---|
| వాడు/ఆయన/అతను 1930లో గుంటూరులో పని చేస్తూ ఉండేవాడు. | 'He was working in Guntur in 1930.' |
| వాళ్ళు 1960లో చపాతీలు తింటూ ఉండేవాళ్ళు. | 'They were eating chapathis in 1960.' |
| ఆవిడ/ఆమె నిరుడు రోజూ పగలు నిద్ర పోతూ ఉండేది. | 'She was sleeping in the daytime everyday last year.' |
| నేను విశాఖపట్నంలో ఉండగా నాకు రోజూ ఉత్తరాలు వస్తూ ఉండేవి. | 'I was getting letters daily when I was staying in Visakhapatnam.' |

95.3. Remember the abilitative and negative abilitative forms (84.1; 84.1.2.) which do not denote any tense.

| | |
|---|---|
| తిన గలడు. | 'He can eat.' |
| తిన లేడు. | 'He cannot eat.' |

In this lesson abilitative forms with different tenses/modes are introduced.

95.3.1. గలుగు– is the auxiliary verb added to the infinitive (52.3.2.) to form abilitative base which will take different tense/mode suffixes.

Abilitative base → Inifintive + గలుగు

| | |
|---|---|
| వెయ్యగలుగు–తున్నాను | 'I am able to do.' |
| వెయ్యగలిగాను (గలుగు + ఆను 66.6) | 'I was able to do.' (I could do) |
| వెయ్య గలుగు–తా–ను | 'I will be able to do.' |
| వెయ్యగలిగితే (గలుగు + ఇతే 63.2) | 'if someone is able to do' |
| వెయ్యగలగటం (గలుగు + అటం 43.2) | 'being able to do' |
| వెయ్యగలిగినా (గలుగు + ఇనా 63.2) | 'though one is able to do' |
| వెయ్యగలిగిన (గలుగు + ఇన 63.2) | 'one who is able to do' |

95.3.2. –లేకపో is the negative form of –గలుగు. It is added to the infinitive (52.3.2.) to form the negative abilitative base which will take different tense/mode suffixes.

Negative abilitative base → Infinitive + లేకపో

| | |
|---|---|
| చెయ్యలేకపో-తున్నాను | 'I am not able to do.' |
| చెయ్యలేకపో-యా-ను (70.1) | 'I was not able to do.' (I could not do) |
| చెయ్యలేకపో-తా-ను | 'I will not be able to do.' |
| చెయ్యలేకపోతే (68.3) | 'if one is not able to do' |
| చెయ్యలేకపోవటం (53.1.1) | 'not being able to do' |
| చెయ్యలేకపో-యినా (90.1.1) | 'though one is not able to do' |
| చెయ్యలేకపో-యిన (75.1.2) | 'one who is not able to do' |

95.4. The causative forms of the bases ఇవ్వు 'give' and తే 'bring' are ఇప్పించు and తెప్పించు respectively.

| | | | |
|---|---|---|---|
| ఇవ్వు | 'give' | ఇప్పించు : | 'Make someone gives something. |
| తే | 'bring' | తెప్పించు : | 'Make someone brings something.' |

| | |
|---|---|
| ఇప్పించు-తున్నాడు→ ఇప్పిస్తున్నాడు (55.4.) | 'He is making someone gives something.' |
| తెప్పించు-ఆ-డు→ తెప్పించాడు | 'He made someone brings something.' |

95.5. The passive voice is also introduced in this lesson. Though passive voice is not very much used in the spoken variety of Telugu it is used at times in writing as a stylistic variation. The passive base is formed by adding -బడు (an alternative form of the base పడు, and -బడు also behaves like the base పడు in all the environments 47.6. & 71.3) to the infinitive (52.3.2.).

Passive base → Infinitive + బడు

| | |
|---|---|
| చెయ్య-బడు | 'be done' |
| అడగ-బడు | 'be asked' |
| చెయ్యబడు-తుంది | 'will be done' |

95.5.1. When passive voice is used the agent noun will take చేత.

| | |
|---|---|
| ఈ పని శర్మచేత చెయ్యబడుతుంది. | 'This work will be done by Sarma.' |
| చెయ్యబడు+అ-ది→ చెయ్యబడ్డది | 'was done' (71.3.) |

95.6. The auxiliary -తీరు is added to the past adverbial participle (79.1.) to give an exphasis to the meaning of the verb. The compound base thus formed will take all tense/mode suffixes.

చేసి + తీరు–తాను — చేసి తీర్తాను (62.2) 'I will definitely do it.'

ఆడి + తీరు–ఆలి — ఆడితీరాలి 'One should definitely play.'

95.7. తమరు is a royal/most formal second person pronoun. The corresponding oblique base is తమ–

తమరు లోపలికి రాండి ! 'Please come inside.'

ఇది తమకు. 'This is for you.'

95.8. Notice the usage:

అనకుండా ఉండలేక పోయాడు. 'He could not resist speaking.'
(He could not remain without saying something.)

This is an emphatic expression of affirmative form 'అన్నాడు' and it contains double negative—one in అనకుండా and the other in ఉండలేకపోయాడు. The opposite form is అనకుండా ఉండగలిగాడు 'He could remain without saying something' which is also an emphatic form of అనలేదు. Such expressions are stylistic variations with some change in the semantic content. Consider the following examples:

తిన్నాడు. 'He ate.' తినలేదు. 'He didn't eat.'

తినకుండా ఉండలేకపోయాడు. × తినకుండా ఉండగలిగాడు.

'He could not remain without eating.' 'He could remain without eating.'

మాట్లాడాడు. 'He spoke.' మాట్లాడలేదు. 'He did not speak.'

మాట్లాడకుండా ఉండలేక పోయాడు. × మాట్లాడకుండా ఉండగలిగాడు.

'He could not remain without speaking.' 'He could remain without speaking.'

# REVIEW 12

Lesson 96









"మీరింత వరకు వివాహం చేసుకోక పోవటానికి కారణం?"
"నా నట జీవితంలో రెండొందల చిత్రాలలో పెళ్ళి సీన్లలో నటించి నటించి మొహం మొత్తింది."




జ్యోతికి తన వయసు
ఎవరూ తెలుసుకోలేరని
గర్వం. పాపం!


ఓ మంచి ఐడియా!
జ్యోతి వయసు జ్యోతి
చేతనే చెప్పిద్దాం
పద!


మిస్ జ్యోతీ! మీ వయసు
ఓ పెద్ద రహస్యంలా
ఉందే!
అవును.


ఆ రహస్యం ఎవరికీ
చెప్పకుండా చాలా
రోజులనించీ దాచి-
పెడ్తున్నారనుకుంటాను?


అవును. ఇరవై ఏళ్ల
నించీ ఆ రహస్యం
దాచిపెడుతున్నాను.


జ్యోతి వయసు ఇరవై
ఏళ్లన్నమాట!
తెలిసిందా?

'ఇంటర్వ్యూలో సెలక్టు అయితే ఇవాళ్టినించే
ఉద్యోగంలో చేరదామనుకుంటున్నాను
సార్. అందుకే మధ్యాహ్నం భోజనం
కారియర్‌లో తెచ్చుకున్నాను'
అన్నాను. అంతే!
సెలక్టు చేసేశారు.






రథం ముగ్గు
మొదలుపెట్టాను.
ఈ పూట కు
మీరే వంట
చేస్తారండి!
కృష్ణ


నా ఫ్రెండ్సు నా కళ్ళజోడు
లాక్కుని పంపారు.
నువ్వెక్కడున్నావు
రాణీ!
నా ఫ్రెండ్సు నన్నూ
అదే పని చేశారు.
నువ్వెక్కడున్నావు
రాజా!
కాటూరి


డాక్టరుగారు ఇంకా రెండు రోజుల దాకా మాట్లాడరు. నిన్న నాలికమీద మందు వేయించుకున్నారు.
Jayadeva


ఏమండోయ్! ఈ వింత కనిపెట్టారా? మన నిలువుటద్దం రోజు రోజుకూ చిన్నదయి పోతున్నట్లు అనుమానంగా ఉందండీ! పెళ్లయిన కొత్తలో నా పూర్తి ప్రతిబింబం కనిపించేది.


వీడికి కాలు ఆపరేషన్ చెయ్యటానికి మత్తుమందు
ఇచ్చినప్పుడే క్రాపు కూడా చేయించేశాం.


ఒక పంచవర్ష ప్రణాళిక-
లో పెళ్ళిళ్ళు ఆపు-
చేయించగలిగితే
ఈ జనాభా అభివృద్ధిని
అరికట్టవచ్చునని నా
అభిప్రాయం.


చిత్రగుప్తా! వాడు
టగ్ ఆఫ్ వార్
ఛాంపియనట. నేను
వేసిన తాడు లాగేసు-
కున్నాడు!


ఇలా నవలలన్నీ నీ పెళ్ళాం పేరుతో రాయటం వల్ల నీకొచ్చే లాభం ఏమిటిరా?
ఆఁ! ఏముందీ, ఈ నవలలన్నీ నాకే అంకితమిచ్చుకో వచ్చు గదా!


మీరూ, మీ తమ్ముడూ కవలలని తెలిస్తే మిమ్మల్ని పెళ్లాడే దాన్నే కాదు!
ఆ విషయం మా అన్నయ్యకు చెప్పండొదినా!
సుందర కేశవులు


గవర్నమెంటు ఉద్యోగం వచ్చిందా? అయితే పెళ్లి చేసుకుని జాయినవుదువు గాని, ఆగు!

## EXERCISES

a. Choose the correct answer for each question and write the corresponding number in the parentheses.

(a) శర్మను బస్సులోనించి వాళ్ళు............

1. దిగారు 2. దింపారు 3. దిగించారు

(b) సుశీల లైటును ............

1. వెలిగింది 2. వెలిగించింది 3. వెలిచింది

(c) పాపారావు బాకీలన్నీ ............

1. తీరాడు 2. తీర్చాడు 3. తీరించాడు

(d) పాత పుస్తకాల సంచీని ............

1. చినిగింది 2. చించింది 3. చినిగించింది

(e) ఆ ఎద్దు చెరువులో .........

1. మునిగింది 2. ముంచింది 3. మునిగించింది

(f) కమల కుర్చీలోనించి ............

1. లేచింది 2. లేపింది 3. లేచించింది

(g) శారద పాఠం చదవటం ............

1. ఆగింది 2. ఆగించింది 3. ఆపింది

(h) పాత నా గాలిపటం దారం .........

1. తెగింది 2. తెగించింది 3. తెంపింది

b. Tick the correct statement.

(a) శర్మ సుబ్బారావు చేత ఒక పుస్తకం కొనిపించాడు అంటే

1. శర్మ సుబ్బారావుకు ఒక పుస్తకం కొని యిచ్చాడు.
2. శర్మ ఒక పుస్తకం కొన్నాడు.
3. శర్మ చెప్పటం వల్ల సుబ్బారావు ఒక పుస్తకం కొన్నాడు.

(b) సుబ్బారావు వచ్చినా శర్మ రాలేదు. అంటే

1. సుబ్బారావు వచ్చాడు. అయినా శర్మ రాలేదు.
2. సుబ్బారావు శర్మ రాలేదు.
3. సుబ్బారావు రావటం వల్ల శర్మ రాలేదు.

(c) సుబ్బారావు వచ్చి తీరాలి అంటే

1. సుబ్బారావు వస్తాడు.
2. సుబ్బారావు రావచ్చు.
3. సుబ్బారావు రావాలి.

(d) సుశీల లైటు వెలిగించుకున్నది. అంటే

1. సుశీల వెలిగించిన లైటు యింకొకరి కోసం.
2. సుశీల వెలిగించిన లైటు అందరి కోసం.
3. సుశీల వెలిగించిన లైటు సుశీల కోసం.

(e) నేను మాట్లాడమనకపోయినా ఆమె మాట్లాడింది. అంటే

1. నేను మాట్లాడమనకపోవటం వల్ల ఆమె మాట్లాడింది.
2. నేను మాట్లాడమనకపోతే ఆమె మాట్లాడింది.
3. నేను మాట్లాడమనలేదు. అయినా ఆమె మాట్లాడింది.

(f) శర్మ మాట్లాడవలసి వచ్చింది. అంటే

1. శర్మకు మాట్లాడటం యిష్టం లేదు.
2. శర్మకు మాట్లాడటం ఇష్టం.
3. శర్మ మాట్లాడాలి.

